## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్థం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన అర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements (more)**

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web 426 billion pages saved over time**

INTERNET ARCHIVE WaybackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** Browse (by keyword)

1,721,625 movies

Curator's Choice (more)

Noveltoon: The Stupidstitious Cat

A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...

Recent Review

Little Ol Bosko In Bagdad

Average rating:

**Live Music** Browse (by band)

131,731 concerts

Curator's Choice (more)

Yarn Live at Towne Crier Cafe on 2014-02-16

01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...

Recent Review

Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30

Average rating:

**Audio** Browse (by keyword)

2,095,303 recordings

Curator's Choice (more)

contra32: Infex - Type-E

How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...

Recent Review

KM/TB Sol Rezza 2014

Average rating:

**Texts** Browse (by keyword)

6,509,320 texts

Curator's Choice (more)

The Orchid world. A monthly illustrated journal...

No more published

Recent Review

الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم

Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

'ముఖ్యంగా ఇంతదాకా పారలౌకిక సుఖసంధాయకాలైన వానిని గూర్చి వ్యాఖ్యానించాను. ఇప్పుడు ఐహిక సుఖ సౌభాగ్య సంధాయకమైన అథర్వవేదాన్ని వ్యాఖ్యానిస్తున్నాను'- అని సాయ నాచార్యులు ఈ వేదభాష్యభూమికలో పేర్కొన్నారు.

మానవుని అనుదిన జీవనానికి సంబంధించిన అనేక విషయా లకు చెందిన ఈ అథర్వవేదసంహితలో అలనాటి జనజీవన సరళి బహుధా వివృత మైనది.

ఇందలి విషయ విభిన్నతలను, వివృతులను వివరించడానికి ఈ వేదానికున్న ఇతర నామధేయాలే తార్కాణాలు.

బ్రహ్మవేదం, భిషగ్వేదం, క్షత్రవేదం, అంగిరోవేదం, అథ ర్వాంగిరోవేదం, అథర్వవేదం, అథర్వణవేదం- ఇవన్నీ ఆ నామాంత రాలలోనివే.

ప్రధానవైదిక కర్మ అయిన యజ్ఞంలో నలుగురు ఋత్విక్కు లుంటారు. వారిలో హోత, ఉద్గాత, అధ్వర్యుడు మిగత మూడు వేదాలలో నిష్ణాతులు కాగా బ్రహ్మ అథర్వవేదం తలస్పర్శిగా తెలిసిన వాడు కావాలి.

ఆ బ్రహ్మదే యజ్ఞంలో పెద్దపీట. ఆయన అంతటినీ, అన్నిటినీ పర్యవేక్షిస్తూ, తన తోడివారి పొరపాట్లను కూడా సవరిస్తూ యజ్ఞాన్ని నిర్వహిస్తాడు. యజ్ఞంలోని బాహిర కర్మలను వారు పరిపూతం చేయగా బ్రహ్మమనస్సును పునీతంచేస్తాడని గోపథ బ్రాహ్మణం పేర్కొన్నది. ఆ కారణం వల్లనే దీనికి బ్రహ్మవేదమన్న పేరువచ్చినది.

భిషగ్వేదమన్న నామాంతరం రావడానికి కారణం ఇందలి విషయప్రాధాన్యం. ఇందులో మానవులకు వచ్చే అనేక వ్యాధులను గూర్చి, వాటి చికిత్సలను గూర్చి కావలసినన్ని వివరా లున్నాయి.

ఆయా రోగనిరోధకాలైన మంత్రాలతో పాటు వాటిని నిర్మూలించే ఓషధులు, ఇతర వైద్య ప్రక్రియలుకూడా ఇందులో ఉన్నవి. అందుకే దీనిని ఉపవేదం, ఆయుర్వేదం అనడం కలదు.

వాత, పిత్త, కఫాదులు, శ్వాసకాసాదులు, హృద్రోగం, కుష్ఠు, గండమాల, మూత్రఘాతం, ఉన్మాదం, యక్ష్మ, రాజయక్ష్మ-ఇత్యాది వ్యాధులెన్నో ఇందులో ప్రస్తావనకు వచ్చినవి. వాటి చికిత్సా విధానాలూ ఇందులో ఉన్నవి.

మూత్రకృఛాదులను గూర్చిన అథర్వవేద ప్రారంభంలోని మంత్రాలలో శస్త్రచికిత్సా ప్రస్తావన కూడా అంతర్గర్భితమై ఉన్నట్లు తజ్ఞులు చెప్తారు.

ఇవే కాక అనేక క్రిమికీటకాదుల వల్ల వచ్చేబాధలు, వాటి నివారణోపాయాలు ఇందులో వివృతము లైనవి. చికిత్సలకు పనికి వచ్చే అనేక మూలికలు, ఓషధులను గూర్చిన విషయ వివేచనం కూడా ఇందులో కలదు. కాబట్టే దీనిని 'భిషగ్వేద' మన్నారు.

దీనికి క్షత్రవేదమన్న పేరుకూడా సార్థకమైనదే. రాజనీతి, దండనీతి, అర్థనీతి అనడం కూడా వాడుకలో ఉన్నదే. ఆ వేదకాలం నాటి రాజనీతిని గురించి, రాజ్యాంగ వ్యవస్థను గురించి ఇందులో కావలసినంత వివరం ఉన్నది. సమితి, సభ, విశః, రాష్ట్ర, రాజ్య-మొదలగుపదాలు అప్పటి పరిపాలనా విధానంలోని పరిపక్వతను తెలియజేస్తాయి.

అలనాడు ఒక విధమైన ప్రజాస్వామ్యం, రాచరికం కూడా కలదని మనం ఊహించవచ్చు. 'విశః' అనేపదం ప్రజాప్రతినిధులను తెలియజేస్తుంది. వారే రాజును ఎన్నుకునేవారు. సమితిలో గొప్పప్రసంగాలు, ప్రవచనాలు కూడా సాగేవి. ఆ ఎన్నుకున్న రాజు ఉనికికి ప్రజాసంక్షేమమే మూలస్తంభం. దానిని ఉపేక్షిస్తే ఆ రాజు పదవీభ్రష్టుడౌతాడు.

బ్రహ్మవేద మనడానికి అనువుగా ఇందులో అనేక దార్శనిక వేదాంత విషయచర్చలు ఉండడం కూడా కారణం కావచ్చును.

మరొకటి యజ్ఞంలోని 'బ్రహ్మ' అథర్వవేదజ్ఞుడు కావలె నన్నది ముందే వివరించాను. అదికాక 'బ్రహ్మ' అన్నమాటకు యజ్ఞమని, పరబ్రహ్మమని కూడా అర్థం. వీనికి చెందిన తాత్త్విక సూక్తాలు ఇందులో ఉన్నవి. ఉదాహరణకు కాలసూక్తం, స్కంభ సూక్తం మొదలైనవి.

అథర్వవేదంలోని పదిహేనవ కాండ మొత్తాన్ని 'వ్రాత్య కాండ' అంటారు. ఇందులో పద్దెనిమిది సూక్తాలు. వానిలో మొత్తం 220 మంత్రాలు ఉన్నవి. మిగతకాండలలో కూడా ఈ విషయానికి ప్రాధాన్యంకల మంత్రాలు అక్కడక్కడా ఉన్నవి.

వీటన్నిటి మూలంగా ఈ వేదంలో రాజనీతి గురించి అనేక విషయాలు, వ్యాధుల చికిత్సలకు సంబంధించిన ఎన్నో అంశాలు, అలాగే తాత్త్విక దార్శనిక విషయాలకు సంబంధించిన అనేక మంత్రాలు కలవని వీని పిండితార్థం.

ఇందుమూలంగా ఈ వేదానికి మన పెద్దలు ఎంత ప్రాముఖ్యాన్నిచ్చారో తెలుసుకొనవచ్చును. ఇందలి విషయాలు అనేక శీర్షికల క్రింద వివరించడం కూడా మనం గమనించ వచ్చును. 'భైషజ్యాన్ని' 'ఆయుష్యాణి', 'పౌష్టికాని', 'ప్రాయశ్చిత్తాని', 'స్త్రీకర్మాణి', 'రాజకర్మాణి', 'బ్రాహ్మణ్యాని' అన్నవి ఈ శీర్షికలలో కొన్ని.

వ్యాధినివారణకు చెందిన విభిన్న చికిత్సాదులు, భైషజ్యములు. తోడివారికి దీర్ఘాయుర్దాయాన్ని అపేక్షించే మంత్రాలు ఆయుష్యములు. పౌష్టిక మంత్రాలు జనం గృహనిర్మాణ సమయంలోను, వ్యవసాయానికై నేలను దున్నే సమయంలోను కొన్ని వ్యాపారాల లావా

దేవీలలోను ఉపయోగించేవారు. ప్రాయశ్చిత్త మంత్రాలు అశుభాలను దూరం చేసేందుకై ఉద్దేశించినవి. స్త్రీకర్మకు చెందినమంత్రాలు ప్రత్యేకించి స్త్రీ జీవితాన్ని గురించినవి. మాట వరుసకు పెండ్లి, ప్రేమ, శిశుసంక్షేమం ఇత్యాదులు.

ఇక రాజకర్మలను గురించి ముందేచెప్పినట్లు అవి ఆనాటి పరిపాలనా విభాగానికి చెందిన మంత్రభాగాలు. ఇక వేదాంత, దార్శనిక విషయ మంత్రాలను 'బ్రాహ్మణ్యము'లని పేర్కొన్నారు.

ఇందుమూలంగా ప్రాచీనవైదిక వాఙ్మయ సమధ్యయనంలో అథర్వవేదానికున్న ప్రాముఖ్యం అంతా ఇంతా కాదని చెప్ప వచ్చును. ఇందులోని జనజీవితానికి సంబంధించిన అనేక సూక్తాలు, మంత్రాలు అప్పటి భారత చరిత్రకు నిధానాలు. వేదఋషులు సమాజవికాసానికి, పౌరుల జీవితాల సమున్నతికి ఎంతగా పరితపించేవారో ఈ సంహితలో మనకు అడుగడుగునా కనిపించే సూక్తాలు, మంత్రాలు వేనోళ్ళచాటుతున్నవి. ఇవన్నీ అతితర భావనా శక్తితో విడిగి విప్పారిన కవితాలతాలతాంతాలుగా మనకు దర్శన మిస్తాయి.

ఇతర వేదాలలో లేని మరొక ప్రధానాంశం అభిచారిక క్రియాకలాపాలకు చెందినది. ఆ నాటి జనం తమ సుఖసౌభాగ్యాల కోసమే గాక, వాటికి విఘాతం కల్పించే శత్రువుల నిర్మూలనాన్ని కూడా కాంక్షించేవారు. అందుకై ప్రయత్నించేవారు. ఇందుకే అనిర్దిష్టాలైన కొన్ని మంత్రాలు, తంత్రాలు ఇందులో కొల్లలుగా ఉన్నవి.

అంతమాత్రాన ఇది కేవలం ఏ ఆటవిక జాతుల మూఢవిశ్వాసాలను తెలిపేవోనని భావించడం సరికాదు. ప్రతిదానికీ అప్పటి వారు కొన్నిమంత్రాలను పఠించి కొన్ని తాంత్రిక ప్రక్రియలను కల్పించుకుని లోకవ్యవహారం నడుపుకునే వారని మనకు తెలిసినదే.

పాశ్చాత్యపండితులకిది కేవలం అభిచారక క్రియాకలాప వివరణగా తోచడంలో ఆశ్చర్యం లేదు. వాళ్ళదృష్టివేరు.

అందుకే ఇదంతా పురాతనమైన అనేక అనాగరక జాతుల భయ భ్రాంతుల సంచయమేనని వారికి అనిపించినా, ఆ మాట వారన్నా అదేమీ వింతకాదు.

ఇక అథర్వాంగిరోవేద మనడానికి మూలం ఈ సంహితలోని అనేక మంత్రాలను దర్శించిన వారు వారేకనుక.

## కవితాసౌందర్యం.

ఈ సంహితలోని మంత్రాలలో అపూర్వం, అద్భుతం అయిన కవితా సౌందర్యం కల సూక్తాలు అనేకం ఉన్నవి.

ఇందలి వాస్తోష్పతి సూక్తం (3-12) శాలను (గృహాన్ని) అభివర్ణించే సూక్తం. ఇత్యాదులు ఇందుకు నిదర్శనాలు.

ఆ ఇల్లు కేవలం బాహ్య సౌందర్య ప్రదర్శకమే కాక అందులో నివసించే వారి సుఖసౌఖ్యాలు, ఆయురారోగ్యాలు, కుటుంబజీవనం ఇత్యాదులు పరమోత్కృష్టంగా ఉండవలెనని ఆ సూక్తం పేర్కొంటున్నది. అందలివ్యక్తులు తమతమ కర్తవ్యాలను నిర్వర్తించినపుడే జీవితం సుఖమయం కాగలదని కూడా ఇది వాకొన్నది.

అందలి గృహిణులు నేతితో నింపిన పూర్ణకుంభాలను గ్రహింపవలెనని సూచించడంతో కుటుంబ జీవనానికి వారు మూలధారమని చెప్పినట్లైనది.

అలాంటి చక్కని. దృఢమైన ఆకృతిగల ఇంటిలో, శత్రువులకు, విచారాలకు, విషాదాలకు దూరమైన ఇంటిలో నూరేళ్ళు జీవించాలని అప్పటివారు భావించుకున్నారు.

కాముక విశృంఖల ప్రవర్తన ఆరోగ్యానికి భంగకరమని, అది సాంఘిక నిగళబద్ధమని కూడా సూచిస్తున్న కామేషు (3-25) సూక్తం ఆనాటి వేదఋషుల దూరదృష్టికి నిదర్శనం.

మరి స్త్రీ వశీకరణాదులను గూర్చి మంత్రాలున్నవంటే అవి కామప్రవర్ధకాలని భావించరాదు. ఆనాటి పురుషులు తమ ప్రేయసు లను ఎంతగా ఆకర్షింప దలచుకున్నారో అది మాత్రమే వీనిలో అభివ్యక్తమౌతుంది.

ఆ నాటి జనం, ముఖ్యంగా వ్యవసాయం మీద ఆధారపడిన వారు. వారికి కావలసిన భూమిని సంతృప్తిపరచి, ధాన్యాన్ని సము త్పన్నంచేసేది వర్షమే గనుక ఇందలి వృష్టిసూక్తం ఎంతో సొగసుగా వానా వంగడులను అభివర్ణిస్తుంది.

(వృష్టిసూక్తం వివరణ 2వ సంపుటిలో....)

ఇలాగే చెప్పుకుంటు పోతే వాక్సూక్తం, దుందుభిసూక్తం లాంటివి అపారభావనా శక్తికి, అనుపమ కవితా వైభవానికి ఉదా హరణలుగా కానవస్తాయి.

ఇక ఆయుస్సూక్తం మనిషి దీర్ఘాయువును ఆకాంక్షిస్తూ చెప్పి నది. ఇది ఆనాటి సామాజిక దృక్పథానికి చిహ్నంగా నిలుస్తుంది. ఈ సూక్తం దీర్ఘాయువును ప్రసాదించ మని దేవతల నందరినీ అర్థించ డమే కాక యజమానిని మృత్యువునుంచి దూరం చేయమని కూడా కోరుతుంది. ఇందుకు కావలసిన మందుమాకులను కూడా ఈ సూక్తం వివరిస్తుంది. మనిషి ఎప్పుడూ ఉన్నతోన్నత స్థితికి వెళ్ళాలే తప్ప క్రిందికి జారిపోకూడదని, అతను అమృతరథాన్ని అధిరోహించ వలెనని కూడా ఈ సూక్తం ఉద్బోధిస్తుంది.

మరి పృథివీసూక్తం - అలనాటివారు నేలతల్లిని ఎంతగా ప్రేమించేవారో తెలియజేస్తుంది. ఈ సూక్తాన్ని ప్రాచ్యపాశ్చాత్య

పండితు లందరూ విపరీతంగా మెచ్చుకున్నారు. నాటి జనజీవన దర్పణంగా, నాటి ప్రజా దృక్పథ వివరణంగా కనిపించేది ఈ సూక్తం.

" యత్ తే మధ్యం పృథివి యచ్చ నభ్యం
యాస్త ఊర్జ స్తన్వః సంబభూవుః ।
తాసు నో ధేహ్యభి నః పవస్వ
మాతా భూమిః పుత్రో అహం పృథివ్యాః
పర్జన్యః పితా స ఉ నః పిపర్తు"          (12-1-12)

"ఓ పృథ్వీ నీ మధ్యభాగ మేది?
నీ నాభీస్థాన మేది?
నీతో ఊర్జ స్స్వాంతములైన
శరీరధారులు స్వయంభువులై ఉన్నారు.
వారిలో మాకు స్థానమివ్వు.
మాకు రక్షనివ్వు.
ఓ భూమీ! నీవు మాతవు
నేను పుత్రుడను.
పర్జన్యుడు మా తండ్రి
ఆయన మమ్ము పాలించుగాక!"

ఇక నాటి వివాహాదులతో కూర్చిన మంత్రాలు అనేకమున్న సూక్తాలు కూడా ఈ సంహితలో కలవు.

కాలసూక్తం వంటివి భారత సాహిత్య భాండారంలో అనర్ఘ మణులుగా విలసిల్లునవి.

ఈ సంహితకు తొమ్మిది శాఖ లున్నట్లు 'నవధా అథర్వణో వేదః' అన్న పతంజలి భాష్యంలోని వాక్యం తెలుపుతుంది.

అవి పైప్పలాద, స్తౌద, మౌద, శౌనకీయ, జాజల, జలద, బ్రహ్మవద, దేవదశచారణ విద్యలని అథర్వ పరిశిష్టచరణవ్యూహం

పేర్కొన్నది. అదే మరొకపాఠం ప్రకారం, పిప్పల, శౌనక, దామోద, తౌత్రాయణ, జాబాల, కునఖి, బ్రహ్మపలాశ, దేవదర్శి, చారణ విద్యలన్నవి ఆ తొమ్మిది శాఖలు.

ఇక ఐదుశాఖలే ఉన్నట్లు పాంచరాత్రంలోని అహిర్బుధ్న్య సంహిత అంటున్నది. ఏమైనా ఇప్పుడు దొరుకుతున్నవి రెండే. అవి పైప్పలాద, శౌనకశాఖలు. వీనిలో శౌనకశాఖను ప్రామాణికంగా దేశమంతటా పరిగ్రహిస్తున్నారు. ఇది ఆ శాఖకుచెందిన పాఠమే.

అథర్వవేద సంహితలో ఇరవైకాండ లున్నవి. వీనిలో కడపటి రెండూ తరువాత చేరినవని అనేవారూ ఉన్నారు. కొందరు పదహారు కాండలని, కొందరు పందొమ్మిది కాండలని అనడంకూడా కలదు.

శౌనకశాఖను బట్టి ఇరవైకాండలలో మొత్తం 736 (730 ?) సూక్తా లున్నవి. వీనిలోని మొత్తం మంత్రాల సంఖ్య 5933. (5918 ?)

ఋగ్వేదం నుంచి పన్నెండువందలదాకా ఋక్కులు ఇందులో చేరినవి. క్రమంలో కొంత మార్పున్నది.

ఇది అథర్వవేద సంహితకు చెందిన స్థూల స్వరూపం. దీనికి సాయణభాష్యం ఉన్నది. కానీ అది సమగ్రం కాదు.

ఇంత విస్తృతి, విషయవైవిధ్యం వైలక్షణ్యం కల ఈ సంహితను గూర్చి, ఇందలి విషయ పరంపరను గూర్చి విపులంగా వివరించడానికి ఇది తావుకాదు. ఎలాగూ మీ ముందుకు వస్తున్న ఈ గ్రంథ సంపుటులనుచూచి పాఠకులైన మీరే గ్రహించగలరు. ఇది కేవలం ఒక స్థూలరేఖా చిత్రణం, ప్రవేశిక మాత్రమే.

అథర్వవేద సంహితకు కొన్నిప్రచురణలలో కొన్నికొన్ని పాఠాంతరాలు ఉన్నవి. దీనిని మొదట జర్మనీలో ప్రచురించారు. భారతదేశంలోని ప్రచురణలలో నేను పరిగ్రహించినది 'విశ్వేశ్వరా

నంద వేదిక్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ - హోషియార్పూర్' (Visweswarananda Vedic Resaerch Institute - Hoshiarpur) వారు 1960 లో ప్రచురించిన ప్రచురణ. మూలం, పదం మొదలైన వానికి దానినే నేను ప్రమాణంగా గ్రహించాను. ఈ ప్రతిని 'విశ్వబంధు' అనే మహాపండితుడు అనేక ప్రతులను సంపాదించి, సంప్రతించి, పరిశోధించి సిద్ధపరచినాడు. ఇదే అన్నిటికంటె అధునాతనమైన సంస్కరణ. ఇది ఐదుసంపుటాలుగా ప్రచురిత మైనది. విలియమ్ డ్వైట్ విట్నీ (William Dwight whitney) ప్రచురణమొదలు బాంబే పండిట్ (Bombay Pandit Edition) ప్రచురణవరకు వచ్చిన వానిని సంప్రతించి విశ్వబంధు పండితుడు ఈ ప్రచురణను సంస్కరించినాడు. ఇందులోని ఇరవై కాండలను, ఎనిమిది సంపుటాలలో మూలంతో పదంతో పాటు చేర్చి నా అనువాదాన్ని కొనసాగించినాను.

నేను ప్రధానంగా సాయణభాష్యాన్నే అనుసరించినాను. కానీ అది అసంపూర్ణంగా ఉన్నందువల్ల దానిమీదనే ఆధారపడడం సాధ్యం కాదుగదా! అందువల్ల విలియమ్ డ్వైట్ విట్నీ (William Dwight-Whitney) పాశ్చాత్య పండితులలో ప్రధానంగా ప్రామాణికుడుగా పలువురు పరిగ్రహించిన అనువాదకుడు గనుక ఆ అనువాదాన్ని కూడా సంప్రతిస్తూ వచ్చినాను.

దీనిని మోతీలాల్ బనార్సీదాస (Motilal Banarsidass) సంస్థ రెండు సంపుటాలుగా ప్రచురించింది. అదికాక సరళసుందరంగా అనువదించినవాడు మరైస్ బ్లూమ్ ఫీల్డు (Mauriee Bloomfield). అయితే ఆయన పరిపూర్తిగా యథాక్రమంగా ఈ సంహితను అనువదించలేదు. ఆయన ఒక దృష్టితో దానిలో కొంతభాగాన్ని తానొక క్రమాన్ని పాటిస్తూ అనువదించినాడు. దీనిని కూడా మోతీలాల్ బనారసిదాస్ (Motilal Banarasidass) సంస్థ ఒకే సంపుటంగా ప్రచురించింది.

గ్రిఫిత్ (Ralph T H. Griffith) అను పాశ్చాత్య వైదికవిద్వాంసుడు ఋగ్వేదాన్ని అనువదించినాడు. ఈతని అథర్వవేద సంహితానువాదం ఆంగ్లంలో చదువుకోవడానికి హాయిగా ఉంటుంది. కానీ కొంత స్వేచ్ఛానువాదపద్ధతిలో రచించిన దిది. దీనిని చౌకాంబ సాన్స్క్రిట్ సీరీస్ ఆఫీస్, వారణాసి (Chowkhamba Sanskrit Series office, Varanasi) వారు 1938లో రెండు సంపుటాలుగా ప్రచురించినారు.

ఇవిగాక మహామహోపాధ్యాయ, పండిత శ్రీపాదదామోదర సాత్వలేకర్, హిందీలో సుబోధ భాష్యాన్ని రచించి మూలంతో పాటు ఐదు సంపుటాలుగా ప్రచురించినాడు. దీనిని స్వాధ్యాయ మండల్, కిల్లాపారడీవారు ప్రచురించినారు. ఇదికాక దేవీచాంద్ (Devichand) తన ఆంగ్లానువాదాన్ని వ్రాసి మూలంతోపాటు ఒకే సంపుటంగా ప్రచురించినాడు. కానీ ఈయన సంప్రదాయపండితుల పద్ధతి ననుసరించక దయానందసరస్వతి వేసిన బాటలో నడుస్తూ ఈ అనువాదం చేసినాడు. దీనిని మున్షీరామ్ మనోహర్‌లాల్ పబ్లిషర్స్, న్యూఢిల్లీ (Munshiram Manoharlal Publishers, New Delhi) వారు ప్రచురించినారు. వీటి నన్నిటినీ సాయణభాష్యంలేనిచోట్ల, అవసరమైనచోట్ల సంప్రతించి సాయణపద్ధతిలోనే అర్థంచేసుకొని, నేను తెలుగులో అనువదిస్తూ వస్తున్నాను.

ఒక్కొక్కకాండలోను అనువాకాలు, సూక్తాలు వానిలో మంత్రాలు ఇలా క్రమంగా ఉన్నవానిని యథాతథంగా విశ్వబంధు ప్రచురణను పాటించి అనుసరించినాను.

అయినా కొన్నిచోట్ల పర్యాయసూక్తాలూ, అవి ఉన్నచోట్ల ఇందలి సంఖ్యలను అలాగే వాడక ఇతర ప్రచురణలను కూడా పరిగ్రహించి వానిలో అత్యధిక ప్రచురణలు స్వీకరించిన సంఖ్యాక్రమాన్నే అనుసరించినాను.

ఈ అనువాదంలో తు. చ. తప్పకుండా అనువదించిన పండితుడు విట్నీ (Whitney); కానీ అదే కారణంవల్ల తన అనువాదాన్ని తానే కొన్ని మంత్రాలవద్ద అర్థంలేనిదని చెప్పుకొనవలసి వచ్చినది. ఈయనలోనున్న మరొక సుగుణం. కొన్ని మంత్రాలు బొత్తిగా అర్థంకానివి, అర్థం కాలేదనే చెప్పి దండాన్వయంలాగా తన అనువాదాన్ని కొనసాగించినాడు.

ఈ కారణా లన్నిటివలన వీసలో ఏ ఒక్కదానినో యథారూపంగా, ఆదర్శంగా పరిగణించలేక పోయినాను. సాయణభాష్యంలో కూడా యద్వా, తద్వాలు అక్కడక్కడా ఉండనే ఉన్నవి. రెండు మూడు అర్థాలను ఆయన సూచించిన చోటుకూడా ఏదో ఒక దానిని మాత్రమే నా అనువాదానికి ఆధారంగా చేసుకున్నాను - ఎక్కడో తప్ప.

ఒక్కొక్క సూక్తానికో, సూక్తగుచ్ఛానికో భాష్యకర్త ప్రవేశికగా ఇస్తూవచ్చిన వినియోగాదులను కొన్నిచోట్ల సంక్షిప్తీకరించి చెప్పినాను. ఎలాగూ ఆ వినియోగాదుల వివరమంతా కల్పసూత్రాలలో చూచుకొనవలసినదే. వానిలోనూ ముఖ్యంగా కౌశిక, వైతానస సూత్రాలలో వివృత మైనవి. ఆ సూత్రగ్రంథ నిరపేక్షంగా ఈ వినియోగాలను బట్టి కర్మప్రవణులు కావడానికి వీలులేదు. ఇంతకూ దీనిని అథర్వవేదసంహితలో ఉన్న ఋక్కులలో ఏమున్నదో తెలియజేయడమే లక్ష్యంగా సిద్ధపరచినాను. చికిత్సలనో, అభిచారికక్రియలనో ఉద్దేశించి కాదు.

ఒకొక్క సూక్తాన్ని ఒక్కొక్క పేర పేర్కొనడం కొన్నిట ఉన్నది. అలా కొన్నింటికి ఇచ్చాను. కానీ అన్నిటికీ అలా ఇవ్వలేదు. కొన్నిసూక్తాలలో ఉన్న విషయాన్ని వినియోగ వివరణ ప్రారంభంలోనే నాలుగు మాటలతో చెప్పడం కూడా చాలాచోట్ల జరిగింది.

కొంత ఊపు, తూగురావలెనన్న ఉద్దేశంతో ముక్తచ్ఛందంలో నా అనువాదాన్ని కొనసాగించినాను. యతిప్రాసాదులనుగానీ, మాత్రానియమాన్నిగానీ పాటించలేదు. అందుకు ప్రయత్నించనూ లేదు. కారణం యథామూలానువాదానికి అవి కొంత అడ్డంకిగా నిలువనూ వచ్చును. పైగా అనవసర దీర్ఘీకరణలు, సంక్షిప్తీకరణలు మొదలైనవానికి తావలం కావచ్చును. అందుకనే నే నాజోలికిపోలేదు. ముఖ్యంగా కొంత కవిత్వచ్ఛాయలు ఉన్నచోటుల్లా ఆ అందచందాలు పోకుండా, తెలుగు నుడికారం చెడకుండా అనువాదాన్ని మలచుకున్నాను. కొన్నిచోట్ల వచనప్రాయాలైన భాగాలుకూడా ఉన్నవి. దానికి కారణం మూలంలోని లక్షణాలే.

ఇందులో ఓషధులు మొదలైనవానిలో కొన్నిటికి సరియైన తెనుగుపేళ్ళేవో మనకు తెలియవు. వాని వివరణకోసం సర్ మోనియర్ మోనియర్ విలియమ్స్ (Sir Monier Monier Williams) ప్రచురించిన సంస్కృతాంగ్ల నిఘంటువు, సూర్యకాంతపండితుడు వ్రాసిన వైదిక నిఘంటువు, ఎ. ఎ. మేక్‌డోనెల్ (A. A Macdonell) మఱియు ఎ. బి. కీత్ (A B Keith) వ్రాసిన వేదిక్ ఇండెక్స్ ఆఫ్ నేమ్స్ అండ్ సబ్జెక్ట్సు (Vedic Index of Names and Subjects) మొదలైనవి సంప్రతించాను. దీనిని మోతీలాల్ బెనారసిదాస్ సంస్థ రెండు సంపుటాలుగా ప్రచురించింది. వానిలోని వృక్షశాస్త్రీయ నామధేయాల (Botanical Names) ను అంతర్జాతీయంగా అంగీకృతమైనవికదా అని కూడా ఇచ్చినాను.

ఇ. బ్లాట్టర్ (E Blatter) జె.ఎఫ్. కైస్ (J. F Caius) మరియు కె. ఎస్. మస్కర్ (K S. Mahskar) పండితులచే పరిష్కృతమై, లలిత్ మోహన్ బసు (Lalit Mohan Basu)చే నాలుగు సంపుటాలలో ప్రచురితమైన 'ఇండియన్ మెడిసనికల్ ప్లాంట్స్ (Indian Medicinical Plants) అనే నిఘంటువును బట్టి సంస్కృతంలోను, తెలుగు

లోనూ వీలైనన్నిచోట్ల పర్యాయపదాలను ఇచ్చినాను. ఇవన్నీ అథోజ్ఞాపికలలో ఉట్టంకితాలైనవి.

ఇంత శ్రమపడినా, ఎన్ని నిఘంటువులను సంప్రతించినా తెలియనివి కొన్ని లేక పోలేదు. వానిని యథామూలంగా ఇచ్చినాను.

ఏ అనువాదంలో గానీ, ఏ వ్యాఖ్యానంలో గానీ ఎంత వివరించినా సాఫీగా సమన్వయం కాని పట్టులుకొన్ని ఈ అథర్వవేద సంహితలో ఉండనే ఉన్నవి. వానిలో ఒక్కొక్కటి తమకు నచ్చిన ఒక్కొక్కరిని ననుసరించి అనువదించుకున్నారు. వీరిలో ఏ ఒక్కరిదో ప్రామాణికమని ఘోషించడం తర్కసహంకాదు కదా! మఱి మనకంటె చాల ముందున్న భాష్యకర్త సాయణుడుగనుక ఆయన ననుసరించడం పాశ్చాత్య వ్యాఖ్యాతలకూ తప్పలేదు. భారతీయులకూ తప్పలేదు. నాకూ తప్పలేదు. ఆయన చెప్పిన అర్థం సరికాదనే పాశ్చాత్య పండితులూ ఉన్నారు.

ఆ భాష్యాన్ని పూర్తిగా త్రోసిపుచ్చుతూ, డాక్టర్ సూర్యకాంత్ బాలి (Dr Suryakanth Bali,) మంత్రాలన్నీ కేవలం ఆనాటి కవితాఖండాలనీ, ఏ ఏ సూక్తాలు ఏ ఏ ఋషుల పేర్లతో వెలసినవో, అవి ఆ ఋషి కర్తృకములేనని వివరిస్తూ 'హిస్టారికల్ క్రిటికల్ స్టడీస్ ఇన్ ది అథర్వవేద' (Historical Critical Studies in the Atharvaveda) అనే ఒక ఉత్తమ గ్రంథాన్ని, అనేక విద్వాంసులు వ్రాసిన వ్యాసాలతో సంపాదించినాడు. దీనిని 'నాగ్ పబ్లిషర్స్, ఢిల్లీ (Nag Publishers, Delhi) వారు ప్రచురించినారు. కర్మకాండను బట్టి వ్యాఖ్యానించే సాయణుని భావాన్ని కాదు పొమ్మన్నాడు.

ఇక్కడ ఒక సంగతి చెప్పాలి. దాదాపు అర్ధశతాబ్దం క్రిందట డా॥ చిలుకూరు నారాయణరావు గారు అథర్వవేద సంహితను టీకా తాత్పర్యాలతో సిద్ధపరచవలెనని సంకల్పించి నాకు, మిత్రుడు

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులకు కొంతపనిని అప్పగించాడు. మేమూ పనిని కొంతనిర్వర్తించాము. మరి దానిని తిరుమల తిరుపతి దేవస్థానం వారు తెప్పించి చూడగా ఇరవై కాండలకు గాను మొదటి మూడుకాండలకు మాత్రమే టీకా తాత్పర్యాదులు ఇచ్చినట్లు తెలినది. ఆ ఇంతలో ఈ అథర్వవేద సంహితానువాదం ఏ మాత్రం ముగియదు గనుకను, ఆ పద్ధతికంటె అనువాదంగా ప్రచురించడమే మంచిదని భావించడం వల్లనూ దానిని ఏ మాత్రం సంప్రతించకుండా స్వతంత్రగా నేనీ అనువాదానికి పూనుకున్నాను. ఆ వివరమంతా నివేదించే ఉన్నాను. దానిని ఈ అనువాదంలో ఏమాత్రం వినియోగించుకోలేదు

వేదర్షులు మంత్రద్రష్టలని సంప్రదాయవాదు లంటే మంత్రస్రష్టలని కొందరు ఆధునికులు అనవచ్చును. ఈ వివాదం సులభంగా తేలేది కాదు. తేలకపోయినా వేదార్థ పరిజ్ఞానానికి వచ్చే ఆటంకమూ లేదు, అఘాతమూ లేదు.

ఈ మొదటి సంపుటంలో సంహితలోని మొదటి మూడు కాండలను మంత్రం, పదం, నా అనువాదంతో పాటూ ఇస్తున్నాను. ఇందులో ఏ కాండ గానీ, ఏ అనువాకం గానీ, ఒకే విషయానికి సంబంధించినది కాదు. కొన్ని చోట్ల ఒక సూక్తంలోనే విషయాంతరాలుండవచ్చును. ఏమైనా మొదటి కాండలో ప్రతిసూక్తం అధిక భాగం నాలుగు మంత్రాలు కలది. రెండవ కాండలో అరు మంత్రాలున్న సూక్తాలు హెచ్చు. మూడవ కాండలో 7 (?) మంత్రాలతో కూర్చినవి. ఈ కాండలలోని సూక్తాలు మంత్రసంఖ్యను బట్టి ఈ క్రమ మేర్పరచినట్టుగా కనబడుతుంది.

## మొదట కాండ

ఈ సంపుటంలోని మొదటికాండలోని మొదటి సూక్తం మేధాజనన సూక్తం. అది ఇలా ప్రారంభ మౌతుంది.

"యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః ।
వాచస్పతిర్బలా తేషాం తన్వో౽అద్య దధాతు మే ॥ 1 ॥

పునరేహి వాచస్పతే దేవేన మనసా సహ ।
వసోష్పతే ని రమయ మయ్యేవాస్తు మయి శ్రుతమ్ ॥2॥

ఇహైవాభి వి తనూభే ఆర్త్నీ ఇవ జ్యయా ।
వాచస్పతిర్ని యచ్ఛతు మయ్యేవాస్తు మయి శ్రుతమ్ ॥3॥

ఉపహూతో వాచస్పతి రుపాస్మాన్ వాచస్పతి ర్హ్వయతామ్।
సంశ్రుతేన గమేమహి మా శ్రుతేన వి రాధిషి ॥ 4 ॥

అనువాదం

విశ్వరూపధారులై ఏ త్రిసప్తపదార్థాలూ
సర్వేసర్వత్రా వ్యాపించునో,
వాని సర్వబలం ఓ వాచస్పతీ!
నాకు సమకూర్చు.

ఓ వాచస్పతీ! దివ్యమనస్సుతో తిరిగిరా!
ఓ వసోష్పతీ! నన్నానందింపజేయి.
నా శ్రుతం నాలోనే ఉండి పోనీ!
ధనుష్కోటులు రెంటినీ జ్యాబద్ధం చేసినట్టు
ఐహికాముష్మికాలను సమకూర్చు.

వాక్పతి తా నిచ్చిన ఫలాన్ని నియమితం చేయనీ!
నా శ్రుతం నాలోనే ఉండనీ.
వాచస్పతిని ఆహ్వానిస్తున్నాము.

ఫలసిద్ధికై మమ్ము ఆయన కూడా ఆహ్వానించుగాక!
జ్ఞానం మాకు సర్వం స్వాయత్త మగుగాక!
ఆ శ్రుతం నుంచి మేము విడిపోకుందుముగాక!

ఇది కేవలం తన మేధాశక్తిని పెంపొందించుటకై వాచస్పతిని ప్రార్థించే సూక్తం.

ఇందులో మఱి విజయసూక్త మున్నది. సంగ్రామాదులలో విజయం కోసమై వినియోగించే మంత్ర సంపుటి అది.

అలాగే ఆరోగ్యాన్ని కోరుతూ చేసే కర్మలో వినియోగించే మంత్రాలు, ఉదక దేవతలను ప్రార్థించే మంత్రాలు కల విభిన్న సూక్తాలు ఇందులో ఉన్నవి. మరి ధర్మప్రచార సూక్తమన్నది రాక్షసులను నాశం చేయవలెనని అగ్నిని ప్రార్థించే సూక్తం.

ఇలాగే వర్చః ప్రాప్తికై వినియోగించే సూక్తం కూడా ఒక టున్నది.

ఇక పెక్కు మంత్రాలు రోగచికిత్సకై, సుఖప్రసూతి మొదలైన వానికై చేసేకర్మలలో వినియోగించే మంత్రాలతో నిండి ఉన్నవి.

దీని నడుమ పరమాత్మకు నమస్కారం చేస్తూ చెప్పిన సూక్త మొకటి కనబడుతుంది. ఒకటి చోరనాశనాన్ని కోరేది, మరొకటి సౌభాగ్యాన్ని వృద్ధిచెందించమని కోరేది.

వీటన్నిటికంటె రోగనివారణలో 'శ్వేతకుష్ఠ నాశన స్సూక్త' మన్నపేర ఒకటి ఉన్నది. ఆరుగ్ణతా నిరోధానికై చేసే హోమాదులలో వినియోగించే మంత్రాలు కొన్ని ఉన్నవి. ఈ సందర్భంలోనే అనేక మూలికలను, ఓషధులను, వనస్పతులను పేర్కొనడం జరిగింది. వీని తెలుగుపేర్లను తెలుసుకొనుటకై గట్టి ప్రయత్నమే చేశాను. తెలియనిచోట వృక్షశాస్త్ర నామధేయం (Botanical name) ఇచ్చాను. ఈ విషయంలో ముందే కొంత వివరంగా చెప్పిఉన్నాను.

శీత జ్వరాన్ని గురించి, వానిలో వరుస జ్వరాన్నిగురించి కొన్ని సూక్తా లున్నాయి. ఆ కాలంలో ఈ జ్వరాల పరివ్యాప్తి అధికంగా ఉండినదేమో!

ఇక సుఖప్రాప్తిసూక్తాదులు, దుష్టనాశనాదిసూక్తాదులు, రాజ్య సంవర్ధన సూక్తాదులు, ఆయుష్యవర్ధన సూక్తాదులు వాటి పేర్లతోనే లోని విషయాన్ని వ్యక్తీకరిస్తున్నది. దిఙ్మాత్రంగా ఇదీ మొదటికాండ స్వరూపస్వభావాదుల వివరణ.

## రెండవ కాండ

కామితార్థ సిద్ధికై చేసే కర్మలో వినియోగించే మంత్రాలతో రెండవకాండ ఆరంభమౌతుంది. దీనిలో ఏకేశ్వరసూక్తమొక టున్నది. ఇందులో ముఖ్యంగా సూర్యస్తుతి కనబడుతుంది.

"దివి స్పృష్టో యజతః సూర్యత్వ
గవ యాతా హరసో దైవ్యస్య ।
మృడాద్ గంధర్వో భువనస్య య
స్పతిరేక ఏవ నమస్యఽః సుశేవాః ॥

దివిలో నున్నవాడు, యజనీయుడు
సూర్య సమానవర్ణుడు, దేవ క్రోధనివారకుడు
సుఖప్రదాత కూడా ఆయనే.
ఆ గంధర్వుడు ( ఆదిత్యుడు ) భువనపతి.
ఆయ నొక్కడే నమస్కారార్హుడు.
సేవాసులభుడు.

దీనిలో ఆరోగ్యాన్ని ప్రసాదించమని కొన్ని ఓషధులను ప్రార్థించడం జరిగింది. ఇంద్రస్తోత్రంకూడా ఇందులో ఒకటి. అగ్ని స్తోత్రమూ అలాంటిదే. రోగనివారణకై చెప్పిన సూక్తాలే ఈ కాండలో ఎక్కువ. వాటిని సాధ్యమైనంత సులభంగా అర్థం చేసుకోవడానికి వీలైనంత సరళంగా అనువదించాను.

మణిబంధనాదులు పీటున్నిటా కనబడతవి. మణి అంటే ఏ చెట్టుకొమ్మనో, రెమ్మనో తెగగొట్టి, కట్టుకొనుటకు అనువుగా తయారు చేసుకునే వారు. దానిని మంత్రపూర్వకంగా కట్టడం వలన కొన్ని రుగ్మతలకు దూరం కావచ్చునని, కొన్ని భూత ప్రేతాదులను తరిమివేయ వచ్చునని అప్పటి వార విశ్వాసం.

ఈ సంహితలో అభిచారకర్మకు చెందిన సూక్తాలు ఎక్కడబడితే అక్కడ దర్శన మిస్తాయి అల్లాగే ఆపన్నివారణకై భయరహిత జీవనానికై చేసే కర్మలలో వినియోగించే సూక్తాలు కొన్ని ఉన్నవి. ఆయుష్కాముడు చేసే హోమాదులలో వినియోగించే మంత్రాలు చాలాకలవు.

పృశ్నిపర్ణి వంటి చిత్రమైన ఓషధుల పేర్లు ఓషధులుగా ఉపయోగించడం ఇందులో కలదు. 'పృశ్నిపర్ణి' అంటే కోలపొన్న, సురపొన్న, నేలపొన్న అనే అర్థాలను కొన్ని నిఘంటువుల సాయంతో గ్రహించినాను. అలాగే 'పార' అనే పేరుగల ఓషధికి విసబొద్ది, విసబొంది, చిరుబొద్ది, విద్ధకర్ణి మొదలైన పేర్లను గ్రహించినాను.

## మూడవ కాండ

ఇది రాజులకు సంబంధించిన సూక్తంతో ప్రారంభ మౌతుంది.

అగ్నిర్నః శత్రూన్ ప్రత్యేతు విద్వాన్
ప్రతిదహన్నభిశస్తి మరాతిమ్ ।
ససేనాం మోహయతు పరేషాం
నిర్హస్తాంశ్చ కృణవ జ్జాతవేదాః ॥ 1 ॥

యూయముగ్రా మరుత ఈదృశే
స్థాభి ప్రేత మృణత సహధ్వమ్ ।
అమీ మృణన్ వసవో నాథితా ఇమే
అగ్నిర్హ్యేషాం దూతః ప్రత్యేతు విద్వాన్ ॥ 2 ॥

అమిత్రసేనాం మఘవన్నస్మాన్ ఛత్రూయతీమభి ।
యువం తా మిన్ద్ర వృత్రహన్నగ్నిశ్చ దహతం ప్రతి॥3॥

ప్రసూత ఇన్ద్ర ప్రవతా హరిభ్యాం
ప్ర తే వజ్రః ప్రమృణన్నేతు శత్రూన్ ।

జహి ప్రతీచో అనూచః పరాచో
విష్వక్ నత్యం కృణుహి చిత్తమేషామ్ ॥ 4 ॥

ఇన్ద్రసేనాం మోహయా మిత్రాణామ్
అగ్నేర్వాతస్య ధ్రాజ్యాతాన్ విషూచో వినాశయ ॥ 5 ॥

ఇన్ద్రసేనాం మోహయతు మరుతో ఘ్నన్త్వోజసా ।
చక్షూంష్యగ్నిరా దత్తాం పునరేతు పరాజితా ॥ 6 ॥

జయోపాయవేత్త అయి అగ్ని
మా శత్రువుల పైకి వెళ్ళు గాక!
మా పైకి వచ్చే శత్రువును దహిస్తూ వెళ్ళుగాక!
పరసేనను మోహింపజేయుగాక!
సర్వజ్ఞుడైన అగ్ని మా శత్రువులను
హస్తవ్యాపార శూన్యులను చేయుగాక! ॥ 1 ॥

ఉగ్రులైన మరుత్తులారా! మీరీ సంగ్రామ కర్మలో
నాకు సాయంగా ఉండండి.
శత్రువులను ఎదుర్కొంటూ వెళ్ళండి.
హింసించే శత్రువులను అభిభవించండి.
అలాగే వసుదేవతలు ప్రార్థితులై
మా శత్రువులను చంపుదురు గాక!
ఈ వసువుల దూత జ్ఞాని అయిన అగ్ని
శత్రువుల పైకి వెళ్ళుగాక! ॥ 2 ॥

ఓ ఇంద్రా మాపై పగబట్టివచ్చే
శత్రుసేనను ఎదుర్కొను.
వృత్ర సంహారి అయిన ఓ ఇంద్రుడా!
నీవు అగ్ని కలిసి ఆ పరసేనను భస్మీకరించండి. ॥ 3 ॥

ఓ ఇంద్రుడా! హరినామకములైన అశ్వములను
పూన్చిన నీ రథం ప్రహత మార్గంలో వెళ్ళుగాక!

నీ వజ్రాయుధం శత్రువులను ఛేదిస్తూ వెళ్ళుగాక !
నీవు ప్రతిముఖంగా వస్తున్న శత్రువులను
పరాఙ్ముఖులై పారిపోతున్న శత్రువులను నశింపజెయ్యి.
ఈ శత్రువుల వ్యవస్థిత చిత్తాన్ని
అవ్యవస్థితంగా చెయ్యి. ॥ 4 ॥

ఓ ఇంద్రుడా ! విరోధిసేనను మోహింపజేయి.
అగ్ని వాయువుల దహన వేగాలతో
ఆ శత్రువులను పలాయనం చెందించి ధ్వంసం చెయ్యి. ॥ 5 ॥

ఇంద్రుడు పరసేనను మోహింపజేయుగాక !
మరుత్తులు తమబలంతో హింసింతురుగాక !
అగ్ని పరనేత్రాలను అపహరించుగాక !
'పరాజితమైన సేన వెనుదిరిగి పోవుగాక ! ॥ 6 ॥

సూక్తం - 1 - కాండ - 3

శత్రుసేనను సమ్మోహింప జేయడానికి చేసే హోమంలో దీని ఉపయోగ మని మొదటి సూక్తమే తెలుపుతుంది. శత్రు పరిహరణం కోసం చేసే ప్రక్రియలు, రాజాహ్వానం మొదలైనవి కొన్ని ఉన్నవి.

విఘ్నశమన కర్మలు, కాలయజ్ఞానికి సంబంధించిన సూక్తాలు కొన్ని ఉన్నవి. క్షయాదులను నిర్మూలించి దీర్ఘాయుస్సు నిచ్చే ఓషధులను చెప్తూ కొన్ని సూక్తా లున్నవి.

ఇందులో నదీప్రవాహసూక్త మొకటి ఉన్నది. ఇది నదులను జలాన్ని ప్రశంసిస్తూ, స్తుతిస్తూ చెప్పిన మంత్రాలతో ఉన్నది. అలాగే వాణిజ్యలాభార్థమైన మంత్రా లున్నవి.

ఇక వ్యవసాయాన్ని గూర్చి చెప్పినవి చాలనే ఉన్నవి. అప్పటికే సేద్యనాద్యాలు బాగా వ్యాపించి ఉన్నవని, వానిలో కొన్ని పరిణత పద్ధతులుకూడా ఉన్నవని మనకు తేట తెల్లమౌతుంది.

అగ్నిని స్తుతిస్తూ ఉదకమధ్యంలో, మేఘంలో, పురుషునిలో, కొన్ని శిలలలో, ఓషధులలో, వనస్పతులలో ఉన్నదని చెప్పడం ఆనాటి వారి సునిశిత దృష్టికి, భావుకతకు నిదర్శనం.

"యే అగ్నయో అప్స్వ న్తర్యే వృత్రే
యే పురుషే యే అశ్మసు
య అవివే శోషధీర్యో వనస్పతీం
స్తేభ్యో అగ్నిభ్యో హుత మ స్త్వేతత్ ॥ 1 ॥

ఉదకమధ్యంలో నున్న అగ్నులకు
మేఘంలో విద్యుద్రూపంగా ఉన్న అగ్నులకు
పురుషునిలో వైశ్వానరాత్మకంగా ఉన్న అగ్నులకు
సూర్యకాంతాది శిలలలో ఉన్న అగ్నులకు
ఓషధులలో, వనస్పతులలో ఉన్న అగ్నులకు
ఆ అగ్ను లన్నింటికీ ఈ హవిస్సు చెందుగాక!

సూక్తం: 21 : కాండ: 3

ఇక వీరపుత్ర ప్రాప్తికి చెప్పిన సూక్త మొకటి, స్త్రీ వశీకరణార్థమైన సూక్త మొకటి ఉన్నవి.

స్త్రీ వశీకరణ మంటే పరస్త్రీవశీకరణ మనికాదు, స్వస్త్రీని తన మీాద మరింత మరులు కొల్పుటకై దీనిని ఉద్దేశించినట్లు భావించవచ్చును.

ఇలా ఈ మూడవకాండ విభిన్న విషయ ప్రపూర్ణంగా ఉన్నది.

ఈ మూడు కాండలతో ఈ ప్రథమ సంపుటం ముగుస్తుంది. ఈ సంపుటం ప్రవేశిక వలెనే మిగత సంపుటాలకు వ్రాసే దానిలో వివరిస్తూ వస్తాను. మొత్తం మీాద అథర్వణ వేదసంహితను గూర్చిన ఒక స్థూలరేఖా చిత్రణం కోసం మాత్రమే ఈ భూమికారచనలో ప్రము

త్నించినాను. వెనువెంటనే మిగత సంపుటాలను కూడా వెలువరించడం జరుగుతుంది గనుక ఆ కాండల వివరణం కూడా త్వరలోనే పాఠకులకు లభిస్తుంది.

ఈ నా శ్రమంతా పాఠకులు దీనిని చదివి ఈ సంహితలోని విషయమేమిటో తెలుసుకొనుటకే. ఆ ఫలితాన్ని ఇది సాధిస్తే అంతకంటే నాకు కావలసినదేమున్నది!

# విషయసూచిక

## ప్రథమకాండ

# అనువాకం: 1

## సూక్తం—1

## మేధాజననసూక్తం

ఋషి: అథర్వుడు ॥ దేవత: వాచస్పతి ॥ ఛందస్సు: 1-3 అనుష్టుప్, 4 చతుష్పదా విరాడురోబృహతీ ॥ మంత్రములు: 4.

వినియోగం: ఈ సూక్తానికి మేధాజననకర్మలో వినియోగం.

మంత్రము:

యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః ।

వాచస్పతిర్బలా తేషాం తన్వోఽ అద్య దధాతు మే ॥ 1 ॥

పదము:

యే । త్రిఽసప్తాః । పరిఽయాన్తి । విశ్వా । రూపాణి । బిభ్రతః ।

వాచః । పతిః । బలా । తేషామ్ । తన్వఽః । అద్య । దధాతు । మే ॥ 1 ॥

అనువాదం:

విశ్వరూపధారులై * ఏ త్రిసప్తపదార్థాలూ
సర్వే సర్వత్రా వ్యాపించునవో

---

* పృథివ్యాదులైన మూడులోకాలు, వాటి అధిష్ఠాతలైన అగ్నివాయు ఆదిత్యులు, సత్త్వరజస్తమోగుణాలు, బ్రహ్మవిష్ణు మహేశ్వరులు - ఇలా త్రి సంఖ్యతో కూడిన వాటి నన్నింటినీ ఇక్కడి త్రిశబ్దం చెప్తుంది. అలాగే సప్తర్షులు, సప్తగ్రహాలు, సప్తమరుద్గణాలు, సప్తలోకాలు, సప్తఛందస్సులు మొదలుగా గల సప్త సంఖ్యాకములైన వన్నీ సప్తశబ్దంతో వివక్షితమైనవి. వీటినే పేకొక విధంగా కూడ చెప్పవచ్చును-అంటూ మొత్తం మీద సర్వభూత జాతం అనే భావం చెప్పుకోవచ్చును. ॥ 1 ॥

వాని సర్వబలం ఓ వాచస్పతీ!
నాకు సమకూర్చు ॥ 1 ॥

మంత్రము:

పునరేహి వాచస్పతే దేవేన మనసా సహ

వసోష్పతే ని రమయ మయ్యేవాస్తు మయి శ్రుతమ్ ॥ 2 ॥

పదము:

పునః । ఆ । ఇహి । వాచః । పతే । దేవేన । మనసా । సహ ।

వసోః । పతే । ని । రమయ । మయి । ఏవ । అస్తు । మయి ।
శ్రుతమ్ ॥ 2 ॥

అనువాదం:

ఓ వాచస్పతీ! దివ్య మనస్సుతో తిరిగిరా
ఓ వసోష్పతీ! నన్నానందింప జెయ్యి.
*నా శ్రుతం నా లోనే ఉండిపోనీ ॥ 2 ॥

ఇహైవాభి వి తనూభే ఆర్త్నీ ఇవ జ్యయా ।

వాచస్పతిర్ని యచ్ఛతు మయ్యేవాస్తు మయి శ్రుతమ్ ॥ 3 ॥

పదము:

ఇహ । ఏవ । అభి । వి । తను । ఉభే ఇతి । ఆర్త్నీఇవేత్యార్త్నీ
ఽఇవ । జ్యయా ।

---

* అధీతమైనది ధారణలో ఉండునట్లు నాకు మేధను ప్రసాదింపుమని భావము.

మంత్రము:

వాచః । పతిః । ని । యచ్ఛతు । మయి । ఏవ । అస్తు । మయి ।
శ్రుతమ్ ॥ 3 ॥

**అనువాదం :**

* ధనుష్కోటులు రెంటినీ జ్యాబద్ధం చేసినట్లు
ఐహికాముష్మికాలను సమకూర్చు.
వాక్పతి తా నిచ్చిన ఫలాన్ని నియమితం చేయనీ!
నా శ్రుతం నాలోనే ఉండనీ! ॥ 3 ॥

**మంత్రము :**

ఉపహూతో వాచస్పతిరుపాస్మాన్ వాచస్పతిర్హ్వయతామ్ ।
సం శ్రుతేన గమేమహి మా శ్రుతేన వి రాధిషి ॥ 4 ॥

**పదము :**

ఉపఽహూతః । వాచః । పతిః । ఉప । అస్మాన్ । వాచః । పతిః ।
హ్వయతామ్ ।
సమ్ । శ్రుతేన । గమేమహి । మా । శ్రుతేన । వి । రాధిషి । ॥ 4 ॥

**అనువాదం :**

వాచస్పతిని ఆహ్వానిస్తున్నాము.
ఫలసిద్ధికై మమ్ము ఆయన కూడ ఆహ్వానించుగాక!
జ్ఞానం మాకు సర్వం స్వాయత్త మగుగాక!
ఆ శ్రుతం నుంచి మేము విడిపోకుందుముగాక! ॥ 4 ॥

---

* ఇక్కడ అల్లెత్రాడు ధనుస్సు రెంటి మొనలను కలిపినట్లు ఐహికాముష్మిక ఫలసాధన సమకూర్చుమని భావము.

ఇది ఒకటవ సూక్తం

# సూక్తం - 2

# విజయ - సూక్తం

ఋషి : అథర్వుడు॥ దేవత : పర్జన్యుడు॥ ఛందస్సు : 1, 2, 4 అనుష్టుప్, 3 త్రిపదా విరాణ్ణామ గాయత్రీ॥ మంత్రములు : 4 ॥

వినియోగం : సంగ్రామాదులలో జయం కోసమై చేసే ఆజ్యహోమాదులలో దీని వినియోగం. అలాగే జ్వరం, అతిసారం, అతిమూత్రం, నాడీ వ్రణం మొదలగువాని ఉపశమనానికి కూడ కొన్ని చికిత్సలతో పాటు దీనికి వినియోగం.

మంత్రము :

విద్మా శరస్య పితరం పర్జన్యం భూరిధాయసమ్ ।
విద్మో ష్వస్య మాతరం పృథివీం భూరి వర్పసమ్ ॥ 1 ॥

పదము :

విద్మ । శరస్య । పితరమ్ । పర్జన్యమ్ । భూరిऽధాయసమ్ ।
విద్మో ఇతి । సు । అస్య । మాతరమ్ । పృథివీమ్ । భూరి ऽవర్పసమ్ ॥ 1 ॥

అనువాదం :

శరజనకుని పర్జన్యుని
సకల శక్తు లిచ్చువాని మే మెరుగుదుము.
అతని జననిని పృథివిని
చరాచరాత్మక రూపధారిణిని కూడ మే మెరుగుదుము. ॥ 1 ॥

మంత్రము :

జ్యాఽకే పరిణో నమాశ్మానం తన్వంఽకృధి।
వీడు ర్వరీ యో ఽరాతీ రప ద్వేషాంస్యా కృధి ॥ 2 ॥

పదము :

జ్యాఽకే। పరి। నః। నమ। అశ్మానమ్। తన్వఽమ్। కృధి।
వీడుః। వరీయః। అరాతిః। అప। ద్వేషాంసి। ఆ। కృధి ॥ 2 ॥

అనువాదం :

ఓ మౌర్వీ! నీ ఈ సంతానాన్ని పరివ్యాపించి
మా శరీరాలను కఠిన శిలలుగా, శస్త్రాభేద్యాలుగా చెయ్యి.
ఓ ఇంద్రా! నీవు సేనను స్తంభింప చేయువాడవు.
మా శత్రువులను, తత్కృతమైన అప్రియములను
అపాకరించు. ॥ 2 ॥

మంత్రము :

వృక్షం యద్గావః పరిషస్వజానా
అనుస్ఫురం శరమర్చ న్త్యృభుమ్।
శరుమస్మద్యావయ దిద్యుమిన్ద్ర ॥ 3 ॥

పదము :

వృక్షమ్। యత్। గావః। పరిఽసస్వజానాః।
అనుఽస్ఫురమ్। శరమ్। అర్చన్తి। ఋభుమ్।

శరుమ్ । అస్మత్ । యవయ । దిద్యుమ్ । ఇన్ద్ర ॥ 3 ॥

**అనువాదం :**

మా హవిస్సులచే సంప్రీతుడవైన ఓ ఇంద్రా !
ధను ర్దండాన్ని ఆశ్లేషించుకొని ఉన్న
అస్త్రవేత్త వదలిన బాణాన్ని
మావైపు వస్తున్న దానిని
మానుంచి దూరం చెయ్యి. ॥ 3 ॥

**అర్థాంతరం :**

నిదాఘపీడితమైన గోగణం నీడనిచ్చే వటవృక్షాదులను ఎలా ఆశ్లేషించి ఉండునో అలాగే శత్రువును పరివేష్టించిన భటాదులు ఆయనను సేవిస్తూంటారు. వారు విడిచిన శరాన్ని, మావైపు వస్తున్న దానిని మానుంచి దూరం చెయ్యి.

**మంత్రము :**

**మంత్రము :**

యథాద్యాంచ పృథివీం చాన్తస్తిష్ఠతి తేజనమ్ ।
ఏవా రోగం చాస్రావం చాన్తస్తిష్ఠతు ముఞ్జఇత్ ॥ 2 ॥

**పదము :**

యథా । ద్యామ్ । చ । పృథివీమ్ । చ । అన్తః । తిష్ఠతి । తేజనమ్ ।
ఏవ । రోగమ్ । చ । ఆఽస్రావమ్ । చ । అన్తః । తిష్ఠతు । ముఞ్జః ।
ఇత్ ॥ 4 ॥

**అనువాదం :**

ద్యావా పృథ్వుల మధ్య వేణువు
తన ఔన్నత్యంతో వాని నధఃకరించి నిలబడే ఉన్నది.

అలాగే జ్వరాది రోగాలకు అతిసారాదులకు అడ్డుగా
వాని నధఃకరించి ముంజ్రగాన రజ్జువు నిలుచుగాక! ॥ 4 ॥

ఇది రెండవ సూక్తం

## సూక్తం – 3

# ఆరోగ్య - సూక్తం

ఋషి : అథర్వుడు ॥ దేవతలు: మంత్రాలలో పేర్కొన్న పర్జన్యాదులు ॥
ఛందస్సు : - 1-5 పథ్యాపంక్తి : 6-9 అనుష్టుప్ ॥ మంత్రములు : 9॥

వినియోగం : మూత్రపురీష నిరోధంలో చేసే చికిత్సలో దీనికి వినియోగం.

మంత్రము :

విద్మా శరస్య పితరం పర్జన్యం శతవృష్ణ్యమ్ ।
తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం
బహిష్టే అస్తు బాలితి ॥ 1 ॥

పదము :

విద్మ । శరస్య । పితరమ్ । పర్జన్యమ్ । శతఽవృష్ణ్యమ్ ।
తేన । తే । తన్వే౭ । శమ్ । కరమ్ ।
పృథివ్యామ్ । తే । నిఽసేచనమ్ ।
బహిః । తే । అస్తు । బాల్ । ఇతి ॥ 1 ॥

అనువాదం :

శరజనకుని పర్జన్యుని
శతబల సంయుతుని మే మెరుగుదుము.
ఓ మూత్ర రోగార్తుడా!
పృథివిపై నిషేచనంతో
నీ శరీరాన్తర్నిబద్ధమైన మూత్రం
జలజల బహిర్గత మగుగాక! ॥ 1 ॥

మంత్రము :

విద్మా శరస్య పితరం మిత్రం శతవృష్ణ్యమ్ ।
తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం
బహిష్టే అస్తు బాలితి ॥ 2 ॥

పదము :

విద్మ । శరస్య । పితరమ్ । మిత్రమ్ । శతఽవృష్ణ్యమ్ ।
తేన । తే । తన్వే । శమ్ । కరమ్ ।
పృథివ్యామ్ । తే । నిఽసేచనమ్ ।
బహిః । తే । అస్తు । బాల్ । ఇతి ॥ 2 ॥

అనువాదం :

శరజనకుని మిత్రుని
శతబల సంయుతుని మేమెరుగుదుము.

పృథివిపై నీ నిషేచనం వలన
శరీరంలోని సకల దోషాలు
త్వరగా పరిహృతాలౌగాక! ॥ 2 ॥

మంత్రము:

విద్మా శరస్య పితరం వరుణం శతవృష్ణ్యమ్।
తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం
బహిష్టే అస్తు బాలితి ॥ 3 ॥

పదము:

విద్మ। శరస్య। పితరమ్। వరుణమ్। శతఽవృష్ణ్యమ్।
తేన। తే। తన్వే ఽ। శమ్। కరమ్।
పృథివ్యామ్। తే। నిఽసేచనమ్।
బహిః। తే। అస్తు। బాల్। ఇతి ॥ 3 ॥

అనువాదం:

శరజనకుని వరుణుని
శతబల సంయుతుని మేమెరుగుదుము.
పృథివిపై నీ నిషేచనం వలన
శరీరంలోని సకల దోషాలు
త్వరగా పరిహృతాలౌగాక! ॥ 3 ॥

మంత్రము :

విద్మా శరస్య పితరం చన్ద్రం శతవృష్ణ్యమ్ ।
తేనా తే తన్వే ३ శం కరం
పృథివ్యాం తే నిషేచనం
బహిష్టే అస్తు బాలితి ॥ 4 ॥

పదము :

విద్మ । శరస్య । పితరమ్ । చన్ద్రమ్ । శతऽవృష్ణ్యమ్ ।
తేన । తే । తన్వేऽ । శమ్ । కరమ్ ।
పృథివ్యామ్ । తే । నిऽసేచనమ్ ।
బహిః । తే । అస్తు । బాల్ । ఇతి ॥ 4 ॥

అనువాదం :

శరజనకుని చంద్రుని
శతబల సంయుతుని మేమెరుగుదుము.
పృథివిపై నీ నిషేచనం వలన
శరీరంలోని సకల దోషాలు
త్వరగా పరిహృతాలౌగాక ! ॥ 4 ॥

మంత్రము :

విద్మా శరస్య పితరం సూర్యం శతవృష్ణ్యమ్ ।
తేనా తే తన్వే३శం కరం

పృథివ్యాం తే నిషేచనం

బహిష్టే అస్తు బాలితి ॥ 5 ॥

పదము :

విద్మ । శరస్య । పితరమ్ । సూర్యమ్ । శతఽవృష్ణ్యమ్ ।

తేన । తే । తన్వే౾ । శమ్ । కరమ్ ।

పృథివ్యామ్ । తే । నిఽసేచనమ్ ।

బహిః । తే । అస్తు । బాల్ । ఇతి ॥ 5 ॥

అనువాదం :

శరజనకుని సూర్యుని
శతబలసంయుతుని మే మెరుగుదుము.
పృథివిపై నీ నిషేచనం వలన
శరీరం లోని సకల దోషాలు
త్వరగా పరిహృతాలౌగాక ! ॥ 5 ॥

మంత్రము :

యదాన్త్రేషు గవీన్యోర్యద్వస్తావధి సంశ్రితమ్ ।

ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ 6 ॥

పదము :

యత్ । ఆన్త్రేషు । గవీన్యోః । యత్ । వస్తౌ । అధి । సమ్ఽశ్రితమ్ ।

ఏవ । తే । మూత్రమ్ । ముచ్యతామ్ । బహిః । బాల్ । ఇతి ।

సర్వకమ్ ॥ 6 ॥

**అనువాదం :**

ఓ మూత్ర రోగార్తుడా !
అంత్రములలో, మూత్రాశయ పార్శ్వనాడులలో,
మూత్రాశయంలో నిరుద్ధమై ఉన్న నీ మూత్రం
సర్వమూ బహిర్గతమౌగాక ! ॥ 6 ॥

**మంత్రము :**

ప్రతే భినద్మి మేహనం వర్త్రం వేశన్త్యా ఇవ ।
ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ 7 ॥

**పదము :**

ప్ర । తే । భినద్మి । మేహనమ్ । వర్త్రమ్ । వేశన్త్యాఃऽఇవ ।
ఏవ । తే । మూత్రమ్ । ముచ్యతామ్ । బహిః । బాల్ । ఇతి ।

సర్వకమ్ ॥ 7 ॥

**అనువాదం:**

ఓ మూత్రవ్యాధి పీడితుడా!
నీ మూత్రనాళాన్ని భేదిస్తున్నాను.
పల్వల జలం త్రవ్విన కాల్వనుంచి వలె
నీ మూత్రం సర్వమూ బహిర్గతమౌగాక ! ॥ 7 ॥

మంత్రము :

విషితం తే వస్తిబిలం సముద్రస్యోదధేరివ ।

ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ 8 ॥

పదము :

వి౽సితమ్ । తే । వస్తి౽బిలమ్ । సముద్రస్య । ఉదధేః౽ఇవ ।

ఏవ । తే । మూత్రమ్ । ముచ్యతామ్ । బహిః । బాల్ । ఇతి ।

సర్వకమ్ ॥ 8 ॥

అనువాదం :

ఓ మూత్ర రోగార్తుడా!
సముద్ర జలం ప్రవహించడానికి దారిని చేసినట్లు
నీ మూత్రబిలాన్ని ఉద్ఘాటన చేస్తున్నాను.
నీ మూత్రం సర్వమూ బహిర్గతమౌగాక! ॥ 8 ॥

మంత్రము :

యథేషుకా పరాపతదవసృష్టాధి ధన్వనః ।

ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ 9 ॥

పదము :

యథా । ఇషుకా । పరా౽అపతత్ । అవ౽సృష్టా । అధి । ధన్వనః ।

ఏవ । తే । మూత్రమ్ । ముచ్యతామ్ । బహిః । బాల్ । ఇతి ।

సర్వకమ్ ॥ 9 ॥

అనువాదం :

ఓ మూత్ర రోగార్తుడా !
అలాగే, ధనుస్సునుంచి వదలిన బాణం
నిరాటంకంగా వెళ్ళినట్టుగా
నీ మూత్రం సర్వమూ ఒక్కసారిగా బయల్వెడలు గాక ! ॥ 9 ॥

ఇది మూడవ సూక్తం

## సూక్తం - 4

# జల - సూక్తం

ఋషి : సింధు ద్వీపుడు లేక కృతి॥ దేవత: ఆపః॥ ఛందస్సు :
1-3 గాయత్రి, 4 పురస్తాద్ బృహతీ ॥ మంత్రములు: 4 ॥

వినియోగం: గోరోగోపశమనార్థం ఈ సూక్తంతో అభిమంత్రించిన జలాన్ని ఉప్పులో కలిపి కాని లేక గాని వానికి త్రాపించాలి. దీనికి సంబంధించిన కొన్ని హోమాదులలో దీనికి వినియోగం.

మంత్రము :

అమ్బయో యన్త్యధ్వభిర్జామయో అధ్వరీయతామ్ ।
పృఞ్చతీర్మధునా పయః ॥ 1 ॥

పదము :

అమ్బయః । యన్తి । అధ్వఽభిః । జామయః । అధ్వరిఽయతామ్ ।
పృఞ్చతీః । మధునా । పయః ॥ 1 ॥

**అనువాదం :**

యజ్ఞకర్తకు భగినీ మణులు
యజ్ఞ కర్తకు మాతృమూర్తులు
జలప్రపూర్ణ నదీనివహాలు
నిజమార్గంలో ప్రవహిస్తూ
యజ్ఞభూమికి వస్తున్నవి.
మధు పయో సమ్మిళితా లవుతున్నవి. ॥ 1 ॥

**మంత్రము :**

**అమూర్యా ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ ।**
**తానో హిన్వన్త్వధ్వరమ్ ॥ 2 ॥**

**పదము :**

**అమూః । యాః । ఉప । సూర్యే । యాభిః । వా । సూర్యః సహ ।**
**తాః । నః । హిన్వన్తు । అధ్వరమ్ ॥ 2 ॥**

**అనువాదం :**

నదులు సూర్యాభిముఖాలై వెళుతూ
మన యజ్ఞకర్మలను ఫలదాన సమర్థాలు చేయుగాక! ॥ 2 ॥

**మంత్రము :**

**అపో దేవీరుప హ్వయే యత్ర గావః పిబన్తి నః ।**
**సిన్ధుభ్యః కర్త్వం హవిః ॥ 3 ॥**

పదము :

అపః । దేవీః । ఉప । హ్వయే । యత్ర । గావః । పిబన్తి । నః ।
సిన్ధు౽భ్యః । కర్త్వమ్ । హవిః ॥ 3 ॥

అనువాదం :

దేవతారూపాలైన ఉదకాలను ఆహ్వానిస్తున్నాను.
ఆ జలపూరితాలైన నదీ తటాకాదులలోనే
మా గోగణాలు నీరు త్రాగుతున్నవి.
అబ్ధి నుంచి పారుతున్న అప్దేవతలు
ఈ హవిస్సు నంగీకరింతురు గాక! ॥ 3 ॥

మంత్రము :

అప్స్వ1న్తరమృతమప్సు భేషజమ్ ।
అపాముత ప్రశస్తిభిరశ్వా భవథ వాజినో
గావో భవథ వాజినీః ॥ 4 ॥

పదము :

అప్౽సు । అన్తః । అమృతమ్ । అప్౽సు । భేషజమ్ ।
అపామ్ । ఉత । ప్రశస్తి౽భిః । అశ్వాః । భవథ । వాజినః ।
గావః । భవథ । వాజినీః ॥ 4 ॥

అనువాదం :

ఈ జలంలో అమృత మున్నది.
ఔషధములున్నవి.

వీనిని త్రావి అశ్వగణం బలిష్ఠమౌగాక !
గోగణం సత్త్వసంపన్నమౌగాక ! ॥ 4 ॥

ఇది నాల్గవ సూక్తం

## సూక్తం - 5

ఋషి: సింధు ద్వీపుడు లేక కృతి॥ దేవత: అపః॥

ఛందస్సు: గాయత్రీ ॥ మంత్రములు: 4 ॥

వినియోగం: ఈ రెండు సూక్తాలకు వపాహోమానంతరం మార్జనంలో, అగ్ని చయన అనుమంత్రణంలో, బృహద్గణ, లఘుగణ, సలిల గణాదులకు చెందినది. వాని వినియోగాన్నిబట్టి దీనికి కూడ వినియోగం గో రోగోపశమన పుష్టి, ప్రజనన కర్మాదులలో వీటికి వినియోగం. వాస్తుసంస్కార కర్మలో ఈ సూక్తంతో గృహభూమిని తడపాలి. ఆదిత్య మహాశాంతిలో దీనికి వినియోగం.

మంత్రము:

ఆపో హి ష్ఠా మయో భువస్తా న ఊర్జే దధాతన ।
మహే రణాయ చక్షసే ॥ 1 ॥

పదము:

ఆపః । హి । స్థ । మయఃऽభువః । తాః । నః । ఊర్జే । దధాతన।
మహే । రణాయ । చక్షసే ॥ 1 ॥

అనువాదం:

ఓ జలదేవతలారా !
మీరు సుఖప్రదాయినులు.
మాకు బలాన్నివ్వండి.

మేము దర్శనీయుల మగుటకై
పుష్టిని కల్పించండి. ॥ 1 ॥

మంత్రము :

యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః ।
ఉశతీరివ మాతరః ॥ 2 ॥

పదము :

యః । వః । శివ౽తమః । రసః । తస్య । భాజయత । ఇహ । నః ।
ఉశతీః౽ఇవ । మాతరః ॥ 2 ॥

అనువాదం :

మీలో శివంకరమైన రసం ఉన్నది.
దానిని మాకు దత్తం చేయండి.
ప్రేమించే మాతృమూర్తులవలె
మాకా రసాన్ని ప్రసాదించండి. ॥ 2 ॥

మంత్రము :

తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ ।
ఆపో జనయథా చ నః ॥ 3 ॥

పదము :

తస్మై । అరమ్ । గమామ । వః । యస్య । క్షయాయ । జిన్వథ ।
ఆపః । జనయథ । చ । నః ॥ 3 ॥

అనువాదం :

ఓ జలదేవతలారా !
అన్నప్రాప్త్యర్థమై
మిమ్ములను పూర్తిగా ఆశ్రయిస్తున్నాము
అహోరాభివృద్ధిని
మాకు పుత్రపౌత్రాభివృద్ధిని
కల్పించండి. ॥ 3 ॥

మంత్రము :

**ఈశానా వార్యాణాం క్షయన్తీశ్చర్షణీనామ్ ।**
**అపో యాచామి భేషజమ్ ॥ 4 ॥**

పదము :

**ఈశానాః । వార్యాణామ్ । క్షయన్తీః చర్షణీనామ్ ।**
**అపః । యాచామి । భేషజమ్ ॥ 4 ॥**

అనువాదం :

అపేక్షింపదగిన సుఖాలకు స్వామినులగు మీరు
మనుష్యజీవనాన్ని కల్పించండి.
మీ నుండి వ్యాధినివారక ఔషధాన్ని
అర్థిస్తున్నాను. ॥ 4 ॥

ఇది ఐదవ సూక్తం

## సూక్తం –6

**ఋషిః అథర్వుడు లేక కృతి ॥ దేవత : అపః ॥ ఛందస్సు : 1-3 గాయత్రీ, 4 పథ్యావంక్తి ॥ మంత్రములు : 4 ॥**

**మంత్రము :**

**శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే ।**

**శం యోరభి స్రవన్తు నః ॥ 1 ॥**

**పదము :**

**శమ్ । నః । దేవీః । అభిష్టయే । ఆపః । భవన్తు । పీతయే ।**
**శమ్ । యోః । అభి । స్రవన్తు । నః ॥ 1 ॥**

**అనువాదం :**

ఈ జలదేవతలు మా అభీష్ట పూర్తికై
సర్వత్ర సుఖప్రదాలౌగాక!
పానార్థమై స్వాదుతరము లగుగాక!
సుఖార్థమై, రోగోపశమనార్థమై
**అవి మావైపు ప్రవహించుగాక!** ॥ 1 ॥

**మంత్రము :**

**అప్సు మే సోమో అబ్రవీదన్తర్విశ్వాని భేషజా ।**

**అగ్నిం చ విశ్వశంభువమ్ ॥ 2 ॥**

**పదము :**

**అప్ऽసు । మే । సోమః । అబ్రవీత్ । అన్తః । విశ్వాని । భేషజా ।**

**అగ్నిమ్ । చ । విశ్వऽశంభువమ్ ॥ 2 ॥**

**అనువాదం :**

ఉదకమధ్యంలో సర్వరోగ నివర్తకములైన
ఓషధు లున్నవని సోమదేవుడు మాకు ఉపదేశించినాడు.




విశ్వ సుఖకారకమైన అగ్నికూడ వానిలో కలదని
సోమదేవుడు మాకు ఉపదేశించినాడు. ॥ 2 ॥

మంత్రము:

ఆపః పృణీత భేషజం వరూథం తన్వే౩ మమ ।

జ్యోక్ చ సూర్యమ్ దృశే ॥ 3 ॥

పదము:

ఆపః । పృణీత । భేషజమ్ । వరూథమ్ । తన్వే౨ । మమ ।

జ్యోక్ । చ । సూర్యమ్ । దృశే ॥ 3 ॥

అనువాదం:

ఓ జలదేవతలారా !
చిరకాల సూర్యదర్శనార్థమై (దీర్ఘాయురర్థమై)
సర్వరోగ నివర్తకమైన ఔషధాన్నిచ్చి
నా శరీరాన్ని గట్టి పఱచండి. ॥ 3 ॥

మంత్రము:

శం న ఆపో ధన్వన్యా౩ః శము సన్త్వనూప్యా౨ః ।

శం నః ఖనిత్రిమా ఆపః శము యాః కుమ్భ ఆభృతాః

శివా నః సన్తు వార్షికీః ॥ 4 ॥

పదము.

శమ్ । నః । ఆపః । ధన్వన్యా౨ః । శమ్ । ఓం ఇతి । సన్తు ।
అనూప్యా౨ః ।

**శమ్ । నః । ఖనిత్రిమాః । ఆపః । శమ్ । ఓం ఇతి । యాః ।**

**కుమ్భే । అఽభృతాః ।**

**శివాః । నః । సన్తు । వార్షికీః ॥ 4 ॥**

**అనువాదం :**

మరుభూ సముద్భూతాలైన జలాలు సుఖప్రదాలగుగాక!
జల సంపన్న స్థలాలలోని ఉదకములు కూడ
మాకు సుఖహేతువులగు గాక!
అలాగే బావులలోని నీరు కూడ మాకు సుఖకరమగు గాక!
నదీతటాకాదుల నుంచి కడవలలో కొనివచ్చినవి కూడ
మాకు సుఖప్రదాలే గాక!
వర్షసముద్భూతాలైన వారిధారలు కూడ
మాకు శివంకరము లగు గాక! ॥ 4 ॥

ఇది ఆరవ సూక్తం

ఇది మొదటి అనువాకం

# అనువాకం : 2

## సూక్తం - 7

## ధర్మ ప్రచార సూక్తం

**ఋషి:** చాతనుడు॥ **దేవత :** అగ్ని ౩ ఇంద్రుడును॥ **ఛందస్సు :** 1-4, 6, 7 అనుష్టుప్, 5 త్రిష్టుప్॥ **మంత్రములు :** 7 ॥

**వినియోగం :** భూత పిశాచాదుల ఉచ్చాటనార్థమై చేసే హోమాదులలో ఈ అనువాకంలోని మొదటి రెండు సూక్తాలు చాతనగణంగా పరిగణిస్తారు.

**మంత్రము :**

**స్తువానమగ్న ఆ వహ యాతుధానం కిమీదినమ్ ।**

త్వం హి దేవ వన్దితో హన్తా దస్యోర్బభూవిథ ॥ 1 ॥

పదము :

స్తువానమ్ । అగ్నే । ఆ । వహ । యాతుఽధానమ్ । కిమీదినమ్।
త్వమ్ । హి । దేవ । వన్దితః । హన్తా । దస్యోః । బభూవిథ ॥ 1 ॥

అనువాదం :

స్తుతిస్తున్న మావద్దకు ఓ అగ్నీ!
నిగ్రహార్థమై ఘాతుక రాక్షసుని పట్టి కొనిరా దేవా!
వందితుడైనట్టి నీవు దస్యుహంతకుడవు గదా! ॥ 1 ॥

మంత్రము :

ఆజ్యస్య పరమేష్ఠిన్ జాతవేదస్తనూవశిన్।
అగ్నే తౌలస్య ప్రాశాన యాతుధానాన్ వి లాపయ ॥ 2 ॥

పదము :

ఆజ్యస్య । పరమేఽస్థిన్ । జాతఽవేదః । తనూఽవశిన్ ।
అగ్నే । తౌలస్య । ప్ర । అశాన । యాతుఽధానాన్ । వి । లాపయ ॥ 2 ॥

అనువాదం :

ఓ పరమేష్ఠీ! జాతవేదుడవు నీవు.
సకల జంతు శారీరక సంయమ సుధాతవు.
మేము సమర్పించు సకల ఆజ్యాదుల స్వీకరించు.
దుష్ట యాతు ధానాదుల నష్టం చెందించు. ॥ 2 ॥

మంత్రము :

విలపన్తు యాతుధానా అత్త్రిణో యే కిమీదినః ।
అథేద మగ్నే నో హవి రిన్ద్రశ్చ ప్రతి హర్యతమ్ ॥ 3 ॥

పదము .

వి । లపన్తు । యాతుఽధానాః । అత్త్రిణః । యే । కిమీదినః ।
అథ । ఇదమ్ । అగ్నే । నః । హవిః । ఇన్ద్రః । చ । ప్రతి ।
హర్యతమ్ ॥ 3 ॥

అనువాదం :

యాతుధాను లెల్ల ప్రాణి
జాత భక్షకులు సుమీ!
సర్వ ప్రాణి జిఘాంసువులు
విలపింతురుగాక!
మే మిచ్చే ఈ హవిస్సు
ఆ మహేంద్రునితో పాటూ
అగ్ని! నీవు అరగించు. ॥ 3 ॥

మంత్రము :

అగ్నిః పూర్వ ఆ రభతాం
ప్రేన్ద్రో నుదతు బాహుమాన్ ।
బ్రవీతు సర్వో యాతుమాన్
అయ మస్మీత్యేత్య ॥ 4 ॥

పదము :

అగ్నిః । పూర్వః । ఆ । రభతామ్ ।

ప్ర । ఇన్ద్రః । నుదతు । బాహు ఽమాన్ ।

బ్రవీతు । సర్వః । యాతు ఽమాన్ ।

అయమ్ । అస్మి । ఇతి । ఆ ఽఇత్య ॥ 4 ॥

అనువాదం :

అగ్ని మొదట యాతుధాన నిగ్రహాన్ని మొదలిడనీ!
ఆవల భుజబలవంతుడు
అమరేంద్రుడు విశేషించి అవశేషం చేయుగాక!
యాతుధానులెల్ల వచ్చి
తమ్ము తాము తెలియ బలుచి
మమ్ము వదలి పోవనీ! ॥ 4 ॥

మంత్రము :

పశ్యామ తే వీర్యం ఽ జాతవేదః

ప్రణో బ్రూహి యాతుధానాన్ నృచక్షః ।

త్వయా సర్వే పరితప్తాః పురస్తాత్

త ఆ యన్తు ప్రబ్రువాణా ఉపేదమ్ ॥ 5 ॥

పదము :

పశ్యామ । తే । వీర్య ఽమ్ । జాత ఽవేదః ।

ప్ర । నః । బ్రూహి । యాతు ఽధానాన్ । నృ ఽచక్షః ।

త్వయా । సర్వే । పరిఽతప్తాః । పురస్తాత్ ।
తే । ఆ । యన్తు । ప్రఽబ్రువాణాః । ఉప । ఇదమ్ ॥ 5 ॥

అనువాదం :

జ్ఞానీ! నీ పరాక్రమము దర్శింతుము గాక!
మానవులకు నీ వేమో మార్గదర్శకుడవు.
మా జోలికి రాకుండా మఱీ మఱీ అజ్ఞాపించుము.
పురతః పరితప్తులగుచు
విలపించే వారెల్లరు
వేగవచ్చి చావనిమ్ము ॥ 5 ॥

మంత్రము :

ఆ రభస్వ జాతవేదోస్మాకార్థాయ జజ్ఞిషే ।
దూతో నో అగ్నే భూత్వా యాతుధానాన్ వి లాపయ ॥ 6 ॥

పదము :

ఆ । రభస్వ । జాతఽవేదః । అస్మాక । అర్థాయ । జజ్ఞిషే ।
దూతః । నః । అగ్నే । భూత్వా । యాతుఽధానాన్ । వి । లాపయ
॥ 6 ॥

అనువాదం :

ఆ రాక్షస నిర్మూలన అరంభించుము నీవే
అవతరించితివి మాకై
అగ్నీ! మా దూత వగుచు
ఆ రాక్షసుల నణచుము. ॥ 6 ॥

మంత్రము :

త్వమగ్నే యాతుధానాన్ ఉపబద్ధాం ఇహా వహ ।
అధైషా మిన్ద్రో వజ్రేణాపి శీర్షాణి వృశ్చతు ॥ 7 ॥

పదముః

త్వమ్ । అగ్నే । యాతుఽధానాన్ । ఉపఽబద్ధాన్ । ఇహ । ఆ । వహ ।
అథ । ఏషామ్ । ఇన్ద్రః । వజ్రేణ । అపి । శీర్షాణి । వృశ్చతు ॥ 7॥

అనువాదం :

యాతుధానులను నీవే
అగ్ని ! బంధించి తెమ్ము.
అప్పు డింద్రుడే తానై
అశనిని చేపట్టి వారి
తలలను తెగవేయు గాక ! । 7 ॥

ఇది ఏడవ సూక్తం

## సూక్త - 8

ఋషి : చాతనుడు ॥ దేవత : 1, 2 బృహస్పతి, అగ్ని సోములు, 3, 4 అగ్ని ॥
ఛందస్సు: 1-3 అనుష్టుప్, 4 బార్హతగర్భా త్రిష్టుప్ ॥ మంత్రములు. 4 ॥

మంత్రము :

ఇదం హవిర్యాతుధానాన్ నదీ ఫేనమివా వహత్ ।
య ఇదం స్త్రీ పుమా నకరిహ స స్తువతాం జనః ॥ 1 ॥

పదము .

ఇదమ్ । హవిః । యాతుఽధానాన్ । నదీ । ఫేనమ్ఽఇవ । ఆ ।
వహత్ ।

యః । ఇదమ్ । స్త్రీ । పుమాన్ । అకః । ఇహ । సః । స్తువతామ్ ।
జనః ॥ 1 ॥

అనువాదం .

ఈ హవిస్సు నది నురుగును వలె
యాతుధానులను కొనివచ్చు గాక!
పురుషుడుకాని, స్త్రీకాని, ఈ హవిస్సును
ఎవరైతే సమర్పిస్తున్నారో
వారు నిన్ను ప్రశంసింతురు గాక! ॥ 1 ॥

మంత్రము .

అయం స్తువాన ఆగమదిమం స్మ ప్రతి హర్యత ।
బృహస్పతే వశే లబ్ధ్వాగ్నీషోమా వి విధ్యతమ్ ॥ 2 ॥

పదము :

అయమ్ । స్తువానః । ఆ । అగమత్ । ఇమమ్ । స్మ । ప్రతి ।
హర్యత ।

బృహస్పతే । వశే । లబ్ధ్వా । అగ్నీషోమా । వి । విధ్యతమ్ ॥ 2 ॥

అనువాదం :

ఓ దేవులారా! రాక్షస పీడితులైన జనం
మిమ్ములను స్తుతిస్తూవస్తున్నారు.

ఓ బృహస్పతీ ! వీరిని స్వాయత్తం చేసుకో.
ఓ అగ్నీ ! ఓ సోమా ! మీరు ఆ రాక్షసులను శిక్షించండి ॥ 2 ॥

మంత్రము :

యాతుధానస్య సోమప జహి ప్రజాం నయస్వ చ ।
ని స్తువానస్య పాతయ పర మక్ష్యుతావరమ్ ॥ 3 ॥

పదము :

యాతుఽధానస్య । సోమఽప । జహి । ప్రఽజామ్ । నయస్వ । చ ।
నిః । స్తువానస్య । పాతయ । పరమ్ । అక్షి । ఉత । అవరమ్ ॥3॥

అనువాదం :

ఓ సోమపాయీ యాతుధానుల
సంతానాన్ని కూడ నశింపజెయ్యి.
భయంతో నిన్ను స్తుతిస్తున్న శత్రువుల
దక్షిణ నేత్రాన్ని, వామనేత్రాన్ని కూడ
స్థాన భ్రష్టం చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

యత్రై 9షా మగ్నే జనిమాని వేత్థ
గుహా సతామత్త్రిణాం జాతవేదః ।
తాం స్త్వం బ్రహ్మణా వా వృధానో
జహ్యేఽషాం శతతర్హ మగ్నే ॥ 4 ॥

పదము :

యత్ర । ఏషామ్ । అగ్నే । జనిమాని । వేత్థ ।

గుహా । సతామ్ । అత్త్రిణామ్ । జాత౨వేదః ।

తాన్ । త్వమ్ । బ్రహ్మణా । వావృధానః ।

జహి । ఏషామ్ । శత౨తర్హమ్ । అగ్నే ॥ 4 ॥

అనువాదం .

గుహాలో దాగిన ఈ రాక్షసులు ఓ అగ్ని !
ఎక్కడున్నారో నీకు తెలును.
నీవు మంత్రంతో వర్ధమానుడవై
ఆ స్వస్థానంలో నున్న రాక్షసులను నశింపజెయ్యి.
వారి బహువిధ హింసాకార్యాలను నివర్తింపజేయి. ॥ 4 ॥

ఇది ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 9

# వర్చః ప్రాప్తి సూక్తం

ఋషి : అథర్వుడు ॥ దేవత : 1, 2 మంత్రములందు చెప్పబడిన వసువు మొదలుగా గల దేవతలు ; 3, 4 అగ్ని ॥ ఛందస్సు : త్రిష్టుప్ ॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం : సంపదభి వృద్ధికోసం చేసే వైదిక కర్మలలోను, ఆయుష్కాములై చేసే కర్మలలోను ఉపనయన కర్మలలోను దీనికి వినియోగం. పుష్పాభిషేక కర్మలో కూడ దీనిని ఉపయోగిస్తారు.

మంత్రము :

అస్మిన్ వసు వసవో ధారయన్త్విన్ద్రః
పూషా వరుణో మిత్రో అగ్నిః ।
ఇమ మాదిత్యా ఉత విశ్వే చ దేవా
ఉత్తరస్మిన్ జ్యోతిషి ధారయన్తు ॥ 1 ॥

పదము :

అస్మిన్ । వసు । వసవః । ధారయన్తు । ఇన్ద్రః ।
పూషా । వరుణః । మిత్రః । అగ్నిః ।
ఇమమ్ । ఆదిత్యాః । ఉత । విశ్వే । చ । దేవాః ।
ఉతఽఉత్తరస్మిన్ । జ్యోతిషి । ధారయన్తు ॥ 1 ॥

అనువాదం :

ఈ పురుషుని యందు వసుదేవతలు,
ఇంద్ర - పూష - వరుణ - అగ్ని - దేవతలు
ధనధారణ చేతురు గాక!
అట్లే ఆదిత్యులు, విశ్వేదేవులు, ఇతరదేవతలందఱు
ఉత్కృష్టతర తేజము నందు ఇతనిని ఉంతురు గాక! ॥ 1 ॥

మంత్రము :

అస్య దేవాః ప్రదిశి జ్యోతిరస్తు
సూర్యో అగ్నిరుత వా హిరణ్యమ్ ।

సపత్నా అస్మదధరే భవన్తూత్తమం

నాకమధి రోహయేమమ్ ॥ 2 ॥

పదము :

అస్య । దేవాః । ప్రఽదిశి । జ్యోతిః । అస్తు ।

సూర్యః । అగ్నిః । ఉత । వా । హిరణ్యమ్ ।

సఽపత్నాః । అస్మత్ । అధరే । భవన్తు । ఉత్ఽతమమ్ ।

నాకమ్ । అధి । రోహయ । ఇమమ్ ॥ 2 ॥

అనువాదం :

ఓ దేవతలారా! ఈ పురుషుని ఆదేశంపై
సూర్య అగ్ని చంద్రాదుల తేజస్సు ఉద్భూతమౌ గాక!
హిరణ్యాదులు కూడ ఇతని వశమునందుండు గాక!
ఇతనికి శత్రువులను క్రింది చేయండి
ఇతనిని ఉత్తమ స్వర్గాన్ని అధిరోహింప జేయండి. ॥ 2 ॥

మంత్రము :

యేనేన్ద్రాయ సమభరః పయాంస్యుత్తమేన

బ్రహ్మణా జాతవేదః ।

తేన త్వమగ్న ఇహ వర్ధయేమం సజాతానాం

శ్రైష్ఠ్య ఆ ధేహ్యేనమ్ ॥ 3 ॥

పదము :

యేన । ఇన్ద్రాయ । సమ్ఽఅభరః । పయాంసి । ఉత్ఽతమేన ।
బ్రహ్మణా । జాతఽవేదః ।
తేన । త్వమ్ । అగ్నే । ఇహ । వర్ధయ । ఇమమ్ । సఽజాతా
నామ్ । శ్రైష్ఠ్యే । ఆ । ధేహి । ఏనమ్ ॥ 3 ॥

అనువాదం :

ఉత్తమ మంత్రంతో ఓ జాతవేద!
ఇంద్రునికై క్షీరాజ్యాదిరూప హవిస్సులను సమర్పించు.
ఓ అగ్నీ! నీవు అలాంటి ఉత్తమ మంత్రంతో
ఈ సంపత్కాముడైన పురుషుని
ఈ లోకంలో అభివృద్ధి చెందించు.
సమానులలో ఇతనికి శ్రేష్ఠత్వాన్ని కల్పించు. ॥ 3 ॥

మంత్రము :

ఐషాం యజ్ఞముత వర్చో దదేహం
రాయస్పోషముత చిత్తాన్యగ్నే ।
సపత్నా అస్మదధరే భవన్తూత్తమం
నాకమధి రోహయేమమ్ ॥ 4 ॥

పదము :

ఆ । ఏషామ్ । యజ్ఞమ్ । ఉత । వర్చః । దదే । అహమ్ ।
రాయః । పోషమ్ । ఉత । చిత్తాని । అగ్నే ।.

స౭పత్నాః । అస్మత్ । అధరే । భవస్తు । ఉత్౭తమమ్ ।

నాకమ్ । అధి । రోహయ । ఇమమ్ । ॥ 4 ॥

**అనువాదం :**

ఓ అగ్ని ! నీ అనుగ్రహంతో
ఈ శత్రువుల పుణ్య కర్మను
నేను అపహరిస్తున్నాను.
శత్రు సంబంధమైన తేజస్సును, ధనాన్ని,
పుష్టిని, చిత్తములను స్వాయత్తం చేసుకుంటున్నాను.
శత్రువులు ఇతనికి క్రిందదుగురు గాక !
ఇతనిని మీాది లోకాలను అధిరోహింపజేయి. ॥ 4 ॥

ఇది తొమ్మిదవ సూక్తం

## సూక్తం–10

# అపత్యా పాప పరిరక్షణసూక్తం

ఋషి : అథర్వుడు॥ దేవత : 1 అసురుడు, 2–4 వరుణుడు॥ ఛందస్సు : 1,2 త్రిష్టుప్ : 3,4 కకుమ్మత్యనుష్టుప్ ॥ మంత్రములు : 4 ॥

వినియోగం : జలోదర రోగ నివృత్తికై చేసే అభిషేకంలో దీనికి వినియోగం

**మంత్రము :**

అయం దేవానామసురో వి రాజతి

వశా హి సత్యా వరుణస్య రాజ్ఞః ।

తతస్పరి బ్రహ్మణా శాశదాన

ఉగ్రస్య మన్యోరుదిమం నయామి ॥ 1 ॥

**పదము :**

అయమ్ । దేవానామ్ । అసురః । వి । రాజతి ।

వశా । హి । సత్యా । వరుణస్య । రాజ్ఞః ।

తతః । పరి । బ్రహ్మణా । శాశదానః ।

ఉగ్రస్య । మన్యోః । ఉత్ । ఇమమ్ । నయామి ॥ 1 ॥

**అనువాదం :**

ఇంద్రాది దేవతలలో పాపనిగ్రహీతయై
వరుణుడు విరాజిల్లుతున్నాడు.
సత్యరూపాలైన పదార్థ జాతాలు
రాజసమానుడైన వరుణదేవుని వశంలో ఉంటున్నవి.
అందుకనే సర్వత్ర స్తుతిమంత్రంతో, హవిస్సుతో
అత్యంత ఉగ్రుడైన వరుణుని అనుగ్రహం సంపాదిస్తున్నాను.
అనృతభాషణా పాప జనితమైన
జలోదరరోగ హేతుభూతమైన ఆయన క్రోధంనుంచి
ఆర్తుడైన ఈ పురుషుని రోగవిముక్తుని చేస్తున్నాను. ॥ 1 ॥

**మంత్రము :**

నమస్తే రాజన్ వరుణాస్తు మన్యవే

విశ్వం హ్యుఽగ్ర నిచికేషి ద్రుగ్ధమ్ ।

సహస్రమన్యాన్ ప్ర సువామి సాకం

శతం జీవాతి శరదస్తవాయమ్ ॥ 2 ॥

**పదము :**

నమః । తే । రాజన్ । వరుణ । అస్తు । మన్యవే ।

విశ్వం । హి । ఉగ్ర । ని౽చికేషి । ద్రుగ్ధమ్ ।

సహస్రమ్ । అన్యాన్ । ప్ర । సువామి । సాకమ్ ।

శతమ్ । జీవాతి । శరదః । తవ । అయమ్ ॥ 2 ॥

**అనువాదం :**

ఓరాజా! వరుణా! నీక్రోధానికి నమస్కారం.
ఓ ఉగ్ర స్వరూపా! సర్వాపరాధాలను నీవెరుగుదువు.
ఇలాంటి అపరాధులైన అనేక జనులతోపాటు
ఇతనిని నీకు అందిస్తున్నాను.
ఈ వ్యాధి పీడితుడు నీ అనుగ్రహం వల్ల
నూరేళ్ళు జీవించు గాక! ॥ 2 ॥

**మంత్రము :**

యదు వక్థానృతం జిహ్వయా వృజినం బహు ।

రాజ్ఞస్త్వా సత్యధర్మణో ముఞ్చామి వరుణాదహమ్ ॥ 3 ॥

**పదము :**

యత్ । ఉవక్థ । అనృతమ్ । జిహ్వయా । వృజినమ్ । బహు ।

రాజ్ఞః । త్వా । సత్య౽ధర్మణః । ముఞ్చామి । వరుణాత్ । అహమ్ ॥ 3 ॥

**అనువాదం :**

ఓ జలోదర రోగపీడితుడా!
నీ నాలుకతో ఈరోగ కారణమైన
అసత్యభాషణాలను చేసినావు.
ఈ అధిక పాపాన్ని పరిహరిస్తున్నాను.
సత్యధర్ముడైన వరుణుని నుంచి
ఓ రోగగ్రస్తుడా! నీకు విముక్తి కల్పిస్తున్నాను. ॥ 3 ॥

**మంత్రము :**

ముఞ్చామి త్వా వైశ్వానరాదర్ణవాన్మహతస్పరి ।
సజాతానుగ్రేహా వద బ్రహ్మ చాప చికీహి నః ॥ 4 ॥

**పదము :**

ముఞ్చామి । త్వా । వైశ్వానరాత్ । అర్ణవాత్ । మహతః । పరి ।
స౽జాతాన్ । ఉగ్ర । ఇహ । ఆ । వద । బ్రహ్మ । చ । అప ।
చికీహి । నః ॥ 4 ॥

**అనువాదం :**

ఓ రోగగ్రస్తుడా!
వైశ్వానర మహదర్ణవం నుంచి
నిన్ను విముక్తుని చేస్తున్నాను.
ఓ ఉగ్రస్వరూపా!
ఈ పురుషుని హింసించకుండా నీ సహచరులను శాసించు.
మా హవిస్సును స్వీకరించి
అనృత భాషణాది జనితమైన
అపరాధాన్ని విస్మరించి

నాస్తోత్రంతో పరితుష్టుడవై
భయాదులను నశింపజేయి. ॥ 4 ॥

ఇది పదవ సూక్తం

## సూక్తం–11

# సుఖప్రసూతి సూక్తం

ఋషి : అథర్వుడు ॥ దేవత : మంత్రాలలో పేర్కొన్న పూషాదులు. ఛందస్సు:
1 పంక్తి; 2 అనుష్టుప్, 3 చతుష్పదోష్ణిగ్గర్భా కకుమ్మత్యనుష్టుప్ ॥ 4 ॥
పథ్యాపంక్తి ॥ మంత్రములు. 6–6

వినియోగం:– సుఖప్రసవానికై చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

వషట్ తే పూషన్నస్మిన్త్సూతావర్యమా
హోతా కృణోతు వేధాః ।
సిస్రతాం నార్యృతప్రజాతా వి పర్వాణి
జిహతాం సూతవా ఉ ॥ 1 ॥

పదము :

వషట్ । తే । పూషన్ । అస్మిన్ । సూతౌ । అర్యమా ।
హోతా । కృణోతు । వేధాః ।
సిస్రతామ్ । నారీ । ఋతఽప్రజాతా । వి । పర్వాణి ।
జిహతామ్ । సూతవై । ఓం ఇతి । ॥ 1 ॥

అనువాదం:

ఓ సకల ప్రాణిజాత పోషకుడవైన దేవా!
నీకు ఈ సుఖప్రసవ కర్మలో దేవతల నాహ్వానించే ఋత్విక్కు
అర్యముడై వషట్కారంతో హవిస్సు నిచ్చుగాక!
అలాగే సకల జగన్నిర్మాతయైన దేవుడు
తదాత్మకుడై సుఖప్రసవ ఫలదాత అగుగాక!
ఈ హవిస్స్వీకారంతో సంతుష్టుడైన దేవుని (పూషన్)
అనుగ్రహం వలన
ఈ సతి సత్యప్రసవయై సుఖంగా ప్రసవించుగాక!
సుఖప్రసవార్థమై ప్రసవ నిరోధకాలైన
సంధిబంధములు విడివడు గాక! ॥ 1 ॥

మంత్రము:

చతస్రో దివః ప్రదిశశ్చతస్రో భూమ్యా ఉత ।
దేవా గర్భం సమైరయన్ తం వ్యూఽర్ణువన్తు సూతవే ॥ 2 ॥

పదము:

చతస్రః । దివః । ప్రఽదిశః । చతస్రః । భూమ్యాః । ఉత ।
దేవాః । గర్భమ్ । సమ్ । ఐరయన్ । తమ్ । వి । ఊర్ణువన్తు ।
సూతవే ॥ 2 ॥

అనువాదం:

ఆకసానికి సంబంధించిన ప్రాచ్యాది
ప్రధాన చతుర్దిక్కులు,
భూలోకానికి సంబంధించిన చతుర్దిక్కులు,

ఆ దిగ్దేవతలైన ఇంద్రాదులు
ఈ గర్భాన్ని సంగతం చేసినారు.
ఇప్పు డా దేవతలు ప్రసవార్థమై
ఉదరస్థమైన గర్భాన్ని
విగతాచ్ఛాదనం చేయుదురు గాక ! ॥ 2 ॥

మంత్రము :

సూషా వ్యూర్ణోతు వి యోనిం హాపయామసి ।
శ్రథయా సూషణే త్వమవ త్వం బిష్కలే సృజ ॥ 3 ॥

పదము :

సూషా । వి । ఊర్ణోతు । వి । యోనిమ్ । హాపయామసి ।
శ్రథయ । సూషణే । త్వమ్ । అవ । త్వమ్ । బిష్కలే । సృజ
॥ 3 ॥

అనువాదం :

ప్రజనయిత్రి ఐన దేవత సూష
గర్భావరణాన్ని తొలగించుగాక !
మేము కూడ సుఖప్రసవాని కనుకూలంగా
గర్భనిర్గమన మార్గాన్ని వివృతం చేస్తాము.
ఓ సుఖప్రసవదేవతా !
నీవు కూడ నేను చేసే సుఖప్రసవ కర్మతో
ప్రీతురాలవై ఆ మార్గాన్ని విశ్లేషించు.
ఓ దేవతా ! గర్భాన్ని అవాఙ్ముఖం చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

నేవ మాంసే న పీవసి నేవ మజ్జస్వాహతమ్ ।

అవైతు పృశ్ని శేవలం శునే జరాయ్వత్తవేఽవ జరాయు
పద్యతామ్ ॥ 4 ॥

పదము :

నఽఇవ । మాంసే । న । పీవసి । నఽఇవ । మజ్జఽసు । ఆఽహతమ్
అవ । ఏతు । పృశ్ని । శేవలమ్ । శునే । జరాయు । అత్తవే ।
అవ । జరాయు । పద్యతామ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ ప్రసవిత్రీ! ఉదరగతమైన ఈ మాంసంతో
నీవు స్థూలం కావు.
ఈ మాయ, మజ్జాదులలో అబద్ధమైనది కాదు.
నీటిపై నున్న నాచువలె
ఆ గర్భవేష్టనాన్ని పతనం చేయి.
ఆ జరాయువు శ్వాన భక్షణార్థమై
అవపతనం చెందు గాక!
మాయ భూమిపై పడిపోవుగాక! ॥ 4 ॥

మంత్రము :

వితే భినద్మి మేహనం వి యోనిం వి గవీనికే ।
వి మాతరం చ పుత్రం చ వి కుమారం
జరాయుణావ జరాయు పద్యతామ్ ॥ 5 ॥

పదము :

వి । తే । భినద్మి । మేహనమ్ । వి । యోనిమ్ । వి । గవీనికే । ఇతి ।

వి । మాతరమ్ । చ । పుత్రమ్ । చ । వి । కుమారమ్ ।
జరాయుణా । అవ । జరాయు । పద్యతామ్ ॥ 5 ॥

అనువాదం :

ఓ గర్భిణీ ! నీ దేహాన్ని (నీ మూత్రావసేక ద్వారాన్ని),
తదాధారభూతమైన యోనిని,
దాని పార్శ్వంలో నిర్గమన ప్రతిబంధకాలుగా
ఉన్న నాడులను,
విభేదనం చేస్తున్నాను.
ఈ విధంగా తల్లిని కొడుకును వేరుపరుస్తున్నాను.
ఆ మాయనుంచి శిశువును వేరుపరుస్తున్నాను.
ఆ మాయకూడ పడిపోవుగాక ! ॥ 5 ॥

మంత్రము :

యథా వాతో యథా మనో
యథా పతన్తి పక్షిణః ।
ఏవా త్వం దశమాస్య సాకం
జరాయుణా పతావ జరాయు పద్యతామ్ ॥ 6 ॥

పదము :

యథా । వాతః । యథా । మనః ।
యథా । పతన్తి । పక్షిణః ।
ఏవ । త్వమ్ । దశఽమాస్య । సాకమ్ ।

జరాయుణా । పత । అవ । జరాయు । పద్యతామ్ ॥ 6 ॥

ఇతి ద్వితీయోఽనువాకః

అనువాదం :

ఏ విధంగా గాలి వీచునో,
ఎలా మనస్సు వేగంగా పరుగిడునో,
ఆ విధంగా పదినెలలు తల్లి పోషించిన ఓ శిశువా!
నీవు గర్భవేష్టనంతో పాటు గర్భాశయంనుంచి
త్వరగా బైటికి రా!
ఆ మాయ కూడ పడిపోవుగాక! ॥ 6 ॥

ఇది పదకొండవ సూక్తం

ఇది రెండవ అనువాకం

## అనువాకం: 3

### సూక్తం–12

# శ్వాసాది రోగనివారణ సూక్తం

ఋషి: భృగువు, అంగిరసుడు ॥ దేవత: యక్ష్మనాశనమ్ ॥ ఛందస్సు – 1–3 జగతీ: (2,3 త్రిష్టుప్) 4 అనుష్టుప్ ॥ మంత్రములు: 4 ॥

వినియోగం: శ్వాసాది రోగనివారణార్థమై చేసే కర్మలలో దీనికి వినియోగం. మబ్బుపట్టిన రోజున, జడి పట్టినప్పుడు తన్నివారణార్థమై కూడ దీనిని ఉపయోగిస్తారు.

మంత్రము :

జరాయుజః ప్రథమ ఉస్రియా వృషా
వాతాభ్రజా స్తనయన్నేతి వృష్ట్యా ।

సనో మృడాతి తన్వ౨ఋజుగో రుజన్
య ఏకమోజస్త్రేధా విచక్రమే ॥ 1 ॥

పదము :

జరాయు౨జః । ప్రథమః । ఉస్రియః వృషా ।
వాత౨అభ్రజాః । స్తనయన్ । ఏతి । వృష్ట్యా ।
స । నః । మృడాతి । తన్వే౨ । ఋజు౨గః । రుజన్ ।
యః । ఏకమ్ । ఓజః । త్రేధా । వి౨చక్రమే ॥ 1 ॥

అనువాదం :

వాతమేఘ సంజాతం నుంచి ఉత్పన్నుడై
తేజస్వి, బలవంతుడైన సూర్యుడు
వర్షంతో పాటు గర్జిస్తూ వెళుతున్నాడు.
ఆయన ఋజుగామి.
రుగ్మతాదోష నివారకుడు.
మన దేహాలకు సుఖాన్నిస్తాడు.
ఆయన తన తేజస్సును మూడు విధాలుగా ప్రకాశింపజేస్తాడు ॥ 1 ॥

మంత్రము :

అగ్నే అగ్నే శోచిషా శిశ్రియాణం
నమస్యన్త స్త్వా హవిషా విధేమ ।

అజ్కాన్త్వమజ్కాన్ హవిషా విధేమ
యో అగ్రభీత్ పర్వాస్యా గ్రభీతా ॥ 2 ॥

పదము.

అఙ్గేఽఅఙ్గే । శోచిషా । శిశ్రియాణమ్ ।
నమస్యన్తః । త్వా । హవిషా । విధేమ ।
అఙ్కాన్ । సమ్ఽఅఙ్కాన్ । హవిషా । విధేమ ।
యః । అగ్రభీత్ । పర్వ । అస్య । గ్రభీతా ॥ 2 ॥

అనువాదం:

ప్రాణుల అంగాంగంలో
స్వతేజస్సుతో వ్యాపించిన నీకు
నమస్కరిస్తూ హవిస్సు నర్పిస్తున్నాము.
గ్రహించే గమనశీలురైన సూర్యుని అనుచరులను,
పరివార ప్రాయులైన దేవతలను
హవనం అర్పించి పూజిస్తున్నాము.
అతని అంగాలను పీడించే
జ్వరాది రూప రోగాన్ని
పరిహరించుటకై
హవిస్సు నర్పిస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము:

ముఞ్చ శీర్షక్త్యా ఉత కాస ఏనం
పరుష్పరురావివేశా యో అస్య ।

యో అభ్రజా వాతజా యశ్చ శుష్మో

వనస్పతీన్త్సచతాం పర్వతాంశ్చ ॥ 3 ॥

పదము :

ముఞ్చ । శీర్షక్త్యాః । ఉత । కాసః । ఏనమ్ ।

పరుఃఽపరుః । ఆఽవివేశ । యః । అస్య ।

యః । అభ్రఽజాః । వాతఽజాః । యః । చ । శుష్మః ।

వనస్పతీన్ । సచతామ్ । పర్వతాన్ । చ ॥ 3 ॥

అనువాదం :

తలనొప్పి నుంచి కాసరోగం నుంచి
ఇతనిని విముక్తుని చెయ్యి.
ఇతని అంగాంగములను ఆవహించిన
రోగాలను దూరం చెయ్యి.
మేఘం నుంచి, వాతం నుంచి, ఉష్ణం నుంచి
ఉత్పన్నమైన రోగాలు
ఈ పురుషుని వదలి
చెట్లులనూ గుట్టలనూ
పట్టిపోవు గాక ! ॥ 3 ॥

మంత్రము :

శం మే పరస్మై గాత్రాయ శమస్త్వవరాయ మే ।

శం మే చతుర్భ్యో అఙ్గేభ్యః శమస్తు తన్వే౩ మమ ॥ 4 ॥

**పదము :**

శమ్ । మే । పరస్మై । గాత్రాయ । శమ్ । అస్తు । అవరాయ। మే ।

శమ్ । మే । చతుఃఽభ్యః । అఙ్గేభ్యః । శమ్ । అస్తు । తన్వేఽ ।

మమ ॥ 4 ॥

**అనువాదం :**

(రోగి తన ఆరోగ్యానికై చేసే ఆశంస)
నాపైనుండే శిరస్సునకు సుఖ మగుగాక !
నా అధోంగాలకు సుఖం కలుగుగాక !
నా కరచరణాలైన చతురంగాలకు కూడా
సుఖం కలుగు గాక !
నా శరీరానికి సుఖం కలుగు గాక ! ॥ 4 ॥

ఇది పన్నెండవ సూక్తం

## సూక్తం - 13

# పరమాత్మకు నమస్కారం

**ఋషి : భృగువు. అంగిరసుడు ॥ దేవత : విద్యుత్ ॥ఛందస్సు :- 1,2 అనుష్టుప్: 3 చతుష్పాద్ విరాడ్జగతీ, 4 త్రిష్టుప్ పరాబృహతీ గర్భాపంక్తి ॥. మంత్రములు: ॥ 4 ॥**

**వినియోగం :- పిడుగుపాటును తప్పించేందుకై చేసే కర్మలో దీనికి వినియోగం అట్లే ఉపాకర్మలో ఆజ్యహోమంలో దీనికి వినియోగం.**

**మంత్రము :**

నమస్తే అస్తు విద్యుతే నమస్తే స్తనయిత్నవే ।

నమస్తే అస్త్వశ్మనే యేనా దూడాశే అస్యసి ॥ 1 ॥

పదము :

నమః । తే । అస్తు । వి౽ద్యుతే । నమః । తే । స్తనయిత్నవే ।
నమః । తే । అస్తు । అశ్మనే । యేన । దుః౽దాశే । అస్యసి ॥1॥

అనువాదం :

ఓ పర్జన్యా! నీ మెఱుపునకు నమస్కారం.
గర్జించే నీ పిడుగునకు నమస్కారం.
వ్యాపనశీలమైన మేఘానికీ నమస్కారం.
స్తుతి, నమస్కార, హవిరాదులను
నీకు అర్పించని వానిపై
నీ పిడుగును పడవేతువు కదా! ॥ 1 ॥

మంత్రము :

నమస్తే ప్రవతో నపాద్ యతస్తపః సమూహసి ।
మృడయా నస్తనూభ్యో మయస్తోకేభ్య స్కృధి ॥ 2 ॥

పదము :

నమః । తే । ప్ర౽వతః । నపాత్ । యతః । తపః । సమ్౽ఊహసి ।
మృడయ । నః । తనూభ్యః । మయః । తోకేభ్యః । కృధి ॥ 2 ॥

అనువాదం :

అకాలంలో వర్షం పడకుండా
మేఘ మండలంలోనే నిలిపే ఓపర్జన్యా! నీకు నమస్కారం.
పాతక దాహకమైన తేజస్సును

పిడుగుగా పడవేసేవాడవు నీవు.
మా శరీరాలపై పిడుగుపడకుండా మమ్ము సుఖపెట్టు.
మా పుత్ర పౌత్రాదులను కూడ సుఖపెట్టు. ॥ 2 ॥

మంత్రము :

ప్రవతో నపాన్నమ ఏవాస్తు తుభ్యం
నమస్తే హేతయే తపుషే చ కృణ్మః ।
విద్మ తే ధామ పరమం గుహాయత్
సముద్రే అన్తర్నిహితాసి నాభిః ॥ 3 ॥

పదము :

ప్రఽవతః । నపాత్ । నమః । ఏవ । అస్తు । తుభ్యమ్ ।
నమః । తే । హేతయే । తపుషే । చ । కృణ్మః ।
విద్మ । తే । ధామ । పరమమ్ । గుహా । యత్ ।
సముద్రే । అన్తః । నిఽహితా । అసి । నాభిః । ॥ 3 ॥

అనువాదం :

అకాలంలో వర్షం పడకుండా
మేఘ మండలంలోనే నిలిపే ఓ పర్జన్యా!
నీకు నమస్కరించుటకంటె ఏమి చేయగలను?
సంతాపకారకం అశనిరూపం అయిన
నీ ఆయుధానికి నమస్కరిస్తున్నాము.
ఓ పర్జన్యా! నీ వుండే పరమ రహస్యస్థానాన్ని

మే మెఱుగుదుము.
అంతరిక్ష మధ్యంలో నీ నాభి కలదు.
అక్కడే నీవుంటావు. ॥ 3 ॥

మంత్రము :

యాం త్వా దేవా అసృజన్త విశ్వ
ఇషుం కృణ్వానా అసనాయ ధృష్ణుమ్ ।
సా నో మృడ విదథే గృణానా
తస్యై తే నమో అస్తు దేవి ॥ 4 ॥

పదము :

యామ్ । త్వా । దేవాః । అసృజన్త । విశ్వే ।
ఇషుమ్ । కృణ్వానాః । అసనాయ । ధృష్ణుమ్ ।
సా । నః । మృడ । విదథే । గృణానా ।
తస్యై । తే । నమః । అస్తు । దేవి ॥ 4 ॥

అనువాదం :

ఓ అశని! (ఓ పిడుగా!)
శత్రుహననానికై వేసే బాణంగా
సర్వదేవతలు నిన్ను సృష్టించినారు.
అలాంటి నీవు స్తుతి పాత్రమవై మమ్ములను
ఆ భయాన్నుంచి తప్పించి సుఖపెట్టు.
ఓ దేవీ! అలాంటి మహిమోపేతురాలవైన
నీ కిదే నా నమస్కారం. ॥ 4 ॥

ఇది పదమూడవ సూక్తం

## సూక్తం – 14




# కులవధూ - సూక్తం

ఋషి: భృగువు, అంగిరసుడు॥ దేవత: యముడు॥ ఛందస్సు:- 1 కకుమ్మత్యనుష్టుప్: 3 చతుష్పదా: 2, 4 అనుష్టుభౌ విరాడనుష్టుప్ మంత్రములు: ॥ 4 ॥

వినియోగం:- స్త్రీపురుష దౌర్భాగ్యార్థమై వారికి చెందిన మాల్యాదులను ఖననం చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము:

భగమస్యా వర్చ ఆదిష్యధి వృక్షాదివ స్రజమ్ ।

మహాబుధ్న ఇవ పర్వతో జ్యోక్ పితృష్వాస్తామ్ ॥ 1 ॥

పదము:

భగమ్ । అస్యాః । వర్చః । ఆ । అదిషి । అధి । వృక్షాత్ఽఇవ ।

స్రజమ్ ।

మహాబుధ్నఃఽఇవ । పర్వతః । జ్యోక్ । పితృషు । ఆస్తామ్ ॥ 1 ॥

అనువాదం:

వృక్షాలనుంచి పూలను మాలకై కోసుకున్నట్టుగా
అనిష్టురాలైన ఈ స్త్రీ భాగ్యాన్ని, వర్చస్సును
నా అధీనం చేసుకుంటున్నాను.
భూమిలో ఎంతో లోతుగా
పాతుకొని ఉన్న పర్వతం వలెనే
ఈమె చిరకాలం తల్లి దండ్రుల ఇండ్లలోనే ఉండిపోవుగాక! ॥1॥

మంత్రము :

ఏషా తే రాజన్ కన్యాఽవధూర్ని ధూయతాం యమ ।

సా మాతుర్బధ్యతాం గృహేథో భ్రాతురథో పితుః ॥ 2 ॥

పదము :

ఏషా । తే । రాజన్ । కన్యాఽ । వధూః । ని । ధూయతామ్ ।
యమ ।

సా । మాతుః । బధ్యతామ్ । గృహే । అథో ఇతి । భ్రాతుః । అథో
ఇతి । పితుః ॥ 2 ॥

అనువాదం :

ఓ విరాజ మానుడవైన సోముడా! యముడా!
ఈ కన్య నీ భార్య.
ఈ దౌర్భాగ్యరాలను పతిగృహం నుంచి వెడలనడతువుగాక!
ఆమె తల్లి ఇంటిలో కట్టి పడవేసి నట్లుగా
చిరకాల ముండుగాక!
అలాగే సోదరుని ఇంటిలో బంధితురాలౌగాక!
జనకుని ఇంటిలో బంధితురా లౌగాక! ॥ 2 ॥

మంత్రము :

ఏషా తే కులపా రాజన్ తాము తే పరి దద్మసి ।

జ్యోక్ పితృష్వాసాతా ఆ శీర్ష్ణః శమోప్యాత్ ॥ 3 ॥

పదము :

ఏషా । తే । కులఽపాః । రాజన్ । తామ్ । ఓం ఇతి । తే । పరి ।
దద్మసి ।

జ్యోక్ । పితృషు । ఆసాతై । ఆ । శీర్‌ష్ణః । శమ్ఽఓ । ప్యాత్ ॥ 3॥

అనువాదం :

ఓ రాజా! ఈస్త్రీ నీకు కులపత్ని
ఈమెను నీకే అప్పగిస్తున్నాను.
ఈమె శిరస్సు నేలపై వ్రాలునంత వఱకు
చిరకాలం పితృగృహంలోనే నివసించుగాక! ॥ 3 ॥

మంత్రము :

అసితస్య తే బ్రహ్మణా కశ్యపస్య గయస్య చ ।
అన్తఃకోశమివ జామయోఽపి నహ్యామి తే భగమ్ ॥ 4 ॥

పదము :

అసితస్య । తే । బ్రహ్మణా । కశ్యపస్య । గయస్య । చ ।
అన్తఃకోశమ్ఽఇవ । జామయః । అపి । నహ్యామి । తే । భగమ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ నారీ! నీభాగ్యాన్ని
అసితుడనే ఋషి మంత్రంతో
నీ నుంచి నివర్తింపజేస్తున్నాను.
అలాగే కశ్యప మంత్రంతోను
గయుని మంత్రంతోను నీ భాగ్యాన్ని
నీ నుంచి నివర్తింపజేస్తున్నాను.
భగిన్యాది స్త్రీలు గృహ మధ్యంలో

ధన వస్త్రాదులను దాచి
కప్పివేసి నట్టుగా నిన్ను ఉంచుతున్నాను. ॥ 4 ॥

ఇది పదునాల్గవ సూక్తం

## సూక్తం - 15

# సంఘటన మహాయజ్ఞ సూక్తం

ఋషి: అథర్వుడు॥ దేవత: మంత్రాలలో పేర్కొన్న సింధువు మొదలగు వారు॥ ఛందస్సు: 1 భురిగ్ బృహతీ; 2 భురిగ్ పథ్యాపంక్తి; 3,4 అనుష్టుప్॥ మంత్రములు: 4 ॥ 4 ॥

వినియోగం:- సర్వపుష్టి కర్మలలో దీనికి వినియోగం. మిశ్రధాన్యాదులు, మధుమిశ్రసక్తు (పేలపిండి) మన్థప్రాశనంలోను దీనికివినియోగం. సంపద అభివృద్ధి నిమిత్తం కూడ దీనిని వినియోగిస్తారు.

మంత్రము:

సం సం స్రవన్తు సిన్ధవః
సం వాతాః సం పతత్రిణః ।
ఇమం యజ్ఞం ప్రదివో మే జుషన్తాం
సంస్రావ్యేఽణ హవిషా జుహోమి ॥ 1 ॥

పదము:

సమ్ । సమ్ । స్రవన్తు । సిన్ధవః ।
సమ్ । వాతాః । సమ్ । పతత్రిణః ।

ఇమమ్ । యజ్ఞమ్ । ప్రఽదివః । మే । జుషన్తామ్ ।

సమ్ఽ స్రావ్యేణ । హవిషా । జుహోమి ॥ 1 ॥

అనువాదం

నదులు నా కనుకూలాలై ప్రవహించుగాక!
వాయువులు నా కనుకూలంగా వీచుగాక!
పక్షులు నా కనుకూలమై ఎగురుగాక!
పురాతన దేవతలు నా ఈ యజ్ఞానికి వచ్చి
హవిస్సును స్వీకరింతురు గాక!
స్రవిస్తున్న ఆజ్యాదుల నీ అగ్నిలో హవనం చేస్తున్నాను. ॥1॥

మంత్రము :

ఇహైవ హవమా యాత మ ఇహ

సంస్రావణా ఉతేమం వర్ధయతా గిరః ।

ఇహైతు సర్వో యః పశురస్మిన్

తిష్ఠతు యా రయిః ॥ 2 ॥

పదము :

ఇహ । ఏవ । హవమ్ । ఆ । యాత । మే । ఇహ ।

సమ్ఽస్రావణాః । ఉత । ఇమమ్ । వర్ధయత । గిరః ।

ఇహ । ఆ । ఏతు । సర్వః । యః । పశుః । అస్మిన్ ।

తిష్ఠతు । యా । రయిః ॥ 2 ॥

అనువాదం :

దేవతలారా !
నా ఈ ఆహ్వానాన్ని పురస్కరించు కొని ఇక్కడికే రండి.
ఇక్కడ హోమం జరుగుతున్నది.
స్తోత్ర పాఠాలు వినవస్తున్నవి.
స్తుతి పాత్రులైన మీరు హవిస్సు నిచ్చే
ఈ యజమానికి అభ్యుదయం చేకూర్చండి.
మీ అనుగ్రహం వల్ల సర్వపశు సంపద
మా ఇంట వర్ధిల్లు గాక !
అలాగే ధనధాన్య రూపమైన సంపద
మా ఇంట నెలకొను గాక ! ॥ 2 ॥

మంత్రము :

యే నదీనాం సంస్రవన్త్యుత్సాసః సదమక్షితాః ।
తేభిర్మే సర్వైః సంస్రావైర్ధనం సం స్రావయామసి ॥ 3 ॥

పదము :

యే । నదీనామ్ । సమ్ఽస్రవన్తి । ఉత్సాసః । సదమ్ । అక్షితాః।
తేభిః । మే । సర్వైః । సమ్ఽస్రావైః। ధనమ్ । సమ్ । స్రావ
యామసి ॥ 3 ॥

అనువాదం :

గంగాదుల ప్రవాహాలు
భూమినుంచి అక్షయములై ప్రవహించుగాక !
గోహిరణ్యాది రూపమైన ధనం
సస్యాదుల అభివృద్ధి ద్వారా మాకు లభించు గాక ! ॥ 3 ॥

మంత్రము :

యే సర్పిషః సంస్రవన్తి క్షీరస్య చోదకస్య చ

తేభిర్మే సర్వైః సంస్రావైర్ధనం సం స్రావయామసి ॥ 4 ॥

పదము :

యే । సర్పిషః । సమ్ఽస్రవన్తి । క్షీరస్య । చ । ఉదకస్య । చ ।

తేభిః । మే । సర్వైః । సమ్ఽస్రావైః । ధనమ్ । సమ్ । స్రావ

యామసి ॥ 4 ॥

అనువాదం :

ఆజ్యాదులు, క్షీరాదులు, ఉదకాదులు
అక్షయమై ప్రవహించు గాక !
వాటితో గోహిరణ్యాది రూపమైన ధనం
సస్యాదుల అభివృద్ధి ద్వారా మాకు లభించు గాక ! ॥ 4 ॥

ఇది పదునైదవ సూక్తం

## సూక్తం - 16

# చోర నాశన - సూక్తం

ఋషి. చాతనుడు ॥ దేవత : 1 అగ్ని : 2 వరుణుడు, అగ్ని, ఇంద్రుడు : 3, 4 సీసమ్ ॥ ఛందస్సు : 1-3 అనుష్టుప్ । 4 కకుమ్మత్యనుష్టుప్ ॥
మంత్రములు ॥ 4 ॥

వినియోగం:- ఈ సూక్తంతో ద్వేష్య మారణార్థం అభిమంత్రించిన సీసచూర్ణ మిశ్రితాన్న ప్రాశనము, విరిచిన వెదురు కఱ్ఱతో తాడనం కూడ చేస్తారు

మంత్రము :

యేఽమావాస్యాం 3 రాత్రి ముదస్థుర్వ్రాజమత్త్రిణః ।
అగ్నిస్తురీయో యాతుహా సో అస్మభ్యమధి బ్రవత్ ॥ 1 ॥

పదము :

యే । అమాఽవాస్యాఽమ్ । రాత్రిమ్ । ఉత్ఽఅస్థుః । వ్రాజమ్ । అత్త్రిణః ।
అగ్నిః । తురీయః । యాతుఽహా । సః । అస్మభ్యమ్ । అధి । బ్రవత్ ॥ 1 ॥

అనువాదం :

సర్వభక్షకులైన రక్షః పిశాచాదులు
అమావాస్య రాత్రిలో నక్షత్రాలు వెలుగుతుండగా
పైకి లేచి వస్తున్నారు.
తురీయాగ్ని, రక్షోహంత
రక్షోభీతిని మాకై నివారించుగాక ! ॥ 1 ॥

మంత్రము :

సీసాయాధ్యాహ వరుణః సీసాయాగ్నిరుపావతి ।
సీసం మ ఇన్ద్రః ప్రాయచ్ఛత్ తదఙ్గం యాతుచాతనమ్॥2॥

పదము .

సీసాయ । అధి । ఆహ । వరుణః । సీసాయ । అగ్నిః । ఉప । అవతి ।

సీసమ్ । మే । ఇన్ద్రః । ప్ర । అయచ్ఛత్ । తత్ । అఙ్గ । యాతు
ఉచాతనమ్ ॥ 2 ॥

అనువాదం :

నదీఫేనాది రూపమైన సీసమును
జలాధిపతియైన వరుణుడు అభిమానిస్తున్నాడు.
అగ్ని దానిని రక్షిస్తున్నాడు.
ఆ సీసాన్ని శత్రు నిరసన కాముడనైన నాకు
ఇంద్రుడు ప్రసాదించినాడు.
ఆ సీసం రక్షః పిశాచాది నాశకమైనది కదా! ॥ 2 ॥

మంత్రము :

ఇదం విష్కన్ధం సహత ఇదం బాధతే అత్త్రిణః ।
అనేన విశ్వా ససహే యా జాతాని పిశాచ్యాః ॥ 3 ॥

పదము :

ఇదమ్ । విఽస్కన్ధమ్ । సహతే । ఇదమ్ । బాధతే । అత్త్రిణః ।
అనేన । విశ్వా । ససహే । యా । జాతాని । పిశాచ్యాః ॥ 3 ॥

అనువాదం :

ఈ సీసం రక్షః పిశాచాది కృత
విఘ్నజాతాన్ని విచ్ఛిన్నం చేస్తుంది.
ఈ సీసం మానవ భక్షకులైన
రాక్షసులను బాధిస్తుంది.
ఈ సీసంతో సర్వమూ లోబఱచుకుంటున్నా.

పిశాచాదులవలన కలిగే ఉపద్రవాల నన్నిటిని
దీనితో నివారిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

యది నో గాం హంసి యద్యశ్వం యది పూరుషమ్ ।
తం త్వా సీసేన విధ్యామో యథా నోసో అవీరహా ॥ 4 ॥

పదము :

యది । నః । గామ్ । హంసి । యది । అశ్వమ్ । యది ।
పూరుషమ్ ।
తమ్ । త్వా । సీసేన । విధ్యామః । యథా । నః । అసః । అవీ
రఽహా ॥ 4 ॥

ఇతి తృతీయోఽనువాకః

అనువాదం :

ఓ విరోధీ! నీవు మా గోజాతాన్ని హింసించినావు గనుక,
అశ్వాదులను హింసించినావు గనుక,
అలాంటి అపకారిని నిన్ను ఈ సీసంతో తాడనం చేస్తున్నాను.
ఇక మీదకూడా నీవు మా పుత్రపౌత్రాదులను
హింసించకుండా చేస్తున్నాను. ॥ 4 ॥

ఇది పదునారవ సూక్తం

ఇది మూడవ అనువాకం

## అనువాకం : 4

### సూక్తం - 17

# రక్తస్రావం ఆపడానికి

ఋషి: బ్రహ్మ॥ దేవత : యోషితులు, ధమనులు॥ ఛందస్సు 1 భురిగనుష్టుప్
2. 3 అనుష్టుప్: 4 త్రిపదార్షీ గాయత్రీ॥ మంత్రములు: ॥ 4 ॥

వినియోగం :- గాయంనుంచి స్రవించే రక్తాన్ని ఆపడానికి, అతిగా స్రవించే స్త్రీ రజస్సును ఆపడానికి, ఐదుకణుపులు గల దండంతో ప్రణముఖంలో అభిమంత్రించడానికి, దారుల కూడలి లోని మట్టిని తెచ్చి చల్లడానికి, ఎండిన బురద మట్టిని చల్లడానికి ఈ మంత్రాలను వినియోగిస్తారు.

మంత్రము .

అమూర్యా యన్తి యోషితో హిరా లోహితవాససః ।
అభ్రాతర ఇవ జామయస్తిష్ఠన్తు హతవర్చసః ॥ 1 ॥

పదము :

అమూః । యాః । యన్తి । యోషితః । హిరాః । లోహితఽవాససః ।
అభ్రాతరఃఽఇవ । జామయః । తిష్ఠన్తు । హతఽవర్చసః ॥ 1 ॥

అనువాదం :

రక్తవస్త్రులైన రమణులవంటి
ధమనులు వీర్యహీనములై
సోదరహీనలైన స్త్రీలవలె నిలిచిపోవుగాక ! ॥ 1 ॥

మంత్రము :

తిష్ఠావరే తిష్ఠ పర ఉత త్వం తిష్ఠ మధ్యమే ।
కనిష్ఠికా చ తిష్ఠతి తిష్ఠాదిద్ధమనిర్మహీ ॥ 2 ॥

పదము .

తిష్ఠ । అవరే । తిష్ఠ । పరే । ఉత । త్వమ్ । తిష్ఠ । మధ్యమే ।
కనిష్ఠికా । చ । తిష్ఠతి । తిష్ఠాత్ । ఇత్ । ధమనిః । మహీ ॥ 2 ॥

అనువాదం :

గాత్రం అధోభాగం లోని రక్తనాళాలు స్రవించకండి.
అలాగే ఊర్ధ్వాంగంలోని నాళాలు కూడ ఆగిపోండి.
శరీర మధ్యభాగంలోనివి కూడ ఆగి పొండి.
సూక్ష్మతరాలైన నాడులు కూడ రక్తం స్రవించకుండు గాక!
అలాగే స్థూలతర ధమని కూడా
రుధిరం స్రవించ కుండా ఉండనీ. ॥ 2 ॥

మంత్రము .

శతస్య ధమనీనాం సహస్రస్య హిరాణామ్ ।
అస్థురిన్మధ్యమా ఇమాః సాకమన్తా అరంసత ॥ 3 ॥

పదము :

శతస్య । ధమనీనామ్ । సహస్రస్య । హిరాణామ్ ।
అస్థుః । ఇత్ । మధ్యమాః । ఇమాః । సాకమ్ । అన్తాః । అరంసత
॥ 3 ॥

అనువాదం :

శత సంఖ్యాకాలైన హృదయగత ధమనులు
సహస్ర సంఖ్యాకాలైన శాఖానాడులు
మధ్యభాగంలో వ్యాధివశం వల్ల
రక్తం స్రవిస్తున్న నాడులు అలాగే ఆగిపోనీ.
నివృత్త రుధిరస్రావములైన నాడులతోపాటు
మిగిలిన అన్ని నాడులు
యథాపూర్వంగా ఉండుగాక ! ॥ 3 ॥

మంత్రము :

పరి వః సికతావతీ ధనూర్బృహత్యఽక్రమీత్ ।
తిష్ఠ తే లయతా సు కమ్ ॥ 4 ॥

పదము :

పరి । వః । సికతావతీ । ధనూః । బృహతీ । అక్రమీత్ ।
తిష్ఠత । ఇలయత । సు । కమ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ నాడులారా ! మీకు ఆధారభూతమైన నాడి
ధనుస్సువలె వక్రమైన మూత్రాశయ నాడి,
బృహన్నాడి, పరితోవ్యాప్తమగు గాక !
మీరంతా రక్తం స్రవించకుందురు గాక !
రోగికి సుఖాన్ని కల్పింతురుగాక ! ॥ 4 ॥

ఇది పదునేడవ సూక్తం

# సూక్తం - 18

# సౌభాగ్య వర్ధన సూక్తం

ఋషి: ద్రవిణోదులు ॥ దేవత : మంత్రాలలో పేర్కొన్న సవిత్రాదులు ॥ ఛందస్సు : 1 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ : 2 నిచృజ్జగతీ : 3 విరాడాస్తార పంక్తి త్రిష్టుప్ : 4 అనుష్టుప్ : మంత్రములు : ॥ 4 ॥

వినియోగం :- స్త్రీ దుర్లక్షణ నివారణార్థమై చేసే హోమాదులలో దీనికి వినియోగం. అలాగే శాంతికల్పంలో మహాశాంతికై దీనిని వినియోగిస్తారు.

మంత్రము :

నిర్లక్ష్మ్యం ౨ లలామ్యం 1 నిరరాతిం సువామసి ।
అథ యా భద్రా తాని నః ప్రజాయా
అరాతిం నయామసి ॥ 1 ॥

పదము :

నిః । లక్ష్మ్య౨మ్ । లలామ్య౨మ్ । నిః । అరాతిమ్ । సువామసి।
అథ । యా । భద్రా । తాని । నః । ప్ర౨జాయై । అరాతిమ్ ।
నయామసి । ॥ 1 ॥

అనువాదం :

తిలకస్థానంలో ఉన్న దౌర్భాగ్య చిహ్నాన్ని
నిరవశేషంగా తొలగిస్తున్నాము.
అలాగే అనిష్టకరమైన అవయవాంతర్గత
దుర్లక్షణాన్ని తొలగిస్తున్నాము.
మఱి కల్యాణచిహ్నాలైన వేవో

అపి మా సంతానానికి ప్రాప్తించుగాక!
తొలగించిన దౌర్భాగ్య చిహ్నాలు
శత్రువునకు సంప్రాప్తింప జేస్తున్నాము ॥ 1 ॥

మంత్రము

నిరరణిం సవితా సావిషక్ పదో
ర్నిర్హస్తయోర్వరుణో మిత్రో అర్యమా ।
నిరస్మభ్యమనుమతీ రరాణా ప్రేమాం
దేవా అసావిషుః సౌభగాయ ॥ 2 ॥

పదము ;

నిః । అరణిమ్ । సవితా । సావిషక్ । పదోః ।
నిః । హస్తయోః । వరుణః । మిత్రః । అర్యమా ।
నిః । అస్మభ్యమ్ । అనుమతిః । రరాణా । ప్ర । ఇమామ్ ।
దేవాః । అసావిషుః । సౌభగాయ ॥ 2 ॥

అనువాదం :

సర్వప్రేరకుడైన సవిత
పాదములలోని దుర్లక్షణాలను తొలగించుగాక!
అలాగే వరుణుడు, మిత్రుడు, అర్యముడు
చేతులలోని దుర్లక్షణాలను తొలగింతురుగాక!
సర్వానుమతి పొందిన దేవత
అభయమిస్తూ మాకై
అంగాంగములలోని దుర్లక్షణాలను తొలగించుగాక!

మాకు సౌభాగ్యాన్నిచ్చుటకై
ఇంద్రాది దేవతలను అర్థిస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము:

యత్తే ఆత్మని తన్వాం ఘోరమ్ అస్తి

యద్వా కేశేషు ప్రతిచక్షణే వా ।

సర్వం తద్వాచాప హన్మో వయం

దేవ స్త్వా సవితా సూదయతు ॥ 3 ॥

పదము .

యత్ । తే । ఆత్మని । తన్వామ్ । ఘోరమ్ । అస్తి ।

యత్ । వా । కేశేషు । ప్రతిఽచక్షణే । వా ।

సర్వమ్ । తత్ । వాచా । అప । హన్మః । వయమ్ ।

దేవః । త్వా । సవితా । సూదయతు ॥ 3 ॥

అనువాదం :

ఓ దుర్లక్షణ భరితుడా!
నీ శరీరంపై నున్న భయంకర దుర్లక్షణాలను
కేశములలోగాని, కన్నులలోగాని,
ఉన్న దుర్లక్షణాలన్నిటిని
ఈ మంత్రరూపమైన వాక్కుతో ధ్వంసం చేస్తున్నాము.
సవితృదేవుడు నీకు శ్రేయస్సు నిచ్చుగాక! ॥ 3 ॥

మంత్రము.

రిశ్యపదీం వృషదతీం గోషేధాం విధమాముత ।

విలీఢ్యం౨లలామ్యం౹తా అస్మన్నాశయామసి ॥ 4 ॥

పదము:

రిశ్య౨పదీమ్ । వృష౨దతీమ్ । గో౨సేధామ్ । వి౨ధమామ్ । ఉత ।

వి౨లీఢ్యమ్ । లలామ్య౨మ్ । తాః । అస్మత్ । నాశయామసి ॥4॥

అనువాదం.

దుప్పికాళ్ళవంటి కాళ్ళుగల స్త్రీలు,
పెద్దపళ్ళుగల స్త్రీలు,
ఆవులాగ నడిచే స్త్రీలు,
ఫూత్కరించే స్త్రీలు,
ఏ రందఱినుంచి ఆ దుర్లక్షణాలను
మంత్రప్రభావంతో
నివర్తింప జేస్తున్నాము.
నుదుటనున్న సుడిని కూడ తొలగిస్తున్నాము. ॥ 4 ॥

ఇది పదునెనిమిదవ సూక్తం

## సూక్తం - 19

# శత్రునాశన సూక్తం

ఋషి: బ్రహ్మ ॥ దేవత 1 ఇంద్రుడు, 2 మనుష్యేషువులు, 3 రుద్రుడు, 4 దేవతలు: ఛందస్సు · 1, 4 అనుష్టుప్, 2 పురస్తాద్ బృహతీ, 3 పథ్యాపంక్తి ॥ మంత్రములు. ॥ 4 ॥

వినియోగం:- సాంగ్రామికాది కర్మలలో దీనికి వినియోగం.

మంత్రము:

మా నో విదన్ వివ్యాధినో

మో అభివ్యాధినో విదన్ ।

ఆరాచ్ఛరవ్యా అస్మ

ద్విషూచీ రిన్ద్ర పాతయ ॥ 1 ॥

పదము:

మా । నః । విదన్ । విఽవ్యాధినః ।

మో ఇతి । అభిఽవ్యాధినః । విదన్ ।

ఆరాత్ । శరవ్యాః । అస్మత్ ।

విషూచీః । ఇన్ద్ర । పాతయ ॥ 1 ॥

అనువాదం:

అస్త్రాలతో మమ్ము కొట్టదలచిన శత్రువులను
మేము ఎరుగకుందుముగాక!
ఇలాగే మమ్ముల సమరిస్తున్న శత్రువులను
మేము పొందక యుందుముగాక!
ఓ ఇంద్రా! శత్రువుల
వదలిన శరసంఘాతములను
మాకు దూరంగా పడునట్లు చేయి. ॥ 1 ॥

మంత్రము:

విష్వఞ్చో అస్మచ్ఛరవః పతన్తు

యే అస్తా యే చాస్యాః ।
దైవీర్మనుష్యేషవో మమా
మిత్రాన్ వి విధ్యత ॥ 2 ॥

పదము ;

విష్వఞ్చః । అస్మత్ । శరవః । పతన్తు
యే । అస్తాః । యే । చ । అస్యాః ।
దైవీః । మనుష్యః ఇషవః । మమ ।
అమిత్రాన్ । వి । విధ్యత ॥ 2 ॥

అనువాదం ;

శత్రువిసర్జితాలైన శస్త్రములు
మాకు దూరముగా పడిపోవుగాక !
మా పొదిలో ఉన్న శరములన్నీ
దైవసంబంధమైనవీ, మానవ సంబంధమైనవీ శర ములన్నీ
మా శత్రువులను నిర్మూలించుగాక ! ॥ 2 ॥

మంత్రము :

యోనః స్వో యో అరణః సజాత ఉత
నిష్ట్యో యో అస్మాం అభిదాసతి ।
రుద్రః శరవ్యయైతాన్
మమామిత్రాన్ వి విధ్యతు ॥ 3 ॥

పదము :

యః । నః । స్వః । అరణః । స౽జాతః । ఉత ।

నిష్ట్యః । యః । అస్మాన్ । అభి౽దాసతి ।

రుద్రః । శరవ్య౽యా । ఏతాన్ ।

మమ । అమిత్రాన్ । వి । విధ్యతు ॥ 3 ॥

అనువాదం :

మా దాయాదులు అధిక బలవంతులై
మమ్ములను అనవసరంగా బాధిస్తున్నారు.
అలాగే సజాతులైన శత్రువులు కూడ బాధిస్తున్నారు.
నికృష్ట బలులైన శత్రువులు కూడ
ఏవో ఇబ్బందులు కల్పిస్తున్నారు.
ఈ మా శత్రువులందరిని రుద్రుడు
శరసంహతితో కొట్టుగాక ! ॥ 3 ॥

మంత్రము :

యః సపత్నో యో౽సపత్నో యశ్చ ద్విషన్ఛపాతి నః ।

దేవాస్తం సర్వే ధూర్వన్తు బ్రహ్మ వర్మ మమాన్తరమ్ ॥4॥

పదము :

యః । స౽పత్నః । యః । అసపత్నః । యః । చ । ద్విషన్ ।
శపాతి । నః ।

దేవాః । తమ్ । సర్వే । ధూర్వన్తు । బ్రహ్మ । వర్మ । మమ ।
అన్తరమ్ ॥ 4 ॥

అనువాదం :

జ్ఞాతి రూపులైన శత్రువులు,
జ్ఞాతులుకాని శత్రువులు మమ్ములను ద్వేషిస్తూ శపించనున్నారు.
వారిని సర్వదేవతలు హింసింతురు గాక !
నేను వదిలిన మంత్రజలం నాకు కవచం అగుగాక ! ॥ 4 ॥

ఇది పందొమ్మిదవ సూక్తం

## సూక్తం - 20

# ఇంద్రప్రార్థన

ఋషి: అథర్వుడు ॥ దేవత : 1. సోముడు, మరుత్తులు ॥ 2. మిత్రావరుణులు : 3. వరుణుడు ॥ 4 ఇంద్రుడు ॥ ఛందస్సు. 1 త్రిష్టుప్, 2-4 అనుష్టుప్॥ మంత్రములు : ॥ 4 ॥

వినియోగం:- సాంగ్రామికాది కర్మలలో, దర్శపౌర్ణమా స్యాదులలో దీనికి వినియోగం.

మంత్రము .

అదారసృద్ భవతు దేవ సోమాస్మిన్
యజ్ఞే మరుతో మృడతా నః ।
మా నో విదదభిభా మో అశస్తిర్మా
నో విదద్ వృజినా ద్వేష్యాయా ॥ 1 ॥

పదము :

అదారఽసృత్ । భవతు । దేవ । సోమ । అస్మిన్ ।
యజ్ఞే । మరుతః । మృడత । నః ।
మా । నః । విదత్ । అభిఽభాః । మో ఇతి । అశస్తిః । మా ।
నః । విదత్ । వృజినా । ద్వేష్యా । యా ॥ 1 ॥

అనువాదం :

ఓ దేవా ! సోమా !
నా శత్రువులు తమ భార్యల చెంతకు
ఎప్పుడూ చేరకుందురు గాక !
ఓ మరుత్తులారా ! నేను చేస్తున్న ఈ యజ్ఞంలో
మమ్ములను సుఖపెట్టుదురు గాక !
మాకు అభిముఖంగా ఉన్న శత్రుతేజం
మమ్ములను లోగొనకుండు గాక !
అలాగే అపకీర్తి మాకు రాకుండు గాక !
ఏ పాపములు మాకు ప్రతిబంధకాలుగా నున్నవో
అవి మమ్ములను అంటకుండు గాక ! ॥ 1 ॥

మంత్రము.

యో అద్య సేన్యో వధోఽఘాయూనా ముదీరతే ।
యువం తం మిత్రావరుణావస్మద్యావయతం పరి ॥ 2 ॥

పదము :

యః । అద్య । సేన్యః । వధః । అఘఽయూనామ్ । ఉత్ఽ
ఈరతే ।

**యువమ్ । తమ్ । మిత్రావరుణౌ । అస్మత్ । యుయుతమ్ । పరి**
**॥ 2 ॥**

**అనువాదం :**

ఇదో పరసేన వదలిన ఆయుధజాలం మావైపు వస్తున్నది.
ఓ మిత్రావరుణులారా!
ఆ శత్రు వినిర్ముక్తాలైన ఆయుధాలను
మా నుండి దూరంగా పడవేయండి. ॥ 2 ॥

**మంత్రము :**

**ఇతశ్చ యదముతశ్చ యద్ వధం వరుణ యాపయ ।**
**వి మహచ్ఛర్మ యచ్ఛ వరీయో యావయా వధమ్ ॥ 3 ॥**

**పదము :**

**ఇతః । చ । యత్ । అముతః । చ । యత్ । వధమ్ । వరుణ ।**
**యవయ ।**
**వి । మహత్ । శర్మ । యచ్ఛ । వరీయః । యవయ । వధమ్॥3॥**

**అనువాదం :**

ఓ వరుణా! మా సమీప శత్రువు దగ్గర నుంచి
మావైపు వస్తున్న ఆయుధాలను,
అలాగే మాకు దూరంలో ఉన్న శత్రువులనుంచి
వస్తున్న ఆయుధాలను, మా నుంచి దూరం చెయ్యి.
ఓ వరుణా! మా శత్రువులకు అలభ్యమైన
సుఖం మాకు ప్రసాదించు.

అలాగే బలవత్తరమైన వారి శస్త్రాస్త్రజాలాన్ని
మా నుంచి దూరం చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

శాస ఇత్థా మహాం అస్యమిత్రసాహో అస్తృతః ।
నయస్య హన్యతే సఖా న జాయతే కదా చన ॥ 4 ॥

పదము :

శాసః । ఇత్థా । మహాన్ । అసి । అమిత్రఽసహః । అస్తృతః ।
న । యస్య । హన్యతే । సఖా । న । జీయతే । కదా । చన ॥ 4 ॥

అనువాదం :

ఓ ఇంద్రా నీవు శాసకుడవు
ఈ విధంగా నీవు మహత్త్వగుణోపేతుడవు.
శత్రువులను అభిభవించు వాడవు.
శత్రుహింసకు అతీతుడవు.
ఇలాంటి నిన్ను శరణన్న పురుషుని
శత్రువులు హింసించలేరు.
అతడు ఎన్నడూ విరోధిపరాభూతుడు కాడు.
ఇంద్రానుగ్రహంవల్ల మేము శత్రువులను జయిస్తాము. ॥4॥

ఇది ఇరవైయవ సూక్తం

## సూక్తం - 21

# ప్రజా - పాలక - సూక్తం

**ఋషి:** అథర్వుడు॥ దేవత . ఇంద్రుడు॥ ఛందస్సు : అనుష్టుప్॥ మంత్రములు 4
వినియోగం . ప్రయాణ సమయంలో, స్వస్తివాచనంలో, పిశాచాది నివారణ

కర్మలో, ఉద్వేగవినాశనంలో, అపరాజిత గణంలోని సాంగ్రామికాది కర్మలలో దీనికి వినియోగం.

మంత్రము.

స్వస్తిదా విశాం పతిర్వృత్రహా విమృధో వశీ ।
వృషేన్ద్రః పుర ఏతు నః సోమపా అభయంకరః ॥ 1 ॥

పదము.

స్వస్తిఽదాః । విశామ్ । పతిః । వృత్రఽహా । విఽమృధః । వశీ ।
వృషా । ఇన్ద్రః । పురః । ఏతు । నః । సోమఽపాః । అభయమ్ ఽకరః ॥ 1 ॥

అనువాదం.

స్వస్తి ప్రదాతయైన సర్వప్రజాపాలకుడు,
వృత్ర సంహారం చేసిన వాడు, శత్రు వినాశకుడు,
సర్వప్రాణిజాతాన్ని తన వశంలో ఉంచుకున్నవాడు,
అభీష్టప్రదాత, సోమపాయి అయిన
అభయంకరుడైన ఇంద్రుడు
సంగ్రామాదులలో మా ముందుండి మమ్ము నడుపుగాక! ॥1॥

మంత్రము:

వి న ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః ।
అధమం గమయా తమో యో అస్మాం అభిదాసతి ॥ 2 ॥

పదము:

వి । నః । ఇన్ద్ర । మృధః । జహి । నీచా । యచ్ఛ । పృతన్యతః ।

అధమమ్ । గమయ । తమః । యః । అస్మాన్ । అభిఽదాసతి॥2॥

అనువాదం :

ఓ ఇంద్రా ! మా కోసమై మాపై ఎత్తివచ్చే
శత్రువులను నశింపజెయ్యి.
సేనలను కూర్చుకొని వచ్చే శత్రువులను నిగ్రహించు.
అలాగే మా క్షేత్ర ధనాదులను అపహరించే శత్రువులను
(మరణాత్మకమైన) అధమస్థితికి కొనిపో. ॥ 2 ॥

మంత్రము :

వి రక్షో వి మృధో జహి వి వృత్రస్యహనూ రుజ ।
వి మన్యుమిన్ద్ర వృత్రహన్నమిత్ర స్యాభిదాసతః ॥ 3 ॥

పదము :

వి । రక్షః । వి । మృధః । జహి । వృత్రస్య । హనూఇతి । రుజ ।
వి । మన్యుమ్ । ఇన్ద్ర । వృత్రఽహన్ । అమిత్రస్య । అభిఽదా
సతః ॥ 3 ॥

అనువాదం :

ఓ వృత్రసంహారి ! నీవు రక్షకుడవై
బాధకులను వినష్టం చెయ్యి.
అలాగే యుద్ధంలో మాకు జయం చేకూర్చు.
శత్రు కపోలాలను విదారణం చెయ్యి.
మమ్ములను చుట్టుముట్టే
శత్రుక్రోధాన్ని కూడా నిగ్రహించు. ॥ 3 ॥

మంత్రము;

అపేన్ద్ర ద్విషతో మనోఽప జిజ్ఞాసతో వధమ్ ।
వి మహ చ్ఛర్మ యచ్ఛ వరీయో యావయా వధమ్ ॥ 4 ॥

పదము :

అప । ఇన్ద్ర । ద్విషతః । మనః । అప । జిజ్ఞాసతః । వధమ్ ।
వి । మహత్ । శర్మ । యచ్ఛ । వరీయః । యవయ । వధమ్॥4॥

ఇతి చతుర్థోఽను వాకః

**అనువాదం :**

ఓ ఇంద్రా! మా విరోధుల క్రూరమనస్సును
అపహతం చెయ్యి.
మములను చంపదలచే పగవాని ఆయుధాన్ని ధ్వంసం చెయ్యి.
మాకు విశేష రక్షణ నివ్వు.
శత్రువుల మారణాయుధాలను పూర్తిగా దూరం చెయ్యి. ॥ 4 ॥

ఇది ఇరవై ఒకటవ సూక్తం

ఇది నాలుగవ అనువాకం

# అనువాకం – 5

## సూక్త – 22

# హృద్రోగ-కామిలల-చికిత్స

**ఋషిః బ్రహ్మ ॥ దేవత – సూర్యుడు, హరిమా, హృద్రోగము ॥ ఛందస్సు, అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 4 ॥**

**వినియోగం : హృద్రోగ కామిలల చికిత్సలో దీనికి వినియోగం.**

మంత్రము.

అను సూర్య ముదయతాం హృద్ద్యోతో హరిమాచతే ।

గో రోహితస్య వర్ణేన తేన త్వా పరి దధ్మసి ॥ 1 ॥

పదము.

అను । సూర్యమ్ । ఉత్ । అయతామ్ । హృత్ఽద్యోతః । హరిమా చ । తే ।

గోః । రోహితస్య । వర్ణేన । తేన । త్వా । పరి । దధ్మసి ॥ 1 ॥

అనువాదం :

ఓ రోగి! నీ హృద్రోగము, నీ కామిలా రోగము (కామెర్లు)
సూర్యునివైపు ఉత్క్రమించు గాక!
లోహిత గోవర్ణంతో నిన్ను కప్పివేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

పరి త్వా రోహితై ర్వర్ణై ర్దీర్ఘాయుత్వాయ దధ్మసి ।

యథాయ మరపా అసదథో అహరితో భువత్ ॥ 2 ॥

పదము :

పరి । త్వా । రోహితైః వర్ణైః । దీర్ఘాయుఽత్వాయ । దధ్మసి ।

యథా । అయమ్ । అరపాః । అసత్ । అథో ఇతి । అహరితః । భువత్ ॥ 2 ॥

అనువాదం.

ఓ వ్యాధితుడా! నిన్ను లోహితవర్ణంతో
ఆలేపనం చేస్తున్నాను.
ఈ చికిత్సతో అపగత పాపుడైన రోగి
దీర్ఘాయుష్మంతుడగు గాక!
పాపక్షయానంతరం
ఆ రోగజనితమైన హరిద్వర్ణం తొలగి పోవుగాక! ॥ 2 ॥

మంత్రము.

యా రోహిణీర్దేవత్యా౩

గావో యా ఉత రోహిణీః ।

రూపం రూపం వయోవయ

స్తాభిష్ట్వా పరి దధ్మసి ॥ 3 ॥

పదము:

యాః । రోహిణీః । దేవత్యాఽః ।

గావః । యాః । ఉత । రోహిణీః ।

రూపమ్ఽరూపమ్ । వయఃఽవయః ।

తాభిః । త్వా । పరి । దధ్మసి ॥ 3 ॥

అనువాదం.

దేవతా సంబంధమైన లోహిత వర్ణ సంయుతాలైన
కామధేన్వాదులు కలవు.

అలాగే మానవులకు సంబంధించిన కపిల గోవులు కలవు
ఆరంటి రూపము, యౌవనము
పరిగ్రహించి, ఓ రోగార్తుడా!
నిలో ప్రవేశింప జేస్తున్నాము ॥ 3 ॥

మంత్రము :

శుకేషు తే హరిమాణం
రోపణాకాసు దధ్మసి ।
అథో హారిద్రవేషు తే
హరిమాణం ని దధ్మసి ॥ 4 ॥

పదము :

శుకేషు । తే । హరిమాణమ్ ।
రోపణాకాసు । దధ్మసి ।
అథో ఇతి । హారిద్రవేషు । తే ।
హరిమాణమ్ । ని । దధ్మసి ॥ 4 ॥

అనువాదం :

ఓ రోగార్తుడా! నీ శరీరం లోని రోగ జనిత హారిద్వర్ణం
చిలుకల లోను, రోపణకములనే
పక్షులలోను ప్రవేశ పెడుతున్నాము.
అలాగే గోపితనకములనే

పక్షివిశేషములలోను
నీ హరిద్వర్ణాన్ని ప్రవేశింప జేస్తున్నాము. ॥ 4 ॥

ఇది ఇరవై రెండవ సూక్తం

## సూక్తం - 23

# శ్వేత కుష్ఠునాశన సూక్తం

ఋషిః అథర్వుడు ॥ దేవత వనస్పతులు (రామా, కృష్ణా, అసిక్నీ) ॥ ఛందస్సుః- అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం :- శ్వేతకుష్ఠ నివారణకై చేసే ఆజ్యహోమాదులలో ఈ క్రింది రెండు సూక్తాలను వినియోగిస్తారు.

మంత్రము :

నక్తంజాతాస్యోషధే రామే కృష్ణే అసిక్ని చ ।
ఇదం రజని రజయ కిలాసం పలితం చయత్ ॥ 1 ॥

పదము :

నక్తమ్ఽజాతా । అసి । ఓషధే । రామే । కృష్ణే । అసిక్ని । చ ।
ఇదమ్ । రజని । రజయ । కిలాసమ్ । పలితమ్ । చ । యత్ ॥1॥

అనువాదం :

హరిద్రాఖ్యమైన ఓ ఓషధీ!
నీవు రాత్రిపూట అంకురించినావు.
* ఓ భృంగరాజమా! ఓ ఇంద్రవారుణీ! ఓ నీలీ!
మీ రందఱూ రాత్రిలో ఉత్పన్నమైన వారు.
మీ రి అంగాన్ని పొడలు తొలగించి

* గుంట గలిజేరు

మీ రంగుతో అనులేపనం చేయండి.
అట్లే తెల్లపడి పోయిన వెంట్రుకలను
మీ రంగతో అనులేపనం చేయండి. ॥ 1 ॥

మంత్రము :

కిలాసం చ పలితం చ నిరితో నాశయా పృషత్ ।
ఆ త్వా స్వో విశతాం వర్ణః పరా శుక్లాని పాతయ ॥ 2 ॥

పదము :

కిలాసమ్ । చ । పలితమ్ । చ । నిః । ఇతః । నాశయ । పృషత్ ।
ఆ । త్వా । స్వః । విశతామ్ । వర్ణః । పరా । శుక్లాని । పాతయ ॥ 2 ॥

అనువాదం :

శ్వేత కుష్ఠు పీడితము పలితకేశము అయిన
వ్యాధి దూషిత శరీరం నుంచి
వానిని వేర్పఱచి, ఓ ఓషధులారా ! నిరవశేషం చేయండి.
ఓ రోగీ! తిరిగి నీ పూర్వ వర్ణం నీలో ప్రవేశించు గాక!
శుక్లాది వర్ణాలు దూరానికి తొలగి పోవుగాక! ॥ 2 ॥

మంత్రము :

అసితం తే ప్రలయనమాస్థానమసితం తవ ।
అసిక్న్యస్యోషధే నిరితో నాశయా పృషత్ ॥ 3 ॥

పదము :

అసితమ్ । తే । ప్రఽలయనమ్ । ఆఽస్థానమ్ । అసితమ్ । తవ ।

అసిక్నీ । అసి । ఓషధే । నిః । ఇతః । నాశయ । పృషత్ ॥ 3 ॥

అనువాదం :

ఓ నీలీ! నీ ఉత్పత్తిస్థానం నల్లనిది.
నీ ఆస్థానం నల్లనిది.
ఓ ఓషధీ! నీవు నల్లని దానవు గనుక
ఈ రోగాక్రాన్త శరీరం నుంచి
నీ ఆలేపనం వల్ల తెల్లపొడలను,
నెరసిన వెంట్రుకలను వేరుచేసి వినాశం చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

అస్థిజస్య కిలాసస్య తనూజస్య చ యత్ త్వచి ।
దూష్యా కృతస్య బ్రహ్మణా లక్ష్మ శ్వేతమనీ నశమ్ ॥ 4 ॥

పదము :

అస్థిఽజస్య । కిలాసస్య । తనూఽజస్య । చ । యత్ । త్వచి ।
దూష్యా । కృతస్య । బ్రహ్మణా । లక్ష్మ । శ్వేతమ్ । అనీనశమ్
॥ 4 ॥

అనువాదం :

అస్థిగతము, తనూగతము,
చర్మగతము అయిన కుష్ఠుదోషం,
దానివల్ల కలిగిన చిహ్నాలు
ఈ మంత్రప్రయోగంతో నశింప జేసినాను. ॥ 4 ॥

ఇది ఇరవై మూడవ సూక్తం

## సూక్తం - 24

# కుష్ఠునాశన సూక్తం

ఋషి: బ్రహ్మ ॥ దేవత - అసురీ వనస్పతి ॥ ఛందస్సు: 1,3,4 అనుష్టుప్, 2 నిచృత్ పథ్యాపంక్తి ॥ మంత్రములు: ॥ 4 ॥

మంత్రము :

సుపర్ణో జాతః ప్రథమస్తస్య త్వం పిత్తమ్ ఆసిథ ।

తద్ ఆసురీ యుధా జితా రూపం చక్రే వనస్పతీన్ ॥ 1 ॥

పదము :

సుఽపర్ణః । జాతః । ప్రథమః । తస్య । త్వమ్ । పిత్తమ్ । ఆసిథ ।

తత్ । ఆసురీ । యుధా । జితా । రూపమ్ । చక్రే । వనస్పతీన్

॥ 1 ॥

అనువాదం :

ఓ ఓషధీ! నీవు తొలుత గరుత్మంతుని వలన పుట్టిన దానవు.
తొలుత ఆయనలోని పిత్తాశయంగా ఉన్న దానవు.
ఆ పిత్తాన్ని అసురమాయ యుద్ధం చేసి గెలుచుకొని
దానికి ఓషధుల రూపం కల్పించింది. ॥ 1 ॥

మంత్రము :

ఆసురీ చక్రే ప్రథమేదం కిలాసభేషజమ్

ఇదం కిలాసనాశనమ్ ।

అనీనశత్ కిలాసం సరూపామ్
అకరత్ త్వచమ్ ॥ 2 ॥

పదము :

ఆసురీ । చక్రే । ప్రథమా । ఇదమ్ । కిలాసఽభేషజమ్ ।
ఇదమ్ । కిలాసఽనాశనమ్ ।
అనీనశత్ । కిలాసమ్ । సఽరూపమ్ ।
అకరత్ । త్వచమ్ ॥ 2 ॥

అనువాదం :

ఆ అసుర మాయా రూపమైన స్త్రీ,
ఈ చికిత్సలో ఆదిభూతమై,
ఈ గరుత్మంతుని పిత్తంతో ఏర్పడిన
నీల్యాది ఔషధాన్ని చేసినది.
ఇది కిలాసరోగ నాశకమైనది.
దానిని ప్రయోగించడం వల్ల
ఈ కుష్ఠును నాశనం చేసినది.
అలాగే చర్మాన్ని సమానరూపంగా చేసినది. ॥ 2 ॥

మంత్రము :

సరూపా నామ తే మాతా సరూపో నామ తే పితా ।
సరూపకృత్ త్వమోషధే సా సరూపమిదం కృధి ॥ 3 ॥

**పదము :**

సఽరూపా । నామ । తే । మాతా । సఽరూపః । నామ । తే । పితా ।

సరూపఽకృత్ । త్వమ్ । ఓషధే । సా । సఽరూపమ్ । ఇదమ్ ।

కృధి ॥ 3 ॥

**అనువాదం :**

ఓ ఓషధీ! నీ తల్లి అయిన భూమి
నీతో సమాన రూపం కలది.
నీ తండ్రి ఆకాశం కూడ నల్లనిదే.
ఓ ఓషధీ! నీవు సృష్టించిన పదార్థాన్ని
సమానరూపంగానే చేసినావు.
నీవీ అంగాన్ని నీతో సమానవర్ణం కలదిగా చెయ్యి. ॥ 3 ॥

**మంత్రము :**

శ్యామా సరూపంకరణీ పృథివ్యా అధ్యుద్భృతా ।

ఇదమూ షు ప్ర సాధయ పునా రూపాణి కల్పయ ॥ 4 ॥

**పదము :**

శ్యామా । సరూపమ్ఽకరణీ । పృథివ్యాః । అధి । ఉత్ఽభృతా ।

ఇదమ్ । ఓంఇతి । సు । ప్ర । సాధయ । పునః । రూపాణి । కల్పయ

॥ 4 ॥

**అనువాదం :**

శ్యామ వర్ణమైన నీవు
అసమానమైన దానిని

సమాన రూపం చేస్తూ
భూమిపై ఉత్పన్నమైనావు.
ఓ ఓషధీ! నీవీ రోగ దూషితమైన
అంగాన్ని రోగ వినిర్ముక్తం చెయ్యి. ॥ 4 ॥

ఇది ఇరవై నాలుగవ సూక్తం

## సూక్తం - 25

# శీతజ్వర దూరీకరణ సూక్తం

ఋషి. భృగువు. అంగిరసుడు ॥ దేవత యక్ష్మనాశనుడైన అగ్ని ॥ ఛందస్సు :-
1 త్రిష్టుప్, 2, 3 విరాడ్ గర్భా త్రిష్టుప్. 4 పురోఽనుష్టుప్ ॥
మంత్రములు : ॥ 4 ॥

వినియోగం :- శీతజ్వరాది శాంతికై చేసే చికిత్సలో దీనికి వినియోగం. ఇనుప గొడ్డలిని కాచి నీటిలో వేసి ఆ నీటితో రోగికి అభిషేకం చేస్తారు.

మంత్రము :

యదగ్నిరాపో అదహత్ ప్రవిశ్య
యత్రాకృణ్వన్ ధర్మధృతో నమాంసి ।
తత్ర త ఆహుః పరమం జనిత్రం
సనః సంవిద్వాన్ పరి వృఙ్గ్ధి తక్మన్ ॥ 1 ॥

పదము :

యత్ । అగ్నిః । ఆపః । అదహత్ । ప్రఽవిశ్య ।
యత్ర । అకృణ్వన్ । ధర్మఽధృతః । నమాంసి ।

తత్ర । తే । ఆహుః । పరమమ్ । జనిత్రమ్ ।

సః । నః । సమ్ఽవిద్వాన్ । పరి । వృఙ్గ్ధి । తక్మన్ ॥ 1 ॥

**అనువాదం :**

తప్తపరశుద్వారా అగ్ని
నీటిలో ప్రవేశించి నీటిని వేడిచేస్తున్నాడు.
ఆ నీటితో తడపడం వల్ల ఓ జ్వరమా!
నీవా అగ్నిని తెలుసుకొని మా శరీరాలను పరివర్జించు.
ధర్మానుష్ఠాన పరులైన యజమానులు
ఈ అగ్నిలో అన్నాదులను ఆహుతి చేస్తున్నారు.
అలాంటి అగ్నిలో ఓ జ్వరమా! నీవు జనించితివని చెప్తారు ॥1॥

**మంత్రము :**

యద్యర్చిర్యది వాసి శోచిః

శకల్యేషి యది వా తే జనిత్రమ్ ।

హ్రూడుర్నామాసి హరితస్య దేవ

స నః సంవిద్వాన్ పరి వృఙ్గ్ధి తక్మన్ ॥ 2 ॥

**పదము :**

యది । అర్చిః । యది । వా । అసి । శోచిః ।

శకల్యఽఏషి । యది । వా । తే । జనిత్రమ్ ।

హ్రూడః । నామ । అసి । హరితస్య । దేవ ।

సః । నః । సమ్ఽవిద్వాన్ । పరి । వృఙ్గ్ధి । తక్మన్ ॥ 2 ॥

అనువాదం:

ఓ జ్వరమా! నీవు ఉష్ణగుణయుక్తమైతే,
శరీర సంతాప కారిణివైతే,
అగ్నిలో జన్మించిన దానవైతే,
ఓ దేవా! నీవు రోగిలో పీతవర్ణాన్ని కల్పిస్తావు.
ఓ తక్మన్! (ఓ శీతజ్వరమా!)
నీవు మా శరీరాలను వదలివెళ్ళు.
నీపేరు "హ్రూడువు" అని హరితవర్ణంవల్ల ప్రసిద్ధమైనది. ॥2॥

మంత్రము:

యది శోకో యది వాభిశోకో
యది వా రాజ్ఞో వరుణస్యాసి పుత్రః ।
హ్రూడర్నామాసి హరితస్య దేవ
స నః సంవిద్వాన్ పరివృఙ్గ్ధి తక్మన్ ॥ 3 ॥

పదము:

యది । శోకః । యది । వా । అభిఽశోకః ।
యది । వా । రాజ్ఞః । వరుణస్య । అసి । పుత్రః ।
హ్రూడుః । నామ । అసి । హరితస్య । దేవ ।
సః । నః । సమ్ఽవిద్వాన్ । పరి । వృఙ్గ్ధి । తక్మన్ ॥ 3 ॥

అనువాదం:

ఓ శీతజ్వరమా! నీవు శరీరాన్ని దహించువాడవైతే,
సర్వ శరీరాన్ని పాలిపోవునట్లు చేయువాడవైతే.

నీవు పాపకారులను శిక్షించే వరుణునకు పుత్రుడ వగుదువు.
నీపేరు 'హ్రూడువు' అని హరితవర్ణం వల్ల ప్రసిద్ధమైనది.
ఓ దేవా! నీవు రోగిలో పీత వర్ణాన్ని కల్పిస్తావు.
ఓ తక్మన్! (ఓ శీతజ్వరమా!) నీవు మా
శరీరాలను వదలి వెళ్ళు. ॥ 3 ॥

మంత్రము:

నమః శీతాయ తక్మనే
నమో రూరాయ శోచిషే కృణోమి ।
యో అన్యేద్యురుభయద్యురభ్యేతి
తృతీయకాయ నమో అస్తు తక్మనే ॥ 4 ॥

పదము:

నమః । శీతాయ । తక్మనే ।
నమః । రూరాయ । శోచిషే । కృణోమి ।
యః । అన్యేద్యుః । ఉభయఽద్యుః । అభిఽఏతి ।
తృతీయకాయ । నమః । అస్తు । తక్మనే ॥ 4 ॥

అనువాదం:

శీతజనకమైన ఓ జ్వరమా! నీకు నమస్కారం.
శీతానంతరంశరీరాన్ని కాలిపోజేసేజ్వరమా! నీకు నమస్కారం
అలాగే రోజు విడిచి, రోజువచ్చే శీతజ్వరానికి,
రెండు రోజులకు ఒకసారి వచ్చే శీతజ్వరానికి,

మూడురోజులు విడిచి వచ్చే జ్వరానికి,
ఈ సర్వ జ్వరాలకు నమస్కారం ॥ 4 ॥

ఇది ఇరవై ఐదవ సూక్తం

## సూక్తం–26

# సుఖప్రాప్తి సూక్తం

ఋషి: బ్రహ్మ ॥ దేవత : మంత్రాలలో పేర్కొన్న ఇంద్రాదులు ॥ ఛందస్సు : 1, 3 గాయత్రీ, 2 త్రిపదా సామ్నీ త్రిష్టుప్ (ఏకావసానా), 4 పాదనిచృత్ గాయత్రీ (ఏకావసానా)॥ మంత్రములు : ॥ 4 ॥

**వినియోగం:–** ఖడ్గాది సర్వశస్త్ర నివారణకై చేసే హోమంలో, చంపడానికి వచ్చిన శత్రువును చూచినప్పుడు పఠించడానికి, దుశ్శకున దర్శనంలో పఠించడానికి, విజయ స్వస్త్యయన కర్మలో దీని వినియోగం. సుఖప్రాప్తికై నిద్రించేముందు వీనిని పఠించి, ముఖాన్ని తుడుచుకొని పడుకోవాలి. అలాగే నిద్రలేవగానే పఠించాలి. ఉపాకర్మలో, ఆజ్యహోమంలో కూడ ఈ చెప్పబోవు రెండు సూక్తాలకు వినియోగం

మంత్రము :

ఆరేఽసావస్మ దస్తు హేతిర్దేవాసో అసత్ ।
ఆరే అశ్మా యమస్యథ ॥ ॥ 1 ॥

పదము :

ఆరే । అసౌ । అస్మత్ । అస్తు । హేతిః । దేవాసః । అసత్ ।
ఆరే । అశ్మా । యమ్ । అస్యథ ॥ 1 ॥

అనువాదం :

ఓ దేవతలారా!
దూరంలో కన్పిస్తున్న
శత్రుప్రయుక్తమైన ఖడ్గం
మా దగ్గఱకు రాకుండా
దూరంలో పడిపోవుగాక!
ఓ శత్రువులారా!
మాపై మీరు వేసే రాళ్ళు
మాకు దూరంలోనే పడిపోవు గాక! ॥ 1 ॥

మంత్రము :

సఖా సా వస్మభ్య మస్తు రాతిః
సఖేన్ద్రో భగః సవితా చిత్రరాధాః ॥ 2 ॥

పదము :

సఖా । అసా । అస్మభ్యమ్ । అస్తు । రాతిః ।
సఖా । ఇన్ద్రః । భగః । సవితా చిత్రఽరాధాః ॥ 2 ॥

అనువాదం :

ఈ ఆకసంలో కనిపించే సూర్యుడు
మా కార్య సిద్ధికై మాకు స్నేహితు డగు గాక!
అలాగే ఇంద్రుడు, భగుడు, సవిత,
సమస్త ధన సంపత్సంసిద్ధికై మాకు మిత్రులగుదురుగాక! ॥2॥

మంత్రము :

యూయం నః ప్రవతో నపాన్మరుతః సూర్యత్వచసః ।
శర్మ యచ్ఛాథ సప్రథాః ॥ 3 ॥

పదము :

యూయమ్ । నః । ప్రఽవతః । నపాత్ । మరుతః ।

సూర్యఽత్వచసః ।

శర్మ । యచ్ఛాథ। సఽప్రథాః ॥ 3 ॥

అనువాదం :

అకాలంలో వర్షపాతం కాకుండా
ఆకాశంలోనే ఆపే పర్జన్యుడు మమ్ము కాపాడుగాక !
ఓ మరుత్తులారా !
సూర్యుని చర్మం వంటి చర్మంగల మీ రందరూ
మాకు అతి సుఖకరమైన శరణాన్ని కల్పించండి. ॥ 3 ॥

మంత్రము :

సుషూదత మృడత మృడయా న

స్తనూభ్యో మయస్తోకేభ్య స్కృధి ॥ 4 ॥

పదము :

సు సూదత । మృడత । మృడయ । నః ।

తనూభ్యః । మయః । తోకేభ్యః । కృధి ॥ 4 ॥

అనువాదం :

ఓ ఇంద్రాది దేవతలారా !
మాపై శత్రువులు విడిచే బాణాదులను,
మా నుండి దూరంగా పడవేయండి.
అలాగే మాకు సుఖాన్ని కల్పించండి.

ఓ ఇంద్రాది దేవతలారా! మమ్ములను సుఖపెట్టండి.
మా శరీరాలకు, పుత్రాదులకు సుఖం కల్పించండి. ॥ 4 ॥

ఇది ఇరవై ఆరవ సూక్తం.

## సూక్తం – 27

ఋషి. అధర్వుడు ; (స్వస్త్యయన కాముడు) ॥ దేవత , ఇంద్రాణి ॥ ఛందస్సు:
1 పథ్యాపంక్తి, 2,4 అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 4 ॥

మంత్రము :

అమూః పారే పృదాక్వ౨స్త్రిషప్తా నిర్జరాయవః ।
తాసాం జరాయుభిర్వయమక్ష్యా౩వపి
వ్యయామస్యఘాయోః పరిపన్థినః ॥ 1 ॥

పదము,

అమూః । పారే । పృదాక్వః । త్రిఽసప్తాః । నిఃఽజరాయవః ।
తాసామ్ । జరాయుఽభిః । వయమ్ । అక్ష్యౌ । అపి ।
వ్యయామసి । అఘఽయోః । పరిఽపన్థినః ॥ 1 ॥

అనువాదం.

ఈ కన్పించే పృదాకులు (సర్పజాతులు,) త్రిసప్తములు,*
జరారహిత దేవతల వలె నాగలోకంలో నివసించేవి.
వాని కంచుకములతో ఆచ్ఛాదితులమై,
మమ్ములను హింసింపదలచిన మా శత్రువుల కళ్ళకు
మేము కన్పించకుందుము గాక! ॥ 1 ॥

---

* మొదటి పేజీ చూడుడు.

మంత్రము :

విషూచ్యేతు కృన్తతీ పినాకమివ బిభ్రతీ ।

విష్వక్ పునర్భువా మనోసమృద్ధా అఘాయవః ॥ 2 ॥

పదము :

విషూచీ । ఏతు । కృన్తతీ । పినాకమ్ఽఇవ । బిభ్రతీ ।

విష్వక్ । పునఃఽభువాః । మనః । అసమ్ఽఋద్ధాః । అఘఽయవః ॥ 2 ॥

**అనువాదం :**

పినాకము వంటి ఆయుధాన్ని ధరించి
శత్రు విదారణం చేస్తూ వచ్చే
శత్రుసేన ఛిన్నాభిన్నమై పోవుగాక !
ఒకవేళ అది తిరిగి సంఘటితమైతే
దాని మనసు అస్తవ్యస్తమగుగాక !
ఇలా సంభ్రాంతమైన సేనను నడిపే
పరాపకార పరాయణులు సమృద్ధిరహితు లగుదురుగాక ! ॥ 2 ॥

మంత్రము :

న బహవః సమశకన్ నార్భకా అభి దాధృషుః ।

వేణోరద్గా ఇవాభితోఽసమృద్ధా అఘాయవః ॥ 3 ॥

పదము :

న । బహవః । సమ్ । అశకన్ । న । అర్భకాః । అభి । దధృషుః ।

వేణోః । అద్గాఃఽఇవ । అభితః । అసమ్ఽఋద్ధాః । అఘఽయవః ॥ 3 ॥

అనువాదం :

శత్రువులు అధిక సంఖ్యాకులైనా
మమ్ములను గెలుచుటకు అశక్తు లగుదురు గాక !
అల్ప సంఖ్యాకులైన శత్రుసేనకు కూడా
మేము దుర్నిరీక్ష్యుల మగుదుముగాక !
వెదురునకు చుట్టూ మొలిచిన శాఖలవలె
విరోధులు సమృద్ధి రహితు లగుదురుగాక ! ॥ 3 ॥

మంత్రము :

ప్రేతం పాదౌప్రస్ఫురతం వహతం పృణతో గృహాన్ ।
ఇన్ద్రాణ్యేతు ప్రథమా జీతాముషితా పురః ॥ 4 ॥

పదము :

ప్ర । ఇతమ్ । పాదౌ । ప్ర । స్ఫురతమ్ । వహతమ్ । పృణతః ।
గృహాన్ ।
ఇన్ద్రాణీ । ఏతు । ప్రథమా । అజీతా । అముషితా । పురః ॥ 4 ॥

అనువాదం :

ఓ పాదములారా ! మీ గమనం వేగవంతం కానీ.
మా ఇష్టఫలదానంతో సంతృప్తులై మీరు
మమ్ములను ఉద్దిష్ట పరనరపాల గృహాన్ని చేర్తురు గాక !
మా రక్షణకై మాసేన ముందు ఇంద్రాణి నడచుగాక !
ముందు నిలిచి అజేయురాలై
అపహరింప వీలులేనిదై ఆమె మమ్మనుగ్రహించుగాక ! ॥ 4 ॥

ఇగి ఇరవై ఏడవ సూక్తం

## సూక్తం - 28

# దంష్టనాశన సూక్తం

ఋషి: చాతనుడు ॥ దేవత : 1,2 (పూర్వార్ధమునకు) అగ్ని : 2 (ఉత్తరార్థము నుండి) - 4 యాతుధానులు ॥ ఛందస్సు : 1, 2 అనుష్టుప్, 3 విరాట్ పథ్యాబృహతీ, 4 పథ్యాపంక్తి ॥ మంత్రములు : ॥ 4 ॥

వినియోగం:- ఉద్వేగ నివారణార్థమై చేసే మణిబంధనాది కర్మలలో దీనికి వినియోగం.

మంత్రము :

ఉప ప్రాగాద్ దేవో అగ్నీ రక్షోహామీవచాతనః ।

దహన్నప ద్వయావినో యాతుధానాన్ కిమీదినః ॥ 1 ॥

పదము :

ఉప । ప్ర । అగాత్ । దేవః । అగ్నిః । రక్షఃఽహా । అమీవఽచాతనః ।

దహన్ । అప । ద్వయావినః । యాతుఽధానాన్ । కిమీదినః ॥1॥

అనువాదం :

పిశాచాది హంత రోగనాశకుడు అయిన అగ్ని
వాచిక, కాయిక హింసనారూపుడై
రంధ్రాన్వేషణం చేసే యాతుధానులను
దహింప జేస్తూ, ఉద్వేగ కారులైన రాక్షసుల
వినాశార్థమై ఉద్విగ్నపురుషుని సమీపించినాడు. ॥ 1 ॥

మంత్రము :

ప్రతి దహ యాతుధానాన్ ప్రతి దేవ కిమీదినః ।

ప్రతీచీః కృష్ణవర్తనే సం దహ యాతుధాన్యః ॥ 2 ॥

**పదము :**

ప్రతి । దహ । యాతుఽధానాన్ । ప్రతి । దేవ । కిమీదినః ।
ప్రతీచీః । కృష్ణఽవర్తనే । సమ్ । దహ । యాతుఽధాన్యః ॥2॥

**అనువాదం :**

ఓ అగ్నీ ! రాక్షసులను భస్మీపటలం చెయ్యి.
ఓ దేవా ! పిశాచాది విశేషాలను దహింపజెయ్యి,
ఓ అగ్నీ ! ప్రాణులకు ప్రతికూలురైన యాతుధానులను
నిరవశేషం చెయ్యి. ॥ 2 ॥

**మంత్రము :**

యా శశాప శపనేన యాఘం మూరమాదధే ।
యా రసస్య హరణాయ జాత మారేభే తోకమత్తు సా ॥3॥

**పదము :**

యా । శశాప । శపనేన । యా । అఘమ్ । మూరమ్ । అఽదధే ।
యా । రసస్య । హరణాయ । జాతమ్ । ఆఽరేభే । తోకమ్ ।
అత్తు । సా ॥ 3 ॥

**అనువాదం :**

యాతుధాని ఆక్రోశంతో శపించినది.
మఱొక యాతుధాని సర్వకిల్బిషములకు
మూలమైన పాపాన్ని పరిగ్రహించినది.

మఱొక యాతుధాని మా సంతాన రక్తాన్ని
త్రాగుటకు ప్రారంభించినది.
ఈ సర్వయాతుధాన వర్గమూ
మా శత్రు సంతానాన్ని భక్షించుగాక! ॥ 3 ॥

మంత్రము :

పుత్రమత్తు యాతుధానీః స్వసారముత నప్త్యఽమ్ ।
అథామిథో వికేశ్యో౩ వి ఘ్నతాం
యాతుధాన్యో౩వి తృహ్యన్తామరాయ్యఽః ॥ 4 ॥

పదము :

పుత్రమ్ । అత్తు । యాతుఽధానీః । స్వసారమ్ । ఉత । నప్త్యఽమ్ ।
అథ । మిథః । విఽకేశ్యఽః । వి । ఘ్నతామ్ ।
యాతుఽధాన్యఽః । వి । తృహ్యన్తామ్ । అరాయ్యఽః ॥ 4 ॥

ఇతి పంచమోఽనువాకః

అనువాదం :

ఆ యాతుధాని తన పుత్రుని తానే భక్షించుగాక!
తన భగినిని తానే భక్షించుగాక!
తన సంతానాన్ని తానే భక్షించుగాక!
తదనంతరం ఆ యాతుధానులు
వెంట్రుకలు విరబోసుకొని
ఒకరినొకరు చంపు కొందురు గాక!

అలాగే దాన ప్రతిబంధకాలైన పిశాచులు
పరస్పరం పోరాడి చత్తురుగాక!

ఇది ఇరవై ఎనిమిదవ సూక్తం

ఇది ఐదవ అనువాకం

# అనువాకం : 6

## సూక్తం - 29

## రాజ్య సంవర్ధన సూక్తం

ఋషి: వసిష్ఠుడు ॥ దేవత : బ్రహ్మణస్పతి, అభీవర్తమణి ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥ మంత్రములు: ॥ 6 ॥

వినియోగం:- శత్రు నిర్జిత రాజ్యాభివృద్ధికి చేసే ప్రక్రియలో దీనికి వినియోగం.

మంత్రము :

అభీవర్తేన మణినా యేనేన్ద్రో అభివావృధే ।
తేనాస్మాన్ బ్రహ్మణస్పతేఽభి రాష్ట్రాయ వర్ధయ ॥ 1 ॥

పదము :

అభిఽవర్తేన । మణినా । యేన । ఇన్ద్రః । అభిఽవవృధే ।
తేన । అస్మాన్ । బ్రహ్మణః । పతే । అభి । రాష్ట్రాయ । వర్ధయ ॥ 1 ॥

అనువాదం :

ఏ చక్రనేమి నిర్మితమైన మణితో
ఇంద్రుడు సర్వతః ప్రవృద్ధుడైనాడో,

ఓ బృహస్పతీ!
ఆ మహిమోపేతమైన మణితో
శత్రుపీడితులైన మమ్ములను స్వరాజ్యాభివృద్ధికై
కరి తురగ ధనాదులతో అభివృద్ధి చెందించు. ॥ 1 ॥

**మంత్రము :**

**అభివృత్య సపత్నానభి యా నో అరాతయః ।**

**అభి పృతన్యన్తం తిష్ఠాభి యో నో దురస్యతి ॥ 2 ॥**

**పదము :**

**అభిऽవృత్య । సऽపత్నాన్ । అభి । యాః । నః । అరాతయః ।**

**అభి । పృతన్యన్తమ్ । తిష్ఠ । అభి । యః । నః । దురస్యతి ॥2॥**

**అనువాదం .**

ఓ అభీవర్త మణీ!* మా సహజ శత్రువులకు
అభిముఖంగా నిలబడు.
మా రాజ్యాన్ని అపహరించిన శత్రువులకు
అభిముఖంగా నిలువు.
యుద్ధోన్ముఖులైన శత్రువునకు అభిముఖంగా నిలబడు.
అలాగే మాపై అభిచారాది రూప క్షుద్ర కర్మలను
చేయ తలపెట్టిన శత్రువుకు ఎదురొడ్డి నిలబడు. ॥ 2 ॥

**మంత్రము .**

**అభి త్వా దేవః సవితాభి సోమో అవీవృధత్ ।**

**అభి త్వా విశ్వా భూతాన్యభీవర్తో యథాససి ॥ 3 ॥**

---

* చక్రనేమి నిర్మిత మణి

పదము :

అభి । త్వా । దేవః । సవితా । అభి । సోమః । అవీవృధత్ ।

అభి । త్వా । విశ్వా । భూతాని । అభిఽవర్తః । యథా । అససి

॥ 3 ॥

అనువాదం :

ఓ మణీ! ద్యోతనాత్మకుడైన సవిత అభివృద్ధి కారకుడైనాడు.
అలాగే సోముడు మాకు అభ్యుదయం కల్పించినాడు.
నిన్ను నిఖిల భూతములు అభివృద్ధి చెందించినవి.
నిన్ను ధరించిన పురుషునికి
సర్వత్ర అభివృద్ధి కారిణి వవుతున్నావు. ॥ 3 ॥

మంత్రము :

అభీవర్తో అభిభవః సపత్నక్షయణో మణిః ।

రాష్ట్రాయ మహ్యం బధ్యతాం సపత్నేభ్యః పరాభువే ॥ 4 ॥

పదము :

అభిఽవర్తః । అభిఽభవః । సపత్నఽక్షయణః । మణిః ।

రాష్ట్రాయ । మహ్యమ్ । బధ్యతామ్ । సఽపత్నేభ్యః । పరా

ఽభువే ॥ 4 ॥

అనువాదం :

శత్రు పరాభవం చేసే సపత్నక్షయకరమైన ఓ మణీ!
నాచేతి నలంకరింతువు గాక!
రాజ్యాభివృద్ధికి, శత్రుపరాభవానికి
నేను కట్టుకొన్న ఈ మణి కారణ మగుగాక! ॥ 4 ॥

మంత్రము :

ఉదసౌ సూర్యో అగాదుదిదం మామకం వచః ।
యథాహం శత్రుహోఽసాన్యసపత్నః సపత్నహా ॥ 5 ॥

పదము ;

ఉత్ । అసౌ । సూర్యః । అగాత్ । ఉత్ । ఇదమ్ । మామకమ్ । వచః ।
యథా । అహమ్ । శత్రుఽహః । అసాని । అసపత్నః । సపత్నఽహా ॥ 5 ॥

అనువాదం :

ఈ సూర్యుడు ఉదయించినాడు.
ఈ నా వాక్యం ఉదయించినది.
అభీవర్తమణి ధారినైన నేను శత్రు హంతకుడ నౌనట్లు
ఈ ఉదయం జరిగింది.
అందువల్ల నేను శత్రురహితుడ నవుతున్నాను.
శత్రు హంతకుడ నవుతున్నాను. ॥ 5 ॥

మంత్రము :

సపత్నక్షయణో వృషాభిరాష్ట్రో విషాసహిః ।
యథాహమేషాం వీరాణాం విరాజాని జనస్య చ ॥ 6 ॥

పదము :

సపత్నఽక్షయణః । వృషా । అభిఽరాష్ట్రః । విఽససహిః ।

యథా । అహమ్ । ఏషామ్ । వీరాణామ్ । వి౨రాజాని । జనస్య ।
చ ॥ 6 ॥

**అనువాదం**

శత్రు నాశకుడును, ప్రజలకు ఇష్టఫలదాయకుడును,
స్వపర రాష్ట్ర అధిపతిని అయి, పదే పదే పరులను
అభిభవించే వాడన వుతున్నాను.
ఈ మణి ధారినైన నేను శత్రు బాధలను, శత్రుభటులను
స్వపరజనాన్ని నిగ్రహించువాడ నైనాను. ॥ 6 ॥

ఇది ఇరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 30

# ఆయుష్య వర్ధన సూక్తం

**ఋషి:** అథర్వుడు (ఆయుష్కాముడు)॥ దేవత : విశ్వేదేవులు ॥ ఛందస్సు : 1, 2, 4 త్రిష్టుప్ ; 3 శాక్వరగర్భావిరాడ్ జగతీ ॥ మంత్రములు : ॥ 4 ॥

**వినియోగం :** ఆయుష్యకర్మలో, స్థాలీపాకంలో, ఘృతపండత్రయాన్ని వేసి అభిమంత్రించి, దానిని తినవలెను. ఉపనయన కర్మలో వటువు నాభిదేశాన్ని పట్టుకొని జపింపవలెను. ఆయుష్కాముడు చేసే వైశ్వదేవ యాగంలో, అధ్యాయోత్సర్జన కర్మలో చేసే ఆజ్య హోమంలో, ఐరావతి మహాశాన్తిలో, పుష్పాభిషేకంలో, దర్శ పౌర్ణ మాసాదులలో వషట్కారానుమంత్రణంలో దీనికి విని యోగం.

మంత్రము :

విశ్వే దేవా వసవో రక్షతేమ-

ముతాదిత్యా జాగృత యూయమస్మిన్ ।

మేమం సనాభిరుత వాన్యనాభి

ర్మేమం ప్రాపత్ పౌరుషేయో వధో యః ॥ 1 ॥

పదము :

విశ్వే । దేవాః । వసవః । రక్షత । ఇమమ్ ।

ఉత । ఆదిత్యాః । జాగృత । యూయమ్ । అస్మిన్ ।

మా । ఇమమ్ । సఽనాభిః । ఉత । వా । అన్యఽనాభిః ।

మా । ఇమమ్ । ప్ర । అపత్ । పౌరుషేయః । వధః । యః ॥ 1 ॥

అనువాదం :

ఓ విశ్వేదేవతలారా ! ఓ వసుదేవతలారా !
మీా రందరూ ఈ ఆయుష్కాముడైన పురుషుని రక్షించండి.
మఱి ఓ ఆదిత్యులారా !
మీారు కూడ ఇతని రక్షణకై జాగృతులు కండి.
దాయాదులు కాని, ఇతర శత్రువులు కాని,
ఈ పురుషుని హింసించుటకై దరిచేరకుందురు గాక !
పురుషకృతమైన హింస
ఈ ఆయుష్కాముని దరిచేర కుండుగాక ! ॥ 1 ॥

మంత్రము :

యే వో దేవాః పితరో యే చ పుత్రాః

సచేతసో మే శృణుతేదముక్తమ్ ।

సర్వేభ్యో వః పరి దదామ్యేతం
స్వస్త్యేఽనం జరసే వహాథ ॥ 2 ॥

పదము :

యే । వః । దేవాః । పితరః । యే । చ । పుత్రాః ।
సఽచేతసః । మే । శృణుత । ఇదమ్ । ఉక్తమ్ ।
సర్వేభ్యః । వః । పరి । దదామి । ఏతమ్ ।
స్వస్తి । ఏనమ్ । జరసే । వహాథ ॥ 2 ॥

అనువాదం :

ఓ దేవతలారా !
మీ పితరులు, పుత్రులు అందరూ ఈ ఆయుష్కాముని
విషయంలో సమాన మనస్కులై
నేను చెప్పే ఈ మాటను వినండి.
ఈ పురుషుని రక్షణార్థమై మీకు అర్పిస్తున్నాను.
ఇతనిని వృద్ధుడయ్యేదాకా రక్షించండి. ॥ 2 ॥

మంత్రము :

యే దేవా దివి ష్ఠ యే పృథివ్యాం యే
అన్తరిక్ష ఓషధీషు పశుష్వప్స్వ 1 న్తః ।
తే కృణుత జరసమాయురస్మై
శతమన్యాన్ పరి వృణక్తు మృత్యూన్ ॥ 3 ॥

పదము :

యే । దేవాః । దివి । స్థ । యే । పృథివ్యామ్ । యే ।

అన్తరిక్షే । ఓషధీషు । పశుషు । అప్ఽసు । అన్తః ।

తే । కృణుత । జరసమ్ । ఆయుః । అస్మై ।

శతమ్ । అన్యాన్ । పరి । వృణక్తు । మృత్యూన్ ॥ 3 ॥

అనువాదం :

ఓ దేవతలారా! సూర్యాదులైన మీరు దివిలో ఉన్నారు.
అగ్న్యాదులైన మీరు భూలోకంలో ఉన్నారు.
వాయు ప్రభృతులైన మీరు అంతరిక్షంలో ఉన్నారు.
ఓషధులలో, పశువులలో, ఉదకములలో మీరున్నారు.
మీ రందరూ ఈ ఆయుష్కాముడైన పురుషునకు
వృద్ధు డయ్యేదాకా ఆయుస్సు నివ్వండి.
శతాధిక అపమృత్యువులను నివారించండి. ॥ 3 ॥

మంత్రము :

యేషాం ప్రయాజా ఉత వానుయాజా

హుతభాగా అహుతాదశ్చ దేవాః ।

యేషాం వః పఞ్చ ప్రదిశో విభక్తా-

స్తాన్ వో అస్మై సత్రసదః కృణోమి ॥ 4 ॥

పదము :

యేషామ్ । ప్రఽయాజాః । ఉత । వా । అనుఽయాజాః ।

హుత౽భాగాః । అహుత౽అదః । చ । దేవాః ।
యేషామ్ । వః । పఞ్చ । ప్ర౽దిశః । వి౽భక్తాః ।
తాన్ । వః । అస్మై । సత్ర౽సదః । కృణోమి ॥ 4 ॥

అనువాదం :

ప్రధాన పంచయాగ భాగాల్ని అనుభవించేవారు,
యాగత్రయ భోక్తలు, ఇతర చరు పురోడాశాదులలో
హవిర్భాగాన్ని పొందేవారు, వ్రేల్చని హవిస్సును
గ్రహించేవారు అయిన ఓ ఇంద్రాది సర్వదేవతలారా !
మీకై పంచ సంఖ్యాకములైన ప్రాచ్యాదులు
విభక్తములై ఉన్నవి.
మీ అందఱను ఈ ఆయుష్కామునిలో
ఆవహింపజేస్తున్నాను. ॥ 4 ॥

ఇది ఋషైరయప సూక్తం

## సూక్తం – 31

# దిక్పాలక - సూక్తం

ఋషి: బ్రహ్మ ॥ దేవత : ఆశాపాలురు (వాస్తోష్పతులు) ॥ ఛందస్సు : 1, 2 అనుష్టుప్ ; 3 విరాట్ త్రిష్టుప్, 4 పరానుష్టుప్ త్రిష్టుప్ ॥ మంత్రములు॥4॥

వినియోగం : నిత్యనైమిత్తిక కామ్యభేదములలో ఇరువది రెండు సవయజ్ఞములు విహితములైనవి. వాటిలో దీనికి వినియోగం. ధూమకేతు దర్శనంలో చేసే కర్మలలో కూడ దీనికి వినియోగం. అలాగే గ్రామ, నగర, దేశ, ప్రాకారాది నిర్మాణాలలో, పాషాణ నికరణలో మూడవమంత్రం తప్ప మిగిలిన మంత్రాలకు వినియోగం, సర్వరోగ భైషజ్యంలో కూడ దీనికి వినియోగం. అశ్వమేధంలో

విడిచిన అశ్వాన్ని అనుమంత్రించడంలో బ్రహ్మ దీనిని పఠిస్తాడు. అద్భుత మహాశాంతిలో దిగ్దేవతాకమైనది మొదటి మంత్రం. ఆఖరు ఋక్కును సర్వస్వస్త్యయన కాముడు రాత్రి పఠించాలి.

మంత్రము :

ఆశానామాశాపాలేభ్యశ్చతుర్భ్యో అమృతేభ్యః ।
ఇదం భూతస్యాధ్యక్షేభ్యో విధేమ హవిషా వయమ్ ॥ 1 ॥

పదము :

ఆశానామ్ । ఆశాఽపాలేభ్యః । చతుఃఽభ్యః । అమృతేభ్యః ।
ఇదమ్ । భూతస్య । అధిఽఅక్షేభ్యః । విధేమ । హవిషా । వయమ్ ॥ 1 ॥

అనువాదం :

ప్రాచ్యాది దిక్పాలకులగు ఇంద్రాదులైన నలుగురకు
అమరులైన జగదధ్యక్షులకు
ఈ హవిస్సుతో పరిచర్య చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

య ఆశానా మాశాపాలాశ్చత్వార స్థన దేవాః ।
తే నో నిర్ఋత్యాః పాశేభ్యో ముఞ్చతాంహసోఅంహసః ॥ 2 ॥

పదము :

యే । ఆశానామ్ । ఆశాఽపాలాః । చత్వారః । స్థన । దేవాః ।

తే । నః । నిః౽బుత్యాః । పాశేభ్యః । ముఞ్చత । అంహసః౽అం
హసః ॥ 2 ॥

అనువాదం :

ఓ నలుగురు దిక్పాలకులారా !
హవిస్సుతో సంతృప్తిపఱచే మమ్ములను 'నిర్ బుతి' అనే
పాపదేవత పాశాలనుంచి విముక్తులను చేయండి. ॥ 2 ॥

మంత్రము :

అస్రామస్త్వా హవిషా యజామ్య
శ్లోణస్త్వా ఘృతేన జుహోమి ।
య ఆశానామాశాపాలస్తురీయో
దేవః స నః సుభూతమేహ వక్షత్ ॥ 3 ॥

పదము .

అస్రామః । త్వా । హవిషా । యజామి ।
అశ్లోణః । త్వా । ఘృతేన । జుహోమి ।
యః । ఆశానామ్ । ఆశా౽పాలః । తురీయః ।
దేవః । సః । నః । సు౽భూతమ్ । ఆ । ఇహ । వక్షత్ ॥ 3 ॥

అనువాదం :

కుబేరదేవా ! అభిమతధనాదుల కోసం
నిన్ను ఆశ్రయిస్తున్నాను.
హవిస్సుతో అర్చిస్తున్నాను.

ఓ దేవా! నిన్నుద్దేశించి రోగదూరుడనై
ఘృతంతో హోమం చేస్తున్నాను.
దిక్పాలురలో నాల్గవ వాడైన ఆ కుబేరుడు మాకు కావలసినంత
ధనాన్ని సన్నిహితం చేయుగాక! ॥ 3 ॥

మంత్రము :

స్వస్తి మాత్ర ఉత పిత్రే నో అస్తు
స్వస్తి గోభ్యో జగతే పురుషేభ్యః ।
విశ్వం సుభూతం సువిదత్రం నో అస్తు
జ్యోగేవ దృశేమ సూర్యమ్ ॥ 4 ॥

పదము :

స్వస్తి । మాత్రే । ఉత । పిత్రే । నః । అస్తు ।
స్వస్తి । గోభ్యః । జగతే । పురుషేభ్యః ।
విశ్వమ్ । సుఽభూతమ్ । సుఽవిదత్రమ్ । నః । అస్తు ।
జ్యోక్ । ఏవ । దృశేమ । సూర్యమ్ ॥ 4 ॥

అనువాదం.

మా తల్లికి క్షేమం కలుగుగాక!
మా తండ్రికి క్షేమం కలుగుగాక!
అలాగే మా పశువులకు క్షేమం కలుగుగాక!
ఇంతెందుకు సర్వజగత్తు శోభన ధనోపేతమై,

జ్ఞాన యుక్తమై వర్ధిల్లుగాక!
నూరేళ్ళు మేము సూర్యుని చూతము గాక! ॥ 4 ॥

ఇది ఋషైక ఒకటవ సూక్తం

## సూక్తం - 32

# జీవన రసం

ఋషి: బ్రహ్మ ॥ దేవత : ద్యావాపృథివీ ॥ ఛందస్సు : 1, 3, 4 అనుష్టుప్, 2 కకుమ్మత్యనుష్టుప్ ॥ మంత్రములు. ॥ 4 ॥

వినియోగం : పుత్రప్రాప్తికై చేసే కర్మలో దీనికి వినియోగం. పుష్టిసంపత్కాముడు ద్యావాపృథ్వ్యలకు చేసే యాగంలో దీని వినియోగం. దర్శపౌర్ణమాసాదులలో భార్య దోసిటిలో ఉదకపాత్రను ఉంచుతూ ఈ మంత్రం పఠిస్తారు.

మంత్రము :

ఇదం జనాసో విదథ మహద్ బ్రహ్మ వదిష్యతి ।
న తత్ పృథివ్యాం నో దివి యేన ప్రాణన్తి వీరుధః ॥1॥

పదము :

ఇదమ్ । జనాసః । విదథ । మహత్ । బ్రహ్మ । వదిష్యతి ।
న । తత్ । పృథివ్యామ్ । నో । ఇతి । దివి । యేన । ప్రాణన్తి
వీరుధః ॥ 1 ॥

అనువాదం :

ఓ జనులారా! జిజ్ఞాసువులైన మీరు
ఈ చెప్పేదానిని గ్రహించండి.

ఇది మహత్త్వపూర్ణ బ్రహ్మ వచనం.
ఓషధులను ప్రాణవంతం చేసే మూలం.
పృథివిపై లేదు. ద్యులోకం లోను లేదు. ॥ 1 ॥

మంత్రము :

అన్తరిక్ష ఆసాం స్థామ శ్రాన్తసదామివ ।
ఆస్థానమస్య భూతస్య విదుష్టద్ వేధసో నవా ॥ 2 ॥

పదము :

అన్తరిక్షే । ఆసామ్ । స్థామ । శ్రాన్తసదామ్ఽఇవ ।
ఆఽస్థానమ్ । అస్య । భూతస్య । విదుః । తత్ । వేధసః । న । వా ।
॥ 2 ॥

అనువాదం :

యక్ష గంధర్వాదులకు వలెనే ఈ ఓషధులకు
మూలమైన ఉదకానికి అంతరిక్షం స్థానం.
దాని స్థితి లోకంలోని సర్వ భూతములకు మూలం.
అది ఉదకమని బ్రహ్మాదులకు తెలుసునో, తెలియదో ! ॥ 2 ॥

మంత్రము :

యద్ రోదసీ రేజమానే భూమిశ్చ నిరతక్షతమ్ ।
ఆర్ద్రం తదద్య సర్వదా సముద్రస్యేవ స్రోత్యాః ॥ 3 ॥

పదము :

యత్ । రోదసీఇతి । రేజమానే ఇతి । భూమిః । చ । నిఃఽఅతక్షతమ్ ।
ఆర్ద్రమ్ । తత్ । అద్య । సర్వదా । సముద్రస్యఽఇవ । స్రోత్యాః
॥ 3 ॥

అనువాదం

ఓ ద్యావా పృథువులారా !
కదులుతున్న మీ నుండి జలం ఉత్పన్నమౌతున్నది.
సముద్రగాములైన నదుల వలెనే
ఆ ఉదకం ఇప్పుడు సర్వదా ఆర్ద్రమైనది. ॥ 3 ॥

మంత్రము .

విశ్వమన్యామభీవార తదన్యస్యామధి శ్రితమ్ ।
దివే చ విశ్వవేదసే పృథివ్యై చాకరం నమః ॥ 4 ॥

పదము .

విశ్వమ్ । అన్యామ్ । అభిఽవార । తత్ । అన్యస్యామ్ । అధి శ్రితమ్ ।
దివే । చ । విశ్వఽవేదసే । పృథివ్యై । చ । అకరమ్ । నమః ॥4॥

అనువాదం :

ఈ సకల విశ్వం దివః పరివృతమైనది.
ఆ దివం పృథివిని ఆశ్రయించి ఉన్నది.
ఆ దివమునకు జగద్ధన భూతమైన పృథివికి
నమస్కరిస్తున్నాను. ॥ 4 ॥

ఇది ముప్పైరెండవ సూక్తం

## సూక్తం - 33

# జల - సూక్తం

ఋషి: శన్తాతి ॥ దేవత ; ఆపస్సు ॥ ఛందస్సు : త్రిష్టుప్ ॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం:- అర్ఘోత్థాపన కర్మలో, గోదాన సంస్కార కర్మలో మధుపర్క, పాద్యోదకాభిమంత్రణంలో, నీరు పడనిచోట నీటికై చేసే ఆజ్యహోమంలో పుష్పాభిషేకంలో, కలశాభి మంత్రణంలో దీనికి వినియోగం.

మంత్రము :

హిరణ్యవర్ణాః శుచయః పావకా

యాసు జాతః సవితా యాస్వగ్నిః ।

యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా

స్తాన ఆపః శం స్యోనా భవన్తు ॥ 1 ॥

పదము :

హిరణ్యఽవర్ణాః । శుచయః । పావకాః ।

యాసు । జాతః । సవితా । యాసు । అగ్నిః ।

యాః । అగ్నిమ్ । గర్భమ్ । దధిరే । సుఽవర్ణాః ।

తాః । నః । ఆపః । శమ్ । స్యోనాః । భవన్తు । ॥ 1 ॥

అనువాదం :

హిరణ్యవర్ణములు, పరిశుద్ధములు, పావనకారులు,
అయిన నీటిలో సూర్యుడు ఉదయిస్తున్నాడు.
అలాగే మేఘస్థములైన ఉదకములలో
విద్యుద్రూపంలో అగ్ని పుడుతున్నాడు.
సువర్ణములైన ఉదకములు అగ్నిని తమ గర్భంలో ధరిస్తున్నవి.
అవి మాకు ఆరోగ్య హేతువులు, సుఖ హేతువులు అగుగాక! ॥1॥

మంత్రము :

యాసాం రాజా వరుణో యాతి మధ్యే

సత్యానృతే అవపశ్యన్ జనానామ్ ।

యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా

స్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ 2 ॥

పదము :

యాసామ్ । రాజా । వరుణః । యాతి । మధ్యే ।

సత్యానృతే ఇతి సత్యఽఅనృతే । అవఽపశ్యన్ । జనానామ్ ।

యాః । అగ్నిమ్ । గర్భమ్ । దధిరే । సువర్ణాః ।

తాః । నః । ఆపః । శమ్ । స్యోనాః । భవన్తు ॥ 2 ॥

అనువాదం :

రాజైన వరుణుడు ఏ నీటి నడుమ నుండి సత్యా సత్యాలను
వేర్పఱచి ప్రవర్తిల్లునో ఆ ఉదకములు అగ్నిని
తమ గర్భంలో ధరిస్తున్నవి.
అవి మాకు ఆరోగ్య హేతువులు సుఖ హేతువులు అగుగాక! ॥2॥

మంత్రము ·

యాసాం దేవా దివి కృణ్వన్తి భక్షం

యా అన్తరిక్షే బహుధా భవన్తి ।

యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా
స్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ 3 ॥

పదము :

యాసామ్ । దేవాః । దివి । కృణ్వన్తి । భక్షమ్ ।
యాః । అన్తరిక్షే । బహుఽధా । భవన్తి ।
యాః । అగ్నిమ్ । గర్భమ్ । దధిరే । సుఽవర్ణాః ।
తాః । నః । ఆపః । శమ్ । స్యోనాః । భవన్తు ॥ 3 ॥

అనువాదం :

ఉదకసార భూతమైన అమృతం
ద్యులోకంలో ఇంద్రాదులకు భోజ్యం.
అవి అంతరిక్షంలో బహు విధాలుగా విస్తరిల్లుతున్నవి.
ఆ ఉదకములు అగ్నిని తమ గర్భంలో ధరిస్తున్నవి.
అవి మాకు ఆరోగ్య హేతువులు సుఖ హేతువులు అగుగాక! ॥3॥

మంత్రము :

శివేన మా చక్షుషా పశ్యతాపః
శివయా తన్వోప స్పృశత త్వచం మే ।
ఘృతశ్చుతః శుచయో యాః పావకా
స్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ 4 ॥

**పదము :**

శివేన । మా । చక్షుషా । పశ్యత । ఆపః ।

శివయా । తన్వా౨ । ఉప । స్పృశత । త్వచమ్ । మే ।

ఘృతఽశ్చుతః । శుచయః । యాః । పావకాః ।

తాః । నః । ఆపః । శమ్ । స్యోనాః । భవన్తు ॥ 4 ॥

**అనువాదం :**

ఓ ఉదకములారా !
సుఖకర దృక్కులతో నన్ను అవలోకించండి.
శివంకరమైన మీ తనువుతో నా చర్మాన్ని స్పృశించండి.
అమృతాన్ని స్రవించే ఉదకములు
స్వతః పరిశుద్ధాలు, పరిశుద్ధకారకాలు.
అవి మాకు ఆరోగ్య హేతువులు, సుఖ హేతువులు అగుగాక! ॥4॥

ఇది ముప్పైమూడవ సూక్తం

## సూక్తం – 34

# మధు విద్య

ఋషి: అథర్వుడు ॥ దేవత : మధువనస్పతి ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥ మంత్రములు. ॥ 5 ॥

వినియోగం:– సభాప్రవేశానికి ముందు మధుక మనే ఓషధిని నమిలి, ఈ మంత్రాన్ని జపిస్తూలోనికి ప్రవేశించాలి. వివాహకర్మలో మధుక మణిని రక్తసూత్రంతో వ్రేలికి కట్టుకొనవలెను. వివాహంలో శయనాగారంలో చేసే మధుకర్మలో, అశ్వమేధంలో దీనికి వినియోగం.

మంత్రము :

ఇయం వీరున్మధుజాతా మధునా త్వా ఖనామసి ।
మధోరధి ప్రజాతాసి సా నో మధుమతస్కృధి ॥ 1 ॥

పదము :

ఇయమ్ । వీరుత్ । మధుఽజాతా । మధునా । త్వా । ఖనామసి ।
మధోః । అధి । ప్రఽజాతా । అసి । సా । నః । మధుఽమతః ।
కృధి ॥ 1 ॥

అనువాదం :

ఈ *ఓషధి మధురోత్పన్నమైనది.
మధువులో నిన్ను త్రవ్వుతున్నారు.
ఈ మధువులోనుంచి జనించిన దానివి.
మమ్ము మధుర రసోపేతులను చెయ్యి. ॥ 1 ॥

మంత్రము :

జిహ్వాయా అగ్రే మధు మే జిహ్వామూలే మధూలకమ్ ।
మమేదహ క్రతావసో మమ చిత్తముపాయసి ॥ 2 ॥

పదము :

జిహ్వాయాః । అగ్రే । మధు । మే । జిహ్వాఽమూలే । మధూల
కమ్ ।

* నీటి ఇప్ప-తిప్పతీగ

మమ । ఇత్ । అహ । క్రతౌ । అసః । మమ । చిత్తమ్ । ఉప
ఽఆయసి ॥ 2 ॥

**అనువాదం :**

నా జిహ్వాగ్రంపై తేనెగా ప్రవర్తిల్లు.
జిహ్వామూలంలో మధూలక రూపంలో ప్రవర్తిల్లు
నా కాయకర్మలో వ్యాపించు.
నా అంతఃకరణంలో ప్రవేశించు. ॥ 2 ॥

**మంత్రము :**

మధుమన్మే నిక్రమణం మధుమన్మే పరాయణమ్ ।
వాచా వదామి మధుమద్ భూయాసం మధుసందృశః ॥ 3 ॥

**పదము**

మధుఽమత్ । మే । నిఽక్రమణమ్ । మధుఽమత్ । మే । పరా
ఽఅయనమ్ ।
వాచా । వదామి । మధుఽమత్ ॥ భూయాసమ్ । మధుఽసందృశః
॥ 3 ॥

**అనువాదం :**

ఓ మధులతా! నా సాన్నిహిత్యం స్వపర ప్రీతి కరమగుగాక!
నా దూరగమనం మధుమంతమగు గాక!
నా వాక్కులు మధురమగుగాక!
నేనుకూడ చూపరులకు మధువు వలె
ప్రీతిపాత్ర మగుదును గాక! ॥ 3 ॥

మంత్రము :

మధోరస్మి మధుతరో మదుఘాన్మధుమత్తరః ।

మామిత్ కిల త్వం వనాః శాఖాం మధుమతీమివ ॥ 4 ॥

పదము :

మధోః । అస్మి । మధుఽతరః । మదుఘాత్ । మధుమత్ఽతరః ।

మామ్ । ఇత్ । కిల । త్వమ్ । వనాః । శాఖామ్ । మధుమతీమ్

ఽఇవ ॥ 4 ॥

అనువాదం :

*ఓ మధుకలతా !

తేనె కంటె నేను తియ్యనివాడను.

మధుధార కంటె మధుమత్తరుడను.

ఓ మధుకలతా !

నా యందే నీ మాధుర్యమంతా నింపుతున్నావు గనుక

మధు యుక్తమైన కొమ్మను వలె జనం నన్ను సేవిస్తారు. ॥4॥

మంత్రము :

పరి త్వా పరితత్నునేక్షుణాగామవిద్విషే ।

యథా మాం కామిన్యసో యథా మన్నాపగా అసః ॥ 5 ॥

---

* మదుకలత :—తిప్పతీగె

Bassia Latifolia or Jonesia Asoka, L

Parra Jacana of Goensis, L, liquorice, L

పదము :

పరి । త్వా । పరిఽతత్నునా ఇక్షుణా । అగామ్ । అవిఽద్విషే ।
యథా । మామ్ । కామినీ । అసః । యథా । మత్ । న । అప
ఽగాః । అసః ॥ 5 ॥

అనువాదం :

నిపు సర్వవ్యాప్తమైన చెఱకుగడ వలె
మాధుర్యరసోపేతమైన మధుకంతో
మానినికీ నాకూ పరస్పరం విరోధం లేకుండా చెయ్యి.
అలాగే నా కామిని నానుంచి విడిపోకుండు గాక ! ॥ 5 ॥

ఇది ముప్పైనాలుగవ సూక్తం

## సూక్తం - 35

# తేజోబల దీర్ఘాయుః సూక్తం

ఋషి: అథర్వుడు॥ (ఆయుష్కాముడు)॥ దేవత: హిరణ్యమ్॥ ఛందస్సు: 1,3 జగతీ, 4 అనుష్టుప్‌గర్భా చతుష్పదా త్రిష్టుప్॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం:- సర్వసంపత్కర్మలలో, ఆయుష్కాముడై చేసే కర్మలో, ఉపనయన కర్మలో, ఆదిత్యమహాశాంతి కర్మలో. హిరణ్యగర్భ మహాదానంలో దీనికి వినియోగం. అలాగే ప్రతి ఉదయం ఈ సూక్తంతో ఆభరణాదులను రాజుకు పురోహితుడు ఇవ్వాలి.

మంత్రము :

యదాబధ్నన్ దాక్షాయణా హిరణ్యం
శతానీకాయ సుమనస్యమానాః ।

తత్ తే బధ్నామ్యాయుషే వర్చసే
బలాయ దీర్ఘాయుత్వాయ శతశారదాయ ॥ 1 ॥

పదము :

యత్ । ఆ౽అబధ్నన్ । దాక్షాయణాః । హిరణ్యమ్ ।
శత౽అనీకాయ । సు౽మనస్యమానాః ।
తత్ । తే । బధ్నామి । ఆయుషే । వర్చసే ।
బలాయ । దీర్ఘాయు౽త్వాయ । శత౽శారదాయ ॥ 1 ॥

అనువాదం :

దక్షప్రజాపతి సంతాన ప్రాయులైన మహర్షులు
మంచి మనసు కలవారై శతానీకునకు అభిషేకం చేసినారు.
హిరణ్యంతో కంకణ బంధనం చేసినారు.
అలాంటి హిరణ్యాన్ని ఓ ఆయురాది ఫలకాముడా!
నీ చేతికి కడుతున్నాను.
ఆయుర్వృద్ధి కోసం, తేజోవృద్ధి కోసం, బలప్రాప్తి కోసం
నూరేళ్ళు జీవించడం కోసం
నీ కీ హిరణ్యబంధనం చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

నైనం రక్షాంసి న పిశాచాః సహన్తే
దేవానామోజః ప్రథమజం హ్యేతత్ ।

యో బిభర్తి దాక్షాయణం హిరణ్యం

స జీవేషు కృణుతే దీర్ఘమాయుః ॥ 2 ॥

పదము :

న । ఏనమ్ । రక్షాంసి । న । పిశాచాః । సహన్తే ।

దేవానామ్ । ఓజః । ప్రథమఽజమ్ । హి । ఏతత్ ।

యః । బిభర్తి । దాక్షాయణమ్ । హిరణ్యమ్ ।

సః । జీవేషు । కృణుతే । దీర్ఘమ్ । ఆయుః ॥ 2 ॥

**అనువాదం :**

ఈ హిరణ్యాన్ని రాక్షసులు బాధించలేరు.
పిశాచాలు సహించలేవు.
దేవతలకు కూడ ఈ సువర్ణం మొట్టమొదట ఓజోరూపమైనది.
శతానీకునకు మొదట కట్టినది.
ఈ రక్షోబంధనం కల పురుషుడు
జీవులలో దీర్ఘకాలం జీవిస్తాడు ॥ 2 ॥

మంత్రము :

అపాం తేజో జ్యోతిరోజో బలం చ

వనస్పతీనాముత వీర్యాఽణి ।

ఇన్ద్రఇవేన్ద్రియాణ్యధి ధారయామో

అస్మిన్ తద్ దక్షమాణో బిభరద్ధిరణ్యమ్ ॥ 3 ॥

పదము :

అపామ్ । తేజః । జ్యోతిః । ఓజః । బలమ్ । చ ।

వనస్పతీనామ్ । ఉత । వీర్యాఽణి ।

ఇన్ద్రేఽఇవ । ఇన్ద్రియాణి । అధి । ధారయామః ।

అస్మిన్ । తత్ । దక్షమాణః । బిభరత్ । హిరణ్యమ్ ॥ 3 ॥

అనువాదం :

ఉదకంలో ఏ తేజస్సున్నదో,
సూర్యాదులలో ఏ జ్యోతి ఉన్నదో,
బలవంతులలో ఏ బలమైతే ఉన్నదో,
ఓషధులలో ఏ మహత్తర శక్తు లున్నవో,
అవన్నీ ఈ హిరణ్యాన్ని ధరించిన పురుషునిలో
మేము ఆవహింప జేస్తున్నాము.
ఇంద్రియాలను ఇంద్రుడు వలెనే
ఈ విధంగా వర్ధమానుడైన ఈ పురుషుడు
ఈ హిరణ్యాన్ని ధరించుగాక ! ॥ 3 ॥

మంత్రము :

సమానాం మాసామృతుభిష్ట్వా వయం

సంవత్సరస్య పయసా పిపర్మి ।

ఇన్ద్రాగ్నీ విశ్వేదేవా స్తేను

మన్యన్తామహృణీయమానాః ॥ 4 ॥

పదము

సమానామ్ । మాసామ్ । ఋతుఽభిః । త్వా । వయమ్ ।
సమ్ఽవత్సరస్య । పయసా । పిపర్మి ।
ఇన్ద్రాగ్నీ ఇతి । విశ్వే । దేవాః । తే । అను ।
మన్యన్తామ్ । అహృణీయమానాః ॥ 4 ॥

ఇతి షష్ఠోఽనువాకః
ఇతి ప్రథమం కాణ్డమ్.

**అనువాదం.**

ఓ సర్వసంపత్కాముడా !
నిన్ను సంవత్సర, మాస, ఋతువులతో
మేము సంపూర్ణాయుష్కుని చేస్తున్నాము.
సంవత్సర రూపమైన క్షీరంతో సంపూర్ణుని చేస్తున్నాము.
ఇంద్రాగ్నులు, విశ్వేదేవతలు ఈ కర్మను
క్రోధరహితులై అనుమతింతురుగాక ! ॥ 4 ॥

ఇది ముప్పై ఐదవ సూక్తం

ఇది ఆరవ అనువాకం

ఇది మొదటి కాండ

## అనువాకం : 1

### సూక్తం - 1

# గుహ్యావిద్య

ఋషి: వేనుడు ; ॥ దేవత : బ్రహ్మ ॥ ఛందస్సు : 1, 2, 4, 5 త్రిష్టుప్,
3 జగతీ : మంత్రములు : ॥ 5 ॥

వినియోగం :- కామితార్థ సిద్ధికి చేసే కర్మలో, కోరిక తీరుతుందా, లేదా అని తెలుసుకోడానికి, పోయిన వస్తువులగూర్చిన ప్రశ్నలలో, వివాహానికి ముందు వధువు సౌభాగ్యాది లక్షణ విజ్ఞానానికి చేసే కొన్ని కర్మలలో, విశ్వకర్మహోమంలో దీనికి వినియోగం.

మంత్రము :

వేనస్తత్ పశ్యత్ పరమం గుహా
యద్ యత్ర విశ్వం భవత్యేకరూపం ।
ఇదం పృశ్నిరదుహజ్జాయమానాః
స్వర్విదో అభ్యనూషత వ్రాః ॥ 1 ॥

పదము .

వేనః । తత్ । పశ్యత్ । పరమమ్ । గుహా ।
యత్ । యత్ర । విశ్వమ్ । భవతి । ఏకఽరూపమ్ ।
ఇదమ్ । పృశ్నిః । అదుహత్ । జాయమానాః ।
స్వఃఽవిదః । అభి । అనూషత । వ్రాః ॥ 1 ॥

**అనువాదం :**

గుహలో (సర్వప్రాణిహృదయంలో) ఏ పరబ్రహ్మ ఉన్నాడో,
ఏ బ్రహ్మలో సమస్త విశ్వం ఏకాకారం అవుతుందో,
ఆ బ్రహ్మను వేనుడు (సూర్యుడు) చూచినాడు.
పృశ్ని (ఆదిత్యుడు)
ఈ భూతభౌతిక ప్రపంచజాతాన్ని వ్యక్తం చేసినాడు.
ఆయనను ఉత్పాద్య మానులైన ప్రజలు
తమకు సృష్టి కర్తగా గ్రహిస్తున్నారు.
ఆయనను సమ్ముఖుని చేసికొనుటకై స్తుతిస్తున్నారు. ॥ 1 ॥

**మంత్రము :**

ప్ర తద్ వోచేద్ అమృతస్య విద్వాన్
గన్ధర్వో ధామ పరమం గుహా యత్ ।
త్రీణి పదాని నిహితా గుహాస్య
యస్తాని వేద స పితుష్పితాసత్ ॥ 2 ॥

**పదము :**

ప్ర । తత్ । వోచేత్ । అమృతస్య । విద్వాన్ ।
గన్ధర్వః । ధామ । పరమమ్ । గుహా । యత్ ।
త్రీణి । పదాని । నిఽహితా । గుహా । అస్య ।
యః । తాని । వేద । సః । పితుః । పితా । అసత్ ॥ 2 ॥

**అనువాదం :**

అవినాశి అయిన బ్రహ్మను ఎరిగిన ఆదిత్యుడు
అయన పరమోత్కృష్ట స్థానం హృదయము నందే
అన్న తత్త్వాన్ని ఉపాసకులకు ఉపదేశించు గాక !
పరమాత్మకు చెందిన మూడు పదములు
గుహలో నిహితములై ఉన్నవి.
శమదమాది సంపన్నుడైన అధికారి
ఆ నిష్కళ బ్రహ్మను సాక్షాత్కరింప జేసుకుంటాడు.
ఆ విద్వాంసుడు తన తండ్రికికూడ తండ్రి అవుతాడు ॥ 2 ॥

**మంత్రము .**

**స నః పితా జనితా స ఉత బన్ధు**
**ర్ధామాని వేద భువనాని విశ్వా ।**
**యో దేవానాం నామధ ఏక ఏవ**
**తం సంప్రశ్నం భువనా యన్తి సర్వా ॥ 3 ॥**

**పదము :**

**సః । నః । పితా । జనితా । సః । ఉత । బన్ధుః ।**
**ధామాని । వేద । భువనాని । విశ్వా ।**
**యః । దేవానామ్ । నామఽధః । ఏకః । ఏవ ।**
**తమ్ । సమ్ఽప్రశ్నమ్ । భువనా । యన్తి । సర్వా**
**॥ 3 ॥**

**అనువాదం :**

ఆ సూర్యాత్మకుడైన పరమాత్మ
మాకు పాలకుడు, ఉత్పాదకుడు.
ఆయనే బంధువు. ఆయన స్వర్గాది స్థానములను,
విశ్వ భూతజాతములను ఎరుగును.
ఆ పరమాత్మ ఒక్కడే దేవతల
నామధేయము లన్నిటినీ వహిస్తున్నాడు.
ఆయ నెవరో తెలుసు కొనవలెనని
సర్వ భువనములు ప్రశ్నించు కొంటున్నవి. ॥ 3 ॥

**మంత్రము :**

పరి ద్యావా పృథివీ సద్య ఆయ
ముపాతిష్ఠే ప్రథమజామృతస్య ।
వాచమివ వక్తరి భువనేష్ఠా
ధాస్యురేష నన్వేతేషో అగ్నిః ॥ 4 ॥

**పదము :**

పరి । ద్యావాపృథివీ ఇతి । సద్యః । ఆయమ్ ।
ఉప । ఆఽతిష్ఠే । ప్రథమఽజామ్ । ఋతస్య ।
వాచమ్ఽఇవ । వక్తరి । భువనేఽస్థాః ।
ధాస్యుః । ఏషః । ను । ఏషః । అగ్నిః ॥ 4 ॥

**అనువాదం :**

సర్వ జగత్తును వెంటనే సంపూర్ణంగా తెలుసు కున్నాను.
భూతభౌతిక ప్రపంచ జాతమున కంటె పూర్వం ఉత్పన్నమైన

సూత్రాత్మ వలెనే నేను సర్వ జగద్వ్యాపకుడ నౌతున్నాను.
చెప్పగానే వినువారికి ఆ సంగతి తెలిసి
పోవునట్లుగా ఈ పరమాత్మ నాకు తెలుస్తున్నాడు.
అతనే సర్వభూత వ్యాపకుడుగా,
పోషకుడుగా, భోక్తగా ఉన్నాడు.
ఈ పరమాత్మ అగ్నియే కదా! ॥ 4 ॥

మంత్రము:

పరి విశ్వా భువనాన్యాయమృతస్య
తన్తుం వితతం దృశే కమ్ ।
యత్ర దేవా అమృతమానశానాః
సమానే యోనావధ్యైరయన్త ॥ 5 ॥

పదము,

పరి । విశ్వా । భువనాని । ఆయమ్ । ఋతస్య ।
తన్తుమ్ । వి౨తతమ్ । దృశే । కమ్ ।
యత్ర । దేవాః । అమృతమ్ । ఆనశానాః ।
సమానే । యోనౌ । అధి । ఐరయన్త ॥ ౫ ॥

అనువాదం:

విశ్వభువనములు జ్ఞానోత్పత్తికి ముందే నాకు తెలుసు.
ఋతరూపుడైన బ్రహ్మకు పటమునకు తంతువులు వలెనే
సర్వవ్యాప్తమైన బ్రహ్మను తెలుసుకున్నాను.

ఏ బ్రహ్మాలో ఇంద్రాది దేవతలు
అమృతానందాన్ని అనుభవిస్తున్నారో
ఆ కారణభూత బ్రహ్మామందే
అలా లీనమై పోతున్నారు. ॥ 5 ॥

ఇది మొదట సూక్తం

## సూక్తం—2

# ఏకేశ్వర సూక్తం

ఋషిః మాతృనామా ॥ దేవత : గంధర్వాప్సరసలు ॥ ఛందస్సు : 1 విరాడ్ జగతీ 2, 3 త్రిష్టుప్ : 4 త్రిపాద్ విరాణ్ణామ గాయత్రీ, 5 భురిగనుష్టుప్ ॥ మంత్రములు ॥ 5 ॥

వినియోగం .— మాతృనామ గణంలోని సూక్తమిది. గంధర్వ, రాక్షస, అప్సరో భూతగ్రహాది శాంతికై చేసే సర్వౌషధిహోమంలోను, చతుష్పథంలో చేసే మృణ్మయ కపాలాది హోమంలోను, ఘృత, మాంస, మధు, హిరణ్యపాంస్వాది ఘోర వర్షణాదులలో చేసే ఆజ్యహోమంలో, గ్రహయజ్ఞంలో ప్రధానహోమానంతరం శాంత్యర్థమై చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం. అశ్వమేధంలో బ్రహ్మ (ఋత్విక్కు) సంవత్సరాంతంలో రావలసిన అశ్వాన్ని పంపుతూ ఈ సూక్తం పరిస్తాడు.

మంత్రము :

దివ్యో గన్ధర్వో భువనస్య యస్పతి
రేక ఏవ నమస్యో౨ విక్ష్వీడ్యః ।
తం త్వా యౌమి బ్రహ్మణా దివ్యదేవ
నమస్తే అస్తు దివి తే సధస్థమ్ ॥ 1 ॥

పదము .

దివ్యః । గన్ధర్వః । భువనస్య । యః । పతిః ।

ఏకః । ఏవ । నమస్యః । విక్షు । ఈడ్యః ।

తమ్ । త్వా । యౌమి । బ్రహ్మణా । దివ్య । దేవ ।

నమః । తే । అస్తు । దివి । తే । సధఽస్థమ్ ॥ 1 ॥

**అనువాదం :**

ద్యులోకంలోని సూర్యుడు
పృథివ్యాది లోకానికి
వృష్ట్యాది రూపంతో పోషకు డౌతున్నాడు.
ప్రజలలో ఆయన ఒక్కడే
నమస్కరింపదగిన వాడు, స్తుతింప దగినవాడు.
ఆ పరమాత్మతో నిన్ను సంయోగింప జేస్తున్నాను.
ఓ దివ్యుడా! ఓ దేవా! నీ కిదే నా నమస్కారం.
నీ ఆవాస స్థానం దివిలోనే కదా! ॥ 1 ॥

**మంత్రము :**

దివి స్పృష్టో యజతః సూర్యత్వ
గవయాతా హరసో దైవ్యస్య ।
మృడాద్ గన్ధర్వో భువనస్య య
స్పతిరేక ఏవ నమస్యః సుశేవాః ॥ 2 ॥

పదము .

దివి । స్పృష్టః । యజతః । సూర్యఽత్వక్ ।

అవ౽యాతా । హరసః । దైవ్యస్య ।

మృడాత్ । గన్ధర్వః । భువనస్య । యః ।

పతిః । ఏకః । ఏవ । నమస్య౽ః । సు౽శేవాః ॥ 2 ॥

అనువాదం :

దివిలో నున్నవాడు, యజనీయుడు,
సూర్య సమానవర్ణుడు, దేవక్రోధనివారకుడు,
సుఖప్రదాత కూడా ఆయనే.
ఆ గంధర్వుడు (ఆదిత్యుడు) భువన పతి.
ఆయ నొక్కడే నమస్కారార్హుడు. సేవాసులభుడు ॥ 2 ॥

మంత్రము.

అనవద్యాభిః సము జగ్మ అభి

రప్సరాస్వపి గన్ధర్వ ఆసీత్ ।

సముద్ర ఆసాం సదనం మ ఆహు

ర్యతః సద్య ఆ చ పరా చ యన్తి ॥ 3 ॥

పదము :

అనవద్యాభిః । సమ్ । ఓం ఇతి । జగ్మే । అభిః ।

అప్సరాసు । అపి । గన్ధర్వః । ఆసీత్ ।

సముద్రే । ఆసామ్ । సదనమ్ । మే । ఆహుః ।

యతః । సద్యః । ఆ । చ । పరా । చ । యన్తి ॥ 3 ॥

**అనువాదం :**

ప్రశస్త రూపం గల అప్సరసలతో గంధర్వుడు సంగతుడైనాడు.
ఆ అప్సరసల స్థానం సముద్రంలో కలదని అభిజ్ఞులు చెప్తారు.
ఆ ఆదిత్యుని నుంచి సూర్యోదయ
సమకాలంలోనే వారు వస్తారు.
అస్తమయ కాలంలో తిరిగి వెళ్ళిపోతారు. ॥ 3 ॥

మంత్రము :

**అభ్రియే విద్యున్నక్షత్రియే యా**

**విశ్వావసుం గన్ధర్వం సచధ్వే ।**

**తాభ్యో వో దేవీ ర్నమ ఇత్ కృణోమి ॥ 4 ॥**

పదము :

**అభ్రియే । దిద్యుత్ । నక్షత్రియే । యాః ।**

**విశ్వఽవసుమ్ । గన్ధర్వమ్ । సచధ్వే ।**

**తాభ్యః । వః । దేవీః । నమః । ఇత్ । కృణోమి ॥ 4 ॥**

**అనువాదం :**

ఓ అభ్రములారా !
ద్యోతన స్వభావులారా !
నక్షత్ర రూపులారా !
మీరు 'విస్వావసువు' అనే గంధర్వునితో సంగతులు కండు.
ఈ మీకు నమస్కరిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

**యాః క్లన్దా స్తమిషీ చ యోక్షకామా మనోముహః ।**

**తాభ్యో** గన్ధర్వపత్నీభ్యోప్సరాభ్యో కరం నమః ॥ 5 ॥

యాః । క్లన్దాః । తమిషీచయః । అక్షఽకామాః । మనఃఽముహః ।

**తాభ్యః** । గన్ధర్వఽపత్నీభ్యః । అప్సరాభ్యః । అకరమ్ । నమః ॥ 5 ॥

**అనువాదం :**

మనుష్యులను ఆవేశించి ఉపద్రవకారు లవుతున్నట్టి,
బలవత్తరులైనట్టి, మోహింప జేయునట్టి,
ఆ అప్సరసలు గంధర్వ పత్నులు,
వారికి నమస్కరిస్తున్నాను. ॥ 5 ॥

ఇది రెండవ సూక్తం

## సూక్తం - 3

# ఆరోగ్య సూక్తం

**ఋషి:** అంగిరసుడు ॥ **దేవత.** (ఆస్రావ) భైషజమ్ ॥ **ఛందస్సు.** 1-5 అనుష్టుప్. 6 త్రిపదా స్వారాడుపరిష్టా న్మహా బృహతీ ॥ మంత్రములు: ॥ 6 ॥

**వినియోగం :-** జ్వర, అతిసార, మూత్రవతనాడీవ్రణాల శాంతికై చేసే ప్రక్రియలో దీనికి వినియోగం.

**మంత్రము :**

**అదో** యదవధావత్యవత్కమధి పర్వతాత్ ।

**తత్ తే** కృణోమి భేషజం సుభేషజం యథాససి ॥ 1 ॥

పదము .

అదః । యత్ । అవఽధావతి । అవత్ఽకమ్ । అధి । పర్వతాత్ ।
తత్ । తే । కృణోమి । భేషజమ్ । సుఽభేషజమ్ । యథా । అససి
॥ 1 ॥

**అనువాదం .**

పర్వతం నుంచి క్రిందికి పరుగిడుతున్న సెలయేటి నుంచి
వ్యాధి నివృత్త్యర్థమై * ఔషధాన్ని సిద్ధం చేస్తున్నాను.
అది సర్వ శ్రేష్ఠమైన ఔషధం కాగలదు. ॥ 1 ॥

మంత్రము .

ఆదఙ్గా కువిదఙ్గా శతం యా భేషజాని తే ।
తేషామసి త్వముత్తమమనాస్రావమరోగణమ్ ॥ 2 ॥

పదము ;

ఆత్ । అఙ్గ । కువిత్ । అఙ్గ । శతమ్ । యా । భేషజాని । తే ।
తేషామ్ । అసి । త్వమ్ । ఉత్ఽతమమ్ । అనాస్రావమ్ । అరోగణమ్ ॥ 2 ॥

**అనువాదం :**

ఓ ఓషధీ! నీవు ఉపయోగానంతరమే రోగాన్ని నివర్తించు.
అనేక రకాలైన అతిసారాది రోగాలు
ఓ ఓషధీ! నీ సజాతీయాలైన శతాధిక ఔషధాలు కలవి.

---

* (సాయణభాష్యాన్ని బట్టి ముంజపర్వతం మీది దర్భ ఈ ఔషధాన్ని సిద్ధం చేయటంలో ఉపయోగపడుతుంది.)

వాసిలో నీవు ఉత్తమమైన దానవు. అతిసారాది రోగాలను,
తన్మూల రోగాన్ని నివర్తింప జేయగలదానవు. ॥ 2 ॥

మంత్రము;

నీచైః ఖనన్త్యసురా అరుస్రాణ మిదం మహత్ ।
తదాస్రావస్య భేషజం తదు రోగ మనీనశత్ ॥ 3 ॥

పదము.

నీచైః ఖనన్తి । అసురాః । అరుఃఽస్రాణమ్ । ఇదమ్ । మహత్ ।
తత్ । ఆఽస్రావస్య । భేషజమ్ । తత్ । ఓం ఇతి । రోగమ్ । అనీ
నశత్ ॥ 3 ॥

అనువాదం;

ఈ కనబడుతున్న పెద్ద వ్రణముఖాన్ని
అసురులు లోపలి నుంచి తొలిచి వేస్తారు.
ఈ ఔషధం ఆ రోగనివర్తకం.
ఇదే అతిసారాది రోగాలను సమూలంగా నశింపజేస్తుంది. ॥3॥

మంత్రము

ఉపజీకా ఉద్భరన్తి సముద్రా దధి భేషజమ్ ।
తదాస్రావస్య భేషజం తదు రోగ మశీశమత్ ॥ 4 ॥

పదము:

ఉపఽజీకాః । ఉత్ । భరన్తి । సముద్రాత్ । అధి । భేషజమ్ ।

తత్ । ఆ౽ఽ[స్రావస్య । భేషజమ్ । తత్ । ఓం ఇతి । రోగమ్ । అశీ
శమత్ ॥ 4 ॥

అనువాదం :

ఉపజీకములు * (పుట్టలు పెట్టే పురుగులు)
సముద్రం నుంచి రోగనివారకమైన
ఔషధాన్ని పైకి కొని వస్తాయి.
ఈ ఔషధం ఆ రోగనివర్తక మైనది.
ఇదే అతిసారాది రోగాలను సమూలంగా నశింజేపస్తుంది. ॥4॥

మంత్రము

అరుస్రాణమిదం మహత్ పృదివ్యా అధ్యద్భృతమ్ ।
తదాస్రావస్య భేషజం తదు రోగమనీనశత్ ॥ 5 ॥

పదము .

అరుః౽స్రాణమ్ । ఇదమ్। మహత్ । పృదివ్యాః । అధి । ఉత్
౽భృతమ్ ।

---

* ఉపజిహ్వక, ఉపజీక, ఉపదీక ఈ మూడు పేర్లు ఒకరకమైన చీమలను పేర్కొంటాయి.

ఉపజిహ్వక : ఋగ్వేదం. VIII 102, 21 ;

ఉపజీక అధర్వవేదం.

ఉపదీక : పైప్పలాదంలో, తైత్తరీయ బ్రాహ్మణంలో తైత్తరీయ ఆరణ్యకంలో, శతపథ బ్రాహ్మణంలో ఉన్నది. ఇవి నీటిలోనికి పోయి రోగనివారక పదార్థాలను కొనివ స్తాయని భావం, అందుకనే విషనివారక చికిత్స లన్నిటిలో దీనికి వినియోగం.

తత్ । ఆ౽స్రావస్య । భేషజమ్ । తత్ । ఓం ఇతి రోగమ్ । అనీనశత్ ॥ 5 ॥

**అనువాదం :**

వ్రణపాచకమైన పృథివినుంచి
పైకి తీసిన ఈ ఔషధం ఉత్కృష్టమైనది
ఈ ఔషధం అరోగ నివర్తకమైనది.
ఇదే అతిసారాది రోగాలను
సమూలంగా నశింప జేస్తుంది, ॥ 5 ॥

**మంత్రము :**

శం నో భవన్త్వప ఓషధయః శివాః ।
ఇన్ద్రస్య వజ్రో అప హన్తు రక్షస
ఆరాద్ విసృష్టా ఇషవః పతన్తు రక్షసామ్ ॥ 6 ॥

**పదము :**

శమ్ । నః । భవన్తు । అపః । ఓషధయః । శివాః ।
ఇన్ద్రస్య । వజ్రః । అప । హన్తు । రక్షసః ।
ఆరాత్ । వి౽సృష్టాః । ఇషవః । పతన్తు । రక్షసామ్ ॥ 6 ॥

**అనువాదం :**

ఈ ఔషధంలో ఉపయోగించే ఉదకం, ఓషధులు
సుఖహేతువులై మాకు రోగోపశమనం కల్గించుగాక!
రోగోత్పాదకులైన రాక్షసులను
ఇంద్రుని వజ్రం హననం చేయుగాక!

ఆరాక్షసులు వదలిన రోగరూపాలైన బాణాలు
మాకు దూరంగా పడిపోవుగాక! ॥ 6 ॥

ఇది మూడవ సూక్తం

## సూక్త - 4

# రోగ నివారకమైన జంగిడబంధనం

ఋషి: అథర్వుడు ॥ దేవత : జంగిడమణి ॥ ఛందస్సు : 1 విరాట్ ప్రస్తార పంక్తి
2-6 అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం:- కృత్యాదూషణార్థం, ఆత్మరక్షణార్థం, విఘ్నశమనార్థం, జంగిడ వృక్షమణిని కట్టుకొనుటలో దీనికి వినియోగం.

మంత్రము :

దీర్ఘాయుత్వాయ బృహతే రణా
యారిష్యన్తో దక్షమాణాః సదైవ ।
మణిం విష్కన్ధదూషణం
జఙ్గిడం బిభృమో వయమ్ ॥ 1 ॥

పదము .

దీర్ఘాయుఽత్వాయ । బృహతే । రణాయ ।
అరిష్యన్తః । దక్షమాణాః సదా । ఏవ ।
మణిమ్ । విస్కన్ధఽదూషణమ్ ।
జఙ్గిడమ్ । బిభృమః । వయమ్ ॥ 1 ॥

అనువాదం :

చిరకాల జీవనార్థం, విఘ్ననివారణార్థం,
ఆత్మరక్షణార్థం మేము సర్వదా విఘ్ననివారకమైన
జంగిడమణిని ధరిస్తున్నాము ॥ 1 ॥

[వారాణసిలో ప్రసిద్ధమైన వృక్షం జంగిడమని సాయణభాష్యం. ఈ చెట్టేమిటో మనకు తెలియదు.]

మంత్రము .

జఙ్గిడో జమ్భాద్ విశరాద్

విష్కన్ధాద్ అభిశోచనాత్ ।

మణిః సహస్రవీర్యః

పరిణః పాతు విశ్వతః ॥ 2 ॥

పదము .

జఙ్గిడః । జమ్భాత్ । వి౨శరాత్ ।

వి౨స్కన్ధాత్ । అభిశోచనాత్ ।

మణిః । సహస్ర౨వీర్యః ।

పరి । నః । పాతు । విశ్వతః ॥ 2 ॥

అనువాదం :

హింసకములైన కృత్యాదుల నుండి, శరీరహింసకములైన
రోగాదులనుండి, ఆశోకం నుంచి తప్పించే
అపరిమిత సామర్థ్యం గల జంగిడమణి
మమ్ములను వాటన్నిటినుంచి పరిరక్షించుగాక ! ॥ 2 ॥

మంత్రము :

అయం విష్కన్ధం సహతేఽయం బాధతే అత్త్రిణః ।
అయం నో విశ్వభేషజో జఙ్గిడః పాత్వంహసః ॥ 3 ॥

పదము :

అయమ్ । విఽస్కన్ధమ్ । సహతే । అయమ్ । బాధతే । అత్త్రిణః ।
అయమ్ । నః । విశ్వఽభేషజః । జఙ్గిడః । పాతు । అంహసః॥ 3 ॥

అనువాదం :

ఈ జంగిడమణి పరకృతాన్ని అభిభవించ గలదు.
భక్షకములైన కృత్యాదులను బాధించగలదు.
సర్వరోగ నివారకమైన ఈ మణి
పాపమునుంచి మమ్ము రక్షించుగాక! ॥ 3 ॥

మంత్రము :

దేవైర్దత్తేన మణినా జఙ్గిడేన మయోభువా ।
విష్కన్ధం సర్వా రక్షాంసి వ్యాయామే సహామహే ॥ 4 ॥

పదము :

దేవైః । దత్తేన । మణినా । జఙ్గిడేన । మయఃఽభువా ।
విఽస్కన్ధమ్ । సర్వా । రక్షాంసి । విఽఆయామే । సహామహే ॥4॥

అనువాదం .

దైవ దత్తమైన, సుఖమయమైన జంగిడ మణితో
విఘ్నకారిణులైన సర్వరాక్షసులను
సంచరించ కుండా నిగ్రహింప గలం. ॥ 4 ॥

మంత్రము

శణశ్చ మా జఙ్గిడశ్చ విష్కన్ధాదభి రక్షతామ్ ।
అరణ్యాదన్య ఆభృతః కృష్యా అన్యో రసేభ్యః ॥ 5 ॥

పదము :

శణః । చ । మా । జఙ్గిడః । చ । విఽస్కన్ధాత్ । అభి । రక్షతామ్।
అరణ్యాత్ । అన్యః । ఆఽభృతః । కృష్యాః । అన్యః । రసేభ్యః
॥ 5 ॥

అనువాదం :

* శణము, జంగిడము, ఈ రెండూ విఘ్నాదుల నుంచి
నన్ను అభిరక్షించు గాక !
వీటిలో అరణ్యం నుంచి తెచ్చినది ఒకటి.
మొక్కల నుంచి తీసినది మఱొకటి. ॥ 5 ॥

మంత్రము :

కృత్యాదూషిరయం మణిరథో అరాతిదూషిః ।
అథో సహస్వాన్ జఙ్గిడః
ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥ 6 ॥

పదము :

కృత్యాఽదూషిః । అయమ్ । మణిః । అథో ఇతి । అరాతిఽదూషిః।

---

* ( మణి బంధన సూత్రానికి ప్రకృతి భూతమైనది. )

**అథో ఇతి । సహస్వాన్ । జజ్ఞిడః । ప్ర । నః । ఆయూంషి । తారి షత్ ॥ 6 ॥**

అనువాదం :

ఈ మణి పరప్రయుక్త పీడను తొలగించు నది.
అంతే కాక శత్రు దూషకమైనది.
బలసంపన్నమైన ఈ మణి
మా ఆయుస్సును వృద్ధి పొందించు గాక ! ॥ 6 ॥

ఇది నాలుగవ సూక్తం.

## సూక్తం - 5

# ఇంద్ర స్తోత్రం

**ఋషి: భృగువు; అథర్వుడు॥ దేవత : ఇంద్రుడు॥ ఛందస్సు : 1 నిచృదుపరిష్టాద్ బృహతీ, 2 విరాడుపరిష్టాద్ బృహతీ, 3 విరాట్ పథ్యాబృహతీ, 4 జగతీ పురోవిరాట్ త్రిష్టుప్, 5- 7 త్రిష్టుప్॥ మంత్రము ; ॥ 7 ॥**

**వినియోగం:- బలకాముడు చేసే ఇంద్రయాగాదులలో, మహాశాంతిలో దీనికి వినియోగం.**

మంత్రము ;

**ఇన్ద్ర జుషస్వ ప్ర వహా యాహి శూర హరిభ్యామ్ ।**
**పిబా సుతస్య మతేరిహ మధోశ్చకానశ్చారుర్మదాయ ॥ 1 ॥**

పదము .

**ఇన్ద్ర । జుషస్వ । ప్ర । వహ । ఆ । యాహి । శూర । హరిఽభ్యామ్**

**పిబ । సుతస్య । మతేః । ఇహ । మధోః । చకానః । చారుః ।
మదాయ ॥ 1 ॥**

**అనువాదం.**

ఓ ఇంద్రా! ప్రీతుడవు కమ్ము.
కామితార్థాన్ని ప్రసాదించు.
ఓ శూరుడా! 'హరి' నామక అశ్వాల మీద
మా యజ్ఞానికి రా.
ఇక్కడ హవనం చేసే మధురసంలో భాగాన్ని పానం చెయ్యి.
ఇది నిర్మలమై మదోత్పత్తికి కారణ మగుగాక! ॥ 1 ॥

**మంత్రము.**

**ఇన్ద్ర జరరం నవ్యో న పృణస్వ మధోర్దివో న ।
అస్య సుతస్య స్వ1ర్ణోప త్వా మదాః సువాచో అగుః ॥2॥**

**పదము:**

**ఇన్ద్ర । జరరమ్ । నవ్యః । న । పృణస్వ । మధోః । దివః । న ।
అస్య । సుతస్య । స్వఽః । న । ఉప । త్వా । మదాః । సుఽవాచః ।
అగుః ॥ 2 ॥**

**అనువాదం:**

నూతనుని వలె ఈ మధురసంతో
ఓ ఇంద్రా! ని జఠరాన్ని నింపుకో.
స్వర్గసంబంధమైన అమృతంతో వలె
ఈ సోమ సంబంధమైన సూక్తులు

స్వర్గంలో మదకర రసముల వలె
ఇక్కడ నీకు లభించు గాక! ॥ 2 ॥

మంత్రము :

ఇన్ద్ర స్తురాషాణ్మిత్రో వృత్రం యో జఘాన యతీర్న ।
బిభేద వలం భృగుర్న ససహే శత్రూన్ మదే సోమస్య॥3॥

పదము .

ఇన్ద్రః । తురాషాట్ । మిత్రః । వృత్రమ్ । యః । జఘాన ।
యతీః । న ।
బిభేద । వలమ్ । భృగుః । న । ససహే । శత్రూన్ । మదే ।
సోమస్య ॥ 3 ॥

అనువాదం :

శత్రువులను అతివేగంగా అభిభవించే
సర్వప్రాణి మిత్రభూతుడయిన ఇంద్రుడు
వృత్రాసురుని సంహరించిన వాడు.
యతులవలె, ఆ భృగువువలె
బలుడనే అసురుని విదారించినాడు.
సోమపాన ప్రభావం వల్లనే ఆయన
ఈ శత్రువుల నందరినీ అభిభవించినాడు. ॥ 3 ॥

మంత్రము :

ఆ త్వా విశన్తు సుతాస ఇన్ద్ర పృణస్వ
కుక్షీ విడ్ఢి శక్ర ధియేహ్యా నః ।

శ్రుధీ హవం గిరో మే జుషస్వేన్ద్ర

స్వయుగ్భిర్మత్స్వేహ మహే రణాయ ॥ 4 ॥

పదము .

ఆ । త్వా । విశన్తు । సుతాసః । ఇన్ద్ర । పృణస్వ ।

కుక్షీఇతి । విడ్ఢి । శక్ర । ధియా । ఆ । ఇహి । ఆ । నః ।

శ్రుధి । హవమ్ । గిరః । మే । జుషస్వ । ఆ । ఇన్ద్ర ।

స్వయుక్ఽభిః । మత్స్వ । ఇహ । మహే । రణాయ ॥ 4 ॥

అనువాదం

ఓ ఇంద్రుడా! ఈ సోమరసం నీలో ప్రవేశించు గాక!
దానితో నీ కుక్షిద్వయం నింపుకొని వృద్ధిపొందుము
ఓ శక్రా! మా స్తుత్యాదిరూప కర్మతో మా వద్దకు రమ్ము.
మా ఆహ్వానాన్ని విను
నా స్తుతి రూపమైన వాక్కులను స్వీకరించు.
ఓ ఇంద్రా! ఈ యజ్ఞంలో నీ మిత్రులైన దేవతలతో పాటు
సోమపానంతో తృప్తుడవు కమ్ము.
మా కర్మ ఫలసిద్ధి కోసమై ఇవి ప్రవర్తిల్లుగాక! ॥ 4 ॥

మంత్రము :

ఇన్ద్రస్య ను ప్రా వోచం వీర్యాఽణి

యాని చకార ప్రథమాని వజ్రీ ।

అహన్నహి మన్వప స్తతర్ద ప్ర
వక్షణా అభినత్ పర్వతానామ్ ॥ 5 ॥

పదము :

ఇన్ద్రస్య । ను । ప్ర । వోచమ్ । వీర్యాఽణి ।
యాని । చకార । ప్రథమాని । వజ్రీ ।
అహన్ । అహిమ్ । అను । అపః । తతర్ద । ప్ర ।
వక్షణాః । అభినత్ । పర్వతానామ్ ॥ 5 ॥

అనువాదం :

ఇంద్రుని వీర కర్మలను వెనువెంటనే చెప్తాను.
వజ్రధారియైన ఆయన వీర కర్మలెన్నో చేసినాడు.
అహిని (వృత్రుని) సంహరించినాడు.
ఆ తరువాత ఆ వృత్రాసురుడు అడ్డగించిన
నీటికి దారిచేసి బయటుకు వదలినాడు.
కొండ వాగులను విదారించినాడు. ॥ 5 ॥

మంత్రము

అహన్నహిం పర్వతే శిశ్రియాణం
త్వష్టాస్మై వజ్రం స్వర్యంఽతతక్ష ।
వాశ్రా ఇవ ధేనవః స్యన్దమానా
అఞ్జః సముద్రమవ జగ్మురాపః ॥ 4 ॥

పదము .

అహన్ । అహిమ్ । పర్వతే । శి్రశియాణమ్ ।

త్వష్టా । అస్మై । వ్రజమ్ । స్వర్యఽమ్ । తతక్ష ।

వా్రశాఃఽఇవ । ధేనవః । స్యన్దమానాః ।

అఞ్జః । సముద్రమ్ । అవ । జగ్ముః । అపః ॥ 6 ॥

అనువాదం

పర్వతంపై పడుకున్న అహిని చంపినాడు.
వృత్రాసురుని తండ్రియైన త్వష్ట
ఇంద్రుని కోసమై వజ్రాయుధాన్ని పదును పెట్టినాడు.
అరుస్తున్న ధేనువుల వలె క్రిందికి ప్రవహిస్తున్న నదులు
నిర్నిరోధంగా సముద్రాన్ని చేరుకొన్నవి. ॥ 6 ॥

మంత్రము .

వృషాయమాణో అవృణీత సోమం
త్రికద్రుకేష్వపిబత్సుతస్య ।
ఆ సాయకం మఘవాదత్త వజ్ర
మహన్నేనం ప్రథమజా మహీనామ్ ॥ 7 ॥

పదము :

వృషఽయమానః । అవృణీత । సోమమ్ ।

త్రిఽకద్రుకేషు । అపిబత్ । సుతస్య ।

**ఆ । సాయకమ్ । మఘఽవా । అదత్త । వజ్రమ్ ।**

**అహన్ । ఏనమ్ । ప్రథమఽజామ్ । అహీనామ్ ॥ 7 ॥**

ఇతి ప్రథమోఽనువాకః

**అనువాదం :**

వృషభమువలె ఇంద్రుడు
సోమాత్మకమైన ఆహారాన్ని వరించినాడు
సోమయాగములలో అభిషుతమైన సోమరసాన్ని త్రాగినాడు.
అందుతో బలవంతుడై ఇంద్రుడు
శత్రుఘాతుకమైన వజ్రాన్ని చేత బట్టినాడు.
అసురులలో ప్రథమజాతుడైన
వృత్రాసురుని సంహరించినాడు. ॥ 7 ॥

ఇది ఐదవ సూక్తం

ఇది మొదటి అనువాకం

# అనువాకం : 2

## సూక్తం — 6

## అగ్నిస్తోత్రం

**ఋషిః శౌనకుడు; (సంపత్కాముడు ॥ దేవత : అగ్ని॥ ఛందస్సు: 1-3 త్రిష్టుప్;**
**4 చతుష్పదాఽఽర్షీపంక్తి ; 5 విరాట్ ప్రస్తారపంక్తి ॥ మంత్రములు: ॥5॥**

**వినియోగం :-** సంపత్కాముడు ఈ సూక్తంతో అగ్నియాగం చేస్తాడు. భూతరోగ, చోరాది భయసంకలితమైన కాలంలో వాని శాంతికై దీనితో ఆజ్య హోమం చేస్తారు. అగ్నిచయనంలో బ్రహ్మ ఈ సూక్తాన్ని పఠిస్తాడు. మహాశాంతి కర్మలో కూడ దీనికి వినియోగం. రాజు దీపారాధన చేస్తూ ఈ సూక్తం పఠిస్తాడు.

మంత్రము :

సమాస్త్వాగ్న ఋతవో వర్ధయన్తు

సంవత్సరా ఋషయో యాని సత్యా ।

సం దివ్యేన దీదిహి రోచనేన

విశ్వా ఆ భాహి ప్రదిశశ్చతస్రః ॥ 1 ॥

పదము .

సమాః । త్వా । అగ్నే । ఋతవః । వర్ధయన్తు ।

సమ్ఽవత్సరాః । ఋషయః । యాని । సత్యా ।

సమ్ । దివ్యేన । దీదిహి । రోచనేన ।

విశ్వాః । ఆ । భాహి । ప్రఽదిశః । చతస్రః ॥ 1 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! సంవత్సరములు నిన్ను వృద్ధిపొందించుగాక !
ఋతువులు నిన్ను వృద్ధిపొందించుగాక !
తదంగ భూతములైన పక్షమాస దివసాదులు
నిన్ను వృద్ధిపొందించుగాక !
ఋషులు ఇతర పృథివ్యాది భూతములు
నిన్ను వృద్ధిపొందించుగాక !
నీ దివ్య తేజస్సుతో వెలుగొందు.
ఆ వెలుగుతో చతుర్దిక్కులను ప్రకాశింపజేయి. ॥ 1 ॥

మంత్రము :

సం చేధ్యస్వాగ్నే ప్ర చ వర్ధయేమ

ముచ్ఛ తిష్ఠ మహతే సౌభగాయ ।
మాతే రిషన్నుపసత్తారో అగ్నే
బ్రహ్మాణస్తే యశసః సన్తు మాన్యే ॥ 2 ॥

పదము :

సమ్ । చ । ఇధ్యస్వ । అగ్నే । ప్ర । చ । వర్ధయ । ఇమమ్ ।
ఉత్ । చ । తిష్ఠ । మహతే । సౌభగాయ ।
మా । తే । రిషన్ । ఉపఽసత్తారః । అగ్నే ।
బ్రహ్మాణః । తే । యశసః । సన్తు । మా । అన్యే ॥ 2 ॥

అనువాదం .

ఓ అగ్నీ ! స్వయం దీప్తుడవుకా !
ఈ యజమానుని సమృద్ధ కాముని చెయ్యి.
మహాసౌభాగ్యం కలిగించు
ఓ అగ్నీ ! నీ పరిచారకులైన
ఋత్విగ్యజమానులు నశింపకుందురుగాక !
బ్రాహ్మణులు నీ పరిచర్యలో మునిగి యశస్వు లగుదురుగాక !
నీ పరిచర్యకు పరాఙ్ముఖులైన
అన్యులు అపకీర్తిపాలగుదురు గాక ! ॥ 2 ॥

మంత్రము :

త్వామగ్నే వృణతే బ్రాహ్మణా ఇమే శివో
అగ్నే సంవరణే భవానః ।

సపత్నహాగ్నే అభిమాతిజిద్ భవ
స్వే గయే జాగృహ్యప్రయుచ్ఛన్ ॥ 3 ॥

పదము :

త్వామ్ । అగ్నే । వృణతే । బ్రాహ్మణాః । ఇమే । శివః ।
అగ్నే । సమ్ఽవరణే । భవ । నః ।
సపత్నఽహా । అగ్నే । అభిమాతిఽజిత్ । భవ ।
స్వే । గయే । జాగృహి । అప్రఽయుచ్ఛన్ ॥ 3 ॥

అనువాదం :

ఓ అగ్నీ! ఈ బ్రాహ్మణులు నిన్ను ఆరాధిస్తున్నారు.
అందువల్ల మా పొరపాట్లను శాంతుడవై కాపాడు!
ఓ అగ్నీ! మా శత్రు హంతకుడా! పాపాత్ములను జయించు.
స్వగృహంలో అప్రమత్తుడవై జాగరూకత వహించు. ॥ 3 ॥

మంత్రము .

క్షత్రేణాగ్నే స్వేన సం రభస్వ
మిత్రేణాగ్నే మిత్రధా యతస్వ ।
సజాతానాం మధ్యమేష్ఠా
రాజ్ఞామగ్నే విహవ్యో దీదిహీహ ॥ 4 ॥

పదము :

క్షత్రేణ । అగ్నే । స్వేన । సమ్ । రభస్వ ।

మిత్రేణ । అగ్నే । మిత్రఽధా । యతస్వ ।
సఽజాతానామ్ । మధ్యమేఽస్థాః ।
రాజ్ఞామ్ । అగ్నే । విఽహవ్యః । దీదిహి । ఇహ ॥ 4 ॥

అనువాదం .

ఓ అగ్నే ! నీ క్షాత్రంతో సంగతుడవుకా !
ఓ అగ్నే ! మిత్రులకు పోషకుడవై
మిత్రభావంతో ఉపకరించు.
సజాతులైన బ్రాహ్మణుల మధ్యలో ఉండు.
క్షత్రియుల యజ్ఞాదులలో కూడ వెలుగొందు.
ఓ అగ్నే ! ఇలాంటి నీవు ఈ కర్మలో దీప్తిమంతుడవుకా ! ॥4॥

మంత్రము :

అతి నిహో అతి సృధోఽ
త్యచిత్తీరతి ద్విషః ।
విశ్వాఽహ్యగ్నే దురితా తర త్వ
మథాస్మభ్యం సహవీరం రయిం దాః ॥ 5 ॥

పదము :

అతి । నిహః । అతి । సృధః ।
అతి । అచిత్తీః । అతి । ద్విషః ।

హి । అగ్నే । దుః౽ఇతా । తర । త్వమ్ ।

అస్మభ్యమ్ । సహ౽వీరమ్ । రయిమ్ । దాః ॥ 5 ॥

ః

విషయజాతాలైన దోషాలనుంచి తరింప జేయి.
దేహశోషకాలైన రోగాల నుంచి తరింపజేయి.
ఓ అగ్నీ ! నీవు సర్వదురితాల నుంచి తరింపజేయి.
తదుపరి మాకు సంతానాన్ని,
ధనాన్ని ప్రసాదించు. ॥ 5 ॥

ఇది ఆరవ సూక్తం

## సూక్తం—7

# శాపనివృత్తికి ........

థర్వుడు ॥ దేవత : వనస్పతి (దూర్వా)॥ ఛందస్సు : 1 భురిగనుష్టుప్ ; 3,5 అనుష్టుప్. 4 విరాడుపరిష్టాద్ బృహతీ ॥ మంత్రములు : ॥ 5 ॥

ం: శాపనివృత్తిలో, దృష్టిదోష నివారణలో, పిశాచాది భయ నివారణలో, భార్గవ్య మహాశాంతిలో దీనికి వినియోగం.

ః

ష్టా దేవజాతా వీరుచ్ఛపథయోపనీ ।
మలమివ ప్రాణైక్షీత్ సర్వాన్ మచ్ఛపథాం అధి ॥1॥

ఘ్వష్టా । దేవ౽జాతా । వీరుత్ । శపథ౽యోపనీ ।

ఆపః । మలమ్ఽఇవ । ప్ర । అనైక్షీత్ । సర్వాన్ । మత్ । శప
థాన్ । అధి ॥ 1 ॥

అనువాదం :

పాపవినాశకారి
దేవనిర్మితం
శాపనివారకం
అయిన ఈ దర్భ
ఉదకం మలినాన్ని వలె
నా సర్వ విధ శాపాలను
ప్రక్షాళనం చేయుగాక! ॥ 1 ॥

మంత్రము :

యశ్చ సాపత్నః శపథో జామ్యాః శపథశ్చయః ।
బ్రహ్మ యన్మన్యుతః శపాత్ సర్వం తన్నో అధస్పదమ్
॥ 2 ॥

పదము :

యః । చ । సాపత్నః । శపథః । జామ్యాః । శపథః । చ । యః ।
బ్రహ్మ । యత్ । మన్యుతః । శపాత్ । సర్వమ్ । తత్ । నః ।
అధఃఽపదమ్ ॥ 2 ॥

అనువాదం :

పగవాని శాపం, భగినీ శాపం
బ్రాహ్మణుడు కోపంతో పెట్టిన శాపం

ఈ శాపాలన్నీ
మా కాళ్ళ క్రిందపడి
నలిగి పోవుగాక ! ॥ 2 ॥

మంత్రము :

**దివో మూలమవతతం పృథివ్యా అధ్యుత్తతమ్ ।**
**తేన సహస్రకాణ్డేన పరి ణః పాహి విశ్వతః ॥ 3 ॥**

పదము :

**దివః । మూలమ్ । అవఽతతమ్ । పృథివ్యాః । అధి । ఉత్ఽతతమ్**
**తేన । సహస్రఽకాణ్డేన । పరి । నః । పాహి । విశ్వతః ॥ 3 ॥**

అనువాదం .

ఆకసం నుంచి క్రిందికి వ్యాపించిన మూలం కలదానవు,
భూమిపై ఊర్ధ్వంగా విస్తృతమైన దానవు,
అనేక పర్వాలు కలదానవు.
అయిన ఓ మణీ!
మమ్ములను సర్వశాపాలనుంచి పరిరక్షించు. ॥ 3 ॥

మంత్రము :

పరి మాం పరి మే ప్రజాం పరి ణః **పాహియద్ ధనమ్ ।**
**అరాతిర్నో మా తారీన్మా నస్తారిషురభిమాతయః ॥ 4 ॥**

పదము :

పరి । మామ్ । పరి । మే । ప్రఽజామ్ । పరి । నః । **పాహి । యత్**
ధనమ్ ।

**అరాతిః । నః। మా తారీత్ । మా । నః । తారిషుః । అభిఽమా । తయః ॥ 4 ॥**

**అనువాదం .**

ఓ మణీ ! నన్ను పరిరక్షించు.
నా సంతానాన్ని పరిపాలించు.
మా ధన్యాని రక్షించు.
మమ్ములను శత్రువులు లోగొన కుందురుగాక !
మమ్ములను హింసింపదలచే శత్రువులు
మమ్ములను లోగొనకుందురుగాక ! ॥ 4 ॥

మంత్రము :

**శప్తారమేతు శపథో యః సుహార్త్ తేన నః సహ ।**
**చక్షుర్మన్త్రస్య దుర్హార్దః పృష్టీరపి శృణీమసి ॥ 5 ॥**

పదము :

**శప్తారమ్ । ఏతు । శపథః । యః । సుఽహార్త్ । తేన । నః । సహ।**
**చక్షుఃఽమన్త్రస్య । దుఃఽహార్దః । పృష్టీః । అపి । శృణీమసి ॥ 5 ॥**

**అనువాదం :**

మమ్ము శపించిన వానినే
వాని శాపం ఎదురు తిరిగి పీడించుగాక !
సౌహార్దం కల మిత్రునితోపాటు మాకు సుఖం కలుగుగాక !
గుప్తంగా దుష్టహృదయులైనవారి
చెడు దృష్టిని వినష్టం చేయుదుము గాక ! ॥ 5 ॥

ఇది ఏడవ సూక్తం

# సూక్తం - 8
# రోగ నివారక సూక్తం

ఋషి: భృగువు, అంగిరసుడు॥ దేవత: క్షేత్రియ (యక్ష్మకుష్ఠాది) నాశనమ్॥
ఛందస్సు: 1,2 అనుష్టుప్; 3పథ్యాపంక్తి: 4 విరా డనుష్టుప్, 5 నిచృత్
పథ్యాపంక్తి: మంత్రములు: ॥ 5 ॥

వినియోగం:- అనువంశికగా వచ్చే రోగాల శాంతికై ఉదకఘటాన్ని అభి మంత్రించి ఇంటివెలుపల రోగిని తడుపుటలోను, అలాగే ఇందు కైన ఇతర కర్మలలోను దీనికి వినియోగం.

మంత్రము:

ఉదగాతాం భగవతీ విచృతౌ నామ తారకే।

వి క్షేత్రియస్య ముఞ్చతామధమం పాశముత్తమమ్ ॥ 1 ॥

పదము:

ఉత్। అగాతామ్। భగవతీ ఇతి భగఽవతీ। విఽచృతౌ। నామ।
తారకే ఇతి।

వి। క్షేత్రియస్య। ముఞ్చతామ్। అధమమ్। పాశమ్। ఉత్
ఽతమమ్ ॥ 1 ॥

అనువాదం:

తేజస్వినులైన, బంధ విమోచకాలైన
నక్షత్రాలు (మూలానక్షత్రం)
క్షేత్ర, పరక్షేత్ర శరీరగతాలైన
ఉదయించిన ఊర్ధ్వఅధోకాయగతాలైన
రోగబీజాలను విముక్తం చేయుగాక! ॥ 1 ॥

మంత్రము :

అపేయం రాత్ర్యుచ్ఛత్వపోచ్ఛన్త్వభికృత్వరీః ।

వీరుత్ క్షేత్రియనాశన్యప క్షేత్రియ ముచ్ఛతు ॥ 2 ॥

పదము :

అప । ఇయమ్ । రాత్రీ । ఉచ్ఛతు । అప । ఉచ్ఛన్తు । అభి

ఽకృత్వరీః ।

వీరుత్ । క్షేత్రియఽనాశనీ । అప । క్షేత్రియమ్ । ఉచ్ఛతు ॥ 2 ॥

అనువాదం :

ఈ రాత్రి రోగాన్ని తొలగించుగాక !
రోగశాంతి కారులైన ఆదిత్యాది దేవతలు
ఈ వ్యాధిని తొలగింతురుగాక !
క్షేత్రియ వ్యాధినివారకమైన దర్భ
ఈ రోగాన్ని తొలగించుగాక ! ॥ 2 ॥

మంత్రము :

బభ్రోరర్జున కాణ్డస్య యవస్య తే

పలాల్యా తిలస్య తిలపిఞ్జ్యా ।

వీరుత్ క్షేత్రియనాశన్యప క్షేత్రియ ముచ్ఛతు ॥ 3 ॥

పదము :

బభ్రోః । అర్జునఽకాణ్డస్య । యవస్య । తే ।

పలాల్యా । తిలస్య । తిలఽపిఞ్జ్యా ।

వీరుత్ । క్షేత్రియఽనాశనీ । అప । క్షేత్రియమ్ । ఉచ్ఛతు ॥ 3 ॥

**అనువాదం :**

కపిల వర్ణమైన అర్జున (మద్ది) కాండంతోను,
యవ కాండంతోను, ఊకతోను, నువ్వులతోను
చేసిన మణి, ఓ రోగి!
నీ రోగాన్ని తొలగించుగాక!
క్షేత్రియ వ్యాధి నివారకమైన దర్భ కూడ
ఈ రోగాన్ని తొలగించుగాక! ॥ 3 ॥

**మంత్రము :**

నమస్తే లాఙ్గలేభ్యో నమ ఈషాయుగేభ్యః ।
వీరుత్ క్షేత్రియనాశన్యప క్షేత్రియముచ్ఛతు ॥ 4 ॥

**పదము :**

నమః । తే । లాఙ్గలేభ్యః । నమః । ఈషాఽయుగేభ్యః ।
వీరుత్ । క్షేత్రియఽనాశనీ । అప । క్షేత్రియమ్ । ఉచ్ఛతు ॥ 4 ॥

**అనువాదం :**

ఓ రోగి! నీ రోగ శమనార్థం నాగళ్ళకు నమస్కారం.
నాగలికి సంబంధించిన మిగతభాగాలకు నమస్కారం.
క్షేత్రియ వ్యాధి నివారకమైన దర్భ
ఈ రోగాన్ని తొలగించుగాక! ॥ 4 ॥

**మంత్రము :**

నమః సనిస్రసాక్షేభ్యో నమః సందేశ్యేఽభ్యః ।

నమః క్షేత్రస్య పతయే వీరుత్

క్షేత్రియనాశన్యప క్షేత్రియ ముచ్ఛతు ॥ 5 ॥

పదము :

నమః । సని(స్రసఽఅక్షేభ్యః । నమః । సమ్ఽదేశ్యేఽభ్యః ।

నమః । క్షేత్రస్య । పతయే । వీరుత్ ।

క్షేత్రియఽనాశనీ । అప । క్షేత్రియమ్ । ఉచ్ఛతు ॥ 5 ॥

అనువాదం :

గవాక్షాదులు శిథిలమై పోయిన
శూన్యగృహాలకు నమస్కారం.
మట్టి త్రవ్వివేసిన గుంటలకు నమస్కారం.
క్షేత్రపతికి నమస్కారం.
క్షేత్రియవ్యాధి నివారకమైన దర్భ
ఈ రోగాన్ని తొలగించుగాక !
(సాయణభాష్యంలో పై విధంగా ఉన్నా ఇతరులిచ్చిన
అర్థాలను బట్టి క్రింది విధంగా చెప్పుకోవచ్చును.)
కనుచూపు తగ్గిపోయిన వ్యవసాయ
కార్మికులకు నమస్కారం.
ఆ క్షేత్రస్థు లందరికి అక్కడున్న పిశాచాదులకు నమస్కారం.
క్షేత్ర పాలకునకు నమస్కారం.
క్షేత్రియ వ్యాధి నివారకమైన దర్భ
ఈ రోగాన్ని తొలగించుగాక ! ॥ 5 ॥

ఇది ఎనిమిదవ సూక్తం

# సూక్తం - 9

# సంధివాత నివారణ సూక్తం

ఋషిః భృగువు, అంగిరసుడు॥ దేవతః వనస్పతి॥ ఛందస్సుః 1 విరాట్ ప్రస్తారపంక్తి : 2-5 అనుష్టుప్॥ మంత్రములు : ॥ 5 ॥

వినియోగం :- బ్రహ్మగ్రహశాంతికి చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము .

దశవృక్ష ముఞ్చేమం రక్షసో గ్రాహ్యా

అధియైనం జగ్రాహ పర్వసు।

అథో ఏనం వనస్పతే

జీవానాం లోకమున్నయ ॥ 1 ॥

పదము :

దశఽవృక్ష। ముఞ్చ। ఇమమ్। రక్షసః। గ్రాహ్యాః।

అధి। యా। ఏనమ్। జగ్రాహ। పర్వఽసు।

అథో ఇతి। ఏనమ్। వనస్పతే।

జీవానామ్। లోకమ్। ఉత్। నయ ॥ 1 ॥

అనువాదం :

* ఓ దశ వృక్షా!

బ్రహ్మరాక్షసి నుంచి, రాక్షసులనుంచి,

---

* (పలాశ ఔదుంబరాది వృక్షశకల నిర్మితమైన మణి)

ఈ పురుషుని విముక్తుని చెయ్యి.
ఆ రాక్షసి ఈ పురుషుని పర్వాలలో * ప్రవేశించినది.
ఓ వనస్పతీ!
ఈ గ్రహావిష్టుడైన పురుషుని ప్రాణులకు స్థానమైన
భూలోకం లోనికి ఉద్ధరించు. ॥ 1 ॥

మంత్రము:

ఆగా దుదగా దయం జీవానాం వ్రాత మప్యగాత్ ।
అభూదు పుత్రాణాం పితా నృణాం చ భగవత్తమః ॥ 2 ॥

పదము:

ఆ । అగాత్ । ఉత్ । అగాత్ । అయమ్ । జీవానామ్ । వ్రాతమ్ ।
అపి । అగాత్ ।
అభూత్ । ఓం ఇతి । పుత్రాణామ్ । పితా । నృణామ్ । చ । భగవత్
ఉతమః ॥ 2 ॥

అనువాదం:

ఓ మణీ! నీ అనుగ్రహం వల్ల
ఇతను గ్రహ విముక్తుడై ఈ లోకంలోనికి వచ్చినాడు.
ఉజ్జీవితుడైనాడు.
జన సమూహంలో చేరినాడు.
అంతేకాక పిల్లలకు తండ్రి యైనాడు.
మనుష్యుల మధ్యలో అతిశయ భాగ్యవంతు డైనాడు. ॥ 2 ॥

---

* (కీళ్ళలో, అమావాస్యాధి పర్వాలలో)

మంత్రము :

అధీతీ రధ్య గాదయ మధి జీవపురా అగన్ ।

శతం హ్యస్య భిషజః సహస్ర ముత వీరుధః ॥ 3 ॥

పదము :

అధిఽఇతీః । అధి । అగాత్ । అయమ్ । అధి । జీవఽపురాః ।
అగన్ ।

శతమ్ । హి । అస్య । భిషజః । సహస్రమ్ । ఉత । వీరుధః ॥ 3 ॥

అనువాదం :

ఈ బ్రహ్మగ్రహ విముక్తుడైన పురుషుడు
పూర్వం అధ్యయనం చేసిన వేదాదులను
జ్ఞాపకం తెచ్చుకున్నాడు.
జీవ పురములను కనుగొన్నాడు.
అందువల్ల ఇతనికి చికిత్సచేసిన
అనేక వైద్యులు అపరిమితమైన
ఔషధాదులను సిద్ధం చేసినారు. ॥ 3 ॥

మంత్రము :

దేవాస్తే చీతి మవిదన్ బ్రహ్మాణ ఉత వీరుధః ।

చీతిం తే విశ్వే దేవా అవిదన్ భూమ్యామధి ॥ 4 ॥

పదము :

దేవాః । తే । చీతిమ్ । అవిదన్ । బ్రహ్మాణః । ఉత । వీరుధః ।

చీతిమ్ । తే । విశ్వే । దేవాః । అవిదన్ । భూమ్యామ్ । అధి ॥ 4 ॥

అనువాదం :

ఓ మణీ ! నీ గ్రహనివారణ శక్తిని దేవత లెరుగుదురు.
అలాగే బ్రాహ్మణులు, ఓషధులు,
విశ్వేదేవతలు భూలోకంలో ఉన్న
నీ శక్తిని ఎరుగుదురు. ॥ 4 ॥

మంత్రము :

య శ్చకార స నిష్కరత్ స ఏవ సుభిషక్తమః ।
స ఏవ తుభ్యం భేషజాని కృణవద్ భిషజా శుచిః ॥ 5 ॥

పదము :

యః । చకార । సః । నిః । కరత్ । సః । ఏవ । సుభిషక్ఽతమః ।
సః । ఏవ । తుభ్యమ్ । భేషజాని । కృణవత్ । భిషజా । శుచిః ॥ 5 ॥

అనువాదం :

ఈ మణిబంధన కర్త అయిన పురుషుడు
గ్రహబాధను ఉపశమింప చేయుగాక !
ఆయనే ఉత్కృష్టవైద్యుడు.
ఆయనే నీ రోగానికి వైద్యం చేసినాడు.
ఆయన నిర్మలుడు. ॥ 5 ॥

ఇది తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 10

# క్షేత్రియం రోగ నివారణ సూక్తం

ఋషిః భృగువు, అంగిరసుడు : దేవత : మంత్రాలలో పేర్కొన్న నిర్ ఋతిః ద్యావాపృథివ్యాదులు ॥ ఛందస్సు : 1 త్రిష్టుప్; 2 సప్తపదాష్టిః,

3-5, 7-8 సప్తపదా ధృతిః) 6 సప్తదాపత్యష్టిః ॥ మంత్రములు : ॥ 8 ॥
వినియోగం :- క్షేత్రియ రోగశాంతికై చేసే మణాక కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

క్షేత్రియాత్ త్వా నిర్ ఋత్యా జామిశం సాద్
ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృదివీ ఉభే స్తామ్ ॥ 1 ॥

పదము :

క్షేత్రియాత్ । త్వా । నిః ఋత్యాః । జామిశంసాత్ ।
ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివే ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 1 ॥

అనువాదం :

ఓ రోగపీడితుడా !
క్షేత్రియ రోగం నుంచి నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగకారణమైన పాపదేవత నుంచి,
భగిన్యాదుల ఆక్రోశజనితమైన పాపం నుంచి,
గురుదేవతాది ద్రోహం నుంచి
వరుణపాశం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.

ఓ వ్యాధితుడా! ద్యావాపృథువులు రెండూ
నీకు కల్యాణకారు లగుగాక! ॥ 1 ॥

మంత్రము :

శం తే అగ్నిః సహాద్భి రస్తు
శం సోమః సహౌషధీభిః ।
ఏవాహం త్వాం క్షేత్రియాన్నిర్‌ఋత్యా
జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 2 ॥

పదము :

శమ్ । తే । అగ్నిః । సహ । అత్‌ఽభిః । అస్తు ।
శమ్ । సోమః । సహ । ఓషధీభిః ।
ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిఃఽఋత్యాః ।
జామిఽశంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివే ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభేఇతి । స్తామ్ ॥ 2 ॥

అనువాదం :

ఓ రోగి! అభి మంత్రిత
జల దేవతాదులతోసహా అగ్ని నీకు సుఖం కల్గించు గాక!

సోముడు ఓషధీ సహితుడై నీకు సుఖం కల్గించు గాక!
ఈ విధంగా నేను క్షేత్రియ రోగం నుంచి
నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగకారణమైన పాపదేవతనుంచి
భగిన్యాదుల ఆక్రోశజనితమైన పాపంనుంచి,
గురుదేవతాది ద్రోహంనుంచి
వరుణ పాశం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా! ద్యావాపృథువులు రెండూ
నీకు కల్యాణకారు లగుగాక! ॥ 2 ॥

మంత్రము :

శం తే వాతో అన్తరిక్షే వయో
ధాచ్ఛం తే భవన్తు ప్రదిశ శ్చతస్రః ।
ఏవాహం త్వాం క్షేత్రియాన్నిర్ ఋత్యా
జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 3 ॥

పదము :

శమ్ । తే । వాతః । అన్తరిక్షే । వయః ।
ధాత్ । శమ్ । తే । భవన్తు । ప్రఽదిశః । చతస్రః ।

ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిః౽ఋతాః ।
జామి౽శంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివే ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 3 ॥

అనువాదం :

అంతరిక్షంలో పక్ష్యాదులను పోషించే
వాయువు నీకు సుఖకరు డగుగాక !
అలాగే నాలుగు దిక్కులు నీకు సుఖ మిచ్చుగాక !
ఈ విధంగా నేను క్షేత్రియరోగంనుంచి
నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగకారణమైన పాపదేవతనుంచి
భగిన్యాదుల ఆక్రోశజనితమైన పాపంనుంచి,
గురుదేవతాది ద్రోహం నుంచి
వరుణ పాశం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధరహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా ! ద్యావాపృథువులు రెండూ
నీకు కల్యాణకారు లగుగాక ! ॥ 3 ॥

మంత్రము :

ఇమా యా దేవీః ప్రదిశ శ్చతస్రో
వాతపత్నీరభి సూర్యో విచష్టే ।
ఏవాహం త్వాం క్షేత్రియాన్నిర్ ఋత్యా

జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 4 ॥

పదము :

ఇమాః । యాః । దేవీః । ప్రఽదిశః । చతస్రః ।
వాతఽపత్నీః । అభి । సూర్యః । విఽచష్టే ।
ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిఃఽఋత్యాః ।
జామిఽశంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివే ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 4 ॥

అనువాదం :

ఈ కనిపించే వాతపత్నులైన
నాలుగు దిక్కులను సూర్యుడు అంతటా చూస్తున్నాడు.
వారు నీకు సుఖ మిత్తురుగాక!
ఈ విధంగా నేను క్షేత్రియ రోగం నుంచి నీకు
విమోచనం కల్పిస్తున్నాను.
రోగ కారణమైన పాపదేవతనుంచి
భగిన్యాదుల ఆక్రోశ జనితమైన పాపం నుంచి,
గురుదేవతాది ద్రోహంనుంచి
వరుణ పాశం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.

మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా! ద్యావాపృథువులు రెండూ
నీకు కల్యాణకారు లగుగాక! ॥ 4 ॥

మంత్రము :

తాసు త్వాన్తర్జరస్యా దధామి
ప్ర యక్ష్మ ఏతు నిర్ఋతిః పరాచైః ।
ఏవాహం త్వాం క్షేత్రియాన్నిర్ఋత్యా
జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 5 ॥

పదము :

తాసు । త్వా । అన్తః । జరసి । ఆ । దధామి ।
ప్ర । యక్ష్మః । ఏతు । నిఃఽఋతిః । పరాచైః ।
ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిఃఽఋత్యాః ।
జామిఽశంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివే ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 5 ॥

**అనువాదం :**

ఆ దిక్కుల మధ్యలో ఓ రోగి!
నిన్ను వృద్ధు డయ్యేదాకా జీవింపజేస్తున్నాను.
నీ రాజయక్ష్మాది రోగములు నిన్ను విడిచి పెట్టు గాక!
పాప దేవతయైన నిర్‌ఋతి వెనుదిరిగి పోవుగాక!
ఈ విధంగా నేను క్షేత్రియ రోగం నుంచి
నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగ కారణమైన పాపదేవత నుంచి,
భగిన్యాదుల ఆక్రోశ జనితమైన పాపం నుంచి,
గురు దేవతాది ద్రోహం నుంచి,
వరుణ పాశం నుంచి, నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా! ద్యావాపృథువులు రెండూ
నీకు కల్యాణకారు లగుగాక! ॥ 5 ॥

**మంత్రము :**

అముక్థా యక్ష్మాద్ దురితాదవద్యాద్
ద్రుహః పాశాద్ గ్రాహ్యాశ్చోదముక్థాః ।
ఏవాహం త్వాం క్షేత్రియా న్నిర్‌ఋత్యా
జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 6 ॥

పదము :

అముక్థాః । యక్ష్మాత్ । దుః౽ఇతాత్ । అవద్యాత్ ।

ద్రుహః । పాశాత్ । గ్రాహ్యాః । చ । ఉత్ । అముక్థాః ।

ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిః౽ఋత్యాః ।

జామి౽శంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।

అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।

శివే । ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 6 ॥

అనువాదం :

నీవు క్షేత్రియ వ్యాధినుంచి విముక్తుడ వైనావు.
అలాగే పాపం నుంచి, దేవతాది ద్రోహం నుంచి,
వరుణ పాశం నుంచి విముక్తుడ వైనావు.
ఈ విధంగా నేను క్షేత్రియరోగం నుంచి
నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగకారణమైన పాపదేవత నుంచి,
భగిన్యాదుల ఆక్రోశజనితమైన పాపంనుంచి గురుదేవతాది
ద్రోహంనుంచి వరుణ పాశం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా! ద్యావా పృథువులు రెండూ
నీకు కల్యాణకారు లగుగాక! ॥ 6 ॥

మంత్రము :

అహా అరాతిమవిదః స్యోనమ

ప్యభూ ర్భద్రే సుకృతస్య లోకే ।

ఏవాహం త్వాం క్షేత్రియాన్నిర్‌ఋత్యా
జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 7 ॥

పదము :

అహః । అరాతిమ్ । అవిదః । స్యోనమ్ ।
అపి । అభూః । భద్రే । సుఽకృతస్య । లోకే ।
ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిఃఽఋత్యాః ।
జామిఽశంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివేఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభేఇతి । స్తామ్ ॥ 7 ॥

**అనువాదం :**

నీవు క్షేత్రియ వ్యాధినుంచి విముక్తుడ వైనావు.
అలాగే పాపం నుంచి, దేవతాది ద్రోహం నుంచి,
వరుణ పాశం నుంచి విముక్తుడ వైనావు.
ఈ విధంగా నేను క్షేత్రియరోగం నుంచి
నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగకారణమైన పాపదేవతనుంచి
భగిన్యాదుల ఆక్రోశ జనితమైన పాపంనుంచి,
గురు దేవతాది ద్రోహం నుంచి,

వరుణ పాశం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా! ద్యావా పృథువులు రెండూ
నీకు కల్యాణ కారు లగుగాక! ॥ 7 ॥

మంత్రము :

సూర్యమృతం తమసో గ్రాహ్యా అధి
దేవా ముఞ్చన్తో అసృజన్నిరేణ సః ।
ఏవాహం త్వాం క్షేత్రియా న్నిర్ఋత్యా
జామిశంసాద్ ద్రుహో ముఞ్చామి వరుణస్య పాశాత్ ।
అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి
శివే తే ద్యావాపృథివీ ఉభే స్తామ్ ॥ 8 ॥

పదము :

సూర్యమ్ । ఋతమ్ । తమసః । గ్రాహ్యాః । అధి ।
దేవాః । ముఞ్చన్తః । అసృజన్ । నిః । ఏనసః ।
ఏవ । అహమ్ । త్వామ్ । క్షేత్రియాత్ । నిఃఽఋత్యాః ।
జామిఽశంసాత్ । ద్రుహః । ముఞ్చామి । వరుణస్య । పాశాత్ ।
అనాగసమ్ । బ్రహ్మణా । త్వా । కృణోమి ।
శివే ఇతి । తే । ద్యావాపృథివీ ఇతి । ఉభే ఇతి । స్తామ్ ॥ 8 ॥

ఇతి ద్వితీయోఽనువాకః

**అనువాదం :**

సత్యభూతుడైన సూర్యుని తమోగ్రహం నుంచి విడిపిస్తూ
దేవతలు పాపం నుంచి నిన్ను విముక్తుని చేసినారు.
ఈ విధంగా నేను క్షేత్రియ రోగం నుంచి
నీకు విమోచనం కల్పిస్తున్నాను.
రోగ కారణమైన పాప దేవతనుంచి,
భగిన్యాదుల ఆక్రోశ జనితమైన పాపం నుంచి,
వరుణ శాపం నుంచి నిన్ను విడిపిస్తున్నాను.
మంత్రంతో నిన్ను అపరాధ రహితుని చేస్తున్నాను.
ఓ వ్యాధితుడా! ద్యావాపృథువులు రెండూ
నీకు కల్యాణ కారు లగుగాక! ॥ 8 ॥

ఇది పదవ సూక్తం

ఇది రెండవ అనువాకం

# అనువాకం : 3

## సూక్తం - 11

# పర ప్రయోగ నివారణ

**ఋషి: శుక్రుడు॥ దేవత ; మంత్రాలలో పేర్కొన్నవారు; ఛందస్సు : 1 చతుష్పదా విరాడ్ గాయత్రీ ; 2, 3, 5 త్రిపదా పరోష్ణిక్ ; 4 పిపీలిక మధ్యా నిచృదుష్ణిక్ ॥ మంత్రములు : ॥ 5 ॥**

**వినియోగం :- కృత్యా నివారణార్థం, ఆత్మరక్షణార్థం చేసే తిలకమణి బంధనాదులలో దీనికి వినియోగం.**

**మంత్రము :**

**దూష్యా దూషిరసి హేత్యా హేతి రసి మేన్యా మేనిరసి ।**
**ఆప్నుహి శ్రేయాంస మతి సమం క్రామ ॥ 1 ॥**

పదము :

దూష్యాః । దూషిః । అసి । హేత్యాః । హేతిః । అసి । మేన్యాః ।
మేనిః । అసి ।

అప్నుహి । శ్రేయాంసమ్ । అతి । సమమ్ । క్రామ ॥ 1 ॥

అనువాదం :

ఓ తిలక మణీ! కృత్యా దోషాన్ని నివారించుదానవు.
పర ప్రేరిత ఖడ్గానికి ఖడ్గానివి.
మంత్రాత్మక వా గ్వజ్రానికి ప్రతివా గ్వజ్రానివి.
అందువల్ల బలవత్తరుడైన మా శత్రువును నిరోధించు.
సమ బలుడైన శత్రువును అతిక్రమించు. ॥ 1 ॥

మంత్రము :

స్రక్త్యోఽసి ప్రతిసరోఽసి ప్రత్యభిచరణోసి ।

అప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ ॥ 2 ॥

పదము :

స్రక్త్యః । అసి । ప్రతిఽసరః । అసి । ప్రతిఅఽభిచరణః । అసి ।

అప్నుహి । శ్రేయాంసమ్ । అతి । సమమ్ । క్రామ ॥ 2 ॥

అనువాదం :

ఓ మణీ! తిలక వృక్ష నిర్మితమవు.
చంపుటకై వస్తున్న కృత్యాదులను
ఎదుర్కొని నివర్తింప జేసే రక్షా సూత్రమవు.
ఇతరులు ప్రయోగించిన కృత్యాదులను నివారించుదానవు.

అందువల్ల బలవత్తరుడైన మా శత్రువును నిరోధించు.
సమబలుడైన శత్రువును అతిక్రమించు. ॥ 2 ॥

మంత్రము :

ప్రతి తమభి చర యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః।
అప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ ॥ 3 ॥

పదము :

ప్రతి । తమ్ । అభి । చర । యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ ।
వయమ్ । ద్విష్మః ।
అప్నుహి । శ్రేయాంసమ్ । అతి । సమమ్ । క్రామ ॥ 3 ॥

అనువాదం :

ఏ శత్రువైతే మమ్మలను ద్వేషిస్తున్నాడో.
మే మే శత్రువును నాశనం చేయదలచు కొన్నామో,
వీరిద్దరినీ, ఓ మణీ! నీవు నశింపజేయి.
అందువల్ల బలవత్తరుడైన మా శత్రువును నిరోధించు.
సమబలుడైన శత్రువును అతిక్రమించు. ॥ 3 ॥

మంత్రము :

సూరి రసి వర్చోధా అసి తనూపానోసి ।
అప్నుహి శ్రేయాంస మతి సమం క్రామ ॥ 4 ॥

పదము :

సూరిః । అసి । వర్చఃఽధాః । అసి । తనూపానః । అసి ।
అప్నుహి । శ్రేయాంసమ్ । అతి । సమమ్ । క్రామ ॥ 4 ॥

**అనువాదం .**

ఓ మణీ! అభిజ్ఞుడవు.
వర్చస్సును కల్పించువాడవు
మా శరీరాదులను
ఇతరుల అభిచారిక క్రియల నుంచి రక్షించు వాడవు.
అందువల్ల బలవత్తరుడైన మా శత్రువును నిరోధించు.
సమ బలుడైన శత్రువును అతిక్రమించు. ॥ 4 ॥

మంత్రము :

**శుక్రోఽసి భ్రాజోఽసి స్వఽరసి జ్యోతి రసి ।**
**అప్నుహి శ్రేయాంస మతి సమం క్రామ ॥ 5 ॥**

పదము :

**శుక్రః । అసి । భ్రాజః । అసి । స్వఽః । అసి । జ్యోతిః । అసి ।**
**అప్నుహి । శ్రేయాంసమ్ । అతి । సమమ్ । క్రామ ॥ 5 ॥**

**అనువాదం :**

ఓ మణీ! శత్రువులను శోకింప జేయువాడవు.
తేజస్వివి. తాపకుడవు.
జ్యోతి స్స్వరూపుడవు.
అందువల్ల బలవత్తరుడైన మా శత్రువును నిరోధించు.
సమబలుడైన శత్రువును అతిక్రమించు. ॥ 5 ॥

ఇది పదకొండవ సూక్తం

# సూక్తం - 12

# అభిచార కర్మ

ఋషి: భరద్వాజుడు॥ దేవత - 1 ద్యావాపృథివీ అంతరిక్షములు॥ 2 దేవతలు, 3 ఇంద్రుడు; 4 ఆదిత్య, వసు, అంగిరస, పితరులు॥ 5 సోమ్యాసుడు, పితరులు, 7 యమసాదనమ్, బ్రహ్మ: 8 అగ్ని॥ ఛందస్సు: 1, 3-6 త్రిష్టుప్: 2 జగతీ: 7-8 అనుష్టుప్॥ మంత్రములు: ॥ 8 ॥

వినియోగం :- అభిచార కర్మలో, దీక్షార్థమై చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము .

ద్యావా పృథివీ ఉర్వ1 న్తరిక్షం

క్షేత్రస్య పత్న్యు రుగాయోద్భుతః ।

ఉతా న్తరిక్ష మురు వాతగోపం

త ఇహ తప్యన్తాం మయి తప్యమానే ॥ 1 ॥

పదము:

ద్యావాపృథివీ ఇతి । ఉరు । అ న్తరిక్షమ్ ।

క్షేత్రస్య । పత్నీ । ఉరుऽగాయః । అద్భుతః ।

ఉత । అ న్తరిక్షమ్ । ఉరు । వాతऽగోపమ్ ।

తే । ఇహ । తప్యన్తామ్ । మయి । తప్యమానే ॥ 1 ॥

అనువాదం:

ద్యావాపృథువుల మధ్యలో విస్తరించిన అంతరిక్షం

త దధిష్ఠాన దేవత

అద్భుతమై అనేకుల స్తోత్రాలకు పాత్ర మైనది.
వాయుసూత్రాత్మకమైన, విశాలమై,న అంతరిక్షం.
ఈ లోకాలు, త దధిపతులు ఈ అభిచార కర్మలో
నేను తపిస్తున్నట్లే తపింతురుగాక! ॥ 1 ॥

మంత్రము :

ఇదం దేవాః శృణుత యే యజ్ఞియా స్థ
భరద్వాజో మహ్య ముక్థాని శంసతి ।
పాశే స బద్ధో దురితే ని యుజ్యతాం
యో అస్మాకం మన ఇదం హినస్తి ॥ 2 ॥

పదము :

ఇదమ్ । దేవాః । శృణుత । యే । యజ్ఞియాః । స్థ ।
భరత్ఽవాజః । మహ్యమ్ । ఉక్థాని । శంసతి ।
పాశే । సః । బద్ధః । దుఃఽఇతే । ని । యుజ్యతామ్ ।
యః । అస్మాకమ్ । మనః । ఇదమ్ । హినస్తి ॥ 2 ॥

అనువాదం .

ఓ దేవతలారా!
ఈ నా మాటను వినండి
మీరు యజ్ఞార్హులు కండు.
భరద్వాజుడు నా కోసమై మంత్రములను పఠిస్తున్నాడు.
మా మనస్సును నొప్పించిన ఆ శత్రువు,
నేను ప్రయోగించే పాశంతో
బద్ధుడై దుర్గతి పాలగుగాక! ॥ 2 ॥

మంత్రము :

ఇద మిన్ద్ర శృణుహి సోమప యత్

త్వా హృదా శోచతా జోహవీమి ।

వృశ్చామి తం కులిశే నేవ వృక్షం

యో అస్మాకం మన ఇదం హినస్తి ॥ 3 ॥

పదము :

ఇదమ్ । ఇన్ద్ర । శృణుహి । సోమఽప । యత్ ।

త్వా । హృదా । శోచతా । జోహవీమి ।

వృశ్చామి । తమ్ । కులిశేనఽఇవ । వృక్షమ్ ।

యః । అస్మాకమ్ । మనః । ఇదమ్ । హినస్తి ॥ 3 ॥

అనువాదం :

ఓ సోమపాయీ! ఓ ఇంద్రా!
ఈ నా చెప్తున్న మాటను విను.
శత్రువు చేసిన అపకారంతో శోకార్తమైన మనస్సుతో
నిన్ను పదే పదే ఆహ్వానిస్తున్నాను.
మా మనస్సును హింసిస్తున్న శత్రువును
పరశువుతో వృక్షాన్ని వలె ఖండిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

అశీతిభి స్తిసృభిః సామగేభి

రాదిత్యేభి ర్వసుభి రఙ్గిరోభిః ।

ఇష్టాపూ ర్త మవతు నః పిత్ర్యాణా
మాముం దదే హరసా దై వ్యేన ॥ 4 ॥

పదము :

అశీతిఽభిః । తిసృఽభిః । సామఽగేభిః ।
ఆదిత్యేభిః । వసుఽభిః । అఙ్గిరఃఽభిః ।
ఇష్టాపూ ర్తమ్ । అవతు । నః । పిత్ర్యాణామ్ ।
ఆ । అముమ్ । దదే । హరసా । దై వ్యేన ॥ 4 ॥

అనువాదం:

త్రి సంఖ్యాకములైన *అశీతి సూక్తాలతో,
సామ గానాలతో, ద్వాద శాదిత్యులతో,
అష్టవసువులతో. అంగిరోమహర్షులతో,
మా పితృదేవతల ఇష్టాపూర్తిని చేస్తున్నాము.
ఆ సుకృతం మమ్ములను రక్షించుగాక!
ఈ అపకారిని క్రోధంతో నిగ్రహిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

ద్యావాపృథివీ అను మా దీధీథాం
విశ్వే దేవాసో అను మా రభధ్వమ్ ।

---

* "గాయత్రీ తృచాశీతిః" "ఔష్ణిః తృచాశీతిః"
బార్హతీ తృచాశీతిః" — ఐతరేయ అరణ్యకం. I, IV, 3

అఙ్గిరసః పితరః సోమ్యాసః
పాప మార్ఛ త్వపకామస్య కర్తా ॥ 5 ॥

పదము :

ద్యావా పృథివీ ఇతి । అను । మా । ఆ । దీధీథామ్ ।
విశ్వే । దేవాసః । అను । మా । ఆ । రభధ్వమ్ ।
అఙ్గిరసః । పితరః । సోమ్యాసః ।
పాపమ్ । ఆ । ఋచ్ఛతు । అపఽకామస్య । కర్తా ॥ 5 ॥

**అనువాదం :**

ఓ, ద్యావా పృథువులారా! మీరు కూడ
నాతో పాటు శత్రు జయార్థం ప్రజ్వలితు లగుదురుగాక!
విశ్వేదేవులారా! శత్రుజయార్థం ఉద్యుక్తుడనైన
నన్ను మీరు అనుసరింతురు గాక!
సోమార్హులైన అంగిరో ఋషులారా!
మీరు కూడ ఉద్యుక్తు లగుదురు గాక!
అనిష్ట కార్యకారి అయిన శత్రువు
మృతి లక్షణమైన పాపాన్ని పొందుగాక! ॥ 5 ॥

మంత్రము :

అతీవ యో మరుతో మన్యతే నో
బ్రహ్మ వా యో నిన్దిషత్ క్రియమాణమ్ ।

తపూంషి తస్మై వృజినాని సన్తు
బ్రహ్మద్విషం ద్యౌ రభి సంతపాతి ॥ 6 ॥

పదము :

అతి ఽ ఇవ । యః । మరుతః । మన్యతే । నః ।
బ్రహ్మ । వా । యః । నిన్దిషత్ । క్రియమాణమ్ ।
తపూంషి । తస్మై । వృజినాని । సన్తు ।
బ్రహ్మ ఽ ద్విషమ్ । ద్యౌః । అభి ఽ సంతపాతి ॥ 6 ॥

అనువాదం :

ఓ మరుత్తులారా ! * మా కంటె అధికుడనని
అనుకుంటున్న విరోధికి,
మేము చేస్తున్న మంత్ర కర్మను నిందిస్తున్న విరోధికి,
తాపకములైన తేజస్సులు బాధకము లగుగాక !
ఆదిత్యుడు ఆ బ్రహ్మద్వేషిని
మిక్కిలి పరితపింప చేయుగాక ! ॥ 6 ॥

మంత్రము :

సప్త ప్రాణా నష్టౌ మన్యస్తాం స్తే వృశ్చామి బ్రహ్మణా ।
అయా యమస్య సాదనమగ్నిదూతో అరంకృతః ॥ 7 ॥

పదము ;

సప్త । ప్రాణాన్ । అష్టౌ । మన్యః । తాన్ । తే । వృశ్చామి ।
బ్రహ్మణా ।

* ( 49 మంది గణదేవతలు )

అయాః। యమస్య। సదనమ్। అగ్ని౽దూతః। అరమ్౽కృతః ॥ 7 ॥

**అనువాదం:**

సప్త సంఖ్యాకాలైన ప్రాణాలను * అష్ట సంఖ్యాకాలైన
కంఠగత నాడీ విశేషాలను ఖండిస్తాను.
నీకు సంబంధించిన మిగత అవయవములను
మంత్ర సాధ్య అభిచార కర్మతో ఛేదిస్తున్నాను.
నీవు ఇలా సర్వాంగములు ఛిన్నములు కాగా,
అగ్ని దూతకాగా, శవాలంకారాలతో
యమ సదనానికి వెళ్ళు. ॥ 7 ॥

**మంత్రము:**

ఆ దధామి తే పదం సమిద్ధే జాతవేదసి ।

అగ్నిః శరీరం వేవేష్ట్వసుం వాగపి గచ్ఛతు ॥ 8 ॥

**పదము:**

ఆ। దధామి। తే। పదమ్। సమ్౽ఇద్ధే। జాత౽వేదసి।

అగ్నిః। శరీరమ్। వేవేష్టు। అసుమ్। వాక్। అపి। గచ్ఛతు॥8॥

**అనువాదం:**

ఓ పగవాడా! నీ పాద పాంసువును ఛిన్న పర్ణ సహితంగా
జ్వలిస్తున్న అగ్నిలో వ్రేలుస్తున్నాను.
తద్వారా అగ్ని నీ పాదంలో ప్రవేశించి
సర్వాంగ ములకు వ్యాపించుగాక!
అట్లాగే నీ మాట కూడ పడిపోవుగాక! ॥ 8 ॥

ఇది పన్నెండవ సూక్తం

---

* (చక్షురాదీంద్రియాలను) (తలలో ఉండే ఇంద్రియాలను)

## సూక్తం – 13

# వస్త్ర ధారణ సూక్తం

ఋషి : అథర్వుడు ॥ దేవత : అగ్ని ॥ 2, 3 బృహస్పతి, 4, 5 విశ్వేదేవతలు
ఛందస్సు : 1-3 త్రిష్టుప్, 4 అనుష్టుప్ : 5విరాడ్ జగతీ॥ మంత్రములు :
॥ 5 ॥

వినియోగం :- గోదాన రూపమైన సంస్కార కర్మలో, శాంత్యుదకంతో ఈ మంత్రాలను వినియోగించాలి. అలాగే నూతన వస్త్రధారణలోను దీనికి వినియోగం, 'పరిధత్త' అనే మంత్రంతో అభి మంత్రించి పురోహితుడు ఉదయమే రాజునకు వస్త్రం ఇవ్వాలి. రాజును ఆసనాధిష్ఠితుని చేయడానికి 'ఏహ్యశ్మానం' అనే మంత్రాన్ని వినియోగించాలి.

మంత్రము :

ఆయుర్దా అగ్నే జరసం వృణానో
ఘృతప్రతీకో ఘృతపృష్ఠో అగ్నే ।
ఘృతం పీత్వా మధు చారు గవ్యం
పితేవ పుత్రా నభి రక్షతాదిమమ్ ॥ 1 ॥

పదము :

ఆయుః౽దాః । అగ్నే । జరసమ్ । వృణానః ।
ఘృత౽ప్రతీకః । ఘృత౽పృష్ఠః । అగ్నే ।
ఘృతమ్ । పీత్వా । మధు । చారు । గవ్యమ్ ।
పితా౽ఇవ । పుత్రాన్ । అభి । రక్షతాత్ । ఇమమ్ ॥ 1 ॥

**అనువాదం :**

ఆయు ర్దాతవైన ఓ అగ్నీ !
వృద్ధాప్యం వచ్చే దాకా ఈ వటువును జీవించునట్లు చెయ్యి.
ఓ అగ్నీ నీవు ఘృతాహుతులతో జ్వాల్య మానుడవు,
ఘృతగాత్రుడవు కమ్ము.
మే మిచ్చే మధురమైన, నిర్మలమైన గవ్యాన్ని,
మేము హోమం చేసిన ఘృతాన్ని యథేచ్ఛగా సేవించు.
తండ్రి పుత్రులను వలె ఈ వటువును రక్షించు. ॥ 1 ॥

**మంత్రము :**

పరిధత్త ధత్త నో వర్చసేమం
జరామృత్యుం కృణుత దీర్ఘమాయుః ।
బృహస్పతిః ప్రాయచ్ఛద్ వాస ఏతత్
సోమాయ రాజ్ఞే పరిధాతవా ఉ ॥ 2 ॥

**పదము :**

పరి । ధత్త । ధత్త । నః । వర్చసా । ఇమమ్ ।
జరాఽమృత్యుమ్ । కృణుత । దీర్ఘమ్ । ఆయుః ।
బృహస్పతిః । ప్ర । అయచ్ఛత్ । వాసః । ఏతత్ ।
సోమాయ । రాజ్ఞే । పరిఽధాతవై । ఓం ఇతి ॥ 2 ॥

**అనువాదం :**

ఓ దేవతలారా ! ఈ మాణవకుని (వటువును)
వస్త్రంతో అలంకరించండి.

మా వానిని తేజస్వీని చేయండి.
* వీనిని వృద్ధాప్యం లోనే మరణించు నట్లు చేయండి.
ఇతను దీర్ఘాయుష్మంతు డగుగాక!
బృహస్పతి ఈ వస్త్రాన్ని
బ్రాహ్మణ రాజైన సోమునకు కట్టుకొనుటకై ఇచ్చినాడు. ॥2॥

మంత్రము:

పరీదం వాసో అధిథాః స్వ స్తయే।
భూ గ్గృష్టీ నామభి శ స్తిపా ఉ।
శతం చ జీవ శరదః పురూచీ
రాయశ్చ పోష ముప సంవ్యయస్వ ॥ 3 ॥

పదము:

పరి। ఇదమ్। వాసః। అధిథాః। స్వస్తయే।
అభూః। గృష్టీనామ్। అభిశస్తిఽపాః। ఓం ఇతి।
శతమ్। చ। జీవ। శరదః। పురూచీః।
రాయః। చ। పోషమ్। ఉపఽసంవ్యయస్వ ॥ 3 ॥

అనువాదం:

ఓ మాణవకుడా!
నీ క్షేమం కోసం ఈ వస్త్రాన్ని ధరించినావు.
దీనితో గోవులను హింసా భయం నుండి తప్పిస్తున్నావు.

---

* (అకాల మృత్యువు వాత పడకుండా చేయండి అని భావం.)

బహువిధ పుత్ర పౌత్రాదులతో
శతాయుష్కుడవై జీవించు.
ధనాన్ని అభివృద్ధి చేయి. ॥ 3 ॥

మంత్రము:

ఏహ్యశ్మానమా తిష్ఠాశ్మా భవతు తే తనూః ।
కృణ్వన్తు విశ్వే దేవా ఆయుష్టే శరదః శతమ్ ॥ 4 ॥

పదము :

ఆ । ఇహి । అశ్మానమ్ । ఆ । తిష్ఠ । అశ్మా । భవతు । తే । తనూః।
కృణ్వన్తు । విశ్వే । దేవాః । ఆయుః । తే । శరదః । శతమ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ మాణవకుడా! రమ్ము.
దక్షిణపాదం పెట్టు.
నీ శరీరం శిలవలె దృఢ మగుగాక!
విశ్వేదేవతలు నిన్ను
శతాయుష్కుని చేయుదురుగాక! ॥ 4 ॥

మంత్రము:

యస్య తే వాసః ప్రథమవాస్యం।
హరామస్తం త్వా విశ్వేవన్తు దేవాః ।
తం త్వా భ్రాతరః సువృధా వర్ధమాన
మను జాయన్తాం బహవః సుజాతమ్ ॥ 5 ॥

అథర్వ. 13

పదము ;

యస్య । తే । వాసః । ప్రథమఽవాస్యఽమ్ ।

హరామః । తమ్ । త్వా । విశ్వే । అవన్తు । దేవాః ।

తమ్ । త్వా । భ్రాతరః । సుఽవృధా । వర్ధమానమ్ ।

అను । జాయన్తామ్ । బహవః । సుఽజాతమ్ ॥ 5 ॥

అనువాదం :

ఓ మాణవకుడా !
నీ ప్రథమ వస్త్రాన్ని స్వీకరిస్తున్నాము.
నిన్ను సర్వదేవతలు రక్షింతురుగాక !
వర్ధమానుడవు, సుజాతుడవు అయిన నీ తరువాత
అనేక మంది సోదరులు కలుగుదురుగాక ! ॥ 5 ॥

ఇది పదమూడవ సూక్తం

## సూక్తం - 14

# ఆపన్నివారణ - సూక్తం

ఋషి: చాతనుడు ॥ దేవత: మంత్రాలలో పేర్కొన్న అగ్ని, భూతపతి, ఇంద్రుడు ॥ ఛందస్సు: 1,3,5,6 అనుష్టుప్ : 2 భురిగనుష్టుప్ ॥ 4 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ ॥ మంత్రములు ; ॥ 6 ॥

వినియోగం :- సంతాన నాశ నివారణార్థమై స్త్రీకి చేసే కర్మకాండలో, గొడ్డు పశువులున్న ఇల్లు దైవహతమౌతుందని, తన్నివారణార్థం చేసే కర్మలో, గృహశాంతికై చేసే కర్మలో దీనికి వినియోగం. ఈ సూక్తం చాతనగణంలో కూడ ఉన్నది.

మంత్రము :

నిః సాలాం ధృష్ణుం ధిషణమేకవాద్యాం జిఘత్స్వ౨మ్ ।

సర్వాశ్చణ్డస్య నప్త్యో౨ నాశయామః సదాన్వాః ॥ 1 ॥

పదము :

నిః౨సాలామ్ । ధృష్ణుమ్ । ధిషణమ్ । ఏక౨వాద్యామ్ । జిఘత్౨స్వ౨మ్ ।

సర్వాః । చణ్డస్య । నప్త్య౨ః । నాశయామః । సదాన్వాః ॥ 1 ॥

అనువాదం :

నిస్సాలమనే పేరుగల భయంకరమైన పిశాచిని,
"ధృష్ణు" నామక పిశాచాన్ని నశింప జేస్తున్నాము.
ధిషణమనే పేరుగల పాపగ్రహాన్ని
'ఏకవాద్య' అనే పేరుగల దానిని
'జిఘుత్సు' అనే పేరుగల దానిని నశింప జేస్తున్నాము.
చండగ్రహ సంతానాన్ని, ఆ క్రోశకారిణులైన
సర్వపిశాచాలను నశింప జేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము :

నిర్వో గోష్ఠాదజామసి నిరక్షాన్నిరుపానసాత్ ।

నిర్వో మగున్ద్యా దుహితరో గృహేభ్యశ్చాతయామహే ॥ 2 ॥

పదము :

నిః । వః । గో౨స్థాత్ । అజామసి । నిః । అక్షాత్ । నిః ।ఉప౨ఆన సాత్ ।

నిః । వః । మగున్ద్యాః । దుహితరః । గృహేభ్యః । చాతయా

మహే ॥ 2 ॥

**అనువాదం :**

ఓ మగుండీ (పిశాచి) పుత్రికలారా !
మిమ్ములను గోశాలనుంచి తరిమి వేస్తున్నాము.
ద్యూతశాల నుంచి కూడ తరిమి వేస్తున్నాము.
ధాన్యాగారాన్నుంచి కూడ తరిమి వేస్తున్నాము.
అలాగే మా నివాస గృహాలనుంచి
మిమ్ములను తన్ని తగులవేస్తున్నాము. ॥ 2 ॥

**మంత్రము :**

అసౌ యో అధరాద్ గృహ స్తత్ర స న్త్వరాయ్యః ।
తత్ర సేది ర్న్యుచ్యతు సర్వాశ్చ యాతుధాన్యః ॥ 3 ॥

**పదము :**

అసౌ । యః । అధరాత్ । గృహః । తత్ర । సన్తు । అరాయ్యః ।
తత్ర । సేదిః । ని । ఉచ్యతు । సర్వాః । చ । యాతుఽధాన్యః

॥ 3 ॥

**అనువాదం :**

ఈ భూమికి క్రిందనున్న పాతాళలోకంలో
'అరాయములు' అనుపేరుగల పిశాచా లుండగాక !
'నిర్‌ఋతి' అనే పిశాచం కూడ అక్కడే ఉండుగాక !
ఆ పాతాళంలో కూడా నిఖిల యాతుధానులు
వాటితో కలిసి ఉండి పోదురు గాక ! ॥ 3 ॥

మంత్రము :

భూతపతిర్నిరజత్విన్ద్రశ్చేతః సదాన్వాః ।
గృహస్య బుధ్న ఆసీనాస్తా ఇన్ద్రో వజ్రేణాధి తిష్ఠతు ॥ 4 ॥

పదము :

భూతఽపతిః । నిః । అజతు । ఇన్ద్రః । చ । ఇతః । సదాన్వాః ।
గృహస్య । బుధ్నే । ఆసీనాః । తాః । ఇన్ద్రః । వజ్రేణ । అధి ।
తిష్ఠతు ॥ 4 ॥

అనువాదం :

భూతపతి అయిన రుద్రుడు సదా ఆక్రోశించే పిశాచాలను
ఇక్కడనుంచి తరిమి వేయుగాక!
ఇంద్రుడు కూడ వానిని తరిమి వేయుగాక!
మా ఇంటి అధః ప్రదేశంలో ఉన్న పిశాచాలను
ఇంద్రుడు వజ్రంతో అణచి ఉంచుగాక! ॥ 4 ॥

మంత్రము :

యది స్థ క్షేత్రియాణాం యది వా పురుషేషితాః ।
యది స్థ దస్యుభ్యో జాతా నశ్యతేతః సదాన్వాః ॥ 5 ॥

పదము :

యది । స్థ । క్షేత్రియాణామ్ । యది । వా । పురుషఽఇషితాః ।
యది । స్థ । దస్యుఽభ్యః । జాతాః । నశ్యత । ఇతః । సదాన్వాః
॥ 5 ॥

**అనువాదం:**

క్షేత్రియ రోగాలకు మూలమైన
పిశాచులారా! మీరు నశించండి.
పగవాని పంపున వచ్చిన పిశాచులారా! నశించండి.
చోరాదుల నుంచి ప్రాదుర్భవించిన
మీరు నశింతురుగాక!
మీ రిక్కడ నుంచి తొలగిపొండి. ॥ 5 ॥

**మంత్రము:**

పరి ధామాన్యాసామాశుర్గాష్ఠామివాసరమ్ ।
అజైషం సర్వాన్ ఆజీన్ వో నశ్యతేతః సదాన్వాః ॥ 6 ॥

**పదము:**

పరి । ధామాని । ఆసామ్ । ఆశుః । గాష్ఠామ్ఽఇవ । అసరన్ ।
అజైషమ్ । సర్వాన్ । ఆజీన్ । వః । నశ్యత । ఇతః । సదాన్వాః
॥ 6 ॥

**అనువాదం.**

ఆ పిశాచాల నివాసస్థానాలను
అన్నిటిని ఆక్రమిస్తున్నాను.
అశ్వం తన గమ్యం చేరినట్టు, ఓ పిశాచులారా!
మీతోడి పోరాటా లన్నింటిలో నేను గెలిచినాను.
కావున మీ రిక్కడ లేకుండా నశింతురుగాక! ॥ 6 ॥

ఇది పదునాల్గవ సూక్తం.

## సూక్తం - 15

# నిర్భయ జీవనం

ఋషిః బ్రహ్మ॥ దేవత : ప్రాణము ॥ ఛందస్సు : త్రిపాద్ గాయత్రీ॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :- ఆయుష్కాముడు చేసే కర్మకాండలో దీనికి వినియోగం.

మంత్రము :

యథా ద్యౌశ్చ పృథివీ చ న బిభీతో న రిష్యతః ।
ఏవా మే ప్రాణ మా బిభేః ॥ 1 ॥

పదము :

యథా । ద్యౌః । చ । పృదివీ । చ । న । బిభీతః । న । రిష్యతః ।
ఏవ । మే । ప్రాణ । మా । బిభేః ॥ 1 ॥

అనువాదం :

దేవలోకం భూలోకం ఎట్లా భయశంకా రహితంగా,
నాశ రహితంగా ఉండునో అట్లే ఓ నా ప్రాణమా!
నీవు కూడా భయరహితవై ఉండు. ॥ 1 ॥

మంత్రము :

యథా హశ్చ రాత్రీచ న బిభీతో న రిష్యతః ।
ఏవా మే ప్రాణ మా బిభేః ॥ 2 ॥

**పదము :**

యథా। అహః। చ। రాత్రీ। చ। న। బిభీతః। న। రిష్యతః।

ఏవ। మే। ప్రాణ। మా। బిభేః ॥ 2 ॥

**అనువాదం :**

రాత్రిం బగళ్ళు భయ రహితంగా,
నాశ రహితంగా ఉన్నట్లే,
ఓ నా ప్రాణమా! నీవు కూడ
భయరహితవై ఉండు. ॥ 2 ॥

**మంత్రము :**

యథా సూర్యశ్చ చన్ద్రశ్చ న బిభీతో న రిష్యతః।

ఏవా మే ప్రాణ మా బిభేః ॥ 3 ॥

**పదము :**

యథా। సూర్యః। చ। చన్ద్రః। చ। న। బిభీతః। న। రిష్యతః।

ఏవ। మే। ప్రాణ। మా। బిభేః ॥ 3 ॥

**అనువాదం :**

సూర్యుడు, చంద్రుడు భయ రహితులుగా,
వినాశ రహితులుగా ఉన్నట్లు ఓ నా ప్రాణమా!
నీవు కూడ భయరహితవై ఉండు. ॥ 3 ॥

**మంత్రము :**

యథా బ్రహ్మ చ క్షత్రం చ న బిభీతో న రిష్యతః।

ఏవా మే ప్రాణ మా బిభేః ॥ 4 ॥

పదము :

యథా । బ్రహ్మ । చ । క్షత్రమ్ । చ । న । బిభీతః । న । రిష్యతః ।
ఏవ । మే । ప్రాణ । మా । బిభేః ॥ 4 ॥

అనువాదం :

బ్రాహ్మణ క్షత్రియులు భయ రహితులుగా,
వినాశ రహితులుగా ఉన్నట్లు ఓ నా ప్రాణమా !
నీవు కూడ భయరహితవై ఉండు. ॥ 4 ॥

మంత్రము .

యథా సత్యం చానృతం చ న బిభీతో న రిష్యతః ।
ఏవా మే ప్రాణ మా బిభేః ॥ 5 ॥

పదము :

యథా । సత్యమ్ । చ । అనృతమ్ । చ । న । బిభీతః । న । రిష్యతః
ఏవ । మే । ప్రాణ । మా । బిభేః ॥ 5 ॥

అనువాదం :

సత్యము, అసత్యము ఏ విధంగా
భయ రహితంగా వినాశ రహితంగా ఉండునో,
అట్లే ఓ నా ప్రాణమా ! నీవు భయరహితవై ఉండు. ॥ 5 ॥

మంత్రము :

యథా భూతం చ భవ్యం చ న బిభీతో న రిష్యతః ।
ఏవా మే ప్రాణ మా బిభేః ॥ 6 ॥

పదము :

యథా । భూతమ్ । చ । భవ్యమ్ । చ । న । బిభీతః । న । రిష్యతః

ఏవ । మే । ప్రాణ । మా । బిభేః ॥ 6 ॥

అనువాదం :

భూత భవిష్యత్తులు ఏ విధంగా
భయ రహితంగా, వినాశ రహితంగా ఉండునో-
అట్లే ఓ నా ప్రాణమా! నీవు భయరహితవై ఉండు. ॥ 6 ॥

ఇది పదునైదవ సూక్తం.

## సూక్తం - 16

# విశ్వంభర ప్రార్థన

ఋషిః బ్రహ్మా ॥ దేవతలు : 1 ప్రాణాపానములు: 2 ద్యావాపృథువులు ; 3 సూర్యుడు 4 అగ్ని ; 5 విశ్వంభరుడు॥ ఛందస్సు : 1, 3 ఏకపదాఽఽసురీ త్రిష్టుప్; 2 ఏకపదాఽఽసుర్యుష్ణిక్ ; 4 ద్విపదాఽఽసురీ గాయత్రీ ॥

మంత్రములు. ॥ 5 ॥

వినియోగం:- ఆయుష్కాముడు చేసే హోమంలో దీనికి వినియోగం.

మంత్రము :

ప్రాణాపానౌ మృత్యోర్మా పాతం స్వాహా ॥ 1 ॥

పదము :

ప్రాణాపానౌ । మృత్యోః । మా । పాతమ్ । స్వాహా ॥ 1 ॥

అనువాదం :

ప్రాణాపానములారా!
మృత్యువు నుంచి నన్ను రక్షించండి.
మీకిదే నా హవిః ప్రదానం. ॥ 1 ॥

మంత్రము :

ద్యావాపృథివీ ఉపశ్రుత్యా మా పాతం స్వాహా ॥ 2 ॥

పదము :

ద్యావాపృథివీ। ఇతి। ఉపఽశ్రుత్యా । మా । పాతమ్ । స్వాహా ॥ 2 ॥

అనువాదం :

ఓ ద్యావా పృథ్వులారా !
శ్రవణ శక్తి ప్రదానంతో నన్ను రక్షించండి.
మీ కిదే నా హవిః ప్రదానం. ॥ 2 ॥

మంత్రము:

సూర్య చక్షుషా మా పాహి స్వాహా ॥ 3 ॥

పదము :

సూర్యః । చక్షుషా । మా । పాహి । స్వాహా ॥ 3 ॥

అనువాదం :

ఓ సూర్యుడా! చక్షురింద్రియ శక్తినిచ్చి నన్ను రక్షించు.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 3 ॥

మంత్రము :

అగ్నే వైశ్వానర విశ్వైర్మా దేవైః పాహి స్వాహా ॥ 4 ॥

పదము :

అగ్నే । వైశ్వానర । విశ్వైః । మా । దేవైః । పాహి । స్వాహా ॥ 4 ॥

అనువాదం :

వైశ్వానరుడవైన ఓ అగ్ని !

వాగింద్రియాదుల నిచ్చి నన్ను రక్షించు.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 4 ॥

మంత్రము :

విశ్వమ్భర విశ్వేన మా భరసా పాహి స్వాహా ॥ 5 ॥

పదము :

విశ్వమ్ఽభర । విశ్వేన । మా । భరసా । పాహి । స్వాహా ॥ 5 ॥

అనువాదం :

ఓ విశ్వంభరా! (జఠరాగ్నీ!)
సర్వపోషణ శక్తి నిచ్చి నన్ను రక్షించు.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 5 ॥

ఇది పదునారవ సూక్తం

## సూక్తం — 17

# ఆత్మ సంరక్షణ ప్రార్థన.

ఋషిః బ్రహ్మ ॥ దేవత : ఓజస్సు మొదలగు దేవతలు ॥ ఛందస్సు : 1-6 ఏకపదాఽఽసురీ త్రిష్టుప్ ; 8 అసుర్యుష్ణిక్ : మంత్రములు : ॥ 7 ॥

వినియోగం : ఆయుష్కాముడు చేసే హోమాదులలో దీనికి వినియోగం.

మంత్రము :

ఓజోస్యోజో మే దాః స్వాహా ॥ 1 ॥

పదము :

ఓజః । అసి । ఓజః । మే । దాః । స్వాహా ॥ 1 ॥

**అనువాదం :**

ఓ అగ్నీ ! నీవు
ఓజస్స్వరూపుడవు.
కావున నాకు
ఓజస్సు నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 1 ॥

**మంత్రము :**

సహోఽసి సహో మే దాః స్వాహా ॥ 2 ॥

**పదము :**

సహః । అసి । సహః । మే । దాః । స్వాహా ॥ 2 ॥

**అనువాదం :**

ఓ అగ్నీ ! నీవు శత్రువులను
అభిభవించే తేజస్స్వరూపుడవు.
నీవు నాకు తేజస్సు నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 2 ॥

**మంత్రము :**

బలమసి బలం మే దాః స్వాహా ॥ 3 ॥

**పదము :**

బలమ్ । అసి । బలమ్ । మే । దాః । స్వాహా ॥ 3 ॥

**అనువాదం :**

ఓ అగ్నీ ! నీవు బలస్వరూపుడవు.
నీవు నాకు బలాన్నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 3 ॥

మంత్రము :

ఆయురస్యాయుర్మే దాః స్వాహా ॥ 4 ॥

పదము :

ఆయుః । అసి । ఆయుః । మే । దాః । స్వాహా ॥ 4 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు ఆయు స్స్వరూపుడవు.
నాకు పూర్ణాయుస్సు నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 4 ॥

మంత్రము :

శ్రోత్ర మసి శ్రోత్రం మే దాః స్వాహా ॥ 5 ॥

పదము :

శ్రోత్రమ్ । అసి । శ్రోత్రమ్ । మే । దాః । స్వాహా ॥ 5 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు శ్రోత్ర స్వరూపుడవు.
నాకు శ్రోత్రాన్నిమ్ము, నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 5 ॥

మంత్రము :

చక్షు రసి చక్షు ర్మే దాః స్వాహా ॥ 6 ॥

పదము :

చక్షుః । అసి । చక్షుః । మే । దాః । స్వాహా ॥ 6 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు చక్షు స్స్వరూపుడవు.

నాకు చక్షువు నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 6 ॥

మంత్రము:

పరిపాణ మసి పరి పాణం మే దాః స్వాహా ॥ 7 ॥

పదము:

పరిఽపానమ్। అసి। పరిఽపానమ్। మే। దాః। స్వాహా ॥ 7 ॥

ఇతి తృతీయోఽనువాకః

అనువాదం:

ఓ అగ్ని! నీవు పరిపాలకుడవు.
ఆయుర్భంగ భూతములైన వాని నుంచి నాకు రక్షణ నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం.

ఇది పదునేడవ సూక్తం

ఇది మూడవ అనువాకం.

# అనువాకం - 4

## సూక్తం - 18

ఋషిః చాతనుడు॥ దేవత: అగ్ని॥ ఛందస్సు: ద్విపాదసామ్ని బృహతీ॥ మంత్రములు. ॥ 5 ॥

వినియోగం:- అభిచార కర్మలో దీనికి వినియోగం. ఇదికూడ చాతన గణం లోనిది.

మంత్రము:

భ్రాతృవ్యక్షయణ మసి భ్రాతృ వ్యచాతనం మే దాః స్వాహా
॥ 1 ॥

పదము :

భ్రాతృవ్యఽక్షయణమ్ । అసి । భ్రాతృవ్యఽచాతనమ్ । మే ।
దాః । స్వాహా ॥ 1 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు జ్ఞాతులైన శత్రువుల క్షయ కారకుడవు.
నాకు జ్ఞాతులైన శత్రువులను క్షయింపజేసే శక్తినిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 1 ॥

మంత్రము :

సపత్నక్షయణ మసి సపత్నచాతనం మేదాః స్వాహా ॥ 2 ॥

పదము :

సపత్నఽక్షయణమ్ । అసి । సపత్నఽచాతనమ్ । మే । దాః ।
స్వాహా ॥ 2 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నీవు జ్ఞాతులు కాని శత్రువులకు క్షయకారకుడవు.
నా కా శత్రుక్షయ శక్తినిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 2 ॥

మంత్రము :

అరాయక్షయణ మస్య రాయ చాతనం మే దాః స్వాహా ॥ 3 ॥

పదము :

అరాయఽక్షయణమ్ । అసి । అరాయఽచాతనమ్ । మే । దాః ।
స్వాహా ॥ 3 ॥

అనువాదం :

ఓ అగ్నీ! నీవు శ్రేయో విఘ్నకారులను
క్షయింప జేయువాడవు.
నాకా శక్తి నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 3 ॥

మంత్రము :

పిశాచ క్షయణ మసి పిశాచచాతనం మే దాః స్వాహా ॥ 4 ॥

పదము :

పిశాచఽక్షయణమ్ । అసి । పిశాచఽచాతనమ్ । మే । దాః ।
స్వాహా ॥ 4 ॥

అనువాదం :

ఓ అగ్నీ! నీవు పిశాచాలను నశింప జేయువాడవు.
నాకా పిశాచ నాశక శక్తి నిమ్ము.
నీకిదే నా హవిః ప్రదానం. ॥ 4 ॥

మంత్రము :

సదాన్వా క్షయణ మసి సదాన్వా చాతనం మేదాః స్వాహా ॥ 5 ॥

పదము :

సదాన్వాఽక్షయణమ్ । అసి । సదాన్వాఽచాతనమ్ । మే । దాః ।
స్వాహా ॥ 5 ॥

అనువాదం :

ఓ అగ్నీ! నీవు సదా ఆక్రోశించే పిశాచాలను
క్షయింప జేయువాడవు.

నా కా పిశాచ నాశక శక్తి నిమ్ము.
నీ కిదే నా హవిః ప్రదానం. ॥ 5 ॥

ఇది పదునెనిమిదవ సూక్తం

## సూక్తం-19

# ప్రాయశ్చిత్త విధి

ఋషిః అథర్వుడు ॥ దేవత : అగ్ని ॥ ఛందస్సు : 1-4 నిచృద్ విషమా త్రిపాద్ గాయత్రీ ; 5 భురిగ్ విషమా త్రిపాద్ గాయత్రీ ॥ మంత్రములు : ॥5॥

వినియోగం :- అభిచార కర్మలో, ముందుచేసే అజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము :

అగ్నే యత్ తే తప స్తేన తం ప్రతి తప
యో ఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 1 ॥

పదము :

అగ్నే । యత్ । తే । తపః । తేన । తమ్ । ప్రతి । తప ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయం । ద్విష్మః ॥ 1 ॥

అనువాదం :

ఎవడైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మెవనిని ద్వేషిస్తున్నామో,
అతని యెడల ఓ అగ్నీ !
నీ తపన శక్తితో ప్రజ్వరిల్లు. ॥ 1 ॥

మంత్రము :

అగ్నే యత్ తే హరస్తేన తం ప్రతి హర
యో౽స్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 2 ॥

పదము :

అగ్నే । యత్ । తే । హరః । తేన । తమ్ । ప్రతి । హర ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 2 ॥

అనువాదం :

ఎవడైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మెవనిని దేషిస్తున్నామో, ఓ అగ్ని !
నీ సంహారణ శక్తితో అతనిని సంహారించు. ॥ 2 ॥

మంత్రము :

అగ్నే యత్ తే౽ర్చి స్తేన తం ప్రత్యర్చ
యో౽స్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 3 ॥

పదము :

అగ్నే । యత్ । తే । అర్చిః । తేన । తమ్ । ప్రతి । అర్చ ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 3 ॥

అనువాదం :

ఎవడైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మెవనిని ద్వేషిస్తున్నామో, ఓ అగ్ని !
నీ దీప్తితో అతనిని దహింప జెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

అగ్నే యత్ తే శోచిస్తేన తం ప్రతి శోచ
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 4 ॥

పదము :

అగ్నే । యత్ । తే । శోచిః । తేన । తమ్ । ప్రతి । శోచ ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 4 ॥

అనువాదం :

ఎవడైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మెవనిని ద్వేషిస్తున్నామో, ఓ అగ్నీ!
నీ శోకజనన శక్తితో అతనిని శోకింప జెయ్యి. ॥ 4 ॥

మంత్రము :

అగ్నే యత్ తే తేజస్తేన త మతేజసం కృణు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 5 ॥

పదము :

అగ్నే । యత్ । తే । తేజః । తేన । తమ్ । అతేజసమ్ । కృణు ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 5 ॥

అనువాదం :

ఎవడైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మెవనిని ద్వేషిస్తున్నామో, ఓ అగ్నీ!
నీ తేజస్సుతో అతనిని నిస్తేజస్కుని చెయ్యి. ॥ 5 ॥

ఇది పందొమ్మిదవ సూక్తం

## సూక్తం-20

ఋషిః అథర్వుడు॥ దేవత : వాయువు॥ ఛందస్సు: 1-4 నిచృద్ విషమా త్రిపాద్ గాయత్రీ: 5 భురిగ్విషమా త్రిపాద్ గాయత్రీ॥
మంత్రములు : ॥ 5 ॥

మంత్రము.

వాయో యత్ తే తపస్తేన తం ప్రతి తప
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 1 ॥

పదము.

వాయో ఇతి। యత్। తే। తపః। తేన। తమ్। ప్రతి। తప।
యః। అస్మాన్। ద్వేష్టి। యమ్। వయమ్। ద్విష్మః ॥ 1 ॥

అనువాదం:

ఓ వాయుదేవా! నీవు తపనశక్తి కలవాడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో, ఆ శత్రువును నీవు
నీ తపన శక్తితో తపింప జెయ్యి. ॥ 1 ॥

మంత్రము:

వాయో యత్ తే హరస్తేన తం ప్రతి హర
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 2 ॥

పదము.

వాయో। ఇతి। యత్। తే। హరః। తేన। తమ్। ప్రతి। హర।
యః। అస్మాన్। ద్వేష్టి। యమ్। వయమ్। ద్విష్మః ॥ 2 ॥

అనువాదం :

ఓ వాయుదేవా! నీవు హరణ శక్తి కలవాడవు
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మెవనిని ద్వేషిస్తున్నామో,
అతనిని నీ హరణ శక్తితో హరించు. ॥ 2 ॥

మంత్రము .

వాయో యత్ తేఽర్చి స్తేన తం ప్రత్యర్చ
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 3 ॥

పదము :

వాయో । ఇతి । యత్ । తే । అర్చిః । తేన । తమ్ । ప్రతి। అర్చ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 3 ॥

అనువాదం :

ఓ వాయుదేవా! నీవు దీప్తిమంతుడవు,
ఎవడైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేము ఎవనినైతే ద్వేషిస్తున్నామో,
ఆ శత్రువును నీ వా దీప్తితో దహింప జెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

వాయో యత్ తే శోచిస్తేన తం ప్రతి శోచ
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 4 ॥

పదము :

వాయోఇతి । యత్ । తే । శోచిః । తేన । తమ్ । ప్రతి । శోచ ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 4 ॥

అనువాదం :

ఓ వాయుదేవా నీవు శోకజనన సమర్థుడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని శోకింప జెయ్యి. ॥ 4 ॥

మంత్రము :

వాయో యత్ తే తేజస్తేన తమతేజసం కృణు
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 5 ॥

పదము.

వాయో ఇతి । యత్ । తే । తేజః । తేన । తమ్ । అతేజసమ్ । కృణు ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 5 ॥

అనువాదం :

ఓ వాయుదేవా! నీవు తేజోవంతుడవు.
ఏ శత్రువైతే మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని నీ తేజస్సుతో నిస్తేజస్కుణ్ణి చెయ్యి. ॥ 5 ॥

ఇది ఇరవైయవ సూక్తం

## సూక్తం-21

ఋషి: అథర్వుడు॥ దేవత : సూర్యుడు॥ ఛందస్సు : 1-4 నిచృద్ విషమా త్రిపాద్ గాయత్రీ : భురిగ్ విషమా త్రిపాద్ గాయత్రీ॥ మంత్రములు ॥ 5 ॥

మంత్రము:

సూర్య యత్ తే తపస్తేన తం ప్రతి తప
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 1 ॥

పదము:

సూర్య । యత్ । తే । తపః । తేన । తమ్ । ప్రతి । తప ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 1 ॥

ఓ సూర్యుడా! నీవు తపన శక్తి కలవాడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని నీ తపన శక్తితో తపింప జెయ్యి. ॥ 1 ॥

మంత్రము:

సూర్య యత్ తే హరస్తేన తంప్రతి హర
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 2 ॥

పదము:

సూర్య । యత్ । తే । హరః । తేన । తమ్ । ప్రతి । హర ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 2 ॥

అనువాదం:

ఓ సూర్యుడా! నీవు హరణ శక్తి కలవాడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని నీ హరణ శక్తితో హరించు. ॥ 2 ॥

మంత్రము :

సూర్య యత్ తేర్చిస్తేన తం ప్రత్యర్చ

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 3 ॥

పదము :

సూర్య । యత్ । తే । అర్చిః । తేన । తమ్ । ప్రతి । అర్చ ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 3 ॥

అనువాదం :

ఓ సూర్యుడా! నీవు దీప్తిమంతుడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని నీ దీప్తితో దహింప జెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

సూర్య యత్ తే శోచిస్తేన తం ప్రతి శోచ

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 4 ॥

పదము :

సూర్య । యత్ । తే । శోచిః । తేన । తమ్ । ప్రతి । శోచ ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 4 ॥

అనువాదం :

ఓ సూర్యుడా! నీవు శోక జనక సమర్థుడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,

మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని శోకింపజెయ్యి. ॥ 4 ॥

మంత్రము :

సూర్య యత్ తే తేజస్తేన తమ తేజసం కృణు
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 5 ॥

పదము :

సూర్య । యత్ । తే । తేజః । తేన । తమ్ । అతేజసమ్ । కృణు ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 5 ॥

అనువాదం :

ఓ సూర్యుడా! నీవు తేజోవంతుడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని నీ తేజస్సుతో నిస్తేజుని చెయ్యి ॥ 5 ॥

ఇది ఇరవై యొకటవ సూక్తం

## సూక్తం - 22

ఋషి: అథర్వుడు॥ దేవత. చంద్రుడు॥ ఛందస్సు: 1-4 నిచృద్ విషమా త్రిపాద గాయత్రీ: 5 భురిగ్ విషమా త్రిపాదగాయత్రీ॥ మంత్రములు॥5॥

మంత్రము :

చన్ద్ర యత్ తే తపస్తేన తం ప్రతి తప
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 1 ॥

పదము.

చన్ద్ర। యత్। తే। తపః। తేన। తమ్। ప్రతి। తప।
యః। అస్మాన్। ద్వేష్టి। యమ్। వయమ్। ద్విష్మః ॥ 1 ॥

అనువాదం:

ఓ చంద్రుడా! నీవు తపన శక్తి కలవాడవు
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని నీ తపన శక్తితో తపింప జెయ్యి. ॥ 1 ॥

మంత్రము:

చన్ద్ర యత్ తే హరస్తేన తం ప్రతి హర
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 2 ॥

పదము.

చన్ద్ర। యత్। తే। హరః। తేన। తమ్। ప్రతి। హర।
యః। అస్మాన్। ద్వేష్టి। యమ్। వయమ్। ద్విష్మః ॥ 2 ॥

అనువాదం:

ఓ చంద్రుడా! నీవు హరణ శక్తి కలవాడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని నీ హరణ శక్తితో హరించు. ॥ 2 ॥

మంత్రము.

చన్ద్ర యత్ తేఽర్చిస్తేన తం ప్రత్యర్చ

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 3 ॥

పదము :

చన్ద్ర । యత్ । తే । అర్చిః । తేన । తమ్ । ప్రతి । అర్చ ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 3 ॥

అనువాదం :

ఓ చంద్రుడా! నీవు దీప్తిమంతుడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని సందీప్తుడవై దహింప జెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

చన్ద్ర యత్ తే శోచిస్తేన తం ప్రతి శోచ ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 4 ॥

పదము :

చన్ద్ర । యత్ । తే । శోచిః । తేన । తమ్ । ప్రతి । శోచ ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 4 ॥

అనువాదం :

ఓ చంద్రుడా! నీవు శోక జనక సమర్థుడవు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని శోకింప జెయ్యి. ॥ 4 ॥

మంత్రము.

చన్ద్ర యత్ తే తేజస్తేన తమతేజసం కృణు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 5 ॥

పదము :

చన్ద్ర । యత్ । తే । తేజః । తేన । తమ్ । అతేజసమ్ । కృణు ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 5 ॥

అనువాదం :

ఓ చంద్రుడా! నీవు తేజస్వివి.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో
అతనిని నీ తేజస్సుతో నిస్తేజుని చెయ్యి. ॥ 5 ॥

ఇది ఇరవై రెండవ సూక్తం

## సూక్తం - 23

ఋషి: అథర్వుడు ॥ దేవత : అపస్సు ॥ ఛందస్సు : 1-4 సమ విషమా త్రిపాద్ గాయత్రీ ; 5 స్వరాడ్ విషమా త్రిపాద్ గాయత్రీ ॥ మంత్రములు ॥5॥

మంత్రము :

ఆపో యద్ వస్తపస్తేన తం ప్రతి తపత
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 1 ॥

పదము :

ఆపః । యత్ । వః । తపః । తేన । తమ్ । ప్రతి । తపత ।

**యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 1 ॥**

**అనువాదం :**

ఓ ఆపో దేవతలారా !
మీరు తపన శక్తి కలవారు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని మీ తపన శక్తితో తపింప జెయ్యండి. ॥ 1 ॥

**మంత్రము :**

**ఆపో యద్ వో హరస్తేన తం ప్రతి హరత**
**యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 2 ॥**

పదము :

**ఆపః । యత్ । వః । హరః । తేన । తమ్ । ప్రతి । హరత ।**
**యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 2 ॥**

**అనువాదం :**

ఓ జలదేవతలారా !
మీరు హరణ శక్తి కలవారు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని మీ హరణ శక్తితో ప్రతిహరించండి. ॥ 2 ॥

మంత్రము :

**ఆపో యద్ వోఽర్చిస్తేన తం ప్రత్యర్చత**

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 3 ॥

పదము.

ఆపః । యత్ । వః । అర్చిః । తేన । తమ్ । ప్రతి । అర్చత ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 3 ॥

అనువాదం:

ఓ జలదేవతలారా! మీరు దీప్తిమంతులు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మేమే శత్రువును ద్వేషిస్తున్నామో.
అతనిని మీ దీప్తితో దహింప జెయ్యండి. ॥ 3 ॥

మంత్రము:

ఆపో యద్ వః శోచిస్తేన తం ప్రతి శోచత

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 4 ॥

పదము:

ఆపః । యత్ । వః । శోచిః । తేన । తమ్ । ప్రతి । శోచత ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 4 ॥

అనువాదం:

ఓ జలదేవతలారా! మీరు శోకజనక సమర్థులు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని శోకింప జెయ్యండి. ॥ 4 ॥

మంత్రము .

అపో యద్ వస్తేజస్తేన త మతేజసం కృణుత

యో౽స్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః ॥ 5 ॥

పదము .

అపః । యత్ । వః । తేజః । తేన । తమ్ । అతేజసమ్ । కృణుత ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ॥ 5 ॥

అనువాదం :

ఓ జలదేవతలారా ! మీరు తేజస్స్వులు.
ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తున్నాడో,
మే మే శత్రువును ద్వేషిస్తున్నామో,
అతనిని మీ తేజస్సుతో నిస్తేజుని చెయ్యండి. ॥ 5 ॥

ఇది ఇరవై మూడవ సూక్తం

## సూక్తం - 24

ఋషి: బ్రహ్మ ॥ దేవత : ఆయువు ॥ ఛందస్సు : 1,2 పురఉష్ణిక్ పంక్తిః ; 3,4 పురోదేవత్యా పంక్తిః ॥ 5 చతుష్పదా బృహతీ ॥ 6-8 భురిక్ చతుష్పదా బృహతీ ॥ మంత్రములు : ॥ 8 ॥

వినియోగం :- దారిద్ర్య వినాశ కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

శేరభక శేరభ పునర్వో యన్తు యాతవః

పునర్హేతిః కిమీదినః ।

యస్యేస్థ తమత్త యో వః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 1 ॥

పదము :

* శేరభక । శేరభ । పునః । వః । యన్తు । యాతవః ।
పునః । హేతిః । కిమీదినః ।
యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్రఽఅహైత్ ।
తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 1 ॥

అనువాదం :

శేరభకా! రాక్షసాధిపతీ!
శేరభ! రాక్షస పరివారమా!
మీరు మా పైనికి పంపించిన అశుభంకర రాక్షసులు
మా నుండి తిరిగి పోవుదురుగాక!
అలాగే మీ ఆయుధాలు, దొంగలు
మీ అనుచరులందరూ,
ఏ విరోధి దగ్గర ఉన్నారో వానినే భక్షించండి.
ఎవడు మిమ్ములను మా పైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 1 ॥

మంత్రము :

శేవృధక శేవృధ పునర్వో యన్తు యాతవః
పునర్హేతిః కిమీదినః ।

---

*పాములు లేదా రాక్షసులు -Vedic Index

యస్య స్థ తమత్త యో వః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 2 ॥

పదము :

శేవృధక । శేవృధ । పునః । వః । యన్తు । యాతవః ।
పునః । హేతిః । కిమీదినః ।
యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్రఽఅహైత్ ।
తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 2 ॥

అనువాదం :

* ఓ శేవృధక ! శేవృధ ! మీరు మాపై పంపిన
అశుభంకర రాక్షసులు, మా నుండి తిరిగి పోవుదురు గాక !
అలాగే మీ ఆయుధాలు, దొంగలు, మీ అనుచరు లందరూ
ఏ విరోధి దగ్గర ఉన్నారో వానినే భక్షించండి.
ఎవడు మిమ్ములను మాపైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 2 ॥

మంత్రము :

మ్రోకానుమ్రోక పునర్వో యన్తు యాతవః
పునర్హేతిః కిమీదినః ।

---

* స్వాశ్రిత సుఖవర్ధక । సాయణ భాష్యం
పాములు లేదా రాక్షసులు V. I

యస్య స్థ తమత్త యో వః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 3 ॥

పదము.

ప్రమోక । అను౽ప్రమోక । పునః । వః । యన్తు । యాతవః ।
పునః । హేతిః । కిమీదినః ।
యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్ర౽హైత్ ।
తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 3 ॥

అనువాదం.

ఓ ప్రమోక! (దొంగ!) ఓ అనుప్రమోక! (అనుచరులారా!)
మీరు మాపై పంపిన అశుభంకర రాక్షసులు
మా నుండి తిరిగి పోవుదురు గాక!
అలాగే మీ ఆయుధాలు, దొంగలు మీ అనుచరు లందరూ
ఏ విరోధి దగ్గర ఉన్నారో వానినే భక్షించండి.
ఎవడు మిమ్ములను మా పైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 3 ॥

మంత్రము.

సర్పానుసర్ప పునర్వో యన్తు యాతవః
పున ర్హేతిః కిమీదినః ।
యస్య స్థ తమత్త యోవః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 4 ॥

పదము :

సర్ప । అను౽సర్ప । పునః । వః । యన్తు । యాతవః ।

పునః । హేతిః । కిమీదినః ।

యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్ర౽హైత్ ।

తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 4 ॥

అనువాదం :

ఓ సర్ప! అనుసర్ప! (యాతుధానాధిపతులు)
మీరు మాపై పంపిన అశుభంకర రాక్షసులు
మా నుండి తిరిగి పోవుదురుగాక!
అలాగే మీ ఆయుధాలు, దొంగలు, మీ అనుచరు లందరూ
ఏ విరోధి దగ్గర ఉన్నారో వానినే భక్షించండి.
ఎవడు మిమ్ములను మాపైకి పంపినాడో, వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 4 ॥

మంత్రము :

జూర్ణి పునర్వో యన్తు యాతవః

పునర్హేతిః కిమీదినీః ।

యస్య స్థ తమత్త యో వః ప్రాహైత్

తమత్త స్వా మాంసాన్యత్త ॥ 5 ॥

పదము :

జూర్ణి । పునః । వః । యన్తు । యాతవః ।

పునః । హేతిః । కిమీదినీః ।

యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్రఽఅహైత్ ।

తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 5 ॥

అనువాదం :

"జూర్ణి" అను పేరుగల ఓ రాక్షసీ!
నీవు మాపై పంపిన అశుభంకర రాక్షసులు
మా నుండి తిరిగి పోవుదురు గాక!
అలాగే మీ ఆయుధాలు, దొంగలూ మీ అనుచరు లందరూ,
ఏ విరోధి దగ్గర ఉన్నారో, వానినే వారు భక్షించనీ.
ఎవడు మిమ్ములను మా పైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 5 ॥

అనువాదం :

ఉపబ్దే పున ర్వోయన్తు యాతవః
పున ర్హేతిః కిమీదినీః ।
యస్య స్థ తమత్త యో వః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 6 ॥

పదము :

ఉపబ్దే । పునః । వః । యన్తు । యాతవః ।

పునః । హేతిః । కిమీదినీః ।

యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్రఽఅహైత్ ।
తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త । ॥ 6 ॥

**అనువాదం :**

ఓ ఉపబ్దీ! (క్రూరశబ్ద కారిణియైన ఓ రాక్షసీ)
నీవు మాపై పంపిన అశుభంకర రాక్షసులు,
మా నుండి తిరిగి పోవుదురు గాక!
అలాగే మీ ఆయుధాలు, దొంగలు, నీ అనుచరు లందరూ,
ఏ విరోధి దగ్గర ఉన్నారో, వానినే వారు భక్షించనీ.
ఎవడు మిమ్ములను మా పైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 6 ॥

**మంత్రము :**

అర్జుని పునర్వో యన్తు యాతవః
పునర్హేతిః కిమీదినీః ।
యస్య స్థ తమత్త యోవః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 7 ॥

**పదము :**

అర్జుని । పునః । వః । యన్తు । యాతవః ।
పునః । హేతిః । కిమీదినీః ।
యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్రఽఅహైత్ ।
తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 7 ॥

అనువాదం :

"అర్జుని" అను పేరుగల ఓ రాక్షసీ!
నీవు మాపై పంపిన అశుభంకర రాక్షసులు
మా నుండి తిరిగి పోవుదురు గాక!
అలాగే వారి ఆయుధాలు, దొంగలు, నీ అనుచరు లందరూ,
ఏ విరోధి దగ్గర ఉన్నారో, వానినే వారు భక్షించనీ.
ఎవడు మిమ్ములను మా పైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 7 ॥

మంత్రము :

భరూజి పునర్వో యన్తు యాతవః
పునర్హేతిః కిమీదినీః ।
యస్య స్థ తమత్త యో వః ప్రాహైత్
తమత్త స్వా మాంసాన్యత్త ॥ 8 ॥

పదము :

భరూజి । పునః । వః । యన్తు । యాతవః ।
పునః । హేతిః । కిమీదినీః ।
యస్య । స్థ । తమ్ । అత్త । యః । వః । ప్ర౨అహైత్ ।
తమ్ । అత్త । స్వా । మాంసాని । అత్త ॥ 8 ॥

అనువాదం .

"భరూచి" (భరూజి) అను పేరుగల ఓ రాక్షసీ!
నీవు మాపై పంపిన అశుభంకర రాక్షసులు

మా నుండి తిరిగి పోవుదురు గాక!
అలాగే వారి ఆయుధాలు, దొంగలు, అనుచరు లందరూ,
ఏ విరోధి దగ్గర ఉన్నారో, వానినే భక్షించండి.
ఎవడు మిమ్ములను మా పైకి పంపినాడో వానినే భక్షించండి.
వాని మాంసాన్ని తినండి. ॥ 8 ॥

ఇది ఇరవై నాల్గవ సూక్తం.

## సూక్తం — 25

ఋషి: చాతనుడు ॥ దేవత: పృశ్నిపర్ణి ॥ ఛందస్సు: 1-3, 5 అనుష్టుప్: 4 భురి గనుష్టుప్ ॥ మంత్రములు: ॥ 5 ॥

వినియోగం:- ఈ సూక్తం చాతన గణం లోనిది. కుష్ఠాది సర్వరోగాలలోను 'పృశ్నిపర్ణి 'ని నూరి లేపనం చేయాలి. అందులో దీని వినియోగం.

మంత్రము:

శం నో దేవీ పృశ్నిపర్ణ్యశం నిర్ఋత్యా అకః ।
ఉగ్రా హి కణ్వజమ్భనీ తామభక్షి సహస్వతీమ్ ॥ 1 ॥

పదము:

శమ్ । నః । దేవీ । పృశ్నిఽపర్ణీ । అశమ్ । నిఃఽఋత్యై । అకః ।
ఉగ్రా । హి । కణ్వఽజమ్భనీ । తామ్ । అభక్షి । సహస్వతీమ్ ॥1॥

అనువాదం:

దేవి, పృశ్నిపర్ణి (చిత్రపర్ణి) మాకు సుఖ మిచ్చుగాక!
*రోగ కారణమైన నిర్ఋతికి దుఃఖం కలిగించుగాక!

---

పృశ్నిపర్ణి :- (B) Hemionitis Cordifolia or Uraria Lagopodioides, L
హిందీ:- పిరవన పితవన, పరానీ.
కోలపొన్న సురపొన్న, నేలపొన్న.

ఉగ్రము, పాపనాశని, రోగనివారణ సమర్థము అయిన
ఆ మూలికను నేను సేవిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

సహమానేయం ప్రథమా పృశ్నిపర్ణ్యజాయత ।
తయాహం దుర్ణామ్నాం శిరో వృశ్చామి శకునే రివ ॥ 2 ॥

పదము :

సహమానా । ఇయమ్ । ప్రథమా । పృశ్ని౽పర్ణీ । అజాయత ।
తయా । అహమ్ । దుః౽నామ్నామ్ । శిరః । వృశ్చామి । శకునేః
౽ఇవ ॥ 2 ॥

అనువాదం :

రోగాలను అభిభవించే ఈ పృశ్నిపర్ణి
ఓషధులలో ముఖ్యమైనదిగా పుట్టినది.
దానితో రోగ మూలకారణాన్ని పక్షిశిరస్సును
విఱిచి వేసినట్టుగా విఱిచి వేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

అరాయమసృక్పావానం యశ్చ స్ఫాతిం జిహీర్షతి ।
గర్భాదం కణ్వం నాశయ పృశ్నిపర్ణి సహస్వ చ ॥ 3 ॥

పదము :

అరాయమ్ । అసృక్౽పావానమ్ । యః । చ । స్ఫాతిమ్ ।
జిహీర్షతి ।

గర్భ ఽఅదమ్ । కణ్వమ్ । నాశయ । పృశ్ని ఽపర్ణి । సహస్వ । చ
॥ 3 ॥

అనువాదం :

శరీర రక్తాన్ని చెఱచి వేసే శత్రువును నశింపజెయ్యి.
ఏ రోగం శరీర వృద్ధిని నశింపజేస్తుందో,
దానిని తొలగించు.
అలాగే, ఓ పృశ్నిపర్ణీ!
గర్భ భక్షకమైన రోగ నిదాన పాపాన్ని నశింపజెయ్యి.
గర్భ ధ్వంసక శత్రువులను అభిభవించు. ॥ 3 ॥

మంత్రము :

గిరి మేనాం ఆ వేశయ కణ్వాన్ జీవితయోపనాన్ ।
తాం స్త్వం దేవి పృశ్నిపర్ణ్యగ్ని రివానుదహన్నిహి ॥ 4 ॥

పదము :

గిరిమ్ । ఏనాన్ । ఆ । వేశయ । కణ్వాన్ । జీవిత ఽయోపనాన్ ।
తాన్ । త్వమ్ । దేవి । పృశ్ని ఽపర్ణి । అగ్నిః ఽఇవ । అను ఽదహన్
ఇహి ॥ 4 ॥

అనువాదం .

ఓ పృశ్ని పర్ణి!
ప్రాణ మోహకములైన
పై రోగకారణ పాపాల పర్వతంలో ప్రవేశించు.
ఓ దేవా! నీవు వానిని అగ్నివలె వెన్నంటి
కాల్చి వేస్తూపో. ॥ 4 ॥

మంత్రము :

పరాచ ఏనాన్ ప్ర ణుద కణ్వాన్ జీవితయోపనాన్ ।
తమాంసి యత్ర గచ్ఛన్తి తత్ క్రవ్యాదో అజీగమమ్ ॥5॥

పదము

పరాచః । ఏనాన్ । ప్ర । నుద । కణ్వాన్ । జీవిత ఽ యోపనాన్ ।
తమాంసి । యత్ర । గచ్ఛన్తి । తత్ । క్రవ్య ఽ అదః । అజీగమమ్ ॥ 5 ॥

అనువాదం :

ఓ పృశ్నిపర్ణి !
ప్రాణ మోహకములైన
పాపములను మా నుంచి వెనుదిరుగు నట్లు చెయ్యి.
చీకటి లోనికి ఈ రోగాలను నీ లేపనంతో
నేను తరిమి వేస్తున్నాను. ॥ 5 ॥

ఇది ఇరవై ఐదవ సూక్తం

## సూక్తం - 26

## గోపుష్టి సూక్తం

ఋషి: సవితా ॥ దేవత : పశువు ॥ ఛందస్సు: 1,2 త్రిష్టుప్; 3 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ ; 4 భురిగనుష్టుప్ ; 5 అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 5 ॥

వినియోగం :- గోపుష్టికై చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

ఏహ యన్తు పశవో యే పరేయు

ర్వాయు ర్యేషాం సహచారం జుజోష ।
త్వష్టా యేషాం రూపధేయాని వేదా
స్మిన్ తాన్ గోష్ఠే సవితా ని యచ్ఛతు ॥ 1 ॥

పదము :

ఆ । ఇహ । యన్తు । పశవః । పరా౽ఈయుః ।
వాయుః । యేషామ్ । సహ౽చారమ్ । జుజోష ।
త్వష్టా । యేషామ్ । రూప౽ధేయాని । వేద ।
అస్మిన్ । తాన్ । గో౽స్థే । సవితా । ని । యచ్ఛతు ॥ 1 ॥

అనువాదం :

పరాఙ్ముఖాలై వెళ్ళిపోయిన పశువులన్నీ తిరిగి
గోష్ఠం లోనికి వచ్చుగాక !
పశువుల రక్షణకై వాయువు ప్రవర్తిస్తున్నది.
ఆ పశువులకు త్వష్ట రూపములను కల్పిస్తాడు.
వానిని ఈ గోష్ఠమునందే
ఉండునట్లు సవిత నియమనం చేయుగాక ! ॥ 1 ॥

మంత్రము .

ఇమం గోష్ఠం పశవః సం స్రవన్తు
బృహస్పతిరా నయతు ప్రజానన్ ।
సినీవాలీ నయత్వాగ్రమేషా
మాజగ్మషో అనుమతే ని యచ్ఛ ॥ 2 ॥

పదము :

ఇమమ్ । గోఽస్థమ్ । పశవః । సమ్ । స్రవన్తు ।

బృహస్పతిః । ఆ । నయతు । ప్రఽజానన్ ।

సినీవాలీ । నయతు । ఆ । అగ్రమ్ । ఏషామ్ ।

ఆఽజగ్మషః । అనుఽమతే । ని । యచ్ఛ ॥ 2. ॥

అనువాదం :

పశువులు ఈ గోష్ఠమును చేరుగాక !
బృహస్పతి వాని నిక్కడికి కొనివచ్చుగాక !
*'సినీవాలి' (ఈ పేరుగల దేవపత్ని)
ఈ పశువులను ముందుండి కొని వచ్చుగాక !
వచ్చిన పశువులను అనుగమిస్తున్న ఓ దేవపత్నీ !
వీనిని గోష్ఠంలోనే ఉండునట్లు ఆజ్ఞాపించు. ॥ 2 ॥

మంత్రము :

సం సం స్రవన్తు పశవః

సమశ్వాః సము పూరుషాః ।

సం ధాన్యఽస్యయా స్ఫాతిః

సం స్రావ్యేఽణ హవిషా జుహోమి ॥ 3 ॥

పదము :

సమ్ । సమ్ । స్రవన్తు । పశవః ।

సమ్ । అశ్వాః । సమ్ । ఓం ఇతి । పురుషాః ।

సమ్ । ధాన్య౽స్య । యా । స్ఫాతిః ।

సమ్౽స్రావ్యే౽ణ । హవిషా । జుహోమి ॥ 3 ॥

అనువాదం :

పశువులు చక్కగా తిరిగి వచ్చుగాక!
అలాగే అశ్వములు సుఖంగా తిరిగి వచ్చుగాక!
అలాగే సేవకాదులు తిరిగి వత్తురు గాక!
ధాన్యాభివృద్ధి కలుగుగాక!
అందుకై హవిస్సుతో హోమం చేస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

సం సిఞ్చామి గవాం క్షీరం

సమాజ్యేన బలం రసమ్ ।

సంసిక్తా అస్మాకం వీరా

ధ్రువా గావో మయి గోపతౌ ॥ 4 ॥

పదము .

సమ్ । సిఞ్చామి । గవామ్ । క్షీరమ్ ।

సమ్ । ఆజ్యేన । బలమ్ । రసమ్ ।

సమ్౽సిక్తాః । అస్మాకమ్ । వీరాః ।

ధ్రువాః । గావః । మయి । గో౽పతౌ ॥ 4 ॥

అనువాదం.

గోక్షీరం ఆజ్యంతో కలుపుతున్నాను.
అలాగే ఆజ్యంతో బలవర్ధకమైన
అన్నరసాన్ని మిళితం చేస్తున్నాను.
మా పుత్రాది వీరులు ఘృతాదులతో సంసిక్తు లగుదురు గాక!
అందుకై గోపతి అయిన నాతోనే
గోవులు స్థిరంగా ఉండు గాక! ॥ 4 ॥

మంత్రము.

ఆ హరామి గవాం క్షీర మాహార్షం ధాన్యం౧రసమ్ ।
ఆహృతా అస్మాకం వీరా ఆ పత్నీరిద మస్తకమ్ ॥ 5 ॥

పదము:

ఆ । హరామి । గవామ్ । క్షీరమ్ । ఆ । అహార్షమ్ । ధాన్యఽమ్ । రసమ్ ।
ఆఽహృతాః । అస్మాకమ్ । వీరాః । ఆ । పత్నీః । ఇదమ్ । అస్తకమ్ ॥ 5 ॥

ఇతి చతుర్థోఽనువాకః

అనువాదం.

గోక్షీరాన్ని కొనివస్తున్నాను.
అలాగే ధాన్యాన్ని రసాన్ని కొనివచ్చినాను.
వీరులను కూడ కొనివచ్చినాను.

వారి పత్నులను కూడ కొనివచ్చినాను.
మా ఈ గృహం నిండుగా ఉండుగాక ! ॥ 5 ॥

ఇది ఇరవై ఆరవ సూక్తం

ఇది నాలుగవ అనువాకం

## అనువాకం: 5

### సూక్తం - 27

## విజయప్రాప్తి సూక్తం

ఋషి: కపిఞ్జలుడు. దేవత: 1-5 ఓషధి; 6 రుద్రుడు; 7 ఇంద్రుడు: ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 7 ॥

వినియోగం:- వివాదంలో విజయప్రాప్తికోసం చేసే కర్మలోను, అపరాజితా మహా శాంతిలోను దీనికి వినియోగం.

మంత్రము.

నేచ్ఛత్రుః ప్రాశం జయాతి సహమానాభిభూరసి ।

ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే ॥ 1 ॥

పదము :

న । ఇత్ । శత్రుః । ప్రాశమ్ । జయాతి । సహమానా । అభిఽభూః అసి ।

ప్రాశమ్ । ప్రతిఽప్రాశః । జహి । అరసాన్ । కృణు । ఓషధే ॥ 1 ॥

అనువాదం :

ఓ ఓషధీ ! *

* (పాట. లేక 'పార' అను పేరుగల ఓషధి).
విసబొద్ది, విసబొంది, చిరుబొద్ది, విద్దకర్ణి.

ప్రతివాది, వాదినయిన నన్ను జయించ కుండు గాక!
నీవు శత్రు సహనస్వభావం కలదానవు.
ప్రతివాదిని జయింపగల దానవు.
వాది నయిన నన్ను ప్రశ్నించే
ప్రతివాదిని పరాజితుని చెయ్యి.
ప్రతివాదులను నీరసవాక్కులను చెయ్యి. ॥ 1 ॥

మంత్రము

సుపర్ణ స్త్వా న్వవిన్దత్ సూకర స్త్వా ఖన న్నసా ।
ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే ॥ 2 ॥

పదము.

సుఽపర్ణః । త్వా । అను । అవిన్దత్ । సూకరః । త్వా । అఖనత్ । నసా ।
ప్రాశమ్ । ప్రతిఽప్రాశః । జహి । అరసాన్ । కృణు । ఓషధే ॥ 2 ॥

అనువాదం:

*( 'పౌర' అను పేరుగల ఓ ఓషధీ!)
ఓ ఓషధీ! వైనతేయుడు విషాపహరణార్థం
నిన్ను వెదకి కనుగొన్నాడు
అది వరాహం నిన్ను ముట్టెతో పెల్లగించినది.
వాదినయిన నన్ను ప్రశ్నించే
ప్రతి వాదిని పరాజితుని చెయ్యి
ప్రతి వాదులను నీరసకంఠులను చెయ్యి. ॥ 2 ।

---

"పాట" "పౌర" Clypea Hernandıfolıa (Bloomfıeld)
"पाटा" "पाठा" F Cessampelos Pereıra Lım.
"पाठी" విషబొద్ది, విషబొంది, చిరుబొద్ది, విద్ధకర్ణి

మంత్రము.

ఇన్ద్రో౹హ చక్రే త్వా బాహా వసురేభ్య స్తరీతవే ।

ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే ॥ 3 ॥

పదము :

ఇన్ద్రః । హ । చక్రే । త్వా । బాహా । అసురేభ్యః । తరీతవే ।

ప్రాశమ్ । ప్రతిఽప్రాశః । జహి । అరసాన్ । కృణు । ఓషధే ॥ 3 ॥

అనువాదం

ఓ ఓషధీ! ఇంద్రుడు అసురులను జయించుటకు
దక్షిణభుజంపై నిన్ను ధరించినాడు.
వాది నయిన నన్ను ప్రశ్నించే
ప్రతివాదిని పరాజితుని చెయ్యి.
ప్రతి వాదులను నీరస కంఠులను చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

పాటా మిన్ద్రో౹ వ్యాఽశ్నా దసురేభ్య స్తరీతవే ।

ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే ॥ 4 ॥

పదము :

పాటామ్ । ఇన్ద్రః । వి । ఆశ్నాత్ । అసురేభ్యః । తరీతవే ।

ప్రాశమ్ । ప్రతిఽప్రాశః । జహి । అరసాన్ । కృణు । ఓషధే ॥4॥

అనువాదం :

ఇంద్రుడు ఈ ఓషధిని
అసురులను జయించుటకై తిన్నాడు.

వాదినయిన నన్ను ప్రశ్నించే
ప్రతివాదిని పరాజితుని చెయ్యి.
ప్రతివాదులను నీరస కంఠులను చెయ్యి. ॥ 4 ॥

మంత్రము :

తయాహం శత్రూ న్త్సాక్ష ఇన్ద్రః సాలావృకాం ఇవ ।
ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే ॥ 5 ॥

పదము :

తయా । అహమ్ । శత్రూన్ । సాక్షే । ఇన్ద్రః । సాలావృకాన్ఽఇవ।
ప్రాశమ్ । ప్రతిఽప్రాశః । జహి । అరసాన్ । కృణు । ఓషధే ॥5॥

అనువాదం :

ఇంద్రుడు అడవి కుక్కలను నిర్జించినట్టు
నేనా మూలికను ధరించి, భక్షించి,
శత్రువులను నిర్జిస్తున్నాను.
వాదినయిన నన్ను ప్రశ్నించే
ప్రతివాదిని పరాజితుని చెయ్యి.
ప్రతివాదులను నీరస కంఠులను చెయ్యి. ॥ 5 ॥

మంత్రము :

రుద్ర జలాషభేషజ నీలశిఖణ్డ కర్మకృత్ ।
ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే ॥ 6 ॥

పదము :

రుద్ర । జలాషఽభేషజ । నిలఽశిఖణ్డ । కర్మఽకృత్ ।
ప్రాశమ్ । ప్రతిఽప్రాశః । జహి । అరసాన్ । కృణు । ఓషధే ॥6॥

**అనువాదం :**

ఓ రుద్రుడా! స్మరణ మాత్రంతో
జలాన్ని మందుగా మార్చువాడా! నీల కపర్ది!
నీ ఉపాసకుల కర్మను తొలగించువాడా!
ఈ ఓషధితో ప్రతివాదిని జయించునట్టు చెయ్యి.
వాదినయిన నన్ను ప్రశ్నించే
ప్రతివాదిని పరాజితుని చెయ్యి
ప్రతి వాదులను నీరసకంఠులను చెయ్యి ॥ 6 ॥

**మంత్రము :**

తస్య ప్రాశం త్వం జహి యో న ఇన్ద్రాభిదాసతి ।
అధి నో బ్రూహి శక్తిభిః ప్రాశి మా ముత్తరం కృధి ॥ 7 ॥

**పదము :**

తస్య । ప్రాశమ్ । త్వమ్ । జహి । యః । నః । ఇన్ద్ర । అభిఽదాసతి ।
అధి । నః । బ్రూహి । శక్తిఽభిః । ప్రాశి । మామ్ । ఉత్ఽతరమ్। కృధి ॥ 7 ॥

**అనువాదం :**

ఓ ఇంద్రా! మమ్ములను తిరస్కరిస్తున్న
ప్రతివాది ప్రతికూల ప్రశ్నను నీవు వినష్టం చెయ్యి.
నీ శక్తితో మా మాటే చెల్లునట్టు చెయ్యి.
ప్రతివాది కంటె నన్ను ఉత్కృష్టుని చెయ్యి. ॥ 7 ॥

ఇది ఇరవై ఏడవ సూక్తం

# సూక్తం - 28

ఋషి: శమ్యుడు ॥ దేవత. 1,3 జరిమా, ఆయువు: 2 మిత్రావరుణులు; 4,5 ద్యావా పృథివ్యాదులు ॥ ఛందస్సు: 1 జగతి: 2-4 త్రిష్టుప్; 5 భురిక్ త్రిష్టుప్ ॥ మంత్రములు ॥ 5 ॥

వినియోగం :- గోదానంలో, చౌలకర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

తుభ్యమేవ జరిమన్ వర్ధతా మయం మేమ
మన్యే మృత్యవో హింసిషుః శతం యే ।
మాతేవ పుత్రం ప్రమనా ఉపస్థే మిత్ర
ఏనం మిత్రియాత్ పాత్వం హసః ॥ 1 ॥

పదము.

తుభ్యమ్ । ఏవ । జరి*మన్ । వర్ధతామ్। అయమ్। మా । ఇమమ్।
అన్యే । మృత్యవః । హింసిషుః । శతమ్ । యే ।
మాతాऽఇవ । పుత్రమ్ । ప్రऽమనాః । ఉపऽస్థే । మిత్రః ।
ఏనమ్ । మిత్రియాత్ । పాతు । అంహసః ॥ 1 ॥

అనువాదం :

స్తుతి పాత్రుడవైన ఓ అగ్నీ !
నీ కోసమే ఈ కుమారుడు అభివృద్ధి పొందుగాక !

* జర – వృద్ధాప్యం. ఓ జరా అని ఇతరులు. ఇక్కడ సాయణుని భాష్యం అనుసృతం.

అసంఖ్యాకములైన ఇతర రక్షః పిశాచాది రోగాదులు
ఈ బాలకుని హింసింప కుండుగాక!
సంతుష్టుడైన మిత్రదేవుడు తల్లి కొడుకును వలె
ఈ బాలకుని ఒడిలో ఉంచుకొని,
మిత్రద్రోహజనిత పాపంనుంచి రక్షించుగాక! ॥ 1 ॥

మంత్రము.

మిత్ర ఏనం వరుణో వా రిశాదా
జరామృత్యుం కృణుతాం సంవిదానౌ ।
తదగ్నిర్హోతా వయునాని విద్వాన్
విశ్వా దేవానాం జనిమా వివక్తి ॥ 2 ॥

పదము:

మిత్రః । ఏనమ్ । వరుణః । వా । రిశాదాః ।
జరాऽమృత్యుమ్ । కృణుతామ్ । సమ్ऽవిదానౌ ।
తత్ । అగ్నిః । హోతా । వయునాని । విద్వాన్ ।
విశ్వా । దేవానామ్ । జనిమ । వివక్తి ॥ 2 ॥

అనువాదం:

మిత్రుడు, వరుణుడు, హింసకుల భక్షకుడు ఏకమై
ఈ వటువును దీర్ఘాయుష్కుని చేయుదురు గాక!

NOTE: [ ఈ మంత్రం ఉత్తరార్థం అస్పష్టంగా ఉంది. ఒక్కొక్క వ్యాఖ్యాత, ఒక్కొక్క అనువాదకర్త ఒక్కొక్క విధంగా అర్థం చెప్పారు. సాయణుని భావార్థాన్ని నేననుసరించాను. ]

హోత అయిన అగ్ని ప్రజ్ఞావంతుడై సర్వదేవ రూపధారియై
వటువు కోరే దీర్ఘాయుస్సు నిచ్చుగాక! ॥ 2 ॥

మంత్రము

త్వమీశిషే పశూనాం పార్థివానాం
యే జాతా ఉత వా యే జనిత్రాః ।
మేమం ప్రాణో హాసీన్మో అపానో
మేమం మిత్రా వధిషు ర్మో అమిత్రాః ॥ 3 ॥

పదము :

త్వమ్ । ఈశిషే । పశూనామ్ । పార్థివానామ్ ।
యే । జాతాః । ఉత । వా । యే । జనిత్రాః ।
మా । ఇమమ్ । ప్రాణః । హాసీత్ । మో ఇతి । అపానః ।
మా । ఇమమ్ । మిత్రాః । వధిషుః । మో ఇతి । అమిత్రాః ॥ 3 ॥

అనువాదం :

నీవు భూమిపై ఉత్పన్నములైన
పశువులకు ఓ అగ్నీ! అధిపతివి.
పూర్వం పుట్టిన వానికి,
ఇకపై పుట్టబోయే వానికి కూడా అధిపతివి.
నీ అనుగ్రహం వల్ల ప్రాణం ఈ వటువును వదలకుండుగాక!
అలాగే అపానం కూడా ఈ వటువును వదలకుండుగాక!
మిత్రులు ఈ కుమారుని వధింపకుందురుగాక!
శత్రువులు కూడ వీనిని వధింప కుందురుగాక! ॥ 3 ॥

మంత్రము :

ద్యౌ ష్ట్వా పితా పృథివీ మాతా

జరామృత్యుం కృణుతాం సంవిదానే ।

యథాజీవా అదితే రుపస్థే ప్రాణా -

పానాభ్యాం గుపితః శతం హి మాః ॥ 4 ॥

పదము :

ద్యౌః । త్వా । పితా । పృథివీ । మాతా ।

జరా౽మృత్యుమ్ । కృణుతామ్ । సంవిదానేఇతిసమ్౽విదానే ।

యథా । జీవాః । అదితేః । ఉప౽స్థే । ప్రాణాపానాభ్యామ్ ।

గుపితః । శతమ్ । హిమాః ॥ 4 ॥

అనువాదం :

ఓ వటువా! నీకు తండ్రివంటి
ద్యులోకము. తల్లివంటి భూలోకము
కలిసి నిన్ను దీర్ఘాయుష్మంతుని చేయును గాక!
అదితి ఉత్సంగంలో ప్రాణాపానాల నుంచి రక్షితుడవై
శతాయుష్కుడ వగుదువు గాక! ॥ 4 ॥

మంత్రము.

ఇమమగ్న ఆయుషే వర్చసే నయ

ప్రియం రేతో వరుణ మిత్ర రాజన్ ।

మాతేవాస్మా అదితే శర్మ యచ్ఛ
విశ్వే దేవా జరదష్టి ర్యథా సత్ ॥ 5 ॥

పదము.

ఇమమ్। అగ్నే। ఆయుషే। వర్చసే। నయ।
ప్రియమ్। రేతః। వరుణ। మిత్రఽరాజన్।
మాతాఽఇవ। అస్మై। అదితే। శర్మ। యచ్ఛ।
విశ్వే। దేవాః। జరత్ఽఅష్టిః। యథా। అసత్ ॥ 5 ॥

అనువాదం:

ఓ అగ్నీ! ఇతనికి ఆయుస్సు నిమ్ము.
వర్చస్సు నిమ్ము.
ఓ వరుణా! ఇతనికి రేతస్సు నిమ్ము
ఓ అదితీ! మాతవలె వీనికి సుఖ మిమ్ము.
ఓ విశ్వేదేవతలారా! వీనికి దీర్ఘాయుస్సు నిండు ॥ 5 ॥

ఇది ఇరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం–29

# ఆయుర్బల సంతానార్థం

ఋషి: అథర్వుడు॥ దేవత: 1 అగ్ని, సూర్యుడు, బృహస్పతి: 2 జాతవేదుడు, త్వష్ట, సవిత: 3, 7 ఇంద్రుడు: 4, 5 ద్యావాపృథివీ, విశ్వేదేవతలు, ఆపస్సు:6 అశ్వినీదేవతలు॥ ఛందస్సు: 1 అనుష్టుప్: 2, 3, 5–7 త్రిష్టుప్ 4 పరాబృహతీ నిచృత్ ప్రస్తార పంక్తి॥ మంత్రములు. ॥ 7 ॥

వినియోగం :- వడదెబ్బకు చికిత్సలోను, గోదాన, చౌల కర్మలలోను దీనికి వినియోగం.

మంత్రము :

పార్థివస్య రసేదేవా భగస్య తన్వో౽బలే ।

ఆయుష్య౽మస్మా అగ్నిః సూర్యోవర్చ ఆ ధాద్ బృహస్పతిః ॥ 1 ॥

పదము :

పార్థివస్య । రసే । దేవాః । భగస్య । తన్వ౽ః । బలే ।

ఆయుష్య౽మ్ । అస్మై । అగ్నిః । సూర్యః । వర్చః ।

ఆ । ధాత్ । బహస్పతిః ॥ 1 ॥

అనువాదం :

పృథివీ సంబంధమైన ! సక్తు (పేలపిండి) వంటి వాని
సారభూత జలపానంతో ఇంద్రాదులు, భగుడు
ఈ దప్పిగొన్న వాని శరీరాన్ని వీర్యవంతం చేయుదురు గాక!
వీనికి అగ్ని దీర్ఘాయుస్సు నిచ్చుగాక !
సూర్యుడు, బృహస్పతి వీనికి వర్చస్సు నిత్తురుగాక ! ॥ 1 ॥

మంత్రము :

ఆయురస్మై ధేహి జాతవేదః

ప్రజాం త్వష్ట రధినిధేహ్యస్మై ।

రాయస్పోషం సవితరా సువాస్మై

శతం జీవాతి శరద స్తవాయమ్ ॥ 2 ॥

పదము

ఆయుః । అస్మై । ధేహి । జాతఽవేదః ।

ప్రజామ్ । త్వష్టః । అధిఽనిధేహి । అస్మై ।

రాయః । పోషమ్ । సవితః । ఆ । సువ । అస్మై ।

శతమ్ । జీవాతి । శరదః । తవ । అయమ్ ॥ 2 ॥

అనువాదం

ఓ జాతవేదా! వీనికి శతాయుస్సు నిమ్ము.
ఓ త్వష్టా! వీనికి సంతానాభివృద్ధి కల్పించు.
ఓ సవితా! వీనికి ధన సమృద్ధి నిమ్ము.
మీ అనుగ్రహంతో ఇతడు నూరేళ్ళు జీవించుగాక! ॥ 2 ॥

మంత్రము :

ఆశీర్ణ ఊర్జ ముత సౌప్రజా_స్త్వం
దక్షం ధ_త్తం ద్రవిణం సచేతసౌ ।
జయం క్షేత్రాణి సహసా యమిన్ద్ర
కృణ్వానో అన్యానధరాన్త్సపత్నాన్ ॥ 3 ॥

పదము :

ఆఽశీః । నః । ఊర్జమ్ । ఉత । సౌప్రజాఃఽత్వమ్ ।

దక్షమ్ । ధత్తమ్ । ద్రవిణమ్ । సఽచేతసౌ ।

జయమ్ । క్షేత్రాణి । సహసా । అయమ్ । ఇన్ద్ర ।
కృణ్వానః । అన్యాన్ । అధరాన్ । సఽపత్నాన్ ॥ 3 ॥

అనువాదం

మమ్ములను ఆశీర్వదించండి.
అహోరాన్ని ద్యావాపృథువులారా! కల్పించండి
మమ్ములను సంతాన వంతులను, సమాన చేతస్కులను,
బలవంతులను, ధనవంతులను చేయండి.
ఓ ఇంద్రా! ఈ పురుషుడు బలంతో శత్రు భూములను
స్వాధీనం చేసుకుంటూ ఇతర శత్రువులను
పరాజితులను చేయుగాక! ॥ 3 ॥

మంత్రము:

ఇన్ద్రేణ దత్తో వరుణేన శిష్టో
మరుద్భిరుగ్రః ప్రహితో న ఆగన్ ।
ఏష వాం ద్యావాపృథివీ ఉపస్థే
మా క్షుధన్మా తృషత్ ॥ 4 ॥

పదము :

ఇన్ద్రేణ । దత్తః । వరుణేన । శిష్టః ।
మరుత్ఽభిః । ఉగ్రః । ప్రఽహితః । నః । ఆ । అగన్ ।
ఏషః । వామ్ । ద్యావాపృథివీ ఇతి । ఉపఽస్థే ।
మా । క్షుధత్ । మా । తృషత్ ॥ 4 ॥

**అనువాదం :**

ఈ దప్పిగొన్నవాడు ఇంద్రుడు జీవ మివ్వగా.
వరుణుడు అనుజ్ఞ ఇవ్వగా,
మరుద్గణములు బలము నివ్వగా మా వద్దకు వచ్చినాడు.
ఇతను ఓ ద్యావా పృథ్వ్యులారా !
మీ ఒడిలో ఉంటూ క్షుత్పీడితుడు కాకుండు గాక !
దప్పిగొనకుండుగాక ! ॥ 4 ॥

**మంత్రము :**

ఊర్జమస్మా ఊర్జస్వతీ ధత్తం
పయో అస్మై పయస్వతీ ధత్తమ్ ।
ఊర్జమస్మై ద్యావాపృథివీ అధాతాం
విశ్వేదేవా మరుత ఊర్జ మాపః ॥ 5 ॥

**పదము :**

ఊర్జమ్ । అస్మై । ఊర్జస్వతీఇతి । ధత్తమ్ ।
పయః । అస్మై । పయస్వతీఇతి । ధత్తమ్ ।
ఊర్జమ్ । అస్మై । ద్యావాపృదివీఇతి । అధాతామ్ ।
విశ్వే । దేవాః । మరుతః । ఊర్జమ్ । ఆపః ॥ 5 ॥

**అనువాదం :**

శక్తియుతులైన ద్యావాపృథ్వ్యులు
ఇతనికి బలాన్ని చేకూర్తురు గాక ! ఉదక భూములైన మీరు
ఇతనికి ఉదక మిత్తురు గాక ! బలవత్తరులైన ద్యావాపృథ్వ్యులు

ఇతనికి ఆహారాన్ని, బలాన్ని కల్పించినారు.
విశ్వేదేవతలు, మరుత్తులు,
జలదేవతలు ఇతనికి శక్తినిచ్చినారు. ॥ 5 ॥

మంత్రము :

శివాభిష్టే హృదయం తర్పయా
మ్యనమీవో మోదిషీష్ఠాః సువర్చాః ।
సవాసినౌ పిబతాం మన్థమేత
మశ్వినో రూపం పరిధాయ మాయామ్ ॥ 6 ॥

పదము :

శివాభిః । తే । హృదయమ్ । తర్పయామి ।
అనమీవః । మోదిషీష్ఠాః । సుఽవర్చాః ।
సఽవాసినౌ । పిబతామ్ । మన్థమ్ । ఏతమ్ ।
అశ్వినోః । రూపమ్ । పరిఽధాయ । మాయామ్ ॥ 6 ॥

అనువాదం :

ఓ దప్పిగొన్నవాడా! నీ హృదయాన్ని
సుఖకరములైన ఉదకములతో తృప్తినొందిస్తున్నాము.
దప్పి తీరిన నీవు వర్చస్స్వంతుడవై సంతోషింతువు గాక!
సహవాసులై అశ్వినీ దేవతలు మాయామయమైన

రూపాన్ని ధరించి, ఈ *మంథాన్ని,
అంబలిని త్రాగుదురు గాక! ॥ 6 ॥

మంత్రము :

ఇన్ద్ర ఏతాం సస్‌ృజే విద్ధో అగ్ర ఊర్జాం
స్వధామజరాం సా త ఏషా ।
తయా త్వం జీవ శరదః సువర్చా మా
త ఆ సుస్రోద్ భిషజస్తే అక్రన్ ॥ 7 ॥

పదము :

ఇన్ద్రః । ఏతామ్ । సస్‌ృజే । విద్ధః । అగ్రే । ఊర్జామ్ ।
స్వధామ్ । అజరామ్ । సా । తే । ఏషా ।
తయా । త్వమ్ । జీవ । శరదః । సుఽవర్చాః । మా ।
తే । ఆ । సుస్రోత్ । భిషజః । తే । అక్రన్ ॥ 7 ॥

అనువాదం :

పూర్వం వృత్రాసురాదులతో దెబ్బగొన్న ఇంద్రుడు దప్పిగొని
బలవర్ధకమైన మంథాన్ని జరానివర్తకమైన
దానిని సృష్టించినాడు.

---

* [ పేలపిండిని నీటిలో కలిపి, రెండు సమిధలతో చిలికినప్పుడు, దానిని 'మన్థం' అంటారు. ]

[ కాని ఇక్కడ విశేష విధితో వైతస, చమస శలాకలతో మథితమైన సక్తూదకం వివక్షితమని సాయణుడు. కౌ, సూ. 27-X ]

ఓ వ్యాధితుడా! దానిని నీ కిస్తున్నాము.
దానితో వర్చస్స్వంతుడవై నీవు నూరేళ్ళు బ్రతుకు.
ఈ మంథపానం చేసిన నీవు శరీరం నుంచి
చ్యుతుడవు కాకుందువుగాక! అది వైద్యులు
నీకై ఈ ఔషధాన్ని సిద్ధం చేసినారు ॥ 7 ॥

ఇది ఇరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 30

# పతిపత్నీసమాగమం సూక్తం

ఋషి: ప్రజాపతి: దేవత : 1 మనస్సు, 2 అశ్వినీ దేవతలు : 3, 4 ఓషధి : 5 దంపతులు : ఛందస్సు: 1 పథ్యాపంక్తి : 2, 4, 5 అనుష్టుప్ : 3 భురిగనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 5 ॥

వినియోగం:- స్త్రీవశీకరణ కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

యథేదం భూమ్యా అధి తృణం వాతో మథాయతి ।
ఏవా మథ్నామి తే మనో యథా మాం
కామిన్యసో యథా మన్నాపగా అసః ॥ 1 ॥

పదము :

యథా । ఇదమ్ । భూమ్యాః । అధి । తృణమ్ । వాతః । మథాయతి ।
ఏవ । మథ్నామి । తే । మనః । యథా । మామ్ ।
కామినీ । అసః । యథా । మత్ । న । అపఽగాః । అసః ॥ 1 ॥

**అనువాదం :**

భూమిపై కనబడుతున్న తృణాన్ని
గాలి ఎలా కదిలిస్తుందో ఓ స్త్రీ!
నీ మనస్సును ఆ విధంగా కదిలించి వేస్తున్నాను
ఇందుతో నన్ను నీవు కాంక్షింతువుగాక!
నా నుంచి పారిపోకుందువు గాక! ॥ 1 ॥

**మంత్రము :**

సంచేతన్నయాథో అశ్వినా కామినా సంచ వక్షథః ।
సం వాం భగాసో అగ్మత సం చిత్తాని సము వ్రతా ॥ 2 ॥

**పదము :**

సమ్ । చ । ఇత్ । నయాథః । అశ్వినా । కామినా । సమ్ । చ । వక్షథః ।
సమ్ । వామ్ । భగాసః । అగ్మత । సమ్ । చిత్తాని । సమ్ । ఓం ఇతి । వ్రతా ॥ 2 ॥

**అనువాదం :**

అశ్వినీ దేవతలు ఈ స్త్రీని నా సమీపానికి తెత్తురు గాక!
నాతో కలుపుదురు గాక!
మీ భాగ్యములు నన్ను సంక్రమించు గాక!
జ్ఞానం వ్రతం నన్ను సంక్రమించు గాక! ॥ 2 ॥

**మంత్రము :**

యత్ సుపర్ణా వివక్షవో అనమీవా వివక్షవః ।
తత్ర మే గచ్ఛతాద్ధవం శల్య ఇవ కుల్మలం యథా ॥ 3 ॥

పదము :

యత్ । సు౽పర్ణాః । వివక్షవః । అనమీవాః । విఏక్షవః ।

తత్ర । మే । గచ్ఛతాత్ । హవమ్ । శల్యః౽ఇవ । కుల్మలమ్ ।

యథా ॥ 3 ॥

అనువాదం.

కపోతాద పక్షులు స్త్రీ విషయమై పలుకదలచుకొన్నవి.
ఆరోగ్య వంతులైన కాముకులు పలుకదలచు కొన్నారు.
ఈ విషయంలో నా ఆహ్వానం దుష్టాంగంలో శస్త్రం వలె
ఆమె హృదయం లోనికి చొచ్చుకొని పోవుగాక ! ॥ 3 ॥

మంత్రము :

యదన్తరం తద్ బాహ్యం యద్ బాహ్యం తదన్తరమ్ ।

కన్యా౽నాం విశ్వరూపాణాం మనో గృభాయౌషధే ॥ 4 ॥

పదము ;

యత్ । అన్తరమ్ । తత్ । బాహ్యమ్ । యత్ । బాహ్యమ్ । తత్ ।

అన్తరమ్ ।

కన్యా౽నామ్ । విశ్వ౽రూపాణామ్ । మనః । గృభాయ । ఓషధే

॥ 4 ॥

అనువాదం.

ఆభ్యంతర విషయమైనదే
బాహ్యవిషయం కూడా అవుతున్నది.
ఈ బాహ్యలక్షణమే అంతర్లక్షణ మౌతున్నది.

ఈ విశ్వరూపమైన కన్యల మనస్సును
తృణాది రూపమైన ఓషధీ! నీవు నాశనం చెయ్యి. ॥ 4 ॥

మంత్రము:

ఏయ మగన్ పతికామా జనికామోహ మాగమమ్ ।
అశ్వః కనిక్రదద్ యథా భగేనాహం సహాగమమ్ ॥ 5 ॥

పదము :

ఆ । ఇయమ్ । అగన్ । పతిऽకామా । జనిऽకామః । అహమ్ । ఆ ।
అగమమ్ ।
అశ్వః । కనిక్రదత్ । యథా । భగేన । అహమ్ । సహ । ఆ ।
అగమమ్ ॥ 5 ॥

అనువాదం :

ఈ స్త్రీ పతిని కోరునదై నా దగ్గఱకు వచ్చినది.
నేను కూడ ఆమెను కామిస్తూ వచ్చినాను
సకిలిస్తూ గుఱ్ఱం ఆడుగుఱ్ఱాన్ని చేరునట్లు
నే నీమెను చేరుతున్నాను. ॥ 5 ॥

ఇది ముప్పైయవ సూక్తం

## సూక్తం - 31

# క్రిమిరోగ నివారణ సూక్తం

ఋషి: కాణ్వుడు : దేవత : 1 మహీ : 2-5 క్రిమిజమ్భనమ్ ॥ ఛందస్సు : 1
అనుష్టుప్ : 2,4 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ, 3,5 ఆర్షీ త్రిష్టుప్ ॥
మంత్రములు : ॥ 5 ॥

వినియోగం : శరీరగత వివిధ క్రిమిరోగముల శాంతికై చేసే హోమంలో దీనికి వినియోగం.

మంత్రము.

ఇన్ద్రస్య యా మహీ దృషత్ క్రిమేర్విశ్వస్య తర్హణీ ।
తయా పినష్మి సం క్రిమీన్ దృషదా ఖల్వాం ఇవ ॥ 1 ॥

పదము

ఇన్ద్రస్య । యా । మహీ । దృషత్ । క్రిమేః । విశ్వస్య । తర్హణీ ।
తయా । పినష్మి । సమ్ । క్రిమీన్ । దృషదా । ఖల్వాన్ఽఇవ ॥ 1 ॥

అనువాదం :

ఇంద్ర సంబంధమైన పెద్దశిల
సర్వక్రిమి సంహారకమైనది.
విసురు రాయితో సెనగలను వలె దానితో
శరీరాంతర్గతాలైన సర్వక్రిములను సంచూర్ణం చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము.

దృష్టమదృష్ట మతృహమథో కురూరుమతృహమ్ ।
అల్గణ్డా_న్త్సర్వాన్ఛలునాన్ క్రిమీన్ వచసా జమ్భయామసి ॥ 2 ॥

పదము.

దృష్టమ్ । అదృష్టమ్ । అతృహమ్ । అథో ఇతి । కురూరుమ్ ।
అతృహమ్ ।

అల్గణ్డాన్ । సర్వాన్ । శలునాన్ । క్రిమీన్ । వచసా । జమ్భయా
మసి ॥ 2 ॥

**అనువాదం :**

కంటికి కనిపించే క్రిమి జాతాన్ని,
కనిపించని క్రిమి జాతాన్ని నశింప జేస్తున్నాను.
అంతేకాక శరీరం లోపలవలె
అల్లుకొని ఉన్న అంతర్గత క్రిమి కులాన్ని కూడా
నాశనం చేస్తున్నాను.
అల్గండువు లను, శల్గము లను, క్రిములను,
ఇతర సర్వ క్రిములను మంత్రంతో నాశనం చేస్తున్నాను. ॥ 2 ॥

**మంత్రము :**

అల్గణ్డాన్ । హన్మి మహతా వధేన
దూనా అదూనా అరసా అభూవన్ ।
శిష్టా నశిష్టాన్ ని తిరామి వాచా
యథా క్రిమీణాం న కిరుచ్ఛిషాతై ॥ 3 ॥

**పదము :**

అల్గణ్డాన్ । హన్మి । మహతా । వధేన ।
దూనాః । అదూనాః । అరసాః । అభూవన్ ।
శిష్టాన్ । అశిష్టాన్ । ని । తిరామి । వాచా ।
యథా । క్రిమీణామ్ । నకిః । ఉత్ ఽశిషాతై ॥ 3 ॥

అనువాదం :

* అల్గండువులను ఉత్కృష్ట మంత్రౌషధాది
సాధనంతో సంహరిస్తున్నాను.
నా ఔషధాదులతో పరితప్తములైనవి,
పరితప్తం కానివి, శుష్కములైనవి ఏవైతే ఉన్నవో,
శిష్టములైనవి, అశిష్టములైనవి
ఏవైతే ఉన్నవో-వాటి నన్నిటిని
మంత్రంతో నిహతం చేస్తున్నాను.
వా టన్నిటిలో ఏ ఒక్కటీ మిగులకుండుగాక ! ॥ 3 ॥

మంత్రము :

అన్వాన్త్ర్యం శీర్షణ్య1మథో పార్ష్టేయం క్రిమీన్ ।
అవస్కవం వ్యధ్వరం క్రిమీన్ వచసా జమ్భయామసి ॥ 4 ॥

పదము :

అను౽ఆన్త్ర్యమ్। శీర్షణ్య౽మ్ । అథో ఇతి । పార్ష్టేయమ్। క్రిమీన్।
అవస్కవమ్ । వి౽అధ్వరమ్ । క్రిమీన్ । వచసా । జమ్భయామసి
॥ 4 ॥

అనువాదం :

ప్రేవులలోని క్రిములను, శిరోభవములైన క్రిములను,
పార్శ్వ భవములైన క్రిములను నశింప జేస్తున్నాను.
లోనికి వెళ్ళే వాని వివిధ మార్గాలను నశింప జేస్తున్నాను.
వీ టినన్నిటిని మంత్రంతో నశింప జేస్తున్నాను ॥ 4 ॥

---

* రక్తమాంస దూషకములైన క్రిములను

మంత్రము.

యే క్రిమయః పర్వతేషు వనే

ష్వోషధీషు పశుష్వప్స్వ1 న్తః ।

యే అస్మాకం తన్వ౨మావివిశుః

సర్వం తద్ధన్మి జనిమ క్రిమీణామ్ ॥ 5 ॥

పదము।

యే। క్రిమయః। పర్వతేషు। వనేషు।

ఓషధీషు। పశుషు। అప్౨సు। అన్తః।

యే। అస్మాకమ్। తన్వ౨మ్। ఆ౨వివిశుః।

సర్వమ్। తత్। హన్మి। జనిమ। క్రిమీణామ్ ॥ 5 ॥

ఇతి పంచమో౨నువాకః

**అనువాదం :**

పర్వతాదుల మధ్యంలో ఉన్న క్రిములు
వ్రణ ముఖంగా మా శరీరాల్లో ప్రవేశించినవి.
వానిని నిశ్శేషంగా, ఆ సర్వక్రిమి జాతినే
నాశనం చేస్తున్నాను. ॥ 5 ॥

ఇది ముప్పైయొకటవ సూక్తం

ఇది ఐదవ అనువాకం.

## అనువాకం - 6

### సూక్తం - 32

# క్రిమి నాశన సూక్తం

ఋషిః కాణ్వుడు॥ దేవత : ఆదిత్యుడు॥ ఛందస్సు : 1 త్రిపాద్ భురిగ్గాయత్రీ 2-5 అనుష్టుప్ : 6 చతుష్పాన్నిచృదుష్ణిక్॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :- పశువుల వ్రణక్రిములకు చేసే చికిత్సలో దీనికి వినియోగం.

మంత్రము :

ఉద్యన్నాదిత్యః క్రిమీన్ హన్తు
నిమ్రోచన్ హన్తు రశ్మిభిః ।
యే అన్తః క్రిమయో గవి ॥ 1 ॥

పదము :

ఉత్ఽయన్ । ఆదిత్యః । క్రిమీన్ । హన్తు ।
నిఽమ్రోచన్ । హన్తు । రశ్మిఽభిః ।
యే । అన్తః । క్రిమయః । గవి ॥ 1 ॥

అనువాదం :

ఆదిత్యుడు ఉదయిస్తూ తన కిరణాలతో
క్రిములను నశింప జేయుగాక !
అస్తమిస్తున్న సూర్యుడు తన కిరణాలతో
క్రిములను నశింప జేయుగాక !
గో శరీర మధ్యంలో ఉన్న
క్రిములను కూడ నశింప జేయుగాక ! ॥ 1 ॥

మంత్రము :

విశ్వరూపం చతురక్షం క్రిమిం సారఙ్గమర్జునమ్ ।
శృణామ్యస్య పృష్టీ రపి వృశ్చామి యచ్ఛిరః ॥ 2 ॥

పదము :

విశ్వ౽రూపమ్ । చతుః౽అక్షమ్ । క్రిమిమ్ । సారఙ్గమ్ । అర్జునమ్।
శృణామి । అస్య । పృష్టీః । అపి । వృశ్చామి । యత్ । శిరః ॥2॥

అనువాదం :

నానా రూపం, చతుర్నేత్రం, శబల వర్ణం అయిన
వివిధ క్రిమి జాతాన్ని చంపివేస్తున్నాను.
వాని పార్శ్వావయవాలను
శిరస్సును కూడ త్రుంచివేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

అత్రివద్ వః క్రిమయో హన్మి కణ్వవజ్జమదగ్నివత్ ।
అగస్త్యస్య బ్రహ్మణా సం పినష్మ్యహం క్రిమీన్ ॥ 3 ॥

పదము :

అత్రి౽వత్ । వః । క్రిమయః । హన్మి । కణ్వ౽వత్ । జమదగ్ని౽వత్ ।
అగస్త్యస్య । బ్రహ్మణా । సమ్ । పినష్మి । అహమ్ । క్రిమీన్ ॥3॥

అనువాదం :

ఓ క్రిములారా ! మిమ్ములను
అత్రివలె, కణ్వునివలె, జమదగ్నివలె

నేను చంపుతున్నాను.
అగస్త్య మంత్రంతో క్రిములను తిరిగి పుట్టకుండా
నశింప జేస్తున్నాను ॥ 3 ॥

మంత్రము :

**హతో రాజా క్రిమీణా ముతైషాం స్థపతి ర్హతః ।**
**హతో హతమాతా క్రిమి ర్హతభ్రాతా హతస్వసా ॥ 4 ॥**

పదము :

**హతః । రాజా । క్రిమీణామ్ । ఉత । ఏషామ్ । స్థపతిః । హతః ।**
**హతః । హతఽమాతా । క్రిమిః । హతఽభ్రాతా । హతఽస్వసా ॥4॥**

అనువాదం :

క్రిముల రాజు నా మంత్రౌషధులతో హతుడైనాడు.
ఈ క్రిముల సచివుడు కూడ హతుడైనాడు.
వీని తల్లి, సోదరులు కూడ హతులైనారు. ॥ 4 ॥

మంత్రము :

**హతాసో అస్య వేశసో హతాసః పరివేశసః ।**
**అథో యే క్షుల్లకా ఇవ సర్వే తే క్రిమయో హతాః ॥ 5 ॥**

పదము :

**హతాసః । అస్య । వేశసః । హతాసః । పరిఽవేశసః ।**
**అథో ఇతి । యే । క్షుల్లకాఃఽఇవ । సర్వే । తే । క్రిమయః । హతాః**
**॥ 5 ॥**

**అనువాదం :**

ఈ క్రిముల నివాస స్థానాలు వినష్టము లైనవి.
వాని చుట్టూ ఉన్న
నివాసస్థానాలు కూడా వినష్టము లైనవి.
అలాగే బీజ రూపంలో ఉన్న కనిపించని
క్రిములన్నీ వినష్టము లైనవి. ॥ 5 ॥

**మంత్రము :**

ప్రతే శృణామి శృఙ్గే యాభ్యాం వితుదాయసి ।
భినద్మి తే కుషుమ్భం యస్తే విషధానః ॥ 6 ॥

**పదము :**

ప్రతే । తే । శృణామి । శృఙ్గేఇతి । యాభ్యామ్ । విఽతుదాయసి ।
భినద్మి । తే । కుషుమ్భమ్ । యః । తే । విషఽధానః ॥ 6 ॥

**అనువాదం :**

మమ్ములను బాధించే నీ శృంగాలను ఓ క్రిమీ!
భిన్నం చేస్తున్నాను.
నీ విషస్థానమైన అవయవాన్ని
విదారింప జేస్తున్నాను. ॥ 6 ॥

ఇది ముప్పై రెండవ సూక్తం

## సూక్తం - 33

ఋషిః బ్రహ్మా : దేవత, యక్ష్మవివర్హణమ్ ॥ ఛందస్సు : 1,2 అనుష్టుప్ : 3 కుమ్మత్యనుష్టుప్ : 4 చతుష్పదాభురిగుష్ణిక్ : 5 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ : 6 ఉష్ణిగ్గర్భా నిచృదనుష్టుప్ : 7 పథ్యాపంక్తి ॥ మంత్రములు. ॥ 7 ॥

**వినియోగం :-** సర్వావయవరోగచికిత్సలో దీని వినియోగం. ఈ సూక్తం అమ్హో లింగగణంలోనిది. అలాగే అశ్వమేథాదులలో యజమానికి చేసే చికిత్సాదులలో దీనికి వినియోగం.

**మంత్రము :**

అక్షీభ్యాం తే నాసికాభ్యాం కర్ణాభ్యాం చుబుకాదధి ।
యక్ష్మం శీర్షణ్యంఽమస్తిష్కా జ్జిహ్వాయా వి వృహామితే ॥ 1 ॥

**పదము :**

అక్షీభ్యామ్ । తే । నాసికాభ్యామ్ । కర్ణాభ్యామ్ । చుబుకాత్ । అధి ।
యక్ష్మమ్ । శీర్షణ్యఽమ్ । మస్తిష్కాత్ । జిహ్వాయాః । వి ।
వృహామి । తే । ॥ 1 ॥

**అనువాదం :**

నీ కనుల నుంచి రోగాన్ని వేరు చేస్తున్నాను.
నీ నాసికనుంచి, చెవులనుంచి
చుబుకాదులనుంచి (గడ్డం మొదలగు వానినుంచి)
శిరస్సునుంచి, మెదడునుంచి, నాలుక నుంచి,
రోగాల నన్నిటిని వేరు చేస్తున్నాను. ॥ 1 ॥

**మంత్రము :**

గ్రీవాభ్యస్త ఉష్ణిహాభ్యః । కీకసాభ్యో । అనూక్యాఽత్ ।
యక్ష్మం దోషణ్య।మంసాభ్యాం బాహుభ్యాం వివృహామి తే ॥2॥

**పదము :**

గ్రీవాభ్యః । తే । ఉష్ణిహాభ్యః । కీకసాభ్యః । అనూక్యాఽత్ ।

యక్ష్మమ్ । దోషణ్యఽమ్ । అంసాభ్యామ్ । బాహుఽభ్యామ్ । వి ।
వృహామి । తే । ॥ 2 ॥

అనువాదం :

నీ గొంతునకు సంబంధించిన
ఎముకల నుంచి రోగాన్ని వేరుచేస్తున్నాను.
పైకి వెళ్ళే నాడుల నుంచి, వక్షోగత అస్థికలనుంచి,
కీళ్ళలోని ఎముకలనుంచి, బాహువులనుంచి,
భుజశిరస్సులనుంచి నీరోగాన్ని
ఉన్మూలనం చేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము.

హృదయాత్ తే పరి క్లోమ్నో హలీక్ష్ణాత్ పార్శ్వాభ్యామ్ ।
యక్ష్మం మతస్నాభ్యాం ప్లీహ్నో యక్నస్తే వి వృహామసి
॥ 3 ॥

పదము.

హృదయాత్ । తే । పరి । క్లోమ్నః । హలీక్ష్ణాత్ పార్శ్వాభ్యామ్ ।
యక్ష్మమ్ । మతస్నాభ్యామ్ । ప్లీహ్నః । యక్నః । తే । వి ।
వృహామసి ॥ 3 ॥

అనువాదం.

నీ హృదయంనుంచి, శ్వాసకోశంనుంచి,
మూత్రాశయంనుంచి, ఇరు పార్శ్వములనుంచి,
ప్లీహంనుంచి, మూత్ర పిండాలనుంచి,

కాలేయంనుంచి ఓ రోగి!
నీ రోగాన్ని నిర్మూలిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

ఆన్త్రేభ్యస్తే గుదాభ్యో వనిష్ఠోరుదరా దధి ।
యక్ష్మం కుక్షిభ్యాం ప్లాశేర్నాభ్యా వి వృహామి తే ॥ 4 ॥

పదము :

ఆన్త్రేభ్యః । తే । గుదాభ్యః । వనిష్ఠోః । ఉదరాత్ । అధి ।
యక్ష్మమ్ । కుక్షిఽభ్యామ్ । ప్లాశేః । నాభ్యాః । వి । వృహామి ।
తే ॥ 4 ॥

అనువాదం :

ప్రేవులలోనుంచి, గుదంలోనుంచి,
పెద్ద పేగులోనుంచి, ఉదరంలోనుంచి
అనర్థకమైన రోగాన్ని తొలగించి వేస్తున్నాను.
డొక్కలలోనుంచి, మలాశయంనుంచి, నాభిమండలంనుంచి,
నీలోని రోగాన్ని నిర్మూలిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

ఊరుభ్యాం తే అష్ఠీవద్భ్యాం
పార్ష్ణిభ్యాం ప్రపదాభ్యామ్ ।
యక్ష్మం భసద్యం1 శ్రోణిభ్యాం
భాసదం భంససో వి వృహామి తే ॥ 5 ॥

పదము :

ఊరుఽభ్యామ్ । తే । అష్ఠీవత్ఽభ్యామ్ ।
పార్ష్ణిఽభ్యామ్ । ప్రఽపదాభ్యామ్ ।
యక్ష్మమ్ । భసద్యఽమ్ । శ్రోణిఽభ్యామ్ ।
భాసదమ్ । భంససః । వి । వృహామి । తే ॥ 5 ॥

అనువాదం :

తొడలనుంచి, మోకాళ్ళనుంచి, పాదములనుంచి,
పాదాగ్రములనుంచి నీ రోగాన్ని తొలగించి వేస్తున్నాను.
కటిప్రదేశంనుంచి, పిరుదలలో నుంచి,
గుహ్య ప్రదేశంలోనుంచి నీ రోగాన్ని నిర్మూలిస్తున్నాను. ॥ 5 ॥

మంత్రము :

అస్థిభ్యస్తే మజ్జభ్యః స్నావభ్యో ధమనిభ్యః ।
యక్ష్మం పాణిభ్యా మఙ్గులిభ్యో నఖేభ్యోవి వృహామి తే ॥ 6 ॥

పదము :

అస్థిఽభ్యః । తే । మజ్జఽభ్యః । స్నావఽభ్యః । ధమనిఽభ్యః ।
యక్ష్మమ్ । పాణిఽభ్యామ్ । అఙ్గులిఽభ్యః । నఖేభ్యః । వి ।
వృహామి । తే ॥ 6 ॥

అనువాదం :

అస్థి మజ్జలలోనుంచి, సూక్ష్మరక్త నాళాలలోనుంచి,
స్థూలరక్త నాళాలలోనుంచి, చేతులలోనుంచి,

వేళ్ళలోనుంచి, గోళ్ళలోనుంచి,
నీ రోగాన్ని నిర్మూలనం చేస్తున్నాను ॥ 6 ॥

మంత్రము :

అఙ్గే అఙ్గే లోమ్నిలోమ్ని యస్తే పర్వణి పర్వణి ।
యక్ష్మం త్వచస్యంఽతే వయం కశ్యపస్య
వీబర్హేణ విష్వఞ్చం వి వృహామసి ॥ 7 ॥

పదము :

అఙ్గేఽఅఙ్గే । లోమ్నిఽలోమ్ని । యః । తే । పర్వణిఽపర్వణి ।
యక్ష్మమ్ । త్వచస్యఽమ్ । తే । వయమ్ । కశ్యపస్య ।
విఽబర్హేణ । విష్వఞ్చమ్ । వి । వృహామసి ॥ 7 ॥

అనువాదం :

ఓ రోగి ! నీ అంగాంగంలో రోమ రోమంతో,
కీలు కీలులో ఉన్న రోగాన్ని, నీ చర్మంలో,
చక్షురాది సర్వావయవాలలో వ్యాపించిన
రోగజాతాన్ని, కశ్యప ప్రోక్త సూక్తంతో
మేము తొలగించి వేస్తున్నాము. ॥ 7 ॥

ఇది ముప్పై మూడవ సూక్తం.

## సూక్తం – 34

# పశం స్వర్గ గమనం

ఋషి: అథర్వుడు ॥ దేవత : 1 పశుపతి; 2 దేవత : 3 అగ్ని, విశ్వకర్మ; 4 వాయువు, ప్రజాపతి; 5 ఆశీస్సు ॥ ఛందస్సు : త్రిష్టుప్ ॥ మంత్రములు, ॥ 5 ॥

**వినియోగం:**- వశాశమన కర్మలో, సర్వలోకాధిపత్యకాముడు చేసే కర్మలో, పశుయాగకర్మలో దీనికి వినియోగం.

**మంత్రము:**

య ఈశే పశుపతిః పశూనాం
చతుష్పాదాముత యో ద్విపదామ్ ।
నిష్క్రీతః స యజ్ఞియం భాగమేతు
రాయస్పోషా యజమానం సచన్తామ్ ॥ 1 ॥

**పదము:**

యః । ఈశే । పశుఽపతిః । పశూనామ్ ।
చతుఃఽపదామ్ । ఉత । యః । ద్విఽపదామ్ ।
నిఃఽక్రీతః । సః । యజ్ఞియమ్ । భాగమ్ । ఏతు ।
రాయః । పోషాః । యజమానమ్ । సచన్తామ్ ॥ 1 ॥

**అనువాదం:**

పశుపతియైన రుద్రుడు చతుష్పాత్తులైన
పశువులకు నియంత అవుతున్నాడు.
అతనే ద్విపాదులకు కూడ నియంత.
ఆయన సమీపం నుంచి స్వాధీనం చేసుకొన్న
ఈ వశారూపమైన పశువు యజ్ఞభాగం అగుగాక!
యజమానికి ధన సమృద్ధి కలుగుగాక! ॥ 1 ॥

మంత్రము :

ప్రముఞ్చన్తో భువనస్య రేతో
గాతుం ధత్త యజమానాయ దేవాః ।
ఉపాకృతం శశమానం యదస్థాత్
ప్రియం దేవానామప్యేతు పాథః ॥ 2 ॥

పదము .

ప్రऽముఞ్చన్తః । భువనస్య । రేతః ।
గాతుమ్ । ధత్త । యజమానాయ । దేవాః ।
ఉపऽఆకృతమ్ । శశమానమ్ । యత్ । అస్థాత్ ।
ప్రియమ్ । దేవానామ్ । అపి । ఏతు । పాథః ॥ 2 ॥

అనువాదం .

ఈ పశువును వదలి పోతున్న
ఓ ప్రాణ రూప దేవతలారా!
భువన కారణమైన ఈ పశువు యజమానుని
పుణ్యలోకగతికి మార్గం కల్పించుగాక!
ఉపకరణంతో సంస్కృతమై, ఈ లోకం నుంచి
ఎగిరి పోయే ఈ పశుమాంస లక్షణమైన అన్నం,
దేవతలకు ప్రియమైన ఆహారం అగుగాక! ॥ 2 ॥

మంత్రము :

యే బధ్యమానమను దీధ్యానా

అన్వైక్షన్త మనసా చక్షుషా చ ।
అగ్నిష్టా నగ్రే ప్ర ముమోక్తు దేవో
విశ్వకర్మా ప్రజయా సంరరాణః ॥ 3 ॥

పదము :

యే । బధ్యమానమ్ । అను । దీధ్యానాః ।
అను౽ఐక్షన్త । మనసా । చక్షుషా । చ ।
అగ్నిః । తాన్ । అగ్రే । ప్ర । ముమోక్తు । దేవః ।
విశ్వ౽కర్మా । ప్ర౽జయా । సమ్౽రరాణః ॥ 3 ॥

అనువాదం :

ఈ కట్టివేసిన పశువును ఆ మందలోని
ఇతర పశువులు వదలి పెట్టలేకున్నవి.
అనురాగ దృక్కులతో, దీనినే చూస్తున్నవి.
పశువు లన్నిటిని అగ్నిదేవుడు
తొలుత విమోచనం చెందించుగాక!
తన సృష్టితో శబ్దిస్తూ విశ్వకర్మ
దీనిని విమోచనం పొందించు గాక! ॥ 3 ॥

మంత్రము :

యే గ్రామ్యాః పశవో విశ్వరూపా
విరూపాః సన్తో బహుధైకరూపాః ।

వాయుష్టానగ్రే ప్ర ముమోక్తు దేవః
ప్రజాపతిః ప్రజయా సంరరాణః ॥ 4 ॥

పదము :

యే । గ్రామ్యాః । పశవః । విశ్వఽరూపాః ।
విఽరూపాః । సన్తః । బహుఽధా । ఏకఽరూపాః ।
వాయుః । తాన్ । అగ్రే । ప్ర । ముమోక్తు । దేవః ।
ప్రజాఽపతిః । ప్రఽజయా । సమ్ఽరరాణః ॥ 4 ॥

అనువాదం :

గ్రామాదులలోని పశువులు, విశ్వరూపాలైన పశువులు,
విరూపాలైన పశువులు అనేకం ఉన్నప్పటికి,
దీని విషయంలో ఏక స్వభావాలై ఉన్నవి.
వాటిని వాయుదేవుడు తొలుత విమోచనం
పొందించుగాక! ప్రజాపతి కూడా తన
సృష్టితో శబ్దిస్తూ వీనిని విమోచనం చెందించుగాక! ॥ 4 ॥

మంత్రము :

ప్రజానన్తః ప్రతి గృహ్ణన్తు పూర్వే
ప్రాణమఙ్గేభ్యః పర్యాచరన్తమ్ ।
దివం గచ్ఛ ప్రతి తిష్ఠా శరీరైః
స్వర్గం యాహి పథిభిర్దేవయానైః ॥ 5 ॥

పదము :

ప్రఽజానన్తః । ప్రతి । గృహ్ణన్తు । పూర్వే ।
ప్రాణమ్ । అఙ్గేభ్యః । పరి । ఆఽచరన్తమ్ ।
దివమ్ । గచ్ఛ । ప్రతి । తిష్ఠ । శరీరైః ।
స్వఃఽగమ్ । యాహి । పథిఽభిః । దేవఽయానైః ॥ 5 ॥

**అనువాదం**

ఈ యాగంలో ఉపయుక్తమైన నీ ప్రకర్త
తెలిసి ముందే అంతరిక్షంలో ఉన్న దేవతలు
నీ అవయవాలనుంచి పైకి వెడలి వస్తున్న
నీ ప్రాణాన్ని ప్రతిగ్రహింతురుగాక !
అలా నీవు అంతరిక్షానికి వెళ్ళు.
అక్కడ నీవు దివ్యభోగార్హాలైన
శరీరాలతో ప్రతిష్ఠితుడవుకా !
అక్కడ నుంచి దేవ మార్గంలో స్వర్గానికి వెళ్ళు. ॥ 5 ॥

ఇది ముప్పైనాలుగవ సూక్తం

## సూక్తం - 35

# విశ్వకర్మ సూక్తం

**ఋషి! అంగిరసుడు ॥ దేవత : విశ్వకర్మ ॥ ఛందస్సు : 1 బృహతీగర్భా త్రిష్టుప్ : 2,3 త్రిష్టుప్ : 4,5 భురిక్ త్రిష్టుప్ ॥ మంత్రములు : ॥ 5 ॥**

**వినియోగం :-** దృష్టిదోష నివారణార్థం అన్నాన్ని ఈ సూక్తంతో అభిమంత్రించి తినవలెను. ఇంద్రాగ్నుల ఉపస్థానంలో, అన్నదానంలో, సర్వ సవయజ్ఞములలోను తొలుతచేసే హోమంలో, సాకమేధాఖ్య

పర్వంలో, వైశ్వకర్మణహోమ మంత్రంలో, దర్శపౌర్ణ మాసా
దులలో చేసే హోమంలో దీని వినియోగం.

మంత్రము :

యే భక్షయన్తో న వసూన్యానృధు

ర్యానగ్నయో అన్వతప్యన్త ధిష్ణ్యాః ।

యా తేషామవయా దురిష్టిః

స్విష్టింనస్తాం కృణవద్ విశ్వకర్మా ॥ 1 ॥

పదము :

యే । భక్షయన్తః । న । వసూని । ఆనృధుః ।

యాన్ । అగ్నయః । అనుఽఅతప్యన్త । ధిష్ణ్యాః ।

యా । తేషామ్ । అవఽయాః । దుఃఽఇష్టిః ।

సుఽఇష్టిమ్ । నః । తామ్ । కృణవత్ । విశ్వఽకర్మా ॥ 1 ॥

అనువాదం :

భుజిస్తూ కూడా ధనాన్ని వృద్ధి పొందింపని మాకు
ఆహవనీయాది అగ్నులను ఉద్దేశించి
యాగములు చేయని మాకు, దుర్యాగములు చేసినమాకు,
శుభంకరమైన ఇష్టిని విశ్వకర్మ సమకూర్చుగాక! ॥ 1 ॥

మంత్రము :

యజ్ఞపతిమృషయ ఏనసాహు

ర్నిర్భక్తం ప్రజా అనుతప్యమానమ్ ।

మథవ్యాఽన్స్తోకానప యాన్ రరాధ
సం నష్టేభిః సృజతు విశ్వకర్మా ॥ 2 ॥

పదము :

యజ్ఞఽపతిమ్ । ఋషయః । ఏనసా । ఆహుః ।
నిఃఽభక్తమ్ । ప్రఽజాః । అనుఽతప్యమానమ్ ।
మథవ్యాఽన్ । స్తోకాన్ । అప । యాన్ । రరాధ ।
సమ్ । నః । తేభిః । సృజతు । విశ్వఽకర్మా ॥ 2 ॥

అనువాదం :

దుర్గతులైన తన సంతానంతో పాటు తపిస్తున్న
యజ్ఞపతిని ఋషులు పాపయుక్తు డంటారు.
సోమరస బిందువులను అంతరింప
జేసిన వారితో మా యజ్ఞపతి సంయోగం
చెందునట్లు విశ్వకర్మ అనుగ్రహించుగాక ! ॥ 2 ॥

మంత్రము :

అదాన్యాన్త్సోమపాన్ మన్యమానో
యజ్ఞస్య విద్వాన్త్సమయే న ధీరః ।
యదేనశ్చకృవాన్ బద్ధ ఏష తం
విశ్వకర్మన్ ప్ర ముఞ్చా స్వస్తయే ॥ 3 ॥

పదము :

అదాన్యాన్ । సోమఽపాన్ । మన్యమానః ।

యజ్ఞస్య । విద్వాన్ । సమ్ఽఅయే । న । ధీరః ।

యత్ । ఏనః । చకృఽవాన్ । బద్ధః । ఏషః । తమ్ ।

విశ్వఽకర్మన్ । ప్ర । ముఞ్చ । స్వస్తయే ॥ 3 ॥

అనువాదం :

యజ్ఞ స్వరూప వేత్తలైన సోమపాయులను కూడ
అజ్ఞు లనుకొని దానానికి అనర్హులుగా భావిస్తూ
యుద్ధంలో ధీరుని వలె అహంకార బద్ధుడైన ఇతను
ఏ తిరస్కార రూపమైన పాపం చేసినాడో
ఓ విశ్వకర్మా !
ఆ పాపం నుంచి ఇతనిని విమోచనం పొందించు. ॥ 3 ॥

మంత్రము :

ఘోరా ఋషయో నమో అస్త్వేభ్య

శ్చక్షుర్యదేషాం మనసశ్చ సత్యమ్ ।

బృహస్పతయే మహిష ద్యుమన్నమో

విశ్వకర్మన్ నమస్తే పాహ్యస్మాన్ ॥ 4 ॥

పదము :

ఘోరాః । ఋషయః । నమః । అస్తు । ఏభ్యః ।

చక్షుః । యత్ । ఏషామ్ । మనసః । చ । సత్యమ్ ।

బృహస్పతయే । మహిష । ద్యుఽమత్ । నమః ।

విశ్వఽకర్మన్ । నమః । తే । పాహి । అస్మాన్ ॥ 4 ॥

అనువాదం :

క్రూరులైన ఋషులకు *నమస్కారం.
ఈ ప్రాణ మనోమధ్యంలో ఉన్న
యథార్థ దర్శియైన చక్షురింద్రియానికి నమస్కారం.
బృహస్పతికి, మహాదీప్తిమంతునకు నమస్కారం.
ఓ విశ్వకర్మా! నీకు నమస్కారం.
మమ్ములను పాలించు. ॥ 4 ॥

మంత్రము :

యజ్ఞస్య చక్షుః ప్రభృతిర్ముఖం చ
వాచా శ్రోత్రేణ మనసా జుహోమి ।
ఇమం యజ్ఞం వితతం విశ్వకర్మణా
దేవా యన్తు సుమనస్యమానాః ॥ 5 ॥

పదము :

యజ్ఞస్య । చక్షుః । ప్రఽభృతిః । ముఖమ్ । చ ।
వాచా । శ్రోత్రేణ । మనసా । జుహోమి ।
ఇమమ్ । యజ్ఞమ్ । విఽతతమ్ । విశ్వకర్మణా ।
ఆ । దేవాః । యన్తు । సుఽమనస్యమానాః ॥ 5 ॥

---

* 'ప్రాణాలు' అని సాయణ భాష్యం.

అనువాదం :

యజ్ఞానికి చక్షువు, ఆదిభూతుడు,
ముఖం అయిన అగ్నికై వాక్కుతోను,
శ్రోత్రంతోను, మనస్సుతోను హోమం చేస్తున్నాను.
విశ్వకర్మతో విస్తృతమైన ఈ యజ్ఞానికి
దేవతలు సహృదయులై వత్తురు గాక ! ॥ 5 ॥

ఇది ముప్పై ఐదవ సూక్తం

## సూక్తం–36

# వివాహ శంభ కర్మ

ఋషి: పతివేదనుడు ॥ దేవత : 1 అగ్ని, 2 సోముడు, అర్యముడు, ధాతా ; 3 అగ్నిసోములు ; 4 ఇంద్రుడు ; 5 సూర్యుడు ; 6 ధనపతి ; 7 హిరణ్యమ్; 8 ఓషధి॥ ఛందస్సు : 1 భురిక్ త్రిష్టుప్, 2,5-7 అనుష్టుప్, 3,4 త్రిష్టుప్ ; 8 నిచృత్ పుర ఉష్ణిక్ ॥ మంత్రములు : ॥ 8 ॥

వినియోగం :- పతిలాభకర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

ఆనో అగ్నే సుమతిం సంభలో గమే
దిమాం కుమారీం సహ నో భగేన ।
జుష్టా వరేషు సమనేషు వల్గు
రోషంపత్యా సౌభగమస్త్వస్యై ॥ 1 ॥

పదము :

ఆ । నః । అగ్నే । సుఽమతిమ్ । సమ్ఽభలః । గమేత్ ।
ఇమామ్ । కుమారీమ్ । సహ । నః । భగేన ।

జుష్టా। వరేషు। సమనేషు। వల్గుః।

ఓషమ్। పత్యా। సౌభగమ్। అస్తు। అస్యై ॥ 1 ॥

అనువాదం :

ఓ అగ్ని ! కన్యార్థియైన పురుషుడు
మాకు సద్బుద్ధి నిచ్చుగాక !
భాగ్యంతో మా ఈ కుమారిని పొందుగాక !
సమాన మనస్కులలో ఈమె అతనికి ఇష్టురాలగు గాక !
సుఖకరమైన పతితోపాటు నివసించే సౌభాగ్యం
ఈ కుమారికి లభించుగాక ! ॥ 1 ॥

మంత్రము.

సోమజుష్టం బ్రహ్మజుష్టమర్యమ్ణా సంభృతం భగమ్।
ధాతుర్దేవస్య సత్యేన కృణోమి పతివేదనమ్ ॥ 2 ॥

పదము :

సోమఽజుష్టమ్। బ్రహ్మఽజుష్టమ్। అర్యమ్ణా। సమ్ఽభృతమ్।
భగమ్।

ధాతుః। దేవస్య। సత్యేన। కృణోమి। పతిఽవేదనమ్ ॥ 2 ॥

అనువాదం :

సోమసేవితం, బ్రహ్మసేవితం,
అర్యమ సేవితం, వారిచే స్వీకృతం అయిన
ఈ కన్యారూప భాగధేయాన్ని, దేవాజ్ఞతో మనుష్య
రూపుడైన పతికి స్వాధీనం చేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

ఇయమగ్నే నారీ పతిం విదేష్ట

సోమోహి రాజా సుభగాం కృణోతి ।

సువానా పుత్రాన్ మహిషీ భవాతి

గత్వా పతిం సుభగా వి రాజతు ॥ 3 ॥

పదము :

ఇయమ్ । అగ్నే । నారీ । పతిమ్ । విదేష్ట ।

సోమః । హి । రాజా । సుఽభగామ్ । కృణోతి ।

సువానా । పుత్రాన్ । మహిషీ । భవాతి ।

గత్వా । పతిమ్ । సుఽభగా । వి । రాజతు ॥ 3 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! మా ఈ కుమారి పతిని పొందుగాక !
సోమదేవుడు ఈమెను సుభగురాలిని చేయుగాక !
అనంతరం సంతానవంతురాలై ఉత్తమ సతి అగుగాక !
ఇలా పతిని పొంది, సుభగురాలై ఈమె విరాజిల్లుగాక ! ॥ 3 ॥

మంత్రము :

యథాఖరో మఘవంశ్చారురేష

ప్రియో మృగాణాం సుషదా బభూవ ।

ఏవా భగస్య జుష్టేయమస్తునారీ

సంప్రియా పత్యావిరాధయన్తీ ॥ 4 ॥

పదము .

యథా । ఆఽఖరః । మఘఽవన్ । చారుః । ఏషః ।

ప్రియః । మృగాణామ్ । సుఽసదాః । బభూవ ।

ఏవ । భగస్య । జుష్టా । ఇయమ్ । అస్తు । నారీ ।

సమ్ఽప్రియా । పత్యా । అవిఽరాధయన్తీ ॥ 4 ॥

అనువాదం :

మహనీయం, శోభనం, మృగాలకు ఆవాస భూమి
అయిన ప్రదేశం వలె ఈమె పతితో పాటు
భోగ్య వస్తువులను వృద్ధి పొందిస్తూ సౌభాగ్యవతి అగుగాక!
॥ 4 ॥

మంత్రము :

భగస్య నావమా రోహ పూర్ణామనుపదస్వతీమ్ ।

తయోపప్రతారయ యో వరః ప్రతికామ్యఽః ॥ 5 ॥

పదము :

భగస్య । నావమ్ । ఆ । రోహ । పూర్ణామ్ । అనుపఽదస్వతీమ్ ।

తయా । ఉపఽప్రతారయ । యః । వరః । ప్రతిఽకామ్యఽః ॥5॥

అనువాదం :

భాగ్యవంతం, అక్షయం అయిన ఈ నావను
ఓ కన్యా ! అధిరోహించు.
దీనితో నీవు పతివద్దకు వెళ్ళు.
నీవు కోరుకున్న పతిని చేరుకో ॥ 5 ॥

మంత్రము .

ఆ క్రన్దయ ధనపతే వరమామనసం కృణు ।
సర్వం ప్రదక్షిణం కృణు యో వరః ప్రతికామ్యః ॥ 6 ॥

పదము :

ఆ । క్రన్దయ । ధనఽపతే । వరమ్ । ఆ ఽమనసమ్ । కృణు ।
సర్వమ్ । ప్రఽదక్షిణమ్ । కృణు । యః । వరః । ప్రతిఽకామ్యః
॥ 6 ॥

అనువాదం .

ఓ కుబేరా ! వరుని ఈ కన్యవద్దకు కొనిరా !
అతనిని ఈమెకు అభిముఖమనస్కునిగా చెయ్యి.
సర్వాన్ని వివాహానుకూల కర్మగా చెయ్యి.
ఈ కన్యను ప్రేమించే అతనికి
సర్వం అనుకూలంగా చెయ్యి. ॥ 6 ॥

మంత్రము .

ఇదం హిరణ్యం గుల్గుల్వయమౌక్షో అథో భగః ।
ఏతే పతిభ్యస్త్వామదుః ప్రతికామాయ వేత్తవే ॥ 7 ॥

పదము :

ఇదమ్ । హిరణ్యమ్ । గుల్గులు । అయమ్ । ఔక్షః । అధో ఇతి । భగః ।

ఏతే । పతిఽభ్యః । త్వామ్ । అదుః । ప్రతిఽకామాయ । వేత్తవే ॥ 7 ॥

అనువాదం :

ఈ అలంకారాలు, ఈ ప్రలేపన ద్రవ్యము,
వీనికి అధిష్ఠాతయైన భగదేవుడు,
ఓ కుమారీ! ఈ సర్వాలంకారాలతో నిన్ను
సోమగంధర్వాగ్నులనే పూర్వ భర్తలనుంచి
నిన్ను కోరుతున్న ఈ మానవ పతికి దానం చేసినాడు. ॥7॥

మంత్రము.

ఆ తే నయతు సవితా

నయతు పతిర్యః ప్రతికామ్యఽః ।

త్వమస్యై ధేహ్యోషధే ॥ 8 ॥

పదము.

ఆ । తే । నయతు । సవితా ।

నయతు । పతిః । యః । ప్రతిఽకామ్యఽః ।

త్వమ్ । అస్యై । ధేహి । ఓషధే ॥ 8 ॥

ఇతి షష్ఠోఽనువాకః

ఇతి ద్వితీయం కాణ్డమ్

**అనువాదం :**

ఓ కన్యా! నీకై సవిత వరుని కొనివచ్చుగాక!
అతడు నిన్ను కోరుతున్నాడు.
అతను కూడ నిన్ను తన ఇంటికి కొనిపోవుగాక!
ఓ ఓషధీ! నీవు ఈ కుమారికి పతిని ప్రసాదించు. ॥ 8 ॥

ఇది ముప్పై ఆరవ సూక్తం

ఇది ఆరవ అనువాకం.

రెండవ కాండం సమాప్తం

## అనువాకం: 1

### సూక్తం - 1

# పరసేనా సమ్మోహన సూక్తం

ఋషి: అథర్వుడు॥ దేవత: 1 అగ్ని; 2 మరుత్తులు; 3-6 ఇంద్రుడు॥ ఛందస్సు: 1,4 త్రిష్టుప్; 2 విరాడ్‌గర్భా భురిక్ త్రిష్టుప్, 3,6 అనుష్టుప్; 5 విరాట్ పుర ఉష్ణిక్॥ మంత్రములు: ॥ 6 ॥

వినియోగం:- పరసేనా సమ్మోహనం కోసం చేసే హోమంలో దీనికి వినియోగం.

మంత్రము:

అగ్నిర్నః శత్రూన్ ప్రత్యేతు విద్వాన్
ప్రతిదహ న్నభిశస్తి మరాతిమ్ ।
స సేనాం మోహయతు పరేషాం
నిర్హస్తాంశ్చ కృణవ జ్జాతవేదాః ॥ 1 ॥

పదము:

అగ్నిః । నః । శత్రూన్ । ప్రతి । ఏతు । విద్వాన్ ।
ప్రతిఽదహన్ । అభిఽశస్తిమ్ । అరాతిమ్ ।
సః । సేనామ్ । మోహయతు । పరేషామ్ ।
నిఃఽహస్తాన్ । చ । కృణవత్ । జాతఽవేదాః ॥ 1 ॥

అనువాదం :

జయోపాయ వేత్త అయిన అగ్ని
మా శత్రువులపైకి వెళ్ళుగాక!
మాపైకి వచ్చే శత్రువును దహిస్తూ వెళ్ళుగాక!
పరసేనను మోహింప జేయుగాక!
సర్వజ్ఞుడైన అగ్ని మా శత్రువులను
హస్తవ్యాపార శూన్యులను చేయుగాక! ॥ 1 ॥

మంత్రము :

యూయ ముగ్రా మరుత ఈదృశే
స్థాభి ప్రేత మృణత సహధ్వమ్ ।
అమీ మృణన్ వసవో నాథితా ఇమే
అగ్నిర్హ్యేఽషాం దూతః ప్రత్యేతు విద్వాన్ ॥ 2 ॥

పదము .

యూయమ్ । ఉగ్రాః । మరుతః । ఈదృశే ।
స్థ । అభి । ప్ర । ఇత । మృణత । సహధ్వమ్ ।
అమీమృణన్ । వసవః । నాథితాః । ఇమే ।
అగ్నిః । హి । ఏషామ్ । దూతః । ప్రతిఽఏతు । విద్వాన్ ॥ 2 ॥

అనువాదం :

ఉగ్రులైన మరుత్తులారా!
మీరీ సంగ్రామ కర్మలో నాకు సాయంగా ఉండండి.

శత్రువులను ఎదుర్కొంటూ వెళ్ళండి.
హింసించే శత్రువులను అభిభవించండి.
అలాగే వసుదేవతలు ప్రార్థితులై
మా శత్రువులను చంపుదురుగాక!
ఈ వసువుల దూత, జ్ఞాని అయిన అగ్ని
శత్రువుల పైకి వెళ్ళుగాక! ॥ 2 ॥

మంత్రము:

అమిత్రసేనాం మఘవ న్నస్మాన్ ఛత్రూయతీమభి ।
యువం తా మిన్ద్ర వృత్రహ న్నగ్నిశ్చ దహతం ప్రతి ॥ 3 ॥

పదము:

అమిత్రఽసేనామ్ । మఘఽవన్ । అస్మాన్ । శత్రుఽయతీమ్ । అభి ।
యువమ్ । తామ్ । ఇన్ద్ర । వృత్రఽహన్ । అగ్నిః । చ । దహతమ్ । ప్రతి ॥ 3 ॥

అనువాదం.

ఓ ఇంద్రా! మాపై పగబట్టి వచ్చే శత్రుసేనను ఎదుర్కొను.
వృత్ర సంహారి అయిన ఓ ఇంద్రుడా!
నీవు, అగ్ని, కలిసి ఆ పరసేనను భస్మీకరించండి. ॥ 3 ॥

మంత్రము:

ప్రసూత ఇన్ద్ర ప్రవతా హరిభ్యాం
ప్ర తే వజ్రః ప్రమృణ న్నేతు శత్రూన్ ।

జహి ప్రతీచో అనూచః పరాచో
విష్వక్ సత్యం కృణుహి చిత్తమేషామ్ ॥ 4 ॥

పదము :

ప్రఽసూతః । ఇన్ద్ర । ప్రఽవతా । హరిఽభ్యామ్ ।
ప్ర । తే । వజ్రః । ప్రఽమృణన్ । ఏతు । శత్రూన్ ।
జహి । ప్రతీచః । అనూచః । పరాచః ।
విష్వక్ । సత్యమ్ । కృణుహి । చిత్తమ్ । ఏషామ్ ॥ 4 ॥

అనువాదం .

ఓ ఇంద్రుడా! హరినామకములైన అశ్వములను
పూన్చిన నీ రథం ప్రహత మార్గంలో వెళ్ళుగాక!
నీ వజ్రాయుధం శత్రువులను ఛేదిస్తూ వెళ్ళుగాక!
నీవు ప్రతిముఖంగా వస్తున్న శత్రువులను,
వెనుకనుంచి వస్తున్న శత్రువులను, పరాఙ్ముఖులై
పారిపోతున్న శత్రువులను నశింపజెయ్యి
ఈ శత్రువుల వ్యవస్థిత చిత్తాన్ని అవ్యవస్థితంగా చెయ్యి. ॥4॥

మంత్రము :

ఇన్ద్ర సేనాం మోహయామిత్రాణామ్ ।
అగ్నేర్వాతస్య ధ్రాజ్యా తాన్ విషూచో వి నాశయ ॥ 5 ॥

పదము.

ఇన్ద్ర। సేనామ్। మోహయ। అమిత్రాణామ్।
అగ్నేః। వాతస్య। ధ్రాజ్యా। తాన్। విషూచః। వి। నాశయ
॥ 5 ॥

అనువాదం

ఓ ఇంద్రుడా! విరోధి సేనను మోహింప జెయ్యి.
అగ్ని వాయువులదహన వేగాలతో ఆ శత్రులను
పలాయనం చెందించి ధ్వంసం చెయ్యి. ॥ 5 ॥

మంత్రము :

ఇన్ద్రః సేనాం మోహయతు మరుతో ఘ్నన్త్వోజసా।
చక్షూంష్యగ్నిరా దత్తాం పునరేతు పరాజితా ॥ 6 ॥

పదము :

ఇన్ద్రః। సేనామ్। మోహయతు। మరుతః। ఘ్నన్తు। ఓజసా।
చక్షూంషి। అగ్నిః। ఆ। దత్తామ్। పునః। ఏతు। పరాఽజితా
॥ 6 ॥

అనువాదం :

ఇంద్రుడు పరసేనను మోహింప జేయుగాక!
మరుత్తులు తమ బలంతో హింసింతురు గాక!
అగ్ని పరనేత్రాలను అపహరించు గాక!
పరాజితమైన సేన వెనుదిరిగి పోవుగాక! ॥ 6 ॥

ఇది ఒకటవ సూక్తం

## సూక్తం - 2

ఋషి: అథర్వుడు॥ దేవత-1,2 అగ్ని; 3.4 ఇంద్రుడు, 5 ద్యౌః; 6 మరుత్తులు॥
చందస్సు: 1,5,6 త్రిష్టుప్, 2-4 అనుష్టుప్॥ మంత్రములు: ॥ 6 ॥

వినియోగం:- పై సూక్తం లాగే దీనికి కూడ వినియోగం.

మంత్రము:

అగ్నిర్నో దూతః ప్రత్యేతు విద్వాన్
ప్రతిదహన్నభిశస్తిమరాతిమ్ ।
స చిత్తాని మోహయతు పరేషాం
నిర్హస్తాంశ్చ కృణవజ్జాతవేదాః ॥ 1 ॥

పదము:

అగ్నిః । నః । దూతః । ప్రతి౨ఏతు । విద్వాన్ ।
ప్రతి౨దహన్ । అభి౨శస్తిమ్ । అరాతిమ్ ।
సః । చిత్తాని । మోహయతు । పరేషామ్ ।
నిః౨హస్తాన్ । చ । కృణవత్ । జాత౨వేదాః ॥ 1 ॥

అనువాదం:

దేవదూత, విద్వాంసుడు అయిన అగ్ని
మా శత్రువుల పైకి వెళ్ళుగాక!
మా పైకి వచ్చే శత్రువును దహించు గాక!
పరసేనల మనస్సును మోహింప జేయుగాక!
వారి చేతులు ఆడకుండా చేయుగాక! ॥ 1 ॥

మంత్రము

అయ మగ్ని రమూ ముహద్

యాని చిత్తాని వో హృది ।

వి వో ధమత్వోకసః

ప్ర వో ధమతు సర్వతః ॥ 2 ॥

పదము :

అయమ్ । అగ్నిః । అమూముహత్ ।

యాని । చిత్తాని । వః । హృది ।

వి । వః । ధమతు । ఓకసః ।

ప్ర । వః । ధమతు । సర్వతః ॥ 2 ॥

**అనువాదం :**

మీ హృదయంలోని జ్ఞానాన్ని శత్రువులారా !
ఈ అగ్ని సమ్మోహం చేయుగాక !
మీ స్వస్థానాలనుంచి మిమ్ములను తరిమి వేయుగాక !
మీ వెంటబడి తరుము గాక ! ॥ 2 ॥

మంత్రము .

ఇన్ద్ర చిత్తాని మోహయ

న్నర్వా జాకూత్యా చర ।

అగ్నిర్వాతస్య ధ్రాజ్యా
తాన్ విషూచో వి నాశయ ॥ 3 ॥

పదము :

ఇన్ద్ర । చిత్తాని । మోహయన్ ।
అర్వాఙ్ । ఆఽకూత్యా । చర ।
అగ్నేః । వాతస్య । ధ్రాజ్యా ।
తాన్ । విషూచః । వి । నాశయ ॥ 3 ॥

అనువాదం :

ఓ ఇంద్రా! శత్రు మనస్సులను మోహింప జేసినవాడవై
మా సంకల్ప బలంతో చేరి శత్రుసేనాభి ముఖంగా వెళ్ళు.
అగ్ని వాయు దహన గతితో వారిని
చెల్లాచెదరుగా పారిపోవునట్లు చెయ్యి ॥ 3 ॥

మంత్రము :

వ్యాఽకూతయ ఏషా మితాథో చిత్తాని ముహ్యత ।
అథో యదద్యైషాం హృది తదేషాం పరినిర్జహి ॥ 4 ॥

పదము :

వి । ఆఽకూతయః । ఏషామ్ । ఇత । అథో ఇతి । చిత్తాని । ముహ్యత
అథో ఇతి । యత్ । అద్య । ఏషామ్ । హృది । తత్ । ఏషామ్ ।
పరి । నిః । జహి ॥ 4 ॥

అనువాదం .

విరుద్ధ సంకల్పులైన మీరు శత్రు మనస్సులలో ప్రవేశించండి.
వానిని మోహింప జేయండి.
ఓ ఇంద్రా! మాపై పడుతున్న
విరోధుల హృదయంలోని
సంకల్పాలను పూర్తిగా పాడుచెయ్యి. ॥ 4 ॥

మంత్రము :

అమీషాం చిత్తాని ప్రతిమోహయన్తీ
గృహాణాఙ్గాన్యప్వే పరేహి ।
అభి ప్రేహి నిర్దహ హృత్సు శోకై
ర్గ్రాహ్యామిత్రాంస్తమసా విధ్య శత్రూన్ ॥ 5 ॥

పదము :

అమీషామ్ । చిత్తాని । ప్రతిఽమోహయన్తీ ।
గృహాణ । అఙ్గాని । అప్వే । పరా । ఇహి ।
అభి । ప్ర । ఇహి । నిః । దహ । హృత్ఽసు । శోకైః ।
గ్రాహ్యా । అమిత్రాన్ । తమసా । విధ్య । శత్రూన్ ॥ 5 ॥

అనువాదం :

ఓ పాప దేవతా!
మా శత్రువుల మనస్సులను సమ్మోహం చేస్తూ
వారి అవయవాలను పట్టివేయి.

మాకు పరాఙ్ముఖివై శత్రువుల వెంటపడు.
వారి శరీరాలలో అంతటా వ్యాపించు.
వారి మనస్సులలో చేరి శోకములతో వానిని దహింపజేయి.
తమోరూపమైన పిశాచితో శత్రువులను పడగొట్టు. ॥ 5 ॥

మంత్రము :

అసౌ యా సేనా మరుతః పరేషా
మస్మా నైత్యభ్యోజసా స్పర్ధమానా ।
తాం విధ్యత తమసా పవ్రతేన
యథైషా మన్యో అన్యం నజానాత్ ॥ 6 ॥

పదము.

అసౌ । యా । సేనా । మరుతః । పరేషామ్ ।
అస్మాన్ । ఆఽఏతి । అభి । ఓజసా । స్పర్ధమానా ।
తామ్ । విధ్యత । తమసా । అపఽవ్రతేన ।
యథా । ఏషామ్ । అన్యః । అన్యమ్ । న । జానాత్ ॥ 6 ॥

అనువాదం.

ఓ మరుత్తులారా !
ఈ కనిపిస్తున్న పరసేన స్వకీయ బలంతో
మాతో పోటీ పడుతూ మాపైకి వస్తున్నది.
దానిని మీ మాయతో నిర్వ్యాపారంగా చేసివేయండి.

ఈ శత్రు మధ్యంలో ఒకరు ఒకరిని
తెలుసుకో లేనట్లుగా చేయండి.

ఇది రెండవ సూక్తం

## సూక్తం - 3

# రాజపునః సంస్థాపనం

ఋషి: అథర్వుడు ॥ దేవత : మంత్రాలలో పేర్కొన్న అగ్ని మొదలగువారు ॥
ఛందస్సు : 1,2,4 త్రిష్టుప్ : 3 చతుష్పదా భురిక్ పంక్తి : 5,6 అనుష్టుప్
మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :- శత్రువులు తరిమివేసిన రాజు స్వరాష్ట్రంలో పునః ప్రవేశించడం కోసం చేసే కర్మలో దీనికి వినియోగం. సాకమేథమనే పర్వానికి ముందునాడు చేసే ఇష్టిలో కూడ దీనికి వినియోగం.

మంత్రము :

అచిక్రదత్ స్వపా ఇహ భువ
దగ్నే వ్యచస్వ రోదసీ ఉరూచీ ।
యుఞ్జన్తు త్వా మరుతో విశ్వవేదస
అముం నయ నమసా రాతహవ్యమ్ ॥ 1 ॥

పదము :

అచిక్రదత్ । స్వఽపాః । ఇహ । భువత్ ।
అగ్నే । వి । అచస్వ । రోదసీఇతి । ఉరూచీఇతి ।

యుఞ్జన్తు । త్వా । మరుతః । విశ్వ౽వేదసః ।
ఆ అముమ్ । నయ । నమసా । రాత౽హవ్యమ్ ॥ 1 ॥

**అనువాదం.**

రాజ్య భ్రష్టుడైన ఈ రాజు ఓ అగ్నీ!
పునః స్వరాష్ట్ర ప్రవేశార్థం నిన్ను ప్రార్థిస్తున్నాడు.
నీ అనుగ్రహం వల్ల ఈ రాష్ట్రంలో
ఇతను స్వప్రజాపాలకు డగుగాక!
అతని రక్షణార్థమై వ్యాపన శీలములైన ద్యావాపృథ్వులు,
విశ్వవేత్తలైన మరుత్తులు,
ఓ అగ్నీ! నీతో చేరుదురు గాక!
నమస్కరిస్తూ హవిస్సు నిస్తున్న
ఈ రాజును తిరిగి స్వరాష్ట్రానికి చేర్చు. ॥ 1 ॥

**మంత్రము;**

దూరే చిత్ సన్త మరుషాస ఇన్ద్ర
మా చ్యావయన్తు సఖ్యాయ విప్రమ్ ।
యద్ గాయత్రీం బృహతీ మర్కమస్మై
సౌత్రామణ్యా దధృషన్త దేవాః ॥ 2 ॥

**పదము ;**

దూరే । చిత్ । సన్తమ్ । అరుషాసః । ఇన్ద్రమ్ ।
ఆ । చ్యావయన్తు । సఖ్యాయ । విప్రమ్ ।

యత్ । గాయత్రీమ్ । బృహతీమ్ । అర్కమ్ । అస్మై ।

సౌత్రామణ్యా । దధృషన్త । దేవాః ॥ 2 ॥

**అనువాదం :**

దీప్తిమంతులైన ఋత్విక్కులు దూరంగా స్వర్గంలో
ఉన్న ఇంద్రుని స్నేహార్థమై ఈ రాజు వద్దకు
వచ్చునట్లు చేతురు గాక! దేవతలు
ఇంద్రునికై గాయత్రిని, బృహస్పతిని,
బృహతిని, అర్చనసాధనభూతం, మంత్రాత్మకం
అయిన శస్త్రాన్ని సౌత్రామణీ అనే
హవిర్యజ్ఞంతో అతిబలవంతం చేసినారు. ॥ 2 ॥

**మంత్రము:**

అద్భ్యస్త్వా రాజా వరుణో హ్వయతు

సోమస్త్వా హ్వయతు పర్వతేభ్యః ।

ఇన్ద్రస్త్వా హ్వయతు విడ్భ్య ఆభ్యః

శ్యేనో భూత్వా విశ ఆ పతేమాః ॥ 3 ॥

**పదము.**

అత్ఽభ్యః । త్వా । రాజా । వరుణః । హ్వయతు ।

సోమః । త్వా । హ్వయతు । పర్వతేభ్యః ।

ఇన్ద్రః । త్వా । హ్వయతు । విట్ఽభ్యః । ఆభ్యః ।

శ్యేనః । భూత్వా । । విశః । ఆ । పత । ఇమాః ॥ 3 ॥

---

సాకమేధ :— చాతుర్మాస్యంలో మూడవపర్వం.

అనువాదం:

ఓ రాజా! నిన్ను వరుణరాజు తన జలంతో
ఆహ్వానించుగాక! అలాగే సోముడు పర్వతములనుంచి
నిన్ను ఆహ్వానించుగాక! ఇంద్రుడు కూడ ఇప్పుడు
నీ వున్న ప్రజలవద్ద నుంచి నిన్ను రప్పించుగాక!
ఇట్లా ఆహూతుడవైన నీవు నీ ప్రజల వద్దకు
డేగవలె శీఘ్రగతివై రమ్ము. ॥ 3 ॥

మంత్రము:

శ్యేనో హవ్యం నయత్వా పరస్మా
దన్యక్షేత్రే అపరుద్ధం చరన్తమ్ ।
అశ్వినా పన్థాం కృణుతాం సుగం
త ఇమం సజాతా అభిసంవి శధ్వమ్ ॥ 4 ॥

పదము:

శ్యేనః । హవ్యమ్ । నయతు । ఆ । పరస్మాత్ ।
అన్యఽక్షేత్రే । అపఽరుద్ధమ్ । చరన్తమ్ ।
అశ్వినా । పన్థామ్ । కృణుతామ్ । సుఽగమ్ ।
తే । ఇమమ్ । సఽజాతాః । అభిఽసంవిశధ్వమ్ ॥ 4 ॥

అనువాదం:

దివిలో నున్న దేవుడు అన్య క్షేత్రంలో శతనిరుద్ధుడై
తిరుగుతున్న రాజును పరరాష్ట్రం నుంచి

స్వదేశానికి కొనివచ్చుగాక! ఓ రాజా! అశ్వినీదేవతలు
నీ మార్గాన్ని సుగమం చేతురు గాక!
ఓ రాజ బంధువులారా!
మీరు ఈ రాజును పరివేష్టింతురు గాక! ॥ 4 ॥

మంత్రము :

హ్వయన్తు త్వా ప్రతిజనాః ప్రతిమిత్రా అవృషత ।
ఇన్ద్రాగ్నీ విశ్వే దేవాస్తే విశి క్షేమమదీధరన్ ॥ 5 ॥

పదము .

హ్వయన్తు । త్వా । ప్రతిఽజనాః । ప్రతి । మిత్రాః । అవృషత ।
ఇన్ద్రాగ్నీ ఇతి । విశ్వే । దేవాః । తే । విశి । క్షేమమ్ । అదీధరన్
॥ 5 ॥

అనువాదం :

ఓ రాజా! పరిజనులు నిన్ను సేవింతురు గాక!
ప్రతి కూలురు విరుద్ధ భావాన్ని వదిలి నిన్ను
చేరుదురుగాక! ఇంద్రాగ్నులు. విశ్వేదేవులు
ప్రజలలో నీకు రక్షణ కల్పింతురు గాక! ॥ 5 ॥

మంత్రము :

యస్తే హవం వివదత్ సజాతో యశ్చ నిష్ట్యః ।
అపాఞ్చమిన్ద్ర తం కృత్వాథేమమిహావ గమయ ॥ 6 ॥

పదము :

యః । తే । హవమ్ । విఽవదత్ । సఽజాతః । యః । చ । నిష్ట్యః ।

అపాఞ్చమ్ । ఇన్ద్ర । తమ్ । కృత్వా । అథ । ఇమమ్ । ఇహ ।
అవ । గమయ ॥ 6 ॥

**అనువాదం:**

ఓ రాజా! నీ పునరాహ్వానాన్ని సమాన జన్ములలో,
నీచులలో ఎవరో ఒకరు అనుమతించక పోతే
ఓ ఇంద్రా! ఆ ఉభయ విధ శత్రువులను బహిష్కరించి
ఇతనిని ఈ రాష్ట్రంలో రాజుగా ప్రఖ్యాపించు. (చాటు) ॥6॥

ఇది మూడవ సూక్తం

## సూక్తం - 4

# రాజాహ్వానం

**ఋషి: అథర్వుడు॥ దేవత: ఇంద్రుడు॥ ఛందస్సు: 1 జగతీ: 2,3,6,7 త్రిష్టుప్: 4,5 భురిక్ త్రిష్టుప్॥ మంత్రములు. ॥ 7 ॥**

**వినియోగం:- పై సూక్తంలో లాగే దీనికి కూడ వినియోగం.**

**మంత్రము:**

ఆ త్వా గన్ రాష్ట్రం సహ వర్చసోదిహి
ప్రాఙ్ విశాం పతిరేకరాష్ట్ర త్వం వి రాజ ।
సర్వాస్త్వా రాజన్ ప్రదిశో
హ్వయన్తూపసద్యో నమస్యో౽ భవేహ ॥ 1 ॥

**పదము:**

ఆ । త్వా । గన్ । రాష్ట్రమ్ । సహ । వర్చసా । ఉత్ ఇహి । ।

ప్రాఙ్ । విశామ్ । పతిః । ఏక౽రాట్ । త్వమ్ । వి । రాజ ।

సర్వాః । త్వా । రాజన్ । ప్ర౽దిశః ।

హ్వాయన్తు । ఉప౽సద్యః । నమస్య౽ః । భవ । ఇహ ॥ 1 ॥

**అనువాదం.**

ఓ రాజా! నీవు నీ రాష్ట్రానికి తిరిగి వచ్చినావు.
వర్చస్సుతో ప్రఖ్యాతుడవు కమ్ము.
పూర్వ ప్రజ లందరకూ పాలకుడవై
ఏకైక రాజువై విరాజిల్లు. ఓ రాజా! నిన్ను సర్వదిక్కులు,
అక్కడి ప్రజలు స్వామిగా ఆమోదింతురు గాక!
ఇక్కడ సర్వులకు సేవ్యుడవై
నమస్కార యోగ్యుడవు కమ్ము ॥ 1 ॥

మంత్రము :

త్వాం విశో వృణతాం రాజ్యా౽య

త్వామిమాః ప్రదిశః పఞ్చ దేవీః ।

వర్ష్మన్ రాష్ట్రస్య కకుది శ్రయస్వ

తతో న ఉగ్రో వి భజా వసూని ॥ 2 ॥

పదము :

త్వామ్ । విశః । వృణతామ్ । రాజ్యా౽య ।

త్వామ్ । ఇమాః । ప్ర౽దిశః । పఞ్చ । దేవీః ।

వర్ష్మన్ । రాష్ట్రస్య । కకుది । శ్రయస్వ ।

తతః । నః । ఉగ్రః । వి । భజ । వసూని ॥ 2 ॥

**అనువాదం :**

నిన్ను ప్రజలు రాజుగా వరింతురు గాక!
నిన్ను ఈ కనబడుతున్న ప్రాచ్యాది
పంచ దిగ్దేవతలు వరింతురు గాక!
నీవు ఈ రాజ్యంలోని ఉన్నత స్థానాన్ని అధిష్ఠించు.
శత్రు దుర్నిరీక్ష్యుడవై ధనాన్ని మాకు ప్రసాదించు. ॥ 2 ॥

**మంత్రము :**

అచ్ఛ త్వా యన్తు హవినః సజాతా
అగ్నిర్దూతో అజిరః సం చరాతై ।
జాయాః పుత్రాః సుమనసో భవన్తు
బహుం బలిం ప్రతి పశ్యాసా ఉగ్రః ॥ 3 ॥

**పదము :**

అచ్ఛ । త్వా । యన్తు । హవినః । సఽజాతాః ।
అగ్నిః । దూతః । అజిరః । సమ్ । చరాతై ।
జాయాః । పుత్రాః । సుఽమనసః । భవన్తు ।
బహుమ్ । బలమ్ । ప్రతి । పశ్యాసై । ఉగ్రః ॥ 3 ॥

**అనువాదం :**

సమాన జన్ములైన ఇతర రాజులు
నీ ఆజ్ఞావర్తులై నీకు సుముఖు లగుదురు గాక!
నీ దూత అగ్నివలె అప్రధృష్యుడై సంచరించుగాక!
భార్యా పుత్రులు, బంధువులు సుమనస్కులగుదురుగాక!
బలవంతుడవైన నీవు
బహువిధాలైన కప్పములను, కానుకలను
అందుకొందువు గాక! ॥ 3 ॥

**మంత్రము :**

**అశ్వినా త్వాగ్రే మిత్రావరుణోభా**
**విశ్వే దేవా మరుతస్త్వా హ్వయన్తు ।**
**అధా మనో వసుదేయాయ కృణుష్వ**
**తతో న ఉగ్రో వి భజా వసూని ॥ 4 ॥**

**పదము :**

**అశ్వినా । త్వా । అగ్రే । మిత్రావరుణా । ఉభా ।**
**విశ్వే । దేవాః । మరుతః । త్వా । హ్వయన్తు ।**
**అధ । మనః । వసుఽదేయాయ । కృణుష్వ ।**
**తతః । నః । ఉగ్రః । వి । భజ । వసూని ॥ 4 ॥**

**అనువాదం :**

రాజా! నిన్ను మొదట అశ్వినీ దేవతలూ,
మిత్రావరుణులు ఆహ్వానింతురు గాక!

నీకు విశ్వేదేవతలు, మరుత్తులు స్వాగత మిత్తురు గాక!
అర్థులకు ధన మిచ్చుటపై ఓ రాజా! నీ మనసుంచు.
నీవు ఉగ్రుడవై ధనాన్ని మాకు ప్రసాదించు. ॥ 4 ॥

మంత్రము

ఆ ప్ర ద్రవ పరమస్యాః పరావతః
శివే తే ద్యావాపృథివీ ఉభేస్తామ్ ।
తదయం రాజా వరుణ స్తథాహ
స త్వాయమహ్వాత్ స ఉపేదమేహి ॥ 5 ॥

పదము .

ఆ । ప్ర । ద్రవ । పరమస్యాః । పరాఽవతః ।
శివేఇతి । తే । ద్యావాపృథివీఇతి । ఉభేఇతి । స్తామ్ ।
తత్ । అయమ్ । రాజా । వరుణః । తథా । ఆహ ।
సః । త్వా । అయమ్ । అహ్వత్ । సః । ఉప । ఇదమ్ । ఆ ।
ఇహి ॥ 5 ॥

అనువాదం :

దూరదేశంలో ఉన్న ఓ రాజా! త్వరగా తిరిగిరా!
నీకు ద్యావాపృథువులు రెండూ
కల్యాణ కారిణు లగుదురు గాక!
ఈ వరుణ రాజు పైన చెప్పినట్టు నిన్ను ఆహ్వానించు గాక!
నీవు నీ రాజ్యంలో ప్రవేశించు. ॥ 5 ॥

మంత్రము :

ఇన్ద్రేన్ద్ర మనుష్యాః పరేహి సం

హ్యజ్ఞాస్థా వరుణైః సంవిదానః ।

సత్వాయమహ్వత్ స్వే సధస్థే స

దేవాన్ యక్షత్ స ఉ కల్పయాద్ విశః ॥ 6 ॥

పదము :

ఇన్ద్రఽఇన్ద్ర । మనుష్యాః । పరా । ఇహి । సమ్ ।

హి । అజ్ఞాస్థాః । వరుణైః । సమ్ఽవిదానః ।

సః । త్వా । అయమ్ । అహ్వత్ । స్వే । సధఽస్థే । సః ।

దేవాన్ । యక్షత్ । సః । ఓంఇతి । కల్పయాత్ । విశః ॥ 6 ॥

అనువాదం :

ఓ ఇంద్రా ! ఇంద్రా ! మనుష్యులమైన మావైపురా !
నీవు వరుణ సహవాసివి.
ఈ ఆహ్వానవిషయం నీకు తెలును.
ఓ రాజా ! ఈ వరుణహితుడైన ఇంద్రుడు
నిన్ను ఆహ్వానిస్తున్నాడు.
నీవు స్వరాష్ట్రంలో ప్రవేశించు.
అలా ప్రవేశించిన రాజు ఇంద్రాదులను యజనం చేయుగాక
ఆ రాజు ప్రజలను స్వస్వ వ్యాపారాలలో నియోగించు గాక !
॥ 6 ॥

మంత్రము

పథ్యా౨రేవతీర్బహుధా విరూపాః
సర్వాఃసఙ్గత్య వరీయస్తే అక్రన్ ।
తా స్త్వా సర్వాః సంవిదానా హ్వయన్తు
దశమీముగ్రః సుమనా వశేహ ॥ 7 ॥

పదము :

పథ్యా౨ః । రేవతీః । బహు౨ధా । వి౨రూపాః ।
సర్వాః । సమ్౨గత్య । వరీయః । తే । అక్రన్ ।
తాః । త్వా । సర్వాః । సమ్౨విదానాః । హ్వయన్తు
దశమీమ్ । ఉగ్రః । సు౨మనాః । వశ । ఇహ ॥ 7 ॥

అనువాదం :

ధనవతులైన, మార్గహితకారిణులైన దేవతలు,
బహుధా వివిధ రూపధారిణులై ఉన్నారు.
వారితో కలిసి నీవు బహుతర శ్రేయస్సును కల్పించు.
ఆ దేవత లందరూ ఏకకంఠంతో
నిన్ను రాష్ట్రంలోనికి ఆహ్వానింతురుగాక !
ఇక్కడ నీవు బలవంతుడవై, సంతుష్ట మనస్కుడవై,
నూరేళ్ళు నివసింతువు గాక !

ఇది నాలుగవ సూక్తం

## సూక్తం-5

# పర్ణమణి ధారణ సూక్తం

ఋషి: అథర్వుడు॥ దేవత: సోముడు, పర్ణమణి॥ ఛందస్సు: 1 పురోఽనుష్టుప్ త్రిష్టుప్: 2,3,5-7 అనుష్టుప్, 4 త్రిష్టుప్, 8 విరాడురో బృహతీ॥ మంత్రములు: ॥ 8 ॥

వినియోగం:- తేజోబల ఆయుర్ధనాది పుష్టికోసమై చేసే హోమంలోను, మహాశాంతిలోను దీనికి వినియోగం.

మంత్రము:

ఆయమగన్ పర్ణమణిర్బలీ
బలేన ప్రమృణన్త్సపత్నాన్ ।
ఓజో దేవానాం పయ ఓషధీనాం
వర్చసా మా జిన్వత్వప్రయావన్ ॥ 1 ॥

పదము:

ఆ । అయమ్ । అగన్ । పర్ణఽమణిః । బలీ ।
బలేన । ప్రఽమృణన్ । సఽపత్నాన్ ।
ఓజః । దేవానామ్ । పయః । ఓషధీనామ్ ।
వర్చసా । మా । జిన్వతు । అప్రఽయావన్ ॥ 1 ॥

అనువాదం.

ఈ పర్ణమణి (మోదుగు) మావైపు వచ్చుగాక!
అది బలవత్తరమై, శత్రుహింసకమై వచ్చు గాక!

ఇంద్రాదుల ఓజోరూపమై ఓషధుల సారభూతమైన
ఈ మణి నన్ను వదలి పోకుండుగాక!
నన్ను వర్చస్విని చేయుగాక! ॥ 1 ॥

మంత్రము :

మయి క్షత్రం పర్ణమణే మయి ధారయతాద్ రయిమ్ ।
అహం రాష్ట్రస్యాభీవర్గే నిజో భూయాసము త్తమః ॥ 2 ॥

పదము .

మయి । క్షత్రమ్ । పర్ణఽమణే । మయి । ధారయతాద్ । రయిమ్।
అహమ్ । రాష్ట్రస్య । అభిఽవర్గే । నిఽజః । భూయాసమ్ । ఉత్
ఽతమః ॥ 2 ॥

అనువాదం :

నాలో క్షాత్రాన్ని నింపు ఓ పలాశమణీ!
ధనాన్ని నాకు చేకూర్చు.
నేను నిన్ను ధరించి రాజ్యాన్ని స్వాధీనం చేసుకోవడంలో
అనన్య సహాయుడను, ఉత్తముడను అగుదును గాక.! ॥ 2 ॥

మంత్రము ·

యం నిదధుర్వనస్పతౌ గుహ్యం దేవాః ప్రియం మణిమ్ ।
తమస్మభ్యం సహాయుషా దేవా దదతు భర్తవే ॥ 3 ॥

పదము :

యమ్ । నిఽదధుః । వనస్పతౌ । గుహ్యమ్ । దేవాః । ప్రియమ్।
మణిమ్ ।

తమ్ । అస్మభ్యమ్ । సహ । ఆయుషా । దేవాః । దదతు । భర్తవే ॥ 3 ॥

అనువాదం :

ఇంద్రాది దేవతలు ప్రియము గుహ్యము అయిన మణిని
మోదుగ చెట్టులో నిహితం చేసినారు.
ఆ మణిధారణకై ఆయుస్సుతో పాటు దీనిని
దేవతలు మా కిత్తురు గాక ! ॥ 3 ॥

మంత్రము

సోమస్య పర్ణః సహ ఉగ్రమాగ
న్నిన్ద్రేణ దత్తో వరుణేన శిష్టః ।
తం ప్రియాసం బహు రోచమానో
దీర్ఘాయుత్వాయ శతశారదాయ ॥ 4 ॥

పదము :

సోమస్య । పర్ణః । సహః । ఉగ్రమ్ । ఆ । అగన్ ।
ఇన్ద్రేణ । దత్తః । వరుణేన । శిష్టః ।
తమ్ । ప్రియాసమ్ । బహు । రోచమానః ।
దీర్ఘాయుఽత్వాయ । శతఽశారదాయ ॥ 4 ॥

అనువాదం .

దివిలోని సోమలతను కొని వస్తూండగా
భూమిపై పడిన మొక్క ఇది.

బల సంపన్నమైన ఈ మణి నాకు లభించుగాక !
ఇంద్రుడివ్వగా, వరుణుడు అనుమతింపగా
దీర్ఘాయుస్సు కోసం బహు తేజస్కమైన
ఈ మణిని నేను ధరిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

ఆ మా రుక్షత్ పర్ణమణిర్మహ్యా అరిష్టతాతయే ।
యథాహ ముత్తరోసాన్యర్యమ్ణ ఉత సంవిదః ॥ 5 ॥

పదము :

ఆ । మా । అరుక్షత్ । పర్ణఽమణిః । మహ్యై । అరిష్టఽతాతయే ।
యథా । అహమ్ । ఉత్తరః । అసాని । అర్యమ్ణః । ఉత । సమ్ఽవిదః ॥ 5 ॥

అనువాదం :

ఈ పర్ణమణి అరిష్టనివారణార్థమై నన్నారోహించుగాక !
అధిక ధనుని కంటె సమాన జ్ఞాని కంటె
నేనీ మణి ధారణతో ఉత్కృష్టతరుడనైనాను. ॥ 5 ॥

మంత్రము :

యే ధీవానో రథకారాః కర్మారా యే మనీషిణః ।
ఉపస్తీన్ పర్ణ మహ్యం త్వం సర్వాన్ కృణ్వభితో జనాన్ ॥ 6 ॥

పదము :

యే । ధీవానః । రథఽకారాః । కర్మారాః । యే । మనీషిణః ।

ఉప౽స్తిన్ । పర్ణ । మహ్యమ్ । త్వమ్ । సర్వాన్ । కృణు ।
అభితః । జనాన్ ॥ 6 ॥

అనువాదం :

ధీవరులు (బెస్తవారు), రథకారులు, కమ్మరులు
మొదలైన మనీషులను ఓ పర్ణమణీ!
నా సేవార్థమై నాచుట్టూ చేర్చు. ॥ 6 ॥

మంత్రము :

యే రాజానో రాజకృతః సూతాగ్రామణ్య౽శ్చ యే ।
ఉపస్తీన్ పర్ణ మహ్యం త్వం సర్వాన్ కృణ్వభితో జనాన్ ॥ 7 ॥

పదము :

యే । రాజానః । రాజ౽కృతః । సూతాః । గ్రామ౽న్య౽ః । చ ।
యే ।
ఉప౽స్తిన్ । పర్ణ । మహ్యమ్ । త్వమ్ । సర్వాన్ । కృణు ।
అభితః । జనాన్ ॥ 7 ॥

అనువాదం :

అన్యరాజులు, మంత్రులు, సూతులు, గ్రామణులు
మొదలగు వారి నందరినీ ఓ పర్ణమణీ!
నా సేవార్థమై నా చుట్టూ చేర్చు. ॥ 7 ॥

మంత్రము :

పర్ణో౽సి తనూపానః సయోనిర్వీరో వీరేణ మయా ।

సంవత్సరస్య తేజసా తేన బధ్నామి త్వా మణే ॥ 8 ॥

పదము :

పర్ణః । అసి । తనూఽపానః । సఽయోనిః । వీరః । వీరేణ ।
మయా ।
సమ్ఽవత్సరస్య । తేజసా । తేన । బధ్నామి । త్వా । మణే ॥ 8 ॥

అనువాదం :

ఓ మణీ! నీవు పలాశ నిర్మితవు.
శరీర రక్షకుడవు, వీరుడవు.
కావున ఆదిత్య తేజోయుక్తుడవైన నిన్ను
తేజః ప్రాప్తికై ధరిస్తున్నాను. ॥ 8 ॥

ఇది ఐదవ సూక్తం

ఇది మొదటి అనువాకం

# అనువాకం – 2

## సూక్తం – 6

## శత్రునాశన సూక్తం

ఋషిః జగద్బీజం పురుషుడు ॥ దేవత : అశ్వత్థము ॥ ఛందస్సు : అనుష్టుప్ః
మంత్రములు : ॥ 8 ॥

వినియోగం : అభిచార కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

పుమాన్ పుంసః పరిజాతోశ్వత్థః ఖదిరాదధి ।

స హన్తు శత్రూన్ మామకాన్ యానహం ద్వేష్మి యే
చ మామ్ ॥ 1 ॥

పదము.

పుమాన్ । పుంసః । పరిఽజాతః । అశ్వత్థః । ఖదిరాత్ । అధి ।
సః । హన్తు । శత్రూన్ । మామకాన్ । యాన్ । అహమ్ । ద్వేష్మి ।
యే । చ । మామ్ ॥ 1 ॥

అనువాదం :

వీర్యాతిశయ వృక్షజన్యము,
అశ్వత్థరూపమైన ఖదిర * వృక్షం నుంచి
పుట్టిన మణిని ధరిస్తున్నాను.
నేను ద్వేషించే శత్రువులను,
నన్ను ద్వేషించే శత్రువులను
ఈ మణి నశింప జేయుగాక! ॥ 1 ॥

మంత్రము :

తానశ్వత్థ నిః శృణీహి శత్రూన్ వైబాధదోధతః ।
ఇన్ద్రేణ వృత్రఘ్నా మేదీ మిత్రేణ వరుణేన చ ॥ 2 ॥

పదము.

తాన్ । అశ్వత్థ । నిః । శృణీహి । శత్రూన్ । వైబాధఽదోధతః ।
ఇన్ద్రేణ । వృత్రఽఘ్నా । మేదీ । మిత్రేణ । వరుణేన చ ॥ 2 ॥

* खदिर (m) खैर Accacia Catechu wild (Vedic dictionary)
అత్తపత్తి. ముడుగుదామర

**అనువాదం .**

ఖదిరోత్పన్నమైన, అశ్వత్థవికారమైన మణీ!
సర్వశత్రువులను నిశ్శేషంగా నిర్మూలించు.
వృత్రహంతకుడైన ఇంద్రునకు, మిత్రునకు, వరుణునకు
మిత్రమైన దీ అశ్వత్థమణి. ॥ 2 ॥

**మంత్రము :**

యథాశ్వత్థ నిరభనో న్తర్మహత్యఽర్ణవే ।
ఏవా తాన్త్సర్వాన్నిర్భఙ్గ్ధి యానహం ద్వేష్మియే చ మామ్
॥ 3 ॥

**పదము :**

యథా । అశ్వత్థ । నిఃఽఅభనః । అన్తః । మహతి । అర్ణవే ।
ఏవ । తాన్ । సర్వాన్ । నిః । భఙ్గ్ధి । యాన్ । అహమ్ । ద్వేష్మి
యే । చ । మామ్ ॥ 3 ॥

**అనువాదం :**

ఓ అశ్వత్థ వృక్షమా! విశాలమైన అంతరిక్షం వంటి
ఖదిర కోటరాన్ని చీల్చుకొని పైకి వచ్చిన
ఓమణీ! నేను ద్వేషించే శత్రువులను,
నన్ను ద్వేషించే శత్రువులను, సర్వులను నిర్మూలించు. ॥ 3 ॥

**మంత్రము :**

యః సహమానశ్చరసి సాసహాన ఇవ ఋషభః ।
తేనాశ్వత్థ త్వయా వయం సపత్నాన్త్సహిషీమహి ॥ 4 ॥

పదము :

యః । సహమానః । చరసి । ససహానఃఽఇవ । ఋషభః ।
తేన । అశ్వత్థ । త్వయా । వయమ్ । సఽపత్నాన్ । సహిషీమహి
॥ 4 ॥

అనువాదం :

పర భంజకమైన అశ్వత్థం తన సజాతీయాలైన
ఇతరాలను అభిభవించే వృషభం వంటిది.
ఇలాంటి నీ సహాయంతో ఓ అశ్వత్థమా!
మేము శత్రువులను నశింప జేస్తున్నాము. ॥ 4 ॥

మంత్రము :

సినాత్వేనాన్ నిర్ ఋతిర్మృత్యోః పాశైరమోక్యైః ।
అశ్వత్థ శత్రూన్ మామకాన్ యానహం ద్వేష్మి యే చ మామ్
॥ 5 ॥

పదము :

సినాతు । ఏనాన్ । నిఃఽఋతిః । మృత్యోః । పాశైః । అమోక్యైః
అశ్వత్థ । శత్రూన్ । మామకాన్ । యాన్ । అహమ్ । ద్వేష్మి ।
యే । చ । మామ్ ॥ 5 ॥

అనువాదం :

సర్వథా విడదీయరాని మృత్యుపాశాలతో నిర్ ఋతి
శత్రువులను బంధించుగాక! ఓ అశ్వత్థమా!
నేను ద్వేషించే, నన్ను ద్వేషించే
శత్రువుల నందరిని నశింపజేయి. ॥ 5 ॥

మంత్రము.

యథాశ్వత్థ వానస్పత్యానారోహన్ కృణుషేధరాన్ ।
ఏవా మే శత్రోర్మూర్ధానం విష్వగ్ భిన్ధి సహస్వ చ ॥ 6 ॥

పదము :

యథా । అశ్వత్థ । వానస్పత్యాన్ । ఆఽరోహన్ । కృణుషే అధరాన్ ।
ఏవ । మే । శత్రోః । మూర్ధానమ్ । విష్వక్ । భిన్ధి । సహస్వ । చ ॥ 6 ॥

అనువాదం :

వనస్పతులను అధిరోహించి, ఓ అశ్వత్థమా!
నీవు వానిని క్రిందు పరుస్తున్నావు.
నా శత్రుశిరస్సును సర్వతః విదారించు, అభిభవించు. ॥ 6 ॥

మంత్రము :

తేఽధరాఞ్చః ప్ర ప్లవన్తాం ఛిన్నా నౌరివ బన్ధనాత్ ।
న వైబాధప్రణుత్తానాం పునరస్తి నివర్తనమ్ ॥ 7 ॥

పదము :

తే । అధరాఞ్చః । ప్ర ప్లవన్తామ్ । ఛిన్నా । నౌఃఽఇవ । బన్ధనాత్
న । వైబాధఽప్రనుత్తానామ్ । పునః । అస్తి । నిఽవర్తనమ్ ॥7॥

**అనువాదం :**

తలలు వంచుకొని వెళ్ళే ద్వివిధ
శత్రువులు నదీప్రవాహంలో వెళ్ళుదురుగాక !
( తీరం చేరకుందురు గాక ! )
రజ్జు బంధనం నుంచి విచ్ఛిన్నమైన నావ వలె
వారు అధోముఖులయ్యే పోవుదురు గాక !
ఈ మణితో తలలు వంచుకున్న శత్రువు లిక తిరిగిరారు. ॥7॥

మంత్రము

ప్రైణాన్ నుదే మనసా ప్ర చిత్తేనోత బ్రహ్మణా ।
ప్రైణాన్ । వృక్షస్య । శాఖయాశ్వత్థస్య నుదామహే ॥ 8 ॥

పదము :

ప్ర । ఏనాన్ । నుదే । మనసా । ప్ర । చిత్తేన । ఉత । బ్రహ్మణా ।
ప్ర । ఏనాన్ । వృక్షస్య । శాఖయా । అశ్వత్థస్య । నుదామహే
॥ 8 ॥

**అనువాదం :**

సంకల్ప బలంతో ఈ శత్రువులను
స్థాన భ్రష్టులను చేస్తున్నాను.
నా చిత్తంతో ఉచ్చాటనం చేస్తున్నాను.
మంత్రంతో, అశ్వత్థవృక్షశాఖతో
ఈ శత్రువులను నాశనం చేస్తున్నాము. ॥ 8 ॥

ఇది ఆరవ సూక్తం

## సూక్తం - 7

ఋషి: భృగువు, అంగిరసుడు॥ దేవత: 1-3 హరిణుడు; 4 విచృతులగు తారకలు; 5 అపస్సు, 7 యక్ష్మనాశనమ్॥ ఛందస్సు: 1-5, 7 అనుష్టుప్; 6 భురిగనుష్టుప్॥ మంత్రములు: ॥ 7 ॥

వినియోగం: క్షేత్రియవ్యాధి నివారణకైన హరిణశృంగ మణి బంధనాదులలోను, కౌమారీ మహాశాంతిలోను దీనికి వినియోగం

మంత్రము:

హరిణస్య రఘుష్యదోధి శీర్షణి భేషజమ్ ।
స క్షేత్రియం విషాణయా విషూచీనమనీనశత్ ॥ 1 ॥

పదము:

హరిణస్య । రఘుఽస్యదః । అధి । శీర్షణి । భేషజమ్ ।
సః । క్షేత్రియమ్। విఽసానయా । విషూచీనమ్ । అనీనశత్ ॥ 1 ॥

అనువాదం:

వేగంగా పరుగెత్తే జింక తలపై
కొమ్ము రూపంలో ఔషధం కలదు.
ఆ హరిణం తన శృంగంతో క్షేత్రియమైన
వ్యాధులను సర్వత్ర నశింపజేయుగాక! ॥ 1 ॥

మంత్రము.

అను త్వా హరిణో వృషా పద్భి శ్చతుర్భి రక్రమీత్ ।
విషాణే వి ష్య గుష్పితం యదస్య క్షేత్రియం హృది ॥2॥

పదము :

అను । త్వా । హరిణః । వృషా । పత్ఽభిః । చతుఃఽభిః ।
అక్రమీత్ ।
విఽసానే । వి । స్య । గుష్పితమ్ । యత్ । అస్య । క్షేత్రియమ్ ।
హృది ॥ 2 ॥

అనువాదం .

మణి రూపంతో ఉన్న ధరించిన నిన్ను అనుసరించి
హరిణం నాలుగు కాళ్ళతో
క్షేత్రియ రోగాన్ని ఆక్రమించినది.
నీవు కూడ ఓ విషాణమా !
రోగి హృదయంలో నాటుకొన్న
రోగజాతాన్ని వినాశం చెయ్యి. ॥ 2 ॥

మంత్రము :

అదో యదవరోచతే చతుష్పక్ష మివ చ్ఛదిః ।
తేనా తే సర్వం క్షేత్రియ మఙ్గేభ్యో నాశయామసి ॥ 3 ॥

పదము ;

అదః । యత్ । అవఽరోచతె । చతుష్పక్షమ్ఽఇవ । ఛదిః ।
తేన । తే । సర్వమ్ । క్షేత్రియమ్ । అఙ్గేభ్యః । నాశయామసి ॥3॥

అనువాదం :

చదరంగా ఉన్న చిత్రాసనం వలె
భాసించే ఆ హరిణ చర్మంతో, ఓ రోగి !

నీ సర్వావయవాలలోని క్షయ కుష్ఠాది రూపమైన
బహు విధ క్షేత్రియ రోగాన్ని నాశనం చేస్తున్నాము. ॥ 3 ॥

మంత్రము :

అమూ యే దివి సుభగే విచృతౌ నామ తారకే ।
వి క్షేత్రియస్య ముఞ్చతా మధమం పాశ ముత్తమమ్ ॥ 4 ॥

పదము :

అమూ ఇతి । యే ఇతి । దివి । సుభగే ఇతి సుఽభగే । విఽచృతౌ ।
నామ । తారకే ఇతి ।
వి । క్షేత్రియస్య । ముఞ్చతామ్ । అధమమ్ । పాశమ్ । ఉత్
ఽతమమ్ ॥ 4 ॥

అనువాదం :

అదో ద్యులోకంలో వెలుగుతున్న శోభన రూపమైన
నక్షత్రాలు (మూలానక్షత్రం) ఉదయించినవి.
క్షేత్ర, పరక్షేత్రగతాలైన, ఊర్ధ్వ అధోకాయగతాలైన
రోగ బీజాన్ని విముక్తం చేయుగాక! ॥ 4 ॥

మంత్రము .

ఆప ఇద్ వా ఉ భేషజీ రాపో అమీవచాతనీః ।
ఆపో విశ్వస్య భేషజీస్తాస్త్వా ముఞ్చన్తు క్షేత్రియాత్ ॥ 5 ॥

పదము .

ఆపః । ఇత్ । వై । ఓంఇతి । భేషజీః । ఆపః । అమీవఽచాతనీః ।

ఆపః । విశ్వస్య । భేషజీః । తాః । త్వా । ముఞ్చన్తు । క్షేత్రియాత్ ॥ 5 ॥

**అనువాదం**

జలమే ఔషధ రూప మైనది.
జలమే ఔషధ రూపంగా పరిణతమై రోగ నాశకమైనది
జలమే సర్వరోగాలకు ఔషధమైనది.
ఓ రోగీ! నిన్ను ఆ జలం
క్షేత్రియ రోగం నుంచి విముక్తుని చేయుగాక! ॥ 5 ॥

మంత్రము.

యదాసుతేః క్రియమాణాయాః క్షేత్రియం త్వా వ్యానశే ।
వేదాహం తస్య భేషజం క్షేత్రియం నాశయామి త్వత్ ॥6॥

పదము ;

యత్ । ఆఽసుతేః । క్రియమాణాయాః । క్షేత్రియమ్ । త్వా । వి ఆనశే ।
వేద । అహమ్ । తస్య । భేషజమ్ । క్షేత్రియమ్ । నాశయామి । త్వత్ ॥ 6 ॥

**అనువాదం :**

ఓ రోగీ! నీవు స్వీకరించిన ద్రవీభూతమైన
అన్నం నుంచి నీకు క్షేత్రియరోగం సంక్రమించినది.
దానికి ఔషధాన్ని నే నెఱుంగుదును.
నీ నుంచి ఆ రోగాన్ని నాశనం చేస్తున్నాను. ॥ 6 ॥

మంత్రము :

అపవాసే నక్షత్రాణా మపవాస ఉషసా ముత ।
అపాస్మత్ సర్వం దుర్భూతమప క్షేత్రియ ముచ్ఛతు ॥ 7 ॥

పదము :

అప ఽవాసే । నక్షత్రాణామ్ । అప ఽవాసే । ఉషసామ్ । ఉత ।
అప । అస్మత్ । సర్వమ్ । దుః ఽభూతమ్ । అప । క్షేత్రియమ్ ।
ఉచ్ఛతు ॥ 7 ॥

అనువాదం :

చుక్కలు అస్తమించే సమయంలో, ఉషోవసాన
సమయంలో చేసే చికిత్సతో నిఖిల దుష్కృతం
మా నుంచి వెడలి పోవుగాక!
క్షేత్రియ రోగం మా నుంచి తొలగి పోవుగాక!

ఇది ఏడవ సూక్తం

## సూక్తం – 8

ఋషిః అథర్వుడు ॥ దేవత : 1–4 మిత్రాదులగు విశ్వేదేవులు ; 5,6 మనస్సు ॥
ఛందస్సు : 1,3 త్రిష్టుప్ ; 2,6 జగతీ ; 4 విరాడ్ బృహతీ గర్భా చతు
ష్పదా త్రిష్టుప్ ; 5 అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం. :– ఉపనయన కర్మలోను, శాంతి కల్పంలోను, సాంమనస్య కర్మ
లోను దీనికి వినియోగం. ఇది ఆయుష్యగణంలోనిది. ఇందులో
నాలుగవ మంత్రానికి వివాహకాండలో వినియోగం.

మంత్రము :

ఆయాతు మిత్ర ఋతుభిః కల్పమానః

సంవేశయన్ పృథివీ ముస్రియాభిః ।
అథాస్మభ్యం వరుణో వాయురగ్ని—
ర్బృహద్ రాష్ట్రం సంవేశ్యఽదధాతు ॥ 1 ॥

పదము :

ఆ । యాతు । మిత్రః । ఋతుఽభిః । కల్పమానః ।
సమ్ఽవేశయన్ । పృథివీమ్ । ఉస్రియాభిః ।
అథ । అస్మభ్యమ్ । వరుణః । వాయుః । అగ్నిః ।
బృహత్ । రాష్ట్రమ్ । సమ్ఽవేశ్యమ్ । దధాతు ॥ 1 ॥

అనువాదం :

మిత్రదేవుడు మా రక్షణకై వచ్చుగాక !
దీర్ఘాయుష్కారకుడు గోవులతో ( కిరణాలతో )
పృథివిని వ్యాపించిన వాడు, మరి వరుణుడు,
వాయువు, అగ్ని మా రాజ్యాన్ని నివాసార్హం చేయుగాక !
॥ 1 ॥

మంత్రము .

ధాతా రాతిః సవితేదం జుషన్తా
మిన్ద్ర స్త్వష్టా ప్రతి హర్యన్తు మే వచః ।
హువే దేవీ మదితిం శూరపుత్రాం
సజాతానాం మధ్యమేష్ఠా యథాసాని ॥ 2 ॥

పదము :

ధాతా । రాతిః । సవితా । ఇదమ్ । జుషన్తామ్ ।

ఇన్ద్రః । త్వష్టా । ప్రతి । హర్యన్తు । మే । వచః ।

హువే । దేవీమ్ । అదితిమ్ । శూరఽపుత్రామ్ ।

సఽజాతానామ్ । మధ్యమేఽస్థాః । యథా । అసాని ॥ 2 ॥

అనువాదం :

విధాత, అర్యముడు, సవిత నా హవిస్సును సేవింతురుగాక!
ఇంద్రుడు త్వష్ట కూడ నా వాక్యాన్ని
అభిముఖులై విందురుగాక!
దేవి, అదితిని ఆహ్వానిస్తున్నాను.
సజాతుల మధ్యలో నన్నుండునట్లు చేయుదురుగాక! ॥ 2 ॥

మంత్రము :

హువే సోమం సవితారం నమోభి
ర్విశ్వా నాదిత్యాం అహ ముత్తరత్వే ।
అయ మగ్నిర్దీదాయద్ దీర్ఘమేవ
సజాతైరిద్ధో ప్రతిబ్రువద్భిః ॥ 3 ॥

పదము :

హువే । సోమమ్ । సవితారమ్ । నమఃఽభిః ।

విశ్వాన్ । ఆదిత్యాన్ । అహమ్ । ఉత్తరఽత్వే ।

అయమ్ । అగ్నిః । దీదయత్ । దీర్ఘమ్ । ఏవ ।

సఽజాతైః । ఇద్ధః । అప్రతిబ్రువత్ఽభిః ॥ 3 ॥

అనువాదం :

సోముని, సవితను అదిత్యులను,
నమస్కారాలతో ప్రయోక్తనైన నేను
యజమాని ఉన్నతికై అహ్వానిస్తున్నాను.
ఈ అగ్ని దీప్తిమంతు డగుగాక!
అనుకూల వాక్కులైన సజాత పురుషుల మధ్యంలో
చిరకాలం అభివృద్ధి చెందుదురుగాక! ॥ 3 ॥

మంత్రము :

ఇహేదసాథ న పరో గమాథే
ర్యోగోపాః పుష్టపతిర్వ అజత్ ।
అస్మై కామాయోప కామినీ
ర్విశ్వే వో దేవా ఉపసంయన్తు ॥ 4 ॥

పదము :

ఇహ । ఇత్ । అసాథ । న । పరః । గమాథ ।
ఇర్యః । గోపాః । పుష్టఽపతిః । వః । అ । అజత్ ।
అస్మై । కామాయ । ఉప । కామినీః ।
విశ్వే । వః । దేవాః । ఉపఽసంయన్తు ॥ 4 ॥

అనువాదం :

* కామినులారా ! మీరు కన్యవద్దనే నివసించండి.
ముందుకు వెళ్ళిపోకండి.
మార్గ ప్రేరకుడు, పోషకుడు అయిన పుష్టపతి
( పూష )మిమ్ములను అందుకై ప్రేరేపించుగాక !
కామిస్తున్న ఈ వరునివద్దకు కామినులైన మిమ్ములను
విశ్వేదేవతలు చేర్తురు గాక ! ॥ 4 ॥

మంత్రము :

సం వో మనాంసి సంవ్రతా
సమాకూతీర్నమా మసి ।
అమీ యే వివ్రతా స్థన తాన్
వః సం నమయామసి ॥ 5 ॥

పదము :

సమ్ । వః । మనాంసి । సమ్ । వ్రతా ।
సమ్ । ఆఽకూతీః । నమామసి ।
అమీ ఇతి । యే । విఽవ్రతాః । స్థన । తాన్ ।
వః । సమ్ । నమయామసి ॥ 5 ॥

---

*భావం స్పష్టంగా లేదు. సాయణుడు, విట్నీ, గ్రిఫిత్స్ ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా అర్థం చెప్పుతున్నారు. సాయణుని ఇక్కడ అనుసరించాను. ఇది కూడా సంతృప్తికరంగా లేదు,

**అనువాదం :**

మీ మనస్సులు ఏక మగునట్లు వ్రతములను చేస్తున్నాము.
అలాగే సంకల్పాలను ఏకం చేస్తున్నాము.
పూర్వం విరుద్ధ కర్మలైన మీ విమనస్కతను
తొలగించి మిమ్ములను ఏకం చేస్తున్నాము. ॥ 5 ॥

**మంత్రము .**

అహం గృహ్ణామి మనసా మనాంసి
మమ చిత్త మను చిత్తేభిరేత ।
మమ వశేషు హృదయాని వః కృణోమి
మమ యాత మను వర్త్మాన ఏత ॥ 6 ॥

**పదము :**

అహమ్ । గృహ్ణామి । మనసా । మనాంసి ।
మమ । చిత్తమ్ । అను । చిత్తేభిః । ఆ । ఇత ।
మమ । వశేషు । హృదయాని । వః । కృణోమి ।
మమ । యాతమ్ । అనుఽవర్త్మానః । ఆ । ఇత ॥ 6 ॥

**అనువాదం :**

మీ మనస్సులను నా మనస్సుతో
స్వాయత్తం చేసుకుంటున్నాను.
మీరు కూడ నాచిత్తాన్ని అనుసరించిన చిత్తములతో
వత్తురుగాక ! నా వశంలోనికి మీ హృదయాలు వచ్చుగాక !
నన్ననుసరించి మీరు వత్తురుగాక ! ॥ 6 ॥

ఇది ఎనిమిదవ సూక్తం.

# సూక్తం–9

ఋషి: వామదేవుడు ॥ దేవత : ద్యావాపృథివీ, విశ్వేదేవులు ॥ ఛందస్సు: 1-3,5
అనుష్టుప్; 4 చతుష్పాన్నిచృద్ బృహతీ ; 6 భురిగనుష్టుప్ ॥
మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :- విఘ్నశమన కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

కర్శఫస్య విశఫస్య ద్యౌః పితా పృథివీ మాతా ।
యథాభిచక్ర దేవా స్తథాప కృణుతా పునః ॥ 1 ॥

పదము :

కర్శఫస్య । వి౽శఫస్య । ద్యౌః । పితా । పృథివీ । మాతా ।
యథా । అభి౽చక్ర । దేవాః । తథా । అప । కృణుత । పునః॥1॥

అనువాదం :

వ్యాఘ్రాదులు, సర్పాదులు ఇంకా
వివధ పిశాచ విఘ్నకారిణులకు
ద్యులోకం తండ్రి, పృథివి తల్లి.
మీరు పూర్వం వీటిని ఓ దేవతలారా !
మాకు అభిముఖంగా పంపినారు.
అలాగే తిరిగి వీటిని మాకు
పరాఙ్ముఖాలై పోవునట్లు చేయండి. ॥ 1 ॥

మంత్రము :

అశ్రేష్మాణో అధారయన్ తథా తన్మనునా కృతమ్ ।
కృణోమి వధ్రి విష్కన్ధం ముష్కాబర్హో గవామివ ॥ 2 ॥

పదము .

అ౹శ్రేష్మాణః । అధారయన్ । తథా । తత్ । మనునా । కృతమ్ ।
కృణోమి । వ౹ధ్రి । వి౽స్కన్ధమ్ । ముష్కఆబర్హః । గవామ్౽ఇవ ॥ 2 ॥

అనువాదం :

విఘ్నంతో కార్యసాఫల్యం చెందని జనులు
విఘ్ననివారణార్థమై * 'అరలు'
మణిని, దండాన్ని ధరించినారు.
అలాగే మనువు విధించినాడు.
నేను కూడ ఈ విధంగా చేసి
ఎద్దులను (* ముష్కాబర్హంతో)
వీర్యహీనంగా చేసినట్లు విఘ్న జాతాన్ని
శుష్క చర్మ రజ్జువుతో బంధిస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము .

పిశఙ్గే సూత్రే ఖృగలం తదా బధ్నన్తి వేధసః ।
శ్రవస్యుం శుష్మం కాబవం వధ్రిం కృణ్వన్తు బన్ధురః ॥ 3 ॥

పదము .

పిశఙ్గే । సూత్రే । ఖృగలమ్ । తత్ । ఆ । బధ్నన్తి । వేధసః ।
శ్రవస్యుమ్ । శుష్మమ్ । కాబవమ్ । వధ్రిమ్ । కృణ్వన్తు । బన్ధురః ॥ 3 ॥

---

* 'అరలు' Aratu-The tree Colosathes Indica Bl- (cf aralu) దుండిలము మండూక పర్ణము
* వృషభాలకు వృషణాలను కొట్టడం.

అనువాదం :

పిశంగ వర్ణ సూత్రంతో కవచంవలె 'అరలు' మణిని
సాధకులు తమ శరీరాలపై కట్టు కుంటున్నారు.
అలాగే మేము ధరించిన ఈ మణి కూడా
అతి క్రూరమూ, శోషకమూ అయిన
కాబవ మనే పైశాచిక
విఘ్నజాతాన్ని నిర్వీర్యం చేయుగాక ! ॥ 3 ॥

మంత్రము :

యేనా శ్రవస్యవ శ్చరథ దేవా ఇవాసురమాయయా ।
శునాం కపిరివ దూషణో బన్ధురా కాబవస్య చ ॥ 4 ॥

పదము :

యేన । శ్రవస్యవః । చరథ । దేవాఃఽఇవ । అసురఽమాయయా।
శునామ్ । కపిఃఽఇవ । దూషణః । బన్ధురా । కాబవస్య । చ ॥ 4 ॥

అనువాదం :

అన్నాన్ని కోరే ఓ జనులారా !
అసుర మాయతో మోహితులైన దేవతలవలె
పరకృత మాయా మోహితులై
సంగ్రామంలో తిరుగుతున్నారు.
కుక్కలకు కోతివలె, అలాంటి
మాయారూప విశేషమునకు బంధురమైన
ఖడ్గం దూష యిత్రి అగుగాక ! ॥ 4 ॥

మంత్రము :

దుష్ట్యై హి త్వా భత్స్యామి దూషయిష్యామి కాబవమ్ ।

ఉదాశవో రథా ఇవ శపథేభిః సరిష్యథ ॥ 5 ॥

పదము.

దుష్ట్యై। హి। త్వా। భత్స్యామి। దూషయిష్యామి। కాబవమ్।

ఉత్। ఆశవః। రథాఃఽఇవ। శపథేభిః। సరిష్యథ ॥ 5 ॥

అనువాదం.

ఓ మణీ! నిన్ను పరకృత
విఘ్ననివారణార్థమై కట్టుకుంటున్నాను.
ఇందులో కాబవ విఘ్న విశేషాన్ని నశింప జేస్తున్నాను.
వేగవంతములైన అశ్వములు పూన్చిన రథాలవలె
శాపాదులతో వియుక్తులై యథేచ్ఛగా సంచరించండి. ॥ 5 ॥

మంత్రము :

ఏకశతం విష్కన్ధాని విష్ఠితా పృథివీ మను।

తేషాం త్వామగ్ర ఉజ్జహ రుర్మణిం విష్కన్ధ దూషణమ్ ॥ 6 ॥

పదము :

ఏకఽశతమ్। విఽస్కన్ధాని। విఽస్థితా। పృదివీమ్। అను।

తేషామ్। త్వామ్। అగ్రే। ఉత్। జహరుః। మణిమ్। విస్కన్ధ
ఽదూషణమ్ ॥ 6 ॥

అనువాదం :

నూటు ఒక్క విఘ్నములు పృథివిని ఆక్రమించి ఉన్నవి.
ఆ విఘ్నముల నివృత్తికై ఓ మణీ!

నిన్ను పూర్వం దేవతలు ధరించినారు.
అందువల్ల విష్కంధ దూషకమైన మణిని
నేను కూడ ధరిస్తున్నాను. ॥ 6 ॥

ఇది తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 10

## కాలయజ్ఞం

ఋషిః అథర్వుడు ॥ దేవత · అష్టకా ॥ ఛందస్సు: 1-3,8-11,13 అనుష్టుప్, 4,-6,12 త్రిష్టుప్, 7 షట్పదా విరాడ్ గర్భాతి జగతీ ॥ మంత్రములు : ॥ 13 ॥

వినియోగం :- పుష్ట్యర్థ కర్మలలో, అష్టకా కర్మలో, సోమయాగంలో, చాతుర్మాస్యంలోని సాకమేధంలో, రాజుకు చెందిన ఆరాత్రిక విధానంలో దీనికి వినియోగం.

మంత్రము.

ప్రథమా హ వ్యుఽవాస సా ధేను రభవద్ యమే ।
సా నః పయస్వతీ దుహా ముత్తరాముత్తరాం సమామ్ ॥ 1 ॥

పదము .

ప్రథమా । హ । వి । ఉవాస । సా । ధేనుః । అభవత్ । యమే ।
సా । నః । పయస్వతీ । దుహామ్ । ఉత్తరామ్ఽఉత్తరామ్ ।
సమామ్ ॥ 1 ॥

అనువాదం ·

అది ఉషస్సు తమస్సును తొలగించినది.

ఆ ఉషోయుక్తమైన * ఏకాష్టక యముని విషయంలో
ధేనువు ( ప్రీతికరం ) అయినది.
అది మాకు పయస్వతి యై
ఏటేటా అభిమత ఫల దుగ్ధాన్ని ప్రసాదించినది ॥ 1 ॥

మంత్రము :

యాం దేవాః ప్రతినన్దన్తి రాత్రిం ధేను ముపాయతీమ్ ।
సంవత్సరస్య యా పత్నీ సా నో అస్తు సుమఙ్గలీ ॥ 2 ॥

పదము :

యామ్ । దేవాః । ప్రతిఽనన్దన్తి । రాత్రిమ్ । ధేనుమ్ । ఉపఽఆయతీమ్ ।
సమ్ఽవత్సరస్య । యా । పత్నీ । సా । నః । అస్తు । సుఽమఙ్గలీ ॥ 2 ॥

అనువాదం :

ఏకాష్టకా రాత్రిని, ధేను రూపమై
తమ వద్దకు వచ్చుదానిని చూచి దేవతలు ప్రశంసిస్తున్నారు.
కాలపత్ని అయిన ఆ ఏకాష్టక
మాకు మంగళకారి అగుగాక ! ॥ 2 ॥

మంత్రము :

సంవత్సరస్య ప్రతిమాం యాం త్వా రాత్ర్యుపాస్మహే ।
సా న ఆయుష్మతీం ప్రజాం రాయస్పోషేణ సం సృజ ॥ 3 ॥

---

* ఏకాష్టక = మాఘకృష్ణాష్టమి.

పదము

సమ్౽వత్సరస్య । ప్రతి౽మామ్ । యామ్ । త్వా । రాత్రి । ఉప౽అస్మహే ।
సా । నః । ఆయుష్మతీమ్ । ప్ర౽జామ్ । రాయః । పోషేణ । సమ్ । సృజ ॥ 3 ॥

అనువాదం.

సంవత్సర ప్రతిరూపమైన రాత్రిని నిన్ను ఉపాసిస్తున్నాము. ఆ నీవు మాకు చిరజీవనం కల సంతానాన్ని ప్రసాదిస్తూ వారికి ధనపుష్టిని కల్పించు. ॥ 3 ॥

మంత్రము :

ఇయమేవ సా యా ప్రథమా వ్యౌచ్ఛ
దాస్వితరాసు చరతి ప్రవిష్టా ।
మహాన్తో అస్యాం మహిమానో అన్త
ర్వధూ ర్జిగాయ నవగజ్జనిత్రీ ॥ 4 ॥

పదము :

ఇయమ్ । ఏవ । సా । యా । ప్రథమా । వి౽ఔచ్ఛత్ ।
ఆసు । ఇతరాసు । చరతి । ప్ర౽విష్టా ।
మహాన్తః । అస్యామ్ । మహిమానః । అన్తః ।
వధూః । జిగాయ । నవ౽గత్ । జనిత్రీ ॥ 4 ॥

అనువాదం :

ఈ ఆది ఉషస్సే తమో నిరసనాన్ని చేసినది.
ఇతర ఉషస్సులలో ప్రవేశించి ఉదయిస్తున్నది.
ఈ ఉషో మధ్యంలో అపరిమిత మహిమలు కలవు.
సూర్యుని పత్ని అయిన ఉషస్సు, నవ నవోదయం
పొందుతున్న సూర్యుని అనుసరించే వస్తున్నది.
జనులకు వెలుగునిస్తూ సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నది. ॥ 4 ॥

మంత్రము.

వానస్పత్యా గ్రావాణో ఘోష మక్రత
హవిష్కృణ్వన్తః పరివత్సరీణమ్ ।
ఏకాష్టకే సుప్రజసః సువీరా
వయం స్యామ పతయో రయీణామ్ ॥ 5 ॥

పదము ;

వానస్పత్యాః । గ్రావాణః । ఘోషమ్ । అక్రత ।
హవిః । కృణ్వన్తః । పరివత్సరీణమ్ ।
ఏకఽఅష్టకే । సుఽప్రజసః । సుఽవీరాః ।
వయమ్ । స్యామ । పతయః । రయీణామ్ ॥ 5 ॥

అనువాదం.

ఓ ఏకాష్టకా! నీకై వనస్పతి వికారాలైన
( కొయ్యతో చేసిన ) రోళ్ళు, రోకళ్ళు,

అలాంటి రాత్రుళ్ళు సంవత్సరంలో నిర్వృత్తమయ్యే
ఈ హవిస్సును ఉత్పన్నం చేస్తూ
శ్రావ్యమైన శబ్దాన్ని కల్పిస్తున్నవి.
నీ అనుగ్రహం వల్ల మేము సత్సంతాన వంతులమై,
సువీరులమై, ధనపతులం అగుదుము గాక! ॥ 5 ॥

మంత్రము :

ఇడాయాస్పదం ఘృతవత్ సరీ సృపం
జాతవేదః ప్రతి హవ్యా గృభాయ ।
యే గ్రామ్యాః పశవో విశ్వరూపా
స్తేషాం సప్తానాం మయి రన్తిరస్తు ॥ 6 ॥

పదము :

ఇడాయాః । పదమ్ । ఘృతఽవత్ । సరీసృపమ్ ।
జాతఽవేదః । ప్రతి । హవ్యా । గృభాయ ।
యే । గ్రామ్యాః । పశవః । విశ్వఽరూపాః ।
తేషామ్ । సప్తానామ్ । మయి । రన్తిః । అస్తు ॥ ౬ ॥

అనువాదం .

ధేను దక్షిణపాదం ఘృతో పేతమైనది.
ఘృతోపేతమైన దానిని, హవ్యములను
ఓ జాత వేదుడా! ప్రతిగ్రహించు.
గ్రామభవాలైన గోవులు, అశ్వాలు, మేకలు, గొర్రెలు,

పురుషులు, గర్దభములు, ఒంటెలు, ఇత్యాది
విశ్వరూపాలైన సప్తవిధ పశువులకు నాపై ప్రీతి కలుగుగాక!
॥ 6 ॥

మంత్రము :

ఆమా పుష్టేచ పోషేచ
రాత్రి దేవానాం సుమతౌ స్యామ ।
పూర్ణా దర్వే పరా పత సుపూర్ణా పునరా పత
సర్వాన్ యజ్ఞాన్త్సంభుఞ్జతీషమూర్జం న ఆ భర ॥ 7 ॥

పదము ।

ఆ । మా । పుష్టే । చ । పోషే । చ ।
~~రాత్రి । దేవానామ్ । సుఽమతౌ । స్యామ ।~~
పూర్ణా । దర్వే । పరా । పత । సుఽపూర్ణా । పునః । ఆ । పత ।
సర్వాన్ । యజ్ఞాన్ । సమ్ఽభుఞ్జతీ । ఇయమ్ । ఊర్జమ్ । నః ।
ఆ । భర ॥ 7 ॥

అనువాదం.

ఓ రాత్రీ నన్ను సమృద్ధ ధనునిగా చెయ్యి.
పుత్రపౌత్రాది సంపద నాకు కల్పించు.
ఇంద్రాదుల కల్యాణ బుద్ధికి మేము
పాత్రులం అగుదుముగాక!
ఓ దర్వీ! ( కొయ్య గరిటె! ) నీవు

హవిస్సులతో నిండిన దానవై యష్టవ్య దేవతలవైపు వెళ్ళు.
అభిమత ఫలాలను నింపుకొని మా దగ్గఱకు తిరిగిరా!
సర్వ యజ్ఞాలను హవిస్సుతో చక్కగా పాలిస్తూ,
దేవతల నుంచి అన్నాన్ని, బలాన్ని మాకై కొనిరా! ॥ 7 ॥

మంత్రము :

ఆయమగ న్త్సంవత్సరః పతి రేకాష్టకే తవ ।

సా న ఆయుష్మతీం ప్రజాం రాయస్పోషేణ సం సృజ॥ 8 ॥

పదము :

ఆ । అయమ్ । అగన్ । సమ్ఽవత్సరః । పతిః । ఏకఽఅష్టకే ।
తవ ।

సా । నః । ఆయుష్మతీమ్ । ప్రఽజామ్ । రాయః । పోషేణ । సమ్
సృజ ॥ ౮ ॥

అనువాదం:

ఓ ఏకాష్టకా! నీ సంవత్సరపతి వచ్చినాడు.
నీవు నీ భర్తతో కూడి మాకు ప్రజను, ఆయుస్సును ఇచ్చి
ధనంతో మమ్ము, పరిపుష్టులను చెయ్యి. ॥ 8 ॥

మంత్రము :

ఋతూన్ యజ ఋతుపతీనా ర్తవానుత హాయనాన్ ।

సమాః సంవత్సరాన్ మాసాన్ భూతస్య పతయే యజే॥ 9 ॥

పదము :

ఋతూన్ । యజే । ఋతుఽపతీన్ । ఆర్తవాన్। ఉత। హాయనాన్

సమాః । సమ్ఽవత్సరాన్ । మాసాన్ । భూతస్య । పతయే । యజే
॥ 9 ॥

అనువాదం :

ఋతువులను హవిస్సుతో ప్రీతులను చేస్తున్నాను.
ఋతు పతులను హవిస్సుతో ప్రీతులను చేస్తున్నాను.
ఋతు సంబంధాలైన కాల విశేషాలను
సంవత్సరాలను, అహోరాత్రాలను,
పక్షాలను, మాసాలను, హవిస్సుతో ఆనంద పరుస్తున్నాను.
చరాచరాత్మక జగత్పతి అయిన కాల పురుషుని
కూడా హవిస్సుతో ప్రీతుని చేస్తున్నాను. ॥ 9 ॥

మంత్రము :

ఋతుభ్యష్ట్వార్తవేభ్యో మాద్భ్యః సంవత్సరేభ్యః ।
ధాత్రే విధాత్రే సమృధే భూతస్య పతయే యజే ॥ 10 ॥

పదము :

ఋతుఽభ్యః । త్వా । ఆర్తవేభ్యః । మాత్ఽభ్యః । సమ్ఽవత్స
రేభ్యః ।
ధాత్రే । విఽధాత్రే । సమ్ఽఋధే । భూతస్య । పతయే । యజే
॥ 10 ॥

అనువాదం :

వసంతాదుల ప్రీత్యర్థమై ఓ ఏకాష్టకా హవిస్సు నర్పిస్తున్నాను.
అలాగే ఋతు సంబంధమైన అహో రాత్రాలకై
నిన్ను యజనం చేస్తున్నాను.

మాసాలకు సంవత్సరాలకు ఆధారమైన ధాతకు, విధాతకు
సమర్థయిత అనే దేవతకు భూతపతికి
హవిస్సు నిచ్చి ప్రియం కల్పిస్తున్నాను. ॥ 10 ॥

మంత్రము :

ఇడయా జుహ్వతో వయం దేవాన్ ఘృతవతా యజే ।

గృహా నలుభ్యతో వయం సం విశేమోప గోమతః ॥ 11 ॥

పదము :

ఇడయా । జుహ్వతః । వయమ్ । దేవాన్ । ఘృతఽవతా । యజే ।

గృహాన్ । అలుభ్యతః । వయమ్ । సమ్ । విశేమ । ఉప ।

గోఽమతః ॥ 11 ॥

అనువాదం :

గోసంబంధమైన హవిస్సుతో ఘృతయుక్తమైన జానితో
హోమం చేస్తూ మేము దేవతలను ప్రీతులను చేస్తున్నాము.
అలాగే వారి అనుగ్రహం వల్ల మేము సంపూర్ణులమై
గోవులు నిండిన గృహాలలో ప్రవేశించి
సుఖంగా నివసిస్తాము. ॥ 11 ॥

మంత్రము:

ఏకాష్టకా తపసా తప్యమానా

జజాన గర్భం మహిమాన మిన్ద్రమ్ ।

తేన దేవా వ్యఽసహన్త శత్రూన్

హన్తా దస్యూనా మభవ చ్ఛచీపతిః ॥ 12 ॥

పదము :

ఏకఽఅష్టకా । తపసా । తప్యమానా ।

జజాన । గర్భమ్ । మహిమానమ్ । ఇన్ద్రమ్ ।

తేన । దేవా । వి । అసహన్త । శత్రూన్ ।

హన్తా । దస్యూనామ్ । అభవత్ । శచీఽపతిః ॥ 12 ॥

అనువాదం :

తపస్సు చేస్తూ ఏకాష్టక, తన గర్భం నుంచి
మహిమోపేతుడైన ఇంద్రుని జనింప జేసినది
అతనితో ఉపలక్షితులైన దేవతలు
శత్రువులను అభిభవించినారు.
ఆ శచీపతి దస్యు ఘాతకు డగుగాక ! ॥ 12 ॥

మంత్రము :

ఇన్ద్ర పుత్రే సోమపుత్రే దుహితాసి ప్రజాపతేః ।
కామా నస్మాకం పూరయ ప్రతి గృహ్ణాహి నో హవిః ॥ 13 ॥

పదము :

ఇన్ద్రఽపుత్రే । సోమఽపుత్రే । దుహితా । అసి । ప్రజాఽపతేః ।
కామాన్ । అస్మాకమ్ । పూరయ । ప్రతి । గృహ్ణాహి । నః । హవిః ।
॥ 13 ॥

ఇతి ద్వితీయోఽనువాకః

అనువాదం .

ఇంద్ర జనని, సోమ జనని అయిన ఓ ఏకాష్టకా!
ప్రజాపతికి నీవు కుమార్తెవు.
మా కామితార్థాలను పూరించు.
అందుకై మా హవిస్సును స్వీకరించు. ॥ 13 ॥

ఇది పదవ సూక్తం

ఇది రెండవ అనువాకం

## అనువాకం : 3

### సూక్తం-11

# దీర్ఘాయుః సూక్తం

ఋషిః బ్రహ్మ, భృగువు, అంగిరసుడు ॥ దేవత : ఇంద్రుడు, అగ్ని, వాయువు, యక్ష్మనాశనమ్, ఛందస్సు : 1-3 త్రిష్టుప్, 4 శక్వరీగర్భా జగతీ, 5,6 అనుష్టుప్, 7 ఉష్ణిగ్బృహతీ గర్భా పథ్యాపంక్తి, 8 షట్పదా బృహతీ గర్భాజగతీ ॥ మంత్రములు ; ॥ 8 ॥

వినియోగం ;- బాలగ్రహరోగానికి, నిరంతర స్త్రీ సంగతివల్ల కలిగిన క్షయకు చేసే చికిత్సలో దీనికి వినియోగం. సర్వవ్యాధి నివృత్తి చికిత్సలో దీనికి వినియోగం. అంహోలింగ గణంలో చేరిన దీసూక్తం. అగణ వినియోగాదులన్నిటా దీనికి కూడ వినియోగం. క్రతు మధ్యంలో జబ్బుపడిన యజమానికి చేసే చికిత్సలో కూడ దీనికి వినియోగం.

మంత్రము :

ముఞ్చామి త్వా హవిషా జీవనాయ
కమజ్ఞాతయక్ష్మాదుత రాజయక్ష్మాత్ ।

గ్రాహిర్జగ్రాహ యద్యేత దేనం తస్యా

ఇన్ద్రాగ్నీ ప్ర ముముక్తమేనమ్ ॥ 1 ॥

పదము :

ముఞ్చామి । త్వా । హవిషా । జీవనాయ ।

కమ్ । అజ్ఞాతఽయక్ష్మాత్ । ఉత । రాజఽయక్ష్మాత్ ।

గ్రాహిః । జగ్రాహ । యది । ఏతత్ । ఏనమ్ । తస్యాః ।

ఇన్ద్రాగ్నీ ఇతి । ప్ర । ముముక్తమ్ । ఏనమ్ ॥ 1 ॥

అనువాదం :

చిరకాల జీవనార్థం అనిర్దిష్ట క్షయరోగం నుంచి
నిన్ను హవిస్సుతో విముక్తుని చేస్తున్నాను.
రాజయక్ష్మనుంచి నిన్ను విముక్తుని చేస్తున్నాను.
పిశాచి ఈ బాలకుని ఆవహించినది.
ఓ ఇంద్రాగ్నులారా !
దానినుండి వీనిని విడిపించండి. ॥ 1 ॥

మంత్రము

యది క్షితాయుర్యది వా పరేతో

యది మృత్యోరన్తికం నీఽత ఏవ ।

తమా హరామి నిర్ ఋతేరుపస్థా

దస్పార్శ మేనం శతశారదాయ ॥ 2 ॥

పదము :

యది । క్షిత౨ఆయుః । యది । వా । పరా౨ఇతః ।
యది । మృత్యోః । అన్తికమ్ । ని౨ఇతః । ఏవ ।
తమ్ । ఆ । హరామి । నిః౨ఋతేః । ఉపస్థాత్ ।
అస్పార్శమ్ । ఏనమ్ । శత౨శారదాయ ॥ 2 ॥

అనువాదం :

ఇతని ఆయుస్సు తగ్గితే, ఇతను పరలోక గతుడైతే.
యముని సమీపానికి కొనిపోబడితే,
ఆ మృత్యువు సమీపం నుంచి తిరిగి
వీనిని ఈ లోకానికి కొని వస్తున్నాను.
నూరేళ్ళు బ్రతుకునట్టు చేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము .

సహస్రాక్షేణ శతవీర్యేణ శతా
యుషా హవిషా హార్షమేనమ్ ।
ఇన్ద్రో యథైనం శరదో నయాత్యతి
విశ్వస్య దురితస్య పారమ్ ॥ 3 ॥

పదము :

సహస్ర౨అక్షేణ । శత౨వీర్యేణ । శత౨ఆయుషా ।
హవిషా । ఆ । అహార్షమ్ । ఏనమ్ ।

ఇన్ద్రః । యథా । ఏనమ్ । శరదః । నయాతి । అతి ।

విశ్వస్య । దుః౽ఇతస్య । పారమ్ ॥ 3 ॥

అనువాదం .

సహస్రాక్షుని చేయునది, శతబలుని చేయునది,
శతాయుష్కుని చేయునది అయిన హవిస్సుతో
ఈ రోగ గ్రస్తుని మృత్యు సకాశం నుంచి కొని వస్తున్నాను.
ఇంద్రుడు వీనిని నూరేళ్ళదాకా సర్వ పాపములను
దాటి తీరం చేరునట్లు చేయుగాక ! ॥ 3 ॥

మంత్రము :

శతం జీవ శరదో వర్ధమానః

శతం హేమన్తా న్ఛతము వసన్తాన్ ।

శతం త ఇన్ద్రో అగ్నిః సవితా బృహస్పతిః

శతాయుషా హవిషా హార్ష మేనమ్ ॥ 4 ॥

పదము :

శతమ్ । జీవ । శరదః । వర్ధమానః ।

శతమ్ । హేమన్తాన్ । శతమ్ । ఓంఇతి । వసన్తాన్ ।

శతమ్ । తే । ఇన్ద్రః । అగ్నిః । సవితా । బృహస్పతిః ।

శత౽ఆయుషా । హవిషా । ఆ । అహార్షమ్ । ఏనమ్ ॥ 4 ॥

అనువాదం :

ఓ రోగ విముక్తుడా!
వర్ధమానుడవై శతశరత్తులు జీవించు.
శత హేమంతాలు శత వసంతాలు జీవించు.
ఇంద్రుడు, అగ్ని, సవిత, బృహస్పతి నీకు
శతాయుస్సు నిత్తురు గాక!
శతాయుస్సు నిచ్చే హవిస్సుతో మృత్యు సకాశం నుంచి
వీనిని తిరిగి కొని వస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

ప్ర విశతం ప్రాణాపానావనడ్వాహావివ వ్రజమ్ ।
వ్య1న్యే యన్తు మృత్యవో యానాహు రితరా న్ఛతమ్ ॥ 5 ॥

పదము :

ప్ర । విశతమ్ । ప్రాణాపానౌ । అనడ్వాహౌఽఇవ । వ్రజమ్ ।
వి । అన్యే । యన్తు । మృత్యవః । యాన్ । ఆహుః । ఇతరాన్ ।
శతమ్ । ॥ 5 ॥

అనువాదం :

ప్రాణాపానములారా!
మీారు వీనిలో తిరిగి ప్రవేశించండి.
బండి గిత్తలు గోష్ఠానికి తిరిగి వచ్చునట్లు మీారు తిరిగి రండి.
క్షయేతర మృత్యుకారకాలైన
రోగాలు వీని నుంచి వెళ్ళిపోవుగాక!
ఆ అపమృత్యువులు శత సంఖ్యాకాలని అభిజ్ఞులు చెప్తారు. ॥ 5 ॥

మంత్రము :

ఇహైవ స్తం ప్రాణాపానౌ మాప గాతమితో యువమ్ ।

శరీర మస్యాఙ్గాని జరసే వహతం పునః ॥ 6 ॥

పదము .

ఇహ । ఏవ । స్తమ్ । ప్రాణాపానౌ । అప । గాతమ్ । ఇతః ।
యువమ్ ।

శరీరమ్ । అస్య । అఙ్గాని । జరసే । వహతమ్ । పునః ॥ 6 ॥

అనువాదం:

ఓ ప్రాణాపానములారా !
ఈ శరీరంలోనే ఉండండి.
ఈ శరీరంలో నుంచి శీఘ్రంగా వెళ్ళిపోకండి.
వీని అంగాలను వృద్ధాప్యం దాకా నిలుచునట్లు చేయండి.
॥ 6 ॥

మంత్రము :

జరాయై త్వా పరి దదామి

జరాయై ని ధువామి త్వా ।

జరా త్వా భద్రా నేష్ట వ్య1న్యే యన్తు

మృత్యవో యానాహు రితరాన్ ఛతమ్ ॥ 7 ॥

పదము :

జరాయై । త్వా । పరి । దదామి ।

జరాయై । ని । ధువామి । త్వా ।

జరా । త్వా । భద్రా । నేష్ట । వి । అన్యే । యన్తు ।

మృత్యవః । యాన్ । ఆహుః । ఇతరాన్ । శతమ్ ॥ 7 ॥

అనువాదం :

ఓ వ్యాధివిముక్తుడా! నిన్ను రక్షణార్థమై
వృద్ధాప్యానికి అధీనం చేస్తున్నాను.
అలాగే నీవు ముసలి వాడ వయ్యే వఱకు
రోగాల నుంచి రక్షిస్తున్నాను.
ఆ జర నిన్ను శుభముల వైపు కొనిపోవుగాక!
క్షయేతర మృత్యుకారకాలైన
రోగాలు వీని నుంచి వెళ్ళిపోవుగాక!
ఆ అపమృత్యువులు శత సంఖ్యాకాలని అభిజ్ఞులు చెప్తారు ॥ 7॥

మంత్రము :

అభి త్వా జరిమాహిత గాముక్షణ మివ రజ్వ్వా ।
యస్త్వా మృత్యు రభ్యధత్త జాయమానం సుపాశయా ।
తం తే సత్యస్య హస్తాభ్యా ముదముఞ్చద్ బృహస్పతిః ॥ 8 ॥

పదము :

అభి । త్వా । జరిమా । అహిత । గామ్ । ఉక్షణమ్ఽఇవ । రజ్వ్వా ।

యః । త్వా । మృత్యుః । అభిఽఅధత్త । జాయమానమ్ । సుఽపాశయా ।

తమ్ । తే । సత్యస్య । హస్తాభ్యామ్ । ఉత్ । అముఞ్చత్ । బృహస్పతిః ॥ 8 ॥

అనువాదం .

వృద్ధాప్యం నిన్ను బద్ధుని చేయుగాక!
ఎద్దును పగ్గం వలె మృత్యువు నీకు కలుగ గానే
శుభ పాశంతో బంధితుని చేసినది.
ఆ మృత్యుపాశాన్ని అవినాశి అయిన బ్రహ్మ
హస్తాల నుంచి బృహస్పతి విడిపించు గాక! ॥ 8 ॥

ఇది పదకొండవ సూక్తం.

## సూక్తం - 12

# గృహ నిర్మాణ సూక్తం

ఋషిః బ్రహ్మ ॥ దేవత. శాలా, వాస్తోష్పతి ॥ ఛందస్సు: 1,4,5 త్రిష్టుప్, 2 విరాడ్ జగతి, 3 బృహతీ, 6 శక్వరీగర్భా జగతీ, 7 అర్షానుష్టుప్, 8 భురిక్, 9 అనుష్టుప్ ॥ మంత్రములు ; ॥ 9 ॥

వినియోగం :- ఈ సూక్తం వాస్తోష్పత్య గణంలోనిది. నవశాలా వాస్తు సంస్కారార్థమై చేసే కర్మలోను, చతుర్గణి మహాశాంతిలోను అన్నిటా దీనికి వినియోగం.

మంత్రము .

ఇహైవ ధ్రువాం ని మినోమి శాలాం

క్షేమే తిష్ఠాతి ఘృత ముక్షమాణా ।

తాం త్వా శాలే సర్వ వీరాః సువీరా
అరిష్టవీరా ఉప సం చరేమ ॥ 1 ॥

పదము :

ఇహ । ఏవ । ధ్రువామ్ । ని । మినోమి । శాలామ్ ।
క్షేమే । తిష్ఠాతి । ఘృతమ్ । ఉక్షమాణా ।
తామ్ । త్వా । శాలే । సర్వ౽వీరాః । సు౽వీరాః ।
అరిష్ట౽వీరాః । ఉప । సమ్ । చరేమ ॥ 1 ॥

అనువాదం :

ఈ ప్రదేశంలో సుస్థిర గృహాన్ని నిర్మిస్తున్నాను.
ఆ శాల, ఘృత సేచనం చేస్తూ క్షేమంగా ఉండుగాక !
ఓ శాలా ! అనేక శూర సంతానంతో,
సుగుణ సంపన్న సంతానంతో అరిష్టరహితులైన
పుత్రాదులతో మే మిక్కడ సంచరింతుముగాక ! ॥ 1 ॥

మంత్రము :

ఇహైవ ధ్రువా ప్రతితిష్ఠ శాలే
శ్వావతీ గోమతీ సూనృతావతీ ।
ఊర్జస్వతీ ఘృతవతీ పయస్వ
త్యుచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ ॥ 2 ॥

పదము :

ఇహ । ఏవ । ధ్రువా । ప్రతి । తిష్ఠశాలే ।

అశ్వ౽వతీ । గో౽నుతీ । సూనృతా౽వతీ ।

ఊర్జస్వతీ । ఘృత౽వతీ । పయస్వతీ ।

ఉత్ । శ్రయస్వ । మహతే । సౌభగాయ ॥ 2 ॥

అనువాదం :

ఇక్కడే ఓ శాలా! సుస్థిరంగా ఉండు.
అనేక గోరాజి సంపూర్ణమై సూనృతవతివై,
ఊర్జస్వతివై, పయస్వతివై మహాసౌభాగ్యంతో సంవర్ధిల్లు ॥ 2 ॥

మంత్రము :

ధరుణ్య౽సి శాలే బృహచ్ఛన్దాః పూతిధాన్యా ।

ఆ త్వా వత్సో గమేదా కుమార

ఆ ధేనవః సాయమా స్పన్దమానాః ॥ 3 ॥

పదము :

ధరుణీ । అసి । శాలే । బృహత్౽ఛన్దాః । పూతి౽ధాన్యా ।

ఆ । త్వా । వత్సః । గమేత్ । ఆ । కుమారః ।

ఆ । ధేనవః । సాయమ్ । ఆ౽స్పన్దమానాః ॥ 3 ॥

అనువాదం .

ఓ శాలా! నీవు ప్రశస్త స్తంభ పరివృతవు.
ప్రశస్త సమాచ్ఛాదనం కలదానవు.

అక్షయ ధాన్య ప్రపూర్ణవైన నిన్ను
మా సంతానం చేరుగాక! పుత్ర పౌత్రాదులతో
నీవు వఱలుదువు గాక! ధేనువులు సాయంకాలం
క్షీర ధారలతో నిన్ను తిరిగి చేరుకొనుగాక! ॥ 3 ॥

మంత్రము :

ఇమాం శాలాం సవితా వాయు రిన్ద్రో
బృహస్పతి ర్ని మినోతు ప్రజానన్ ।
ఉక్షన్తూ ద్నా మరుతో ఘృతేన భగో
నో రాజా నికృషిం తనోతు ॥ 4 ॥

పదము :

ఇమామ్ । శాలామ్ । సవితా । వాయుః । ఇన్ద్రః ।
బృహస్పతిః । ని । మినోతు । ప్రఽజానన్ ।
ఉక్షన్తు । ఉద్నా । మరుతః । ఘృతేన । భగః ।
నః । రాజా । ని । కృషిమ్ । తనోతు । ॥ 4 ॥

అనువాదం :

సవిత, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి
శాలా నిర్మాణజ్ఞులైన వీ రందరూ ఈ ఇంటిని నిర్మింతురుగాక!
మరుత్తులు ఘృతంతో, ఉదకంతో
ఈ గృహభూమిని తడుపుదురుగాక!
మాకు రాజైన భగుడు శాలా భూమిని
చక్కగా చదును చేయుగాక! ॥ 4 ॥

మంత్రము :

మానస్య పత్ని శరణా స్యోనా
దేవీ దేవేభి ర్నిమితాస్యగ్రే ।
తృణం వసానా సుమనా అసస్త్వ
మథాస్మభ్యం సహవీరం రయిం దాః ॥ 5 ॥

పదము :

మానస్య । పత్ని । శరణా । స్యోనా ।
దేవీ । దేవేభిః । ని౨మితా । అసి । అగ్రే ।
తృణమ్ । వసానా । సు౨మనాః । అసః । త్వమ్ ।
అథ । అస్మభ్యమ్ । సహ౨వీరమ్ । రయిమ్ । దాః ॥ 5 ॥

అనువాదం :

మాననీయ వాస్తు పురుష పత్నివైన ఓ శాలా !
నీవు ఆశ్రయమవై, సుఖకరివై, ద్యోతమానవై
సృష్ట్యాదిలో దేవ నిర్మితవు.
ఆ నీవు తృణ సమాచ్ఛాదనంతో శోభన మనస్కవు కమ్ము.
నీలో నివసిస్తున్న మాకు వీర సంతతినీ, ధనాన్నీ ఇమ్ము ॥5॥

మంత్రము,

ఋతేన స్థూణామధి రోహ వంశోగ్రో
విరాజ న్నప వృఙ్క్ష్వ శత్రూన్ ।

మా తే రిష న్నుపసత్తారో గృహాణాం
శాలే శతం జీవేమ శరదః సర్వవీరాః ॥ 6 ॥

పదము :

ఋతేన । స్థూణామ్ । అధి । రోహ । వంశ । ఉగ్రః ।
వి౨రాజన్ । అప । వృజ్క్ష్వ । శత్రూన్ ।
మా । తే । రిషన్ । ఉప౨సత్తారః । గృహాణామ్ ।
శాలే । శతమ్ । జీవేమ । శరదః । సర్వ౨వీరాః ॥ 6 ॥

అనువాదం :

అబాధ్యమైన రూపంతో ఓ *శతపర్వా!
శాలా మధ్యస్తంభాన్ని అధిరోహించు.
ఉగ్రుడవై, దీప్యమానుడవై,
మా నివాసం నుంచి శత్రువులను తరిమి వెయ్యి.
ఓ శాలా! నీ ఉపసదనాలలో నివసించే
మేము ఆర్తులము కా కుందుముగాక!
నీలో నివసించే మేము సర్వ పుత్ర
పౌత్రాది సమేతులమై నూరేళ్ళు జీవింతుము గాక! ॥ 6 ॥

మంత్రము :

ఏమాం కుమార స్తరుణ ఆ వత్సో జగతా సహ ।
ఏమాం పరిస్రుతః కుమ్భ ఆ దధ్నః కలశై రగుః ॥ 7 ॥

---

* వెదురు.

పదము :

ఆ । ఇమామ్ । కుమారః । తరుణః । ఆ । వత్సః । జగతా । సహ ।

ఆ । ఇమామ్ । పరిఽస్రుతః । కుమ్భః । ఆ । దధ్నః । కలశైః ।

అగుః ॥ 7 ॥

అనువాదం :

ఈ శాలకు తరుణుడైన కుమారుడు వచ్చుగాక!
గోవులతో పాటు దూడలు వచ్చు గాక!
అలాగే మధు పూర్ణాలైన కుంభములు వచ్చుగాక!
దధి పూర్ణాలైన కలశాలు వచ్చుగాక! ॥ 7 ॥

మంత్రము :

పూర్ణం నారి ప్ర భర కుమ్భ మేతం
ఘృతస్య ధారా మమృతేన సంభృతామ్ ।
ఇమాం పాతౄ నమృతేనా సమఙ్గ్ధీష్టా
పూర్త మభి రక్షాత్యేనామ్ ॥ 8 ॥

పదము :

పూర్ణమ్ । నారి । ప్ర । భర । కుమ్భమ్ । ఏతమ్ ।
ఘృతస్య । ధారామ్ । అమృతేన । సమ్ఽభృతామ్ ।
ఇమామ్ । పాతౄన్ । అమృతేన । సమ్ । అఙ్గ్ధి ।
ఇష్టాపూర్తమ్ । అభి । రక్షాతి । ఏనామ్ ॥ 8 ॥

**అనువాదం :**

ఉదక పూర్ణమైన ఈ కుంభాన్ని
ఓ నారీ! ఇంటిలోనికి కొనిపో.
ఇది సుధామయమైన ఉదకంతో నిండినది.
మధు ఘృతాది ధారలతో నిండిన ఈ కలశం
సుధారూప జలంతో సమృద్ధ మగునట్లు చెయ్యి.
ఈ శాలను ఇక్కడ చేసే శ్రౌత, స్మార్త కర్మ అభిరక్షించుగాక! ॥ 8 ॥

**మంత్రము :**

ఇమా ఆపః ప్ర భరామ్యయక్ష్మా యక్ష్మనాశనీః ।
గృహానుప ప్ర సీదా మ్యమృతేన సహాగ్నినా ॥ 9 ॥

**పదము :**

ఇమాః । ఆపః । ప్ర । భరామి । అయక్ష్మాః । యక్ష్మఽనాశనీః ।
గృహాన్ । ఉప । ప్ర । సీదామి । అమృతేన । సహ । అగ్నినా
॥ 9 ॥

**అనువాదం :**

ఈ కలశం లోని జలం ఇంటికి కొనిపోతున్నాను.
ఇది యక్ష్మరహిత మైనది. యక్ష్మ నాశక మైనది.
ఈ ఇంటిలో మేము కూడ అవినాశి
అయిన అగ్నితో పాటు ప్రవేశిస్తున్నాము. ॥ 9 ॥

ఇది పన్నెండవ సూక్తం

# సూక్తం - 13

# నదీప్రవాహ సూక్తం

ఋషి : భృగువు॥ దేవత : సిన్ధువు, అపస్సు, వరుణుడు॥ ఛందస్సు : 1 నిచృదనుష్టుప్, 2-4,7 అనుష్టుప్, 5 విరాడ్ జగతీ, 6 నిచృదనుష్టుప్॥
మంత్రములు : ॥ 7 ॥

వినియోగం : తనకు అవసరమైన చోటికి ప్రవాహాన్ని తీసుకువెళ్ళే కర్మకాండలోను గ్రామనగరాదులకు వరదభయం కలిగే టప్పుడు చేసే కర్మలోను, నదిని మళ్ళించుటలోను, ఉత్థాపన విఘ్నశమన కర్మలోను దీనికి వినియోగం.

మంత్రము

యదదః సంప్రయతీరహావనదతా హతే ।
తస్మాదా నద్యో౩ నామ స్థ
తా వో నామాని సిన్ధవః ॥ 1 ॥

పదము.

యత్ । అదః । సమ్ఽప్రయతీః । అహౌ । అనదత । హతే ।
తస్మాత్ । ఆ । నద్యఽః । నామ । స్థ ।
తా । వః । నామాని । సిన్ధవః ॥ 1 ॥

అనువాదం.

ఈ మేఘం తాడిత మైనప్పుడు,
ఓ జలదేవతలారా ! ప్రవహిస్తూ శబ్దిస్తారు.
అందువల్లనే మీకు నదులను పేరు కలిగినది.
ఓ నదులారా ! మీ పేర్లన్నీ ఇలాగే అన్వర్థ మైనవి. ॥ 1 ॥

మంత్రము.

యత్ ప్రేషితా వరుణేనాచ్ఛీభం సమవల్గత ।
తదాప్నోదింద్రో వో యతీ స్తస్మాదాపో అను ష్ఠన ॥ 2 ॥

పదము :

యత్ । ప్రఽఇషితాః । వరుణేన । అత్ । శీభమ్ । సమ్ఽఅవల్గత।
తత్ । ఆప్నోత్ । ఇన్ద్రః । వః । యతీః । తస్మాత్ । ఆపః । అను।
స్థన ॥ 2 ॥

అనువాదం :

వరుణ ప్రేరితులై, మీరు వేగంగా
బృందనృత్యం చేస్తూన్నట్లు ప్రవహిస్తున్నారు.
అలా వెళ్ళే మిమ్ములను
ఇంద్రుడు స్వాయత్తం* చేసుకున్నాడు.
అప్పటి నుంచి మీకు "ఆపః" (నీరు) అనుపేరు వచ్చినది.
॥ 2 ॥

మంత్రము :

అపకామం స్యన్దమానా అవీవరత వో హి కమ్ ।
ఇన్ద్రో వః శక్తిభి ర్దేవీ స్తస్మాద్ వార్నామ వో హితమ్ ॥ 3 ॥

పదము :

అపఽకామమ్ । స్యన్దమానాః । అవీవరత । వః । హి । కమ్ ।

---

* అప్నోత్

ఇన్ద్రః । వః । శక్తిఽభి । దేవీః । తస్మాత్ । వాః । నామ । వః ।
హితమ్ ॥ 3 ॥

**అనువాదం :**

నిష్కామంగా ఎల్లప్పుడూ ప్రవహించే
మిమ్ములను ఇంద్రుడు స్వశక్తితో
స్వాధీనం చేసికొనుటకై అభిలషించినాడు.
ఓ దేవతలారా! అందువల్ల మీకు "వార్"
( వరింపబడునది ) అను పేరు ప్రసిద్ధమైనది. ॥ 3 ॥

**మంత్రము :**

ఏకో వో దేవోప్యతిష్ఠత్ స్యన్దమానా యథావశమ్ ।
ఉదా నిషు ర్మహీరితి తస్మా దుదక ముచ్యతే ॥ 4 ॥

**పదము :**

ఏకః । వః । దేవః । అపి । అతిష్ఠత్ । స్యన్దమానాః । యథా
ఽవశమ్ ।
ఉత్ । ఆనిషుః । మహీః । ఇతి । తస్మాత్ । ఉదకమ్ । ఉచ్యతే ॥4॥

**అనువాదం :**

అసహాయ శూరుడు ఇంద్రుడు తన ఇచ్ఛ వచ్చినట్టు
అటూ ఇటూ ప్రవహిస్తున్న మీపై అధిష్ఠాత అయినాడు.
అందువల్ల మీరు మహత్త్వ పూర్ణలై
ఉచ్ఛ్వసిత వతు లైనారు.
అందువల్ల మీకు *ఉదకం అను పేరు కలిగినది. ॥ 4 ॥

---

* ( ఉదననాత్ ఉదకం )

మంత్రము :

ఆపో భద్రా ఘృత మిదాప ఆస

న్నగ్నిషోమౌ బిభ్రత్యాప ఇత్ తాః ।

తీవ్రో రసో మధుపృచా మరంగమ

ఆ మా ప్రాణేన సహ వర్చసా గమేత్ ॥ 5 ॥

పదము :

ఆపః । భద్రాః । ఘృతమ్ । ఇత్ । ఆపః । ఆసన్ ।

అగ్నిషోమౌ । బిభ్రతి । ఆపః । ఇత్ । తాః ।

తీవ్రః । రసః । మధుఽపృచామ్ । అరమ్ఽగమః ।

ఆ । మా । ప్రాణేన । సహ । వర్చసా । గమేత్ ॥ 5 ॥

అనువాదం

జలం తృణాది నిష్పాదకమై ఘృతమైనది
జలమే అగ్నిసోములను ధరించినది.
మధురస సమ్మిశ్రితమైన వీటికి
ఉద్భూతరసం అక్షయమై, ప్రాణభరితమై,
వర్చస్సంయుతమై నాకు లభించుగాక ! ॥ 5 ॥

మంత్రము.

ఆదిత్ పశ్యామ్యుత వా శృణోమ్యా మా

ఘోషో గచ్ఛతి వాఙ్ మాసామ్ ।

మన్యే భేజానో అమృతస్య తర్హి
హిరణ్యవర్ణా అతృపం యదా వః ॥ 6 ॥

పదము.

ఆత్ । ఇత్ । పశ్యామి । ఉత । వా । శృణోమి । ఆ । మా ।
ఘోషః । గచ్ఛతి । వాక్ । మా । ఆసామ్ ।
మన్యే । భేజానః । అమృతస్య । తర్హి ।
హిరణ్య౨వర్ణాః । అతృపమ్ । యదా । వః ॥ 6 ॥

**అనువాదం :**

ఆవల నేను చూస్తున్నాను; వింటున్నాను.
శబ్దం నన్ను చేరుతున్నది.
వాగింద్రియం ఈ జల రసాగమనంతో నా వద్దకు వస్తున్నది
ఇందుతో నేను అమృతభుక్కునైనట్లు భావిస్తున్నాను.
ఓ హిరణ్య వర్ణాలైన ఆపోదేవతలారా !
మీ సంసేవనంతో నేను సంతృప్తుడ నవుతున్నాను. ॥ 6 ॥

మంత్రము.

ఇదం వ ఆపో హృదయ మయం వత్స ఋతావరీః ।
ఇహేత్థ మేత శక్వరీర్యత్రేదం వేశయామి వః ॥ 7 ॥

పదము :

ఇదమ్ । వః । ఆపః । హృదయమ్ । అయమ్ । వత్సః । ఋత
౨వరీః ।

ఇహ । ఇత్థమ్ । ఆ । ఇత । శక్వరీః । యత్ర । ఇదమ్ । వేశ

యామి । వః ॥ 7 ॥

అనువాదం :

ఓ ఆపోదేవతలారా! మీకై అర్పిస్తున్న
హృదయ స్థానీయ హిరణ్యం వైపురండి.
సత్యోపేతాలైన ఓ జలములారా!
ఈ గుంటలో పడవేసిన మండూకం మీకు వత్సప్రాయమైనది.
గోవుల వలె మీ రావేపు పరువెత్తండి.
శక్తిమంతాలైన మీరు ఈ గుంటలో ఈ విధంగా
( కప్ప మీద వేసిన నాచు బాగా ప్రాకునట్లుగా )
స్థిరప్రవాహాలు కండి.
నేనిప్పుడు మిమ్ములను ఈ ఖాతంలో ప్రవేశ పెడుతున్నాను. ॥7॥

ఇది పదమూడవ సూక్తం

## సూక్తం – 14

ఋషి: బ్రహ్మ ॥ దేవత : గోష్ఠుడు, మంత్రములలో పేర్కొన్న అర్యముడు మొదలగు దేవతలు ॥ ఛందస్సు : 1–5 అనుష్టుప్ ; 6 ఆర్షీత్రిష్టుప్ ॥
మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :– గోపుష్టికాముడు చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

సంవో గోష్ఠేన సుషదా సం రయ్యా సం సుభూత్యా ।
*అహర్జాతస్య యన్నామ తేనావః సం సృజామసి ॥ 1 ॥

* ( అహర్జాతం = రోజు రోజూ పుత్రపౌత్రాదిరూపంతో వర్ధిల్లునది. )

పదము .

సమ్ । వః । గోఽస్థేన । సుఽసదా । సమ్ । రయ్యా । సమ్ ।
సుఽభూత్యా ।
అహఃఽజాతస్య । యత్ । నామ । తేన । వః । సమ్ । సృజామసి
॥ 1 ॥

అనువాదం :

ఓ గోవులారా! మిమ్ములను సుఖనివాసమైన
గోశాలలో నిలుపుతున్నాము.
అహోరాది రూపమైన ధనంతో ఈ శాలను నింపుతున్నాము.
సమృద్ధితో దీనిని సంపూర్ణం చేస్తున్నాము.
దిన దిన ప్రవర్ధమానంగా మిమ్ములను
సంయోగింప జేస్తున్నా. ॥ 1 ॥

మంత్రము :

సం వః సృజత్వర్యమా సం పూషా సం బృహస్పతిః ।
సమిన్ద్రో యో ధనంజయో మయి పుష్యత యద్ వసు
॥ 2 ॥

పదము :

సమ్ । వః । సృజతు । అర్యమా । సమ్ । పూషా । సమ్ । బృహ
స్పతిః ।
సమ్ । ఇన్ద్రః । యః । ధనమ్ఽజయః । మయి । పుష్యత ।
యత్ । వసు ॥ 2 ॥

**అనువాదం :**

ఓ గోవులారా! అర్యముడు మిమ్ములను సృష్టించుగాక!
పూష సృష్టించుగాక! బృహస్పతి సృష్టించుగాక!
ధనంజయుడైన ఇంద్రుడు మిమ్ములను సృజించుగాక!
ఇలా వృద్ధిపొందిన మీరు క్షీరఘృతాదికమైన
ధనాన్ని నాకు కల్పించి పోషింతురు గాక! ॥ 2 ॥

**మంత్రము :**

సంజగ్మానా అబిభ్యుషీరాస్మిన్ గోష్ఠే కరీషిణీః ।
బిభ్రతీః సోమ్యం మధ్వనమీవా ఉపేతన ॥ 3 ॥

**పదము :**

సమ్ఽజగ్మానాః । అబిభ్యుషీః । అస్మిన్ । గోఽస్థే । కరీషిణీః ।
బిభ్రతీః । సోమ్యమ్ । మధు । అనమీవాః । ఉపఽఏతన ॥ 3 ॥

**అనువాదం:**

నా గోష్ఠంలో దిన దినాభివృద్ధి చెందుతున్న గోవులు
చోరవ్యాఘ్రాది భయహీనాలై, చిరకాలజీవనం కలవై,
రోగహీనాలై, సోమ మయాలై,
మధు రస ధారిణులై పెద్ద పొదుగులతో ఉండుగాక! ॥ 3 ॥

**మంత్రము :**

ఇహైవ గావ ఏతనేహో శకేవ పుష్యత ।
ఇహైవోత ప్ర జాయధ్వం మయి సంజ్ఞానమస్తు వః ॥ 4 ॥

పదము :

ఇహ । ఏవ । గావః । ఆ । ఇతన । ఇహోఇతి । శకాఽఇవ । పుష్యత

ఇహ । ఏవ । ఉత । ప్ర । జాయధ్వమ్ । మయి । సమ్ఽజ్ఞానమ్।

అస్తు । వః ॥ 4 ॥

అనువాదం :

మీరు నా గోష్ఠంలోనికే రండి.
ఇక్కడే మక్షికాలవలె అసంఖ్యాకాలుగా వృద్ధికండి.
అదీగాక, ఈ గోష్ఠంలోనే సంతానవతులు కండి.
నాపై మీకు సంప్రీతి కలుగుగాక! ॥ 4 ॥

మంత్రము :

శివో వో గోష్ఠో భవతు శారిశాకేవ పుష్యత ।

ఇహైవోత ప్ర జాయధ్వం మయా వః సం సృజామసి॥5॥

పదము :

శివః । వః । గోఽస్థః । భవతు । శారిశాకాఽఇవ । పుష్యత ।

ఇహ । ఏవ । ఉత । ప్ర । జాయధ్వమ్ । మయా । వః । సమ్ ।

సృజామసి ॥ 5 ॥

అనువాదం :

మీ గోష్ఠం సుఖకర మగుగాక!
మీరు *శారిశాకాల వలె సమృద్ధి చెందండి.
అదీగాక ఈ గోష్ఠంలోనే సంతానవతులు కండి.
నేను మిమ్ములను వృద్ధిపొందిస్తున్నాను. ॥ 5 ॥

---

* (క్షణంలో వేలకొలదిగా పెరిగి పోయే ప్రాణి విశేషాలు)

మంత్రము :

మయా గావో గోపతినా సచధ్వ-
మయం వో గోష్ఠ ఇహ పోషయిష్ణుః ।
రాయస్పోషేణ బహులా భవన్తీ
ర్జీవా జీవన్తీ రుప వః సదేమ ॥ 6 ॥

పదము :

మయా । గావః । గో౾పతినా । సచధ్వమ్ ।
అయమ్ । వః । గో౾స్థః । ఇహ । పోషయిష్ణుః ।
రాయః । పోషేణ । బహులాః । భవన్తీః ।
జీవాః । జీవన్తీః । ఉప । వః । సదేమ ॥ 6 ॥

అనువాదం.

గోవులారా! గోపతితో కలిసి నివసించండి.
ఇక్కడ ఈ గోష్ఠం మీకు పోషక మగుగాక!
ధన సమృద్ధితో అసంఖ్యాకాలై చిరం జీవులైన
మీరు మాకు లభింతురు గాక! ॥ 6 ॥

ఇది పదు నాల్గవ సూక్తం

## సూక్తం-15

# వాణిజ్య లాభార్థం....

ఋషిః అథర్వుడు (పణ్యకాముడు) ॥ దేవత : 1 ఇంద్రుడు. 2 పన్థానుడు, 3 అగ్ని, 4 ప్రపణుడు, విక్రయుడు, 5 దేవులు, అగ్ని, 8 దేవులు,

ఇంద్రుడు, ప్రజాపతి, సవితా, సోముడు, అగ్ని, 7 వైశ్వానరుడు, 8 జాతవేదులు॥ ఛందస్సు: 1 భురిక్ త్రిష్టుప్, 2,3,6 త్రిష్టుప్, 4 షట్పదా బృహతీగర్భా విరా డత్యష్టిః; 5 విరాడ్ జగతీ, 7 అనుష్టుప్, 8 నిచృత్ త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 8 ॥

వినియోగం:- వాణిజ్యలాభార్థమై చేసే కర్మలోను, పణ్యకాముడు ఇంద్రుని గూర్చి చేసే హోమంలోను దీనికి వినియోగం.

మంత్రము :

ఇన్ద్రమహం వణిజం చోదయామి

సన ఏతు పుర ఏతా నో అస్తు।

నుదన్నరాతిం పరిపన్థినం మృగం

స ఈశానో ధనదా అస్తు మహ్యమ్ ॥ 1 ॥

పదము :

ఇన్ద్రమ్। అహమ్। వణిజమ్। చోదయామి।

సః। నః। ఆ। ఏతు। పురఃఽఏతా। నః। అస్తు।

నుదన్। అరాతిమ్। పరిఽపన్థినమ్। మృగమ్।

సః। ఈశానః। ధనఽదాః। అస్తు। మహ్యమ్ ॥ 1 ॥

అనువాదం.

నేను వాణిజ్య కర్తయైన ఇంద్రుని ఉద్బోధిస్తున్నాను.
అయన మా వద్దకు వచ్చుగాక!
మాకు పురోగామి అగుగాక!
శత్రువులను, మార్గ నిరోధకులను,

క్రూర మృగాదులను చంపి ఈశ్వరుడైన
ఆ ఇంద్రుడు నాకు ధనదాత అగుగాక! ॥ 1 ॥

మంత్రము :

యే పన్థానో బహవో దేవయానా
అన్తరా ద్యావాపృథివీ సంచరన్తి ।
తే మా జుషన్తాం పయసా ఘృతేన
యథా క్రీత్వా ధన మాహరాణి ॥ 2 ॥

పదము :

యే । పన్థానః । బహవః । దేవఽయానాః ।
అన్తరా । ద్యావా పృథివీ ఇతి । సమ్ఽచరన్తి ।
తే । మా । జుషన్తామ్ । పయసా । ఘృతేన ।
యథా । క్రీత్వా । ధనమ్ । ఆఽహరాణి ॥ 2 ॥

అనువాదం :

దేవతలు నడిచే ప్రసిద్ధ మార్గాలు,
అనేక దేశాలకు వెళ్ళే మార్గాలు
ద్యావా పృథువుల మధ్యలో ఉన్నవి,
ఆ మార్గాలు క్షీర ఘృత సంయుతాలై,
నేను నా వస్తు విక్రయంతో ధనం సంపాదించు కొని
స్వగృహం చేరుకొనునట్లు అవి నాకు తోడ్పడుగాక! ॥ 2 ॥

మంత్రము :

ఇధ్మేనాగ్న ఇచ్ఛమానో ఘృతేన

జుహోమి హవ్యం తరసే బలాయ ।

యావదీశే బ్రహ్మణా వన్దమాన

ఇమాం ధియం శతసేయాయ దేవీమ్ ॥ 3 ॥

పదము :

ఇధ్మేన । అగ్నే । ఇచ్ఛమానః । ఘృతేన ।

జుహోమి । హవ్యమ్ । తరసే । బలాయ ।

యావత్ । ఈశే । బ్రహ్మణా । వన్దమానః ।

ఇమామ్ । ధియమ్ । శతఽసేయాయ । దేవీమ్ ॥ 3 ॥

అనువాదం :

వాణిజ్యలాభ కామనతో ఓ అగ్నీ ! నేను సమిధలతో, ఘృతంతో, హవ్యంతో నిన్ను తృప్తిపరుస్తున్నాను. వేగం కోసం, బలం కోసం మంత్రంతో స్తుతిస్తూ వ్యవహార కుశలమైన నా బుద్ధితో అసంఖ్యాక ధనలాభం కోసం హోమం చేస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

ఇమా మగ్నే శరణిం మీమృషో

నోయమధ్వానమగాయ దూరమ్ ।

శునం నో అస్తు ప్రపణో విక్రయశ్చ
ప్రతిపణః ఫలినం మా కృణోతు ।
ఇదం హవ్యం సంవిదానౌ జుషేథాం
శునం నో అస్తు చరిత ముత్థితం చ ॥ 4 ॥

పదము :

ఇమామ్ । అగ్నే । శరణిమ్ । మీమృషః ।
నః । యమ్ । అధ్వానమ్ । అగామ । దూరమ్ ।
శునమ్ । నః । అస్తు । ప్రఽపణః । విఽక్రయః । చ ।
ప్రతిఽపణః । ఫలినమ్ । మా । కృణోతు ।
ఇదమ్ । హవ్యమ్ । సమ్ఽవిదానౌ । జుషేథామ్ ।
శునమ్ । నః । అస్తు । చరితమ్ । ఉత్థితమ్ । చ ॥ 4 ॥

అనువాదం .

ఓ అగ్నీ ! మా ఈ వ్రతలోప
రూపమైన అపరాధాన్ని క్షమించు.
మేము దూరాభారం వెళుతున్నాము.
క్రయ విక్రయాదులు మాకు సుఖ కారకము లగుగాక !
నేను తిరిగి తెచ్చే ధనం కూడా
నాకు తగినంత లాభం చేకూర్చుగాక !
ఓ ఇంద్రాగ్నులారా !

మీరు ఏకమై ఈ నా హవ్యాన్ని స్వీకరించండి.
మీ ప్రసాదం వల్ల మా క్రయ విక్రయాదులు
లాభ యుక్తమై హాయి నిచ్చుగాక! ॥ 4 ॥

మంత్రము :

యేన ధనేన ప్రపణం చరామి
ధనేన దేవా ధన మిచ్ఛమానః ।
తన్మే భూయో భవతు మా కనీయోగ్నే
సాతఘ్నో దేవాన్ హవిషా నిషేధ ॥ 5 ॥

పదము.

యేన । ధనేన । ప్రఽపణమ్ । చరామి ।
ధనేన । దేవాః । ధనమ్ । ఇచ్ఛమానః ।
తత్ । మే । భూయః । భవతు । మా । కనీయః । అగ్నే ।
సాతఽఘ్నః । దేవాన్ । హవిషా । ని । సేధ ॥ 5 ॥

అనువాదం :

మూల్యధన సంపాదనార్థినైన నాకు
దేవతలారా! అది పుష్కలంగా లభించుగాక!
సుఖిని చేయుగాక! మీ ప్రసాసాదంతో నా ధనం
బహుతర మగుగాక! అల్పతరం కాకుండుగాక!
హవిస్సుతో తృప్తుడవై లాభవిఘ్న కారులైన
దేవతలను నివారించు. ॥ 5 ॥

మంత్రము :

యేన ధనేన ప్రపణం చరామి

ధనేన దేవా ధన మిచ్ఛమానః ।

తస్మిన్ మ ఇన్ద్రో రుచిమా దధాతు

ప్రజాపతిః సవితా సోమో అగ్నిః ॥ 6 ॥

పదము :

యేన । ధనేన । ప్రఽపణమ్ । చరామి ।

ధనేన । దేవాః । ధనమ్ । ఇచ్ఛమానః ।

తస్మిన్ । మే । ఇన్ద్రః । రుచిమ్ । ఆ । దధాతు ।

ప్రజాఽపతిః । సవితా । సోమః । అగ్నిః ॥ 6 ॥

అనువాదం :

మూల్యధన సంపాద నార్థినైన నాకు
దేవతలారా ! అది పుష్కలంగా లభించుగాక !
సుఖిని చేయుగాక ! నా ధనం సర్వజన
ప్రీతికరమగు నట్లు ఇంద్రుడు చేయుగాక !
అలాగే ప్రజాపతి, సోముడు, అగ్నికూడ చేయుదురుగాక ! ॥ 6 ॥

మంత్రము:

ఉప త్వా నమసా వయం హోతర్వైశ్వానర స్తుమః ।

స నః ప్రజాస్వాత్మసు గోషు ప్రాణేషు జాగృహి ॥ 7 ॥

పదము:

ఉప । త్వా । నమసా । వయమ్ । హోతః । వైశ్వానర । స్తుమః ।

సః । నః । ప్రఽజాసు । ఆత్మఽసు । గోషు । ప్రాణేషు । జాగృహి ॥ 7 ॥

అనువాదం :

ఓ హోతా! వైశ్వానరా!
నీకు మేము నమస్కరించి స్తోత్రం చేస్తున్నాము.
నీవు మా పుత్ర పౌత్రాదులలో, మాలో,
మా పశువులలో, మా ప్రాణాలలో ప్రబుద్ధుడవు కా! ॥ 7 ॥

మంత్రము :

విశ్వా హా తే సదమి ద్భరేమా
శ్వాయేవ తిష్ఠతే జాతవేదః ।
రాయస్పోషేణ సమిషా మదన్తో
మా తే అగ్నే ప్రతివేశా రిషామ ॥ 8 ॥

పదము :

విశ్వాహా । తే । సదమ్ । ఇత్ । భరేమ ।

అశ్వాయఽఇవ । తిష్ఠతే । జాతఽవేదః ।

రాయః । పోషేణ । సమ్ । ఇషా । మదన్తః ।

మా । తే । అగ్నే । ప్రతిఽవేశాః । రిషామ ॥ 8 ॥

ఇతి తృతీయోఽనువాకః

**అనువాదం :**

ఓ జాతవేదా! స్వస్థాన గృహంలో ఉంటున్న నీకు
ప్రతిరోజు హవిస్సు నిస్తున్నాము.
స్వగృహంలో ఉండే అశ్వాదులకు
ఆహార మిచ్చినట్లు ఓ అగ్ని!
నీకు పరిచర్యలు చేస్తున్నాము.
ధన సమృద్ధితో, అన్నంతో
హర్షం మేము పొందుతున్నాము.
మాకు నష్టం కలుగకుండు గాక! ॥ 8 ॥

ఇది పదునైదవ సూక్తం

ఇది మూడవ అనువాకం

## అనువాకం: 4

## సూక్తం-16

## ప్రాతఃప్రార్థన

**ఋషి:** అథర్వుడు॥ **దేవత :** 1 మంత్రాలలో పేర్కొన్న, అగ్ని, ఇంద్రుడు మొదలగువారు; 2-6 భగుడు; 7 ఉషస్సు॥ **ఛందస్సు**॥ 1 ఆర్షీ జగతీ, 2,3,5-7 త్రిష్టుప్; 4 భురిక్ పంక్తి॥ మంత్రములు : ॥ 7 ॥

వినియోగం :- మేధాకాముడు, వర్చస్కాముడు చేసే కర్మలలో దీనికి వినియోగం

మంత్రము :

ప్రాతరగ్నిం ప్రాతరిన్ద్రం హవామహే
ప్రాతర్మిత్రావరుణా ప్రాతరశ్వినా ।
ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం
ప్రాతః సోమ ముత రుద్రం హవామహే ॥ 1 ॥

పదము .

ప్రాతః । అగ్నిమ్ । ప్రాతః । ఇన్ద్రమ్ । హవామహే ।

ప్రాతః । మిత్రావరుణా । ప్రాతః । అశ్వినా ।

ప్రాతః । భగమ్ । పూషణమ్ । బ్రహ్మణః । పతిమ్ ।

ప్రాతః । సోమమ్ । ఉత । రుద్రమ్ । హవామహే ॥ 1 ॥

అనువాదం :

ప్రాతః కాలంలో అగ్నిని, ఇంద్రుని ఆహ్వానిస్తున్నాము.
ప్రాతః కాలంలో మిత్రావరుణులను,
అశ్వినీ దేవతలను ఆహ్వానిస్తున్నాము.
ప్రాతః కాలంలో భగుని పూషణుని
బ్రహ్మణస్పతిని ఆహ్వానిస్తున్నాము.
ప్రాతః కాలంలో సోముని, రుద్రుని ఆహ్వానిస్తున్నాము. ॥1॥

మంత్రము;

ప్రాతర్జితం భగ ముగ్రం హవామహే

వయం పుత్ర మదితేర్యో విధర్తా ।

ఆధ్రశ్చిద్ యం మన్యమానస్తురశ్చిద్

రాజా చిద్ యం భగం భక్షీత్యాహ ॥ 2 ॥

పదము ।

ప్రాతఃఽజితమ్ । భగమ్ । ఉగ్రమ్ । హవామహే ।

వయమ్ । పుత్రమ్ । అదితేః । యః । విఽధర్తా ।

ఆ(ధః । చిత్ । యమ్ । మన్యమానః । తురః । చిత్ ।
రాజా । చిత్ । యమ్ । భగమ్ । భక్షి । ఇతి । ఆహ ॥ 2 ॥

**అనువాదం :**

ప్రాతః కాలంలో స్వాభిమత సాధకుడైన ఉగ్రుని,
అదితి పుత్రుడైన భగుని,
మేము వర్చః కాములమై ఆహ్వానిస్తున్నాము.
ఆయన సర్వపోషకుడు.
దరిద్రుడైనా, సమృద్ధుడైనా తమ కోరిక
నెరవేరుటకై ఆయనను స్తుతిస్తారు.
రాజు కూడా ఆయనను స్తుతిస్తాడు. ॥ 2 ॥

**మంత్రము :**

భగ ప్రణేతర్భగ సత్యరాధో
భగేమాం ధియ ముదవా దదన్నః ।
భగ ప్ర ణో జనయ గోభి రశ్వై
ర్భగ ప్ర నృభి ర్నృవ న్తః । స్యామ ॥ 3 ॥

**పదము :**

భగ । ప్రఽనేతః । భగ । సత్యఽరాధః ।
భగ । ఇమామ్ । ధియమ్ । ఉత్ । అవ । దదత్ । నః ।
భగ । ప్ర । నః । జనయ । గోభిః । అశ్వైః ।
భగ । ప్ర । నృఽభిః । నృఽవన్తః । స్యామ ॥ 3 ॥

**అనువాదం :**

ఓ భగదేవా! నీవు సర్వ జగ న్నేతవు.
సత్య ధన సంయుతుడవు.
ఓ భగదేవా! నా స్తుతిని సఫలం చెయ్యి.
మాకు మేధా జననాది ఫలా న్నివ్వు.
ఓ భగదేవా! మమ్ములను గోవులతో,
అశ్వాలతో సమృద్ధులను చెయ్యి.
ఓ భగదేవా! మమ్ము పుత్ర పౌత్రాదులతో
భృత్యులతో సమృద్ధులను చెయ్యి. ॥ 3 ॥

**మంత్రము :**

ఉతేదానీం భగవన్తః స్యామోత
ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్ ।
ఉతోదితా మఘవన్త్సూర్యస్య
వయం దేవానాం సుమతౌ స్యామ ॥ 4 ॥

**పదము :**

ఉత । ఇదానీమ్ । భగఽవన్తః । స్యామ । ఉత ।
ప్రఽపిత్వే । ఉత । మధ్యే । అహ్నామ్ ।
ఉత । ఉత్ఽఇతౌ । మఘఽవన్ । సూర్యస్య ।
వయమ్ । దేవానామ్ । సుఽమతౌ । స్యామ ॥ 4 ॥

**అనువాదం :**

భగదేవ యుక్తులమై మే మిప్పుడు
సౌభాగ్యవంతులం అగుదుము గాక!

మరిన్ని, సాయంకాలం, మధ్యాహ్నం, ఉదయం
ఓ ఇంద్రా! మేము సూర్యుని యెడల,
దేవతల యెడల సద్బుద్ధి కలవార మగుదుము గాక! ॥ 4 ॥

మంత్రము :

భగ ఏవ భగవాం అస్తు దేవ
స్తేనా వయం భగవ న్తః స్యామ ।
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీమి
స నో భగ పుర ఏతా భవేహ ॥ 5 ॥

పదము :

భగః । ఏవ । భగఽవాన్ । అస్తు । దేవః ।
తేన । వయమ్ । భగఽవ న్తః । స్యామ ।
తమ్ । త్వా । భగ । సర్వః । ఇత్ । జోహవీమి ।
సః । నః । భగ । పురఃఽఏతా । భవ । ఇహ ॥ 5 ॥

అనువాదం .

భగదేవుడే ధనవంతు డగుగాక!
అయన ధనంతో మేము ధనవంతుల మగుదుముగాక!
ఓ భగదేవా! అలాంటి నిన్ను
సర్వజనులు పునః పునః అహ్వానిస్తున్నారు.
ఓ భగదేవా! నీవు ఈ వ్యాపారంలో
మాకు పురోగామివి కా! ॥ 5 ॥

మంత్రము :

సమధ్వరాయోషసో నమన్త

దధిక్రావేవ శుచయే పదాయ ।

అర్వాచీనం వసువిదం భగం మే

రథ మివాశ్వా వాజిన ఆ వహన్తు ॥ 6 ॥

పదము :

సమ్ । అధ్వరాయ । ఉషసః । నమన్త ।

దధిక్రావాఽఇవ । శుచయే । పదాయ ।

అర్వాచీనమ్ । వసుఽవిదమ్ । భగమ్ । మే ।

రథమ్ఽఇవ । అశ్వాః । వాజినః । ఆ । వహన్తు । ॥ 6 ॥

అనువాదం :

ఉషో దేవతలు యజ్ఞార్థం వత్తురు గాక!
అశ్వం సుఖప్రయాణానికై సజ్జితం అయినట్లు
సంగతలైన ఉషోదేవతలు వేగవంతాలైన అశ్వాలు
కూర్చిన రథాన్ని వలె ధనాధి పతి అయిన భగదేవుని
నాకు అభిముఖునిగా కొని వత్తురు గాక! ॥ 6 ॥

మంత్రము :

అశ్వావతీ ర్గోమతీ ర్న ఉషసో

వీరవతీః సదముచ్ఛన్తు భద్రాః ।

ఘృతం దుహానా విశ్వతః ప్రపీతా

యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 7 ॥

పదము :

అశ్వ౽వతీః । గో౽మతీః । నః । ఉషసః ।

వీర౽వతీః । సదమ్ । ఉచ్ఛన్తు । భద్రాః ।

ఘృతమ్ । దుహానాః । విశ్వతః । ప్ర౽పీతాః ।

యూయమ్ । పాత । స్వస్తి౽భిః । సదా । నః ॥ 7 ॥

**అనువాదం :**

ఉషోదేవతలు అశ్వవతులై గోమతులై, వీరవతులై,
శుభకార్య పరలై మా ఇంటిని సర్వదా అలంకరింతురు గాక!
ఉదకాన్ని ప్రవహింప జేస్తూ సర్వతః సంతృప్తి పరుస్తూ
ఉషస్సులు సర్వదా మా స్వస్తి వాచనంతో
మమ్ము రక్షింతురుగాక! ॥ 7 ॥

ఇది పదునారవ సూక్తం

## సూక్తం-17

## కృషికై....

ఋషి: విశ్వామిత్రుడు ॥ దేవత : సీత ॥ ఛందస్సు : 1 ఆర్షీ గాయత్రీ ; 2,5,9 త్రిష్టుప్ ; 3 పథ్యాపంక్తి ; 4,8 అనుష్టుప్, 7 విరాట్ పుర ఉష్ణిక్ ; 8 నిచృ దనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 9 ॥

వినియోగం :- కృషినిష్పత్తి కర్మలోను, వృషలాభ కర్మలోను, అద్భుతశాంతి కర్మలోను, యజ్ఞవాస్తు సంస్కార కర్మలోను, అగ్నిచయన కర్మలోను దీనికి వినియోగం.

మంత్రము

సీరా యుఞ్జన్తి కవయో యుగా వి తన్వతే పృథక్ ।
ధీరా దేవేషు సుమ్నయా ॥ 1 ॥

పదము .

సీరా । యుఞ్జన్తి । కవయః । యుగా । వి । తన్వతే । పృథక్ ।
ధీరాః । దేవేషు । సుమ్నఽయా ॥ 1 ॥

అనువాదం .

దేవతలకై చేసే యజ్ఞం సుఖకరం కావలెనని
మేధావులైన జనులు నాగేళ్ళను సన్నద్ధం చేస్తున్నారు.
ధీరులైన వారు కాడిని ఎద్దుల మెడపై ఉంచుతున్నారు. ॥1॥

మంత్రము .

యునక్త సీరా వి యుగా తనోత
కృతే యోనౌ వపతేహ బీజమ్ ।
విరాజః శ్నుష్టిః సభరా అసన్నో
నేదీయ ఇత్ సృణ్యఽః పక్వమా యవన్ ॥ 2 ॥

పదము ;

యునక్త । సీరా । వి । యుగా । తనోత ।
కృతే । యోనౌ । వపత । ఇహ । బీజమ్ ।

వి౽రాజః । శ్నుష్టిః । స౽భరాః । అసత్ । నః ।

నేదీయః । ఇత్ । సృణ్య౽ః । పక్వమ్ । ఆ । యవన్ ॥ 2 ॥

**అనువాదం :**

కృషీవలులారా! నాగేళ్ళను సన్నద్ధం చేయండి.
కాడిని ఎద్దులపై ఉంచండి.
అంకురోత్పత్తికి కారణమైన
ఈ దున్నిన భూమిలో విత్తనాలను చల్లండి.
త్వరగా పైరు ఫలభార సహితమగుగాక!
త్వరలో ఈ పంట పరిపక్వమై కోతకు వచ్చుగాక! ॥ 2 ॥

**మంత్రము :**

లాఙ్గలం పవీరవత్ సుశీమం సోమసత్సరు ।

ఉదిద్ వపతు గామవిం ప్రస్థావద్

రథవాహనం పీబరీం చ ప్రఫర్వ్య౽మ్ ॥ 3 ॥

**పదము :**

లాఙ్గలమ్ । పవీర౽వత్ । సు౽శీమమ్ । సోమసత్౽సరు ।

ఉత్ । ఇత్ । వపతు । గామ్ । అవిమ్ । ప్రస్థా౽వత్ ।

రథ౽వాహనమ్ । పీబరీమ్ । చ । ప్ర౽ఫర్వ్య౽మ్ ॥ 3 ॥

**అనువాదం :**

నిశితమైన నాగేటి కఱ్ఱు భూమిని చీల్చుకొని పోతున్నది.
కర్షకునికి సుఖాన్నిచ్చే మేడితో (త్సరుతో)*

*Vedic Index of names and subjects

కూడిన గొఱ్ఱు విత్తుగాక!
గోవులను, గొఱ్ఱెలను గమన సమర్థం చేయుగాక!
రథ వాహన సమర్థమైన అశ్వవృషభాదులను
బలిష్ఠాలను చేయుగాక! ॥ 3 ॥

మంత్రము :

ఇన్ద్రః సీతాం నిగృహ్ణాతు తాం పూషాభిరక్షతు ।
సానః పయస్వతీ దుహా ముత్తరాముత్తరాం సమామ్ ॥ 4 ॥

పదము :

ఇన్ద్రః । సీతామ్ । ని । గృహ్ణాతు । తామ్ । పూషా। అభి । రక్షతు।
సా । నః । పయస్వతీ । దుహామ్ । ఉత్తరామ్ఽఉత్తరామ్ ।
సమామ్ ॥ 4 ॥

అనువాదం :

ఇంద్రుడు నాగేటి చాలును పరిగ్రహించుగాక!
దానిని పూష అభిరక్షించుగాక!
ఆ నాగేటి చాలు మాకు అభిమత ఫలవతియై
ఏటేటా పంట నిచ్చుగాక! ॥ 4 ॥

మంత్రము :

శునం సుఫాలా వి తుదన్తు భూమిం
శునం కీనాశా అను యన్తు వాహాన్ ।
శునాసీరా హవిషా తోశమానా
సుపిప్పలా ఓషధీః కర్తమస్మై ॥ 5 ॥

పదము :

శునమ్ । సు౽ఫాలాః । వి । తుదన్తు । భూమిమ్ ।

శునమ్ । కీనాశాః । అను । యన్తు । వాహాన్ ।

శునాసీరా । హవిషా । తోశమానా ।

సు౽పిప్పలాః । ఓషధీః । క_ర్తమ్ । అస్మై ॥ 5 ॥

అనువాదం :

మా మంచి నాగళ్ళు మాకు
సుఖం కల్గించునట్లు భూమిని దున్ను గాక !
కర్షకులు హాయిగా ఎద్దులను అనుగమింతురు గాక !
వాయు సూర్యులారా !
మీరు మా హవిస్సుతో సంతుష్టులై మాకు
వ్రీహి యవాదులను బాగా పండు నట్లు చేతురుగాక ! ॥ 5 ॥

మంత్రము :

శునం వాహాః శునం నరః శునం కృషతు లాఙ్గలమ్ ।
శునం వరత్రా బధ్యన్తాం శున మష్ట్రా ముదిఙ్గయ ॥ 6 ॥

పదము :

శునమ్ । వాహాః । శునమ్ । నరః । శునమ్ । కృషతు । లాఙ్గలమ్ ।

శునమ్ । వరత్రాః । బధ్యన్తామ్ । శునమ్ । అష్ట్రామ్ । ఉత్ ।

ఇఙ్గయ ॥ 6 ॥

**అనువాదం.**

ఎద్దులు బాగా దున్నుగాక!
కర్షకులు బాగా దున్నుదురు గాక!
నాగలి హాయిగా దున్నుగాక!
పగ్గాలు గట్టిగా ముడిపడుగాక!
ములుకోల* సుఖార్థమై ప్రేరకమగుగాక! ॥ 6 ॥

**మంత్రము.**

శునాసీరేహ స్మ మే జుషేథామ్ ।
యద్ దివి చక్రథుః పయ
స్తేనేమా ముప సిఞ్చతమ్ ॥ 7 ॥

**పదము:**

శునాసీరా । ఇహ । స్మ । మే । జుషేథామ్ ।
యత్ । దివి । చక్రథుః । పయః
తేన । ఇమామ్ । ఉప । సిఞ్చతమ్ ॥ 7 ॥

**అనువాదం**

శునాసీర దేవతలు ఈ నా క్షేత్రంలో
నా హవిస్సును సేవింతురు గాక!
వారు దివిలో ఉదకాన్ని సృష్టించి,
ఆ వృష్టి జలంతో ఈ భూమిని తడుపుదురుగాక! ॥ 7 ॥

---

* ప్రతోదం అష్ట్రా

**మంత్రము :**

సీతే వన్దామహే త్వార్వాచీ సుభగే భవ ।

యథా నః సుమనా అసో యథా నః సుఫలా భువః॥8॥

**పదము :**

సీతే । వన్దామహే । త్వా । అర్వాచీ । సుఽభగే । భవ ।

యథా । నః । సుఽమనాః । అసః । యథా । నః । సుఽఫలా ।

భువః ॥ 8 ॥

**అనువాదం :**

ఓ సీతా! ( ఓ నాగేటిచాలా! )
నీకు నమస్కరిస్తున్నాము.
ఓ సుభగా! నీవు మాకు అభిముఖవు కమ్ము.
మా యెడ సుమనస్కవు కమ్ము.
మాకై శోభన ఫలోపేతవు కమ్ము. ॥ 8 ॥

**మంత్రము :**

ఘృతేన సీతా మధునా సమక్తా

విశ్వైర్దేవై రనుమతా మరుద్భిః ।

సా నః సీతే పయసాభ్యావవృ

త్స్వోర్జస్వతీ ఘృతవత్ పిన్వమానా ॥ 9 ॥

పదము :

ఘృతేన । సీతా । మధునా । సమ్ఽఅక్తా ।

విశ్వైః । దేవైః । అనుఽమతా । మరుత్ఽభిః ।

సా । నః । సీతే । పయసా । అభిఽఆవవృత్స్వ

ఊర్జస్వతీ ఘృతఽవత్ । పిన్వమానా ॥ 9 ॥

అనువాదం :

ఉదకంతో, మధు రసంతో సంసిక్త అయిన ఆ సీతను
విశ్వేదేవతలు, మరుత్తులు స్వీకరింతురుగాక !
బలోపేతవై ఘృతవతివై సేచనం చేస్తూ ఓ సీతా !
నీవు ఉదకంతో మాకు అభిముఖురాలవు కా ! ॥ 9 ॥

ఇది పదునేడవ సూక్తం

## సూక్తం - 18

# వనస్పతి ...

ఋషి: అథర్వుడు ॥ దేవత : వనస్పతి (వాణపర్ణి)॥ ఛందస్సు : 1-3,5 అనుష్టుప్ 4 అనుష్టుబ్గర్భా చతుష్పాదుష్ణిక్, 6 ఉష్ణిగ్గర్భా పథ్యా పఙ్క్తిః ॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం:- సపత్నీజయ కర్మలోను, వివాద జయ కర్మలోను దీనికి వినియోగం.

మంత్రము :

ఇమాం ఖనామ్యోషధిం వీరుధాం బలవత్తమామ్ ।

యయా సపత్నీం బాధతే యయా సంవిన్దతే పతిమ్ ॥ 1 ॥

పదము .

ఇమామ్ । ఖనామి । ఓషధిమ్ । వీరుధామ్ । బలవత్ఽతమామ్ ।

యయా । సఽపత్నీమ్ । బాధతే । యయా । సమ్ఽవిన్దతే ।

పతిమ్ ॥ 1 ॥

అనువాదం :

*ఈ ఓషధిని లతారూపమైన ఓషధులలో
బలవత్తరమైన దానిని త్రవ్వి పైకి తీస్తున్నాను.
ఇది నా సపత్నిని బాధిస్తుంది
అలాగే పతిని లభింప జేస్తుంది. ॥ 1 ॥

మంత్రము :

ఉత్తానఽపర్ణే సుభగే దేవజూతే సహస్వతి ।

సపత్నీం మే పరా ణుద పతిం మే కేవలం కృధి ॥ 2 ॥

పదము .

ఉత్తానఽపర్ణే । సుఽభగే । దేవఽజూతే । సహస్వతి ।

సఽపత్నీమ్ । మే । పరా । నుద । మే । కేవలమ్ । కృధి ॥ 2 ॥

అనువాదం :

ఊర్ధ్వ ముఖాలైన ఆకులతో
సుభగం, దైవ ప్రేరితం, అభిభవన సమర్థం
అయిన ఓ ఓషధీ! (పార!)
నా సపత్నిని పరాఙ్ముఖురాలిని చెయ్యి.
నా పతిని అసాధారణుని చెయ్యి. ॥ 2 ॥

* ఓషధి: Pātā, Pāthā, Clypea Hernandifolia
పార : విసబొద్ది, విసబొంది, చిఱుబొద్ది, అగరు (లు) సొంటి.

మంత్రము :

నహి తే నామ జగ్రాహ నో అస్మిన్ రమసే పతౌ ।

పరామేవ పరావతం సపత్నీం గమయామసి ॥ 3 ॥

పదము

నహి । తే । నామ । జగ్రాహ । నోఇతి । అస్మిన్ । రమసే । పతౌ

పరామ్ । ఏవ । పరాఽవతమ్ । సఽపత్నీమ్ । గమయామసి॥3॥

అనువాదం :

ఓ సపత్నీ ! నీ పేరు కూడా నేను తలపెట్టను.
నా దగ్గర నున్న పతితో రమింప వద్దు.
సపత్నిని దూరదేశాలకు పంపి వేస్తున్నాము. ॥ 3 ॥

మంత్రము :

ఉత్తరాహ ముత్తర ఉత్తరే దుత్తరాభ్యః ।

అధః సపత్నీ యా మమాధరా సాధరాభ్యః ॥ 4 ॥

పదము :

ఉత్ఽతరా । అహమ్ । ఉత్ఽతరే । ఉత్ఽతరా । ఇత్ । ఉత్ఽతరాభ్యః ।

అధః । సఽపత్నీ । యా । మమ । అధరా । సా । అధరాభ్యః॥4॥

అనువాదం .

ఉత్కృష్ట తరమైన ఓ ఓషధీ ! ( పాఠ ! )
నేను ఉత్కృష్టతరు రాలను అగుదును గాక !

ఇతర ఉత్తమ స్త్రీలలో అత్యుత్తమురాల నగుదునుగాక!
నా సపత్ని నికృష్టులలో నికృష్టురాలగుగాక! ॥ 4 ॥

మంత్రము :

అహ మస్మి సహమానాథో త్వ మసి సాసహిః ।
ఉభే సహస్వతీ భూత్వా సపత్నీం మే సహావహై ॥ 5 ॥

పదము :

అహమ్ । అస్మి । సహమానా । అథో ఇతి । త్వమ్ । అసి । ససహిః
ఉభేఇతి । సహస్వతీ ఇతి । భూత్వా । సఽపత్నీమ్ । మే । సహా
వహై ॥ 5 ॥

అనువాదం .

నేను సపత్నిని అభిభవింప గలుగుతున్నాను.
నీవు కూడా శత్రువులను అభిభవింప గలుగుతున్నావు
మన మిరువురం అభిభవన సమర్థులమై
నా సపత్నిని అభిభవింతుముగాక ! ॥ 5 ॥

మంత్రము :

అభితేధాం సహమానా ముపతేధాం సహీయసీమ్ ।
మామను ప్ర తే మనో వత్సం గౌరివ
ధావతు పథా వారివ ధావతు ॥ 6 ॥

---

Note .- "సపత్ని" కి బదులుగా వివాద జయ కర్మలో
"సపత్న *" పరంగా అర్థం చెప్పుకోవాలి.
* ( ప్రతిపక్షి ).

పదము :

అభి । తే । అధామ్ । సహమానమ్ । ఉప । తే । అధామ్ । సహీయసీమ్ ।

మామ్ । అను । ప్ర । తే । మనః । వత్సమ్ । గౌః౽ఇవ ।

ధావతు । పథా । వాః౽ఇవ । ధావతు ॥ 6 ॥

అనువాదం :

అభిభవన శీలమైన ఈ ఓషధిని ఓ సపత్నీ !
నీ శయనస్థానం క్రింద సర్వత్రా పరచు తున్నాను
అధికంగా అభిభవన శీలమైన ఈ ఓషధిని
నీ శయనం ఉపరి భాగంలో కూడ పరుస్తున్నాను.
ఈ ఓషధి ప్రభావంతో నా వశమైన నీ మనస్సు
న న్ననుసరించి నడచుకొనుగాక !
దూడ వెంట పడు ఆవువలె, పల్లంలోనికి వెళ్ళే నీటివలె
సపత్ని సర్వథా నా స్వాధీన చిత్త అగుగాక ! ॥ 6 ॥

ఇది పదునెనిమిదవ సూక్తం

## సూక్తం - 19

# పరసేనా విబర్హణం

ఋషి: వసిష్ఠుడు ॥ దేవత : విశ్వేదేవులు, ఇంద్రుడు ॥ ఛందస్సు : 1 పథ్యా బృహతీ, 2,4 అనుష్టుప్, 3 భురిగ్-బృహతీ, 5 త్రిష్టుప్, 6 షట్పదా త్రిష్టుప్, కకుమ్మతీ గర్భా౽తిజగతీ ; 7 విరాడాస్తార పంక్తి ; 8 పథ్యా పంక్తి ॥ మంత్రములు . ॥ 8 ॥

వినియోగం :- పరసేనను ఉద్విగ్నం చేసే హోమంలో, సంగ్రామ జయార్థం చేసే అజ్యహోమంలో, అగ్ని చయనంలో, మహావ్రతంలో దీనికి వినియోగం.

మంత్రము :

సంశితం మ ఇదం బ్రహ్మ సంశితం వీర్యం1బలమ్ ।

నంశితం క్షత్ర మజర మస్తు జిష్ణు ర్యేషా మస్మి పురోహితః ॥1॥

పదము :

సమ్ఽశితమ్ । మే । ఇదమ్ । బ్రహ్మ । సమ్ఽశితమ్ । వీర్యఽమ్

బలమ్ ।

సమ్ఽశితమ్ । క్షత్రమ్ । అజరమ్ । అస్తు । జిష్ణుః । యేషామ్ ।

అస్మి । పురఃఽహితః ॥ 1 ॥

అనువాదం :

నా ఈ బ్రాహ్మణత్వం దోష పరిహారంతో వెలుగొందుగాక!
నా వీర్యం, బలం తీక్ష్ణీకృత మగుగాక!
చాక్షత్రం మరింత తీక్ష్ణమై, జరా రహితమై
జయశీల మగుగాక! నేను పురోహితుడుగా ఉన్న
మా రాజు జయార్థమై నేని ప్రార్థన చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

సమహ మేషాం రాష్ట్రం స్యామి సమోజో వీర్యం1బలమ్ ।

వృశ్చామి శత్రూణాం బాహూననేన హవిషా హమ్ ॥ 2 ॥

పదము :

సమ్ । అహమ్ । ఏషామ్ । రాష్ట్రమ్ । స్యామి । సమ్ । ఓజః ।

వీర్యఽమ్ । బలమ్ ।

వృశ్చామి । శత్రూణామ్ । బాహూన్ । అనేన । హవిషా । అహమ్ ॥ 2 ॥

అనువాదం :

నే నున్న రాజుల రాజ్యాన్ని సమృద్ధం చేస్తున్నాను.
ఓజోవంతం చేస్తున్నాను.
బలిష్ఠం చేస్తున్నాను.
మా రాజ శత్రువుల బాహువులను
ఈ హవిస్సుతో ఖండించి వేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము .

నీచైః పద్యన్తా మధరే భవన్తు
యే నః సూరిం మఘవానం పృతన్యాన్ ।
క్షిణామి బ్రహ్మణామిత్రా -
నున్నయామి స్వానహమ్ ॥ 3 ॥

పదము :

నీచైః । పద్యన్తామ్ । అధరే । భవన్తు ।
యే । నః । సూరిమ్ । మఘఽవానమ్ । పృతన్యాన్ ।
క్షిణామి । బ్రహ్మణా । అమిత్రాన్ ।
ఉత్ । నయామి । స్వాన్ । అహమ్ ॥ 3 ॥

అనువాదం :

నా శత్రువులు అధః పతితులగుదురుగాక!
పాదాక్రాంతు లగుదురుగాక!

మా ప్రభూత ధన యుక్తుడైన రాజును జయించుటకై
వారు తమ సేనను సమీకరిస్తున్నారు.
ఈ అమోఘమైన మంత్రంతో
శత్రువులను నేను హింసిస్తున్నాను.
మా రాజును ఉత్కృష్టుని చేస్తున్నాను ॥ 3 ॥

మంత్రము :

తీక్ష్ణీయాంసః పరశోరగ్నేస్తీక్ష్ణతరా ఉత ।
ఇన్ద్రస్య వజ్రాత్ తీక్ష్ణీయాంసో
యేషా మస్మి పురోహితః ॥ 4 ॥

పదము :

తీక్ష్ణీయాంసః । పరశోః । అగ్నేః । తీక్ష్ణఽతరాః । ఉత ।
ఇన్ద్రస్య । వజ్రాత్ । తీక్ష్ణీయాంసః ।
యేషామ్ । అస్మి । పురఃఽహితః ॥ 4 ॥

అనువాదం :

నేను పురోహితుడుగా ఉన్న రాజు పరశువులు
తీక్ష్ణ తరము లగుగాక! అగ్ని కంటె తీక్ష్ణము లగుగాక!
అలాగే ఇంద్రుని వజ్రం కంటె తీక్ష్ణతమము లగుగాక! ॥ 4 ॥

మంత్రము :

ఏషా మహ మాయుధా సం స్యామ్యేషాం
రాష్ట్రం సువీరం వర్ధయామి ।

ఏషాం క్షత్ర మజర మస్తు జిష్ణ్వేతేషాం
చిత్తం విశ్వేవస్తు దేవాః ॥ 5 ॥

పదము :

ఏషామ్ । అహమ్ । ఆయుధా । సమ్ । స్యామి । ఏషామ్ ।
రాష్ట్రమ్ । సుఽవీరమ్ । వర్ధయామి ।
ఏషామ్ । క్షత్రమ్ । అజరమ్ । అస్తు । జిష్ణు । ఏషామ్ ।
చిత్తమ్ । విశ్వే । అవస్తు । దేవాః ॥ 5 ॥

అనువాదం:

నేను మా రాజుల ఆయుధాలను నిశితం చేస్తున్నాను,
వీరి రాజ్యం వీర సముపేతంగా సమృద్ధం చేస్తున్నాను.
అంతే కాక వీరి క్షాత్రం జరారహితం జయశీలం అగుగాక!
యుద్ధోన్ముఖమైన వీరి మనస్సును
సర్వదేవతలు కాపాడుదురు గాక! ॥ 5 ॥

మంత్రము :

ఉద్ధర్షన్తాం మఘవన్ వాజినాన్యుద్
వీరాణాం జయతా మేతు ఘోషః ।
పృథగ్ ఘోషా ఉలులయః కేతుమన్త ఉదీరతామ్ ।
దేవా ఇన్ద్రజ్యేష్ఠా మరుతో యన్తు సేనయా ॥ 6 ॥

పదము .

ఉత్ । హర్షన్తామ్ । మఘ2వన్ । వాజినాని । ఉత్ ।

వీరాణామ్ । జయతామ్ । ఏతు । ఘోషః ।

పృథక్ । ఘోషాః । ఉలులయః । కేతు2మన్తః । ఉత్ । ఈరతామ్ ।

దేవాః । ఇన్ద్ర2జ్యేష్ఠాః । మరుతః । యన్తు । సేనయా ॥ 6 ॥

అనువాదం .

చతురంగ బలాలు ఓ ఇంద్రా! ఉత్సాహవంతా లగుగాక!
జయప్రాప్తి నందుతున్న మా శూరుల
సింహనాదం దిక్కులు పిక్కటిల్ల చేయుగాక!
వేరు వేరుగా *'ఉల్లులు' అంటూ ప్రజ్ఞానవంతాలై
ఆ జయ ఘోషలు అటూ ఇటూ చెలరేగుగాక!
ఇంద్రస్వామికులైన మరుత్తులు
మాకు సాయం చేయుటకై తమ తమ
సేనలతో పాటు వత్తురు గాక! ॥ 6 ॥

మంత్రము :

ప్రేతా జయతా నర ఉగ్రా వః సన్తు బాహవః ।
తీక్ష్ణేషవో బలధన్వనో హతో
గ్రాయుధా అబలా నుగ్ర బాహవః ॥ 7 ॥

---

* ధ్వన్యను కరణం.

పదము :

ప్ర । ఇత । జయత । నరః । ఉగ్రాః । వః । సన్తు । బాహవః ।

తీక్ష్ణఽఇషవః । అబలఽధన్వనః । హత ।

ఉగ్రఽఆయుధాః । అబలాన్ । ఉగ్రఽబాహవః ॥ 7 ॥

అనువాదం:

మా భటులు యుద్ధభూమికి వెళ్ళుదురు గాక!
శత్రువులను జయింతురుగాక! వీరి నిశిత బాణాదులు
మీ బాహువులను ఉగ్రములు చేయుగాక!
ఉగ్రాయుధులైన మీరు ఉగ్రబాహువులై
దుర్బలధనుర్ధారులూ, అబలులూ అయిన
శత్రువులను చంపుదురుగాక! ॥ 7 ॥

మంత్రము :

అవసృష్టా పరా పత శరవ్యే బ్రహ్మసంశితే ।

జయామిత్రాన్ ప్ర పద్యస్వ జహ్యేఽషాం

వరం వరం మామీషాం మోచి కశ్చన ॥ 8 ॥

పదము :

అవఽసృష్టా । పరా । పత । శరవ్యే । బ్రహ్మఽసంశితే ।

జయ । అమిత్రాన్ । ప్ర । పద్యస్వ । జహి । ఏషామ్ ।

వరమ్ఽవరమ్ । మా । అమీషామ్ । మోచి । కః । చన ॥ 8 ॥

అనువాదం :

అభిమంత్రితమై, హింసా సమర్థమైన బాణమా!
నీవు మాధనుర్వినిర్ముక్తమై పరసేనాభిముఖంగా వెళ్ళు.
ఆ అమిత్రులను జయించు.
శత్రుసేనలో ప్రవేశించి, అందలి శ్రేష్ఠతరమైన
చతురంగబలాన్ని చంపు.
ఈ దూరంలో కనిపించే శత్రుమధ్యంలో
ఏ ఒక్క వీరుడూ తప్పించు కొనకుండుగాక! ॥ 8 ॥

ఇది పందొమ్మిదవ సూక్తం

## సూక్తం – 20
# తేజస్సు కోసం ప్రార్థన

ఋషి : వసిష్ఠుడు ॥ దేవత : 1,2,5 అగ్ని : 3 అర్యముడు, భగుడు, బృహస్పతి, దేవీ, 4 సోముడు, అగ్ని: ఆదిత్యుడు, విష్ణువు, బ్రహ్మ, బృహస్పతి, 6 ఇంద్రుడు, వాయువు, 7 అర్యముడు, బృహస్పతి, ఇంద్రుడు. వాతము, విష్ణువు, సరస్వతి, సవిత, వాజి, 8 విశ్వములు, భువనములు, 9 పంచ ప్రదిక్కులు, 10 వాయువు, త్వష్ట ॥ ఛందస్సు : 1-5, 7,9,10 అనుష్టుప్ 6 పథ్యాపంక్తి, 8 విరాడ్ జగతీ ॥ మంత్రములు : ॥ 10 ॥

వినియోగం :- నిర్ ఋతి కర్మలో చేసే హోమంలో, ఉత్థాపన విఘ్నశమన కర్మలో చేసే హోమాలలో, అరణ్యంలో అగ్ని సమారోపణంలో నవయజ్ఞంలో, అగ్ని చయనంలో దీనికి వినియోగం.

మంత్రము :

**అయం తే యోనిర్ ఋత్వియో యతో జాతో అరోచథాః ।**
**తం జానన్నగ్న ఆ రోహాధా నో వర్ధయా రయిమ్ ॥ 1 ॥**

పదము .

అయమ్ । తే । యోనిః । ఋత్వియః । యతః । జాతః । అరోచథాః

తమ్ । జానన్ । అగ్నే । ఆ । రోహ । అథ । నః । వర్ధయ ।
రయిమ్ ॥ 1 ॥

అనువాదం :

అరణిలో నుంచి ఓ అగ్నీ ! ఉత్పన్న మైనావు.
అక్కడ దీప్తి చెందుతున్నావు.
ఆ ఉత్పత్తి స్థానాన్ని గుర్తెరిగి అందులో ప్రవేశించు.
అనంతరం మా ధనాన్ని అభివృద్ధి చెందించు. ॥ 1 ॥

మంత్రము :

అగ్నే అచ్ఛా వదేహ నః ప్రత్యఙ్ నః సుమనా భవ ।
ప్రణో యచ్ఛ విశాంపతే ధనదా అసి నస్త్వమ్ ॥ 2 ॥

పదము :

అగ్నే । అచ్ఛ । వద । ఇహ । నః । ప్రత్యఙ్ । నః । సుఽమనాః ।
భవ ।

ప్ర । నః । యచ్ఛ । విశామ్ । పతే । ధనఽదాః । అసి । నః ।
త్వమ్ ॥ 2 ॥

అనువాదం :

ఇక్కడ మాకు ఓ అగ్నీ ! ప్రియభాషివికా !
మాకు అభిముఖుడవై సుమనస్కుడవు కమ్ము.

సర్వ ప్రజాపాలకుడా! మాకు ధనాదుల నిమ్ము.
నీవే మాకు ధనదాతవు. ॥ 2 ॥

మంత్రము :

ప్ర ణో యచ్ఛత్వర్యమా ప్ర భగః ప్ర బృహస్పతిః ।
ప్ర దేవీః ప్రోత సూనృతా రయిం దేవీ దధాతు మే ॥3॥

పదము :

ప్ర । నః । యచ్ఛతు । అర్యమా । ప్ర । భగః । ప్ర । బృహస్పతిః ।
ప్ర । దేవీః । ప్ర । ఉత । సూనృతా । రయిమ్ । దేవీ । దధాతు ।
మే ॥ 3 ॥

అనువాదం

మాకు అర్యముడు సర్వం ప్రసాదించుగాక!
భగుడు, బృహస్పతి కూడా ధనాన్ని ప్రసాదింతురు గాక!
ఇంద్రాది దేవతలు ధనా న్నిత్తురు గాక!
మఱి ప్రియభాషిణి అయిన
దేవి సరస్వతి, ధనాన్ని నాకు ఇచ్చుగాక! ॥ 3 ॥

మంత్రము :

సోమం రాజాన మవసేగ్నిం గీర్భిర్హవామహే ।
ఆదిత్యం విష్ణుం సూర్యం బ్రహ్మాణం చ బృహస్పతిమ్ ॥4॥

పదము :

సోమమ్ । రాజానమ్ । అవసే । అగ్నిమ్ । గీఃఽభిః । హవామహే ।

ఆదిత్యమ్ । విష్ణుమ్ । సూర్యమ్ । బ్రహ్మాణమ్ । చ । బృహ
స్పతిమ్ ॥ 4 ॥

అనువాదం :

రాజైన సోముని, అగ్నిని రక్షణార్థమై
స్తుతిగీతాలతో ఆహ్వానిస్తున్నాము.
అలాగే ఆదిత్యుని, విష్ణువును, సూర్యుని
బ్రహ్మను, బృహస్పతిని వీ రందరిని ఆహ్వానిస్తున్నాము. ॥ 4 ॥

మంత్రము.

త్వం నో అగ్నే అగ్నిభి ర్బ్రహ్మ యజ్ఞం చ వర్ధయ ।
త్వం నో దేవ దాతవే రయిం దానాయ చోదయ ॥ 5 ॥

పదము :

త్వమ్ । నః । అగ్నే । అగ్నిఽభిః । బ్రహ్మ । యజ్ఞమ్ । చ ।
వర్ధయ ।
త్వమ్ । నః । దేవ । దాతవే । రయిమ్ । దానాయ । చోదయ॥5॥

అనువాదం :

ఓ అగ్ని! నీ విభూతి రూపాలైన విభిన్నాగ్నులతో కలిసి
మా మంత్రాన్ని, యజ్ఞాన్ని, సమృద్ధం చెయ్యి.
మా ధనాన్ని ఓ దేవా! దానార్థమై వృద్ధిచెందించు. ॥ 5 ॥

మంత్రము :

ఇన్ద్రవాయూ ఉభావిహ సుహవేహ హవామహే ।

యథా నః సర్వ ఇజ్జనః సంగత్యాం
సుమనా అసద్ దానకామశ్చ నో భువత్ ॥ 6 ॥

పదము .

ఇన్ద్రవాయూ ఇతి । ఉభౌ । ఇహ । సుఽహవా । ఇహ । హవామహే
యథా । నః । సర్వః । ఇత్ । జనః । సమ్ఽగత్యామ్ ।
సుఽమనాః । అసత్ । దానఽకామః । చ । నః । భువత్ ॥ 6 ॥

అనువాదం :

ఇంద్ర వాయువులను ఉభయులనూ
ఈ కర్మకై ఆహ్వానిస్తున్నాము.
ఈ దేవతలీ కర్మలో ఆహ్వాన సులభులు .
సర్వ జన సంగతిలో వీరు సహృదయులు.
వారు మా దానాన్ని కూడా అభిలషించేవారు. ॥ 6 ॥

మంత్రము :

అర్యమణం బృహస్పతి మిన్ద్రం దానాయ చోదయ ।
వాతం విష్ణుం సరస్వతీం సవితారం చ వాజినమ్ ॥ 7 ॥

పదము :

అర్యమణమ్ । బృహస్పతిమ్ । ఇన్ద్రమ్ । దానాయ । చోదయ ।
వాతమ్ । విష్ణుమ్ । సరస్వతీమ్ । సవితారమ్ । చ । వాజినమ్ ॥ 7 ॥

అనువాదం :

ఓ స్తోత్ర పొరకుడా!
అర్యముని, బృహస్పతిని, ఇంద్రుని,
దానార్థమై ప్రేరేపించు.
వాయువును, విష్ణువును, సరస్వతిని,
వేగవంతుడైన సవితను కూడా ప్రేరేపించు. ॥ 7 ॥

మంత్రము.

వాజస్య ను ప్రసవే సంబభూ
విమేమా చ విశ్వా భువనాన్యన్తః ।
ఉతాదిత్సన్తం దాపయతు ప్రజానన్
రయిం చ నః సర్వవీరం ని యచ్ఛ ॥ 8 ॥

పదము :

వాజస్య । ను । ప్రఽసవే । సమ్ । బభూవిమ ।
ఇమా । చ । విశ్వా । భువనాని । అన్తః ।
ఉత । ఆదిత్సన్తమ్ । దాపయతు । ప్రఽజానన్ ।
రయిమ్ । చ । నః । సర్వఽవీరమ్ । ని । యచ్ఛ ॥ 8 ॥

*అన్నోత్పత్తి కర్మలో మేము సంఘటితులమైనాము.
ఈ విశ్వ భువనాలు దానిలో అంతర్గర్భితములై ఉన్నవి.

---

ఇది స్పష్టంగా లేదు - సాయణుడు ఇచ్చిన అర్థం పైనిది.
* "శక్తి" అని మిగతావా రన్నారు.

దాన బుద్ధి లేని వానిని కూడా జ్ఞానియై ప్రేరేపించుగాక!
మాకు ధనాన్ని, సర్వ వీర పుత్రులను
సుస్థిరం చేయుగాక! ॥ 8 ॥

మంత్రము :

దుహ్రాం మే పఞ్చ ప్రదిశో దుహ్రా ముర్వీర్యథాబలమ్ ।
ప్రాపేయం సర్వా ఆకూతీ ర్మనసా హృదయేన చ ॥ 9 ॥

పదము :

దుహ్రామ్ । మే । పఞ్చ । ప్రఽదిశః । దుహ్రామ్ । ఉర్వీః । యథా ఽబలమ్ ।
ప్ర । ఆపేయమ్ । సర్వాః । ఆఽకూతీః । మనసా । హృదయేన । చ ॥ 9 ॥

అనువాదం :

*1 పంచ సంఖ్యాకాలైన దిక్కులు
నాకు ఫలదాయకా లగు గాక!
షట్సంఖ్యాకాలైన *2 "ఉర్వీదేవతలు"
యథాశక్తి ధనా న్నిత్తురు గాక!
మనస్సుతో, హృదయంతో కూడా
సకల సంకల్పాలు నాకు లభించుగాక! ॥ 9 ॥

మంత్రము :

గోసనిం వాచ ముదేయం వర్చసా మాభ్యుదిహి ।
ఆ రున్ధాం సర్వతో వాయు స్త్వష్టా పోషం దధాతు మే ॥ 10 ॥

---

*1. నాల్గు దిక్కులు, అంతరాళమూ.
*2. దివి, పృథివి మొదలైనవి.

పదము :

గోఽసనిమ్ । వాచమ్ । ఉదేయమ్ । వర్చసా । మా । అభిఽఉదిహి ।

ఆ । రున్ధామ్ । సర్వతః । వాయుః । త్వష్టా । పోషమ్ । దధాతు । మే ॥ 10 ॥

ఇతి చతుర్థోఽనువాకః

అనువాదం .

గోధన ప్రదమైన వాక్కును నేను వచిస్తున్నాను.
ఓ వాగ్దేవతా! నీవు తేజస్సుతో
నన్ను అభ్యుదయం చెందించు.
వాయువు సర్వత్రా ప్రాణరూపంతో ఆవరించుగాక!
త్వష్ట నాకు పుష్టి నిచ్చుగాక! ॥ 10 ॥

ఇది ఇరవైయవ సూక్తం

ఇది నాల్గవ అనువాకం

# అనువాకం : 5

## సూక్తం - 21

## కామాగ్ని శాంతికి....

ఋషి: వసిష్ఠుడు॥ దేవత : 1-7 అగ్ని : 8-10 మంత్రాలలో పేర్కొన్న సవిత మొదలగువారు॥ ఛందస్సు : 1 పురోఽనుష్టుప్, త్రిష్టుప్ : 2,3,8 భురిక్ త్రిష్టుప్, 4 త్రిష్టుప్, 5 జగతీ, 6 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ, 7 విరాడ్ గర్భా త్రిష్టుప్ : 9 నిచృదనుష్టుప్ : 10 అనుష్టుప్॥ మంత్రములు : ॥10॥

వినియోగం :- దోషోపహతాలైన గృహగోష్ఠాదుల శాంత్యర్థం చేసే కర్మలో, మణిధారణహోమాది కర్మలలో, పశాశమన కర్మలో, ప్రాయ

శ్చిత్త కర్మలో దీనికి వినియోగం. ఇందులోని మొదటి ఏడు మంత్రాలు బృహద్గణంలోనివి. క్రవ్యాదులను తరిమివేసిన తరువాత చేసే హోమంలో చివరి మూడు మంత్రాలకు వినియోగం. చాతుర్మాస్యంలోని సాకమేధ పర్వంలో కూడ దీనికి వినియోగం.

మంత్రము :

యే అగ్నయో అప్స్వ1న్తర్యే వృత్రే
యే పురుషే యే అశ్మసు ।
య ఆవివేశౌషధీర్యో వనస్పతీం
స్తేభ్యో అగ్నిభ్యో హుత మస్త్వేతత్ ॥ 1 ॥

పదము ·

యే । అగ్నయః । అప్ఽసు । అన్తః । యే । వృత్రే ।
యే । పురుషే । యే । అశ్మఽసు ।
యః । ఆఽవివేశ । ఓషధీః । యః । వనస్పతీన్ ।
తేభ్యః । అగ్నిఽభ్యః । హుతమ్ । అస్తు । ఏతత్ ॥ 1 ॥

అనువాదం :

ఉదకమధ్యంలో ఉన్న అగ్నులకు,
మేఘంలో విద్యుద్రూపంగా ఉన్న అగ్నులకు,
పురుషునిలో వైశ్వానరాత్మకంగా ఉన్న అగ్నులకు,
*సూర్యకాంతాది శిలలలో ఉన్న అగ్నులకు,
ఓషధులలో, వనస్పతులలో ఉన్న అగ్నులకు,
ఆ అగ్ను లన్నింటికీ ఈ హవిస్సు చెందుగాక ! ॥ 1 ॥

* చెకుముకి రాళ్ళలో అని కొందఱు

మంత్రము :

యః సోమే అన్తర్యో గోష్వన్తర్య

ఆవిష్టో వయఃసు యో మృగేషు ।

య ఆవివేశ ద్విపదో యశ్చతుష్పద

స్తేభ్యో అగ్నిభ్యో హుత మస్త్వేతత్ ॥ 2 ॥

పదము

యః । సోమే । అన్తః । యః । గోషు । అన్తః । యః ।

ఆఽవిష్టః । వయఃఽసు । యః । మృగేషు ।

యః । ఆఽవివేశ । ద్విఽపదః । యః । చతుఃఽపదః ।

తేభ్యః । అగ్నిఽభ్యః । హుతమ్ । అస్తు । ఏతత్ ॥ 2 ॥

అనువాదం :

సోమలతలో, అంతరావిష్టమై ఉన్న అగ్ని,
గోవులలో అంతర్గర్భితంగా ఉన్న అగ్ని,
పక్షులలో ఉన్న అగ్ని, మృగాలలో ఉన్న అగ్ని,
ద్విపాదులైన మనుష్యాదులలో ఉన్న అగ్ని
ఈ అగ్నులన్నిటికీ ఈ హవిస్సు చెందుగాక! ॥ 2 ॥

మంత్రము :

య ఇన్ద్రేణ సరథం యాతి దేవో

వైశ్వానర ఉత విశ్వదావ్యఽః ।

యం జోహవీమి పృతనాసు సాసహిం
తేభ్యో అగ్నిభ్యో హుత మస్త్వేతత్ ॥ 3 ॥

పదము.

యః । ఇన్ద్రేణ । సఽరథమ్ । యాతి । దేవః ।
వైశ్వానరః । ఉత । విశ్వఽదావ్యః ।
యమ్ । జోహవీమి । పృతనాసు । ససహిమ్ ।
తేభ్యః । అగ్నిఽభ్యః । హుతమ్ । అస్తు । ఏతత్ ॥ 3 ॥

అనువాదం :

ఏ అగ్ని ఇంద్రునితో ఏక రథుడై వెడతాడో,
ఏ అగ్ని వైశ్వానరుడో, ఏ అగ్ని విశ్వదాహకుడో,
సంగ్రామాదులలో ఏ అగ్నితో జయార్థమై హోమం చేస్తారో,
ఆ అగ్నికి ఈ హవిస్సు చెందుగాక! ॥ 3 ॥

మంత్రము :

యో దేవో విశ్వాద్ యము కామమాహు
ర్యం దాతారం ప్రతిగృహ్ణన్త మాహుః ।
యో ధీరః శక్రః పరిభూరదాభ్య
స్తేభ్యో అగ్నిభ్యో హుతమ స్త్వేతత్ ॥ 4 ॥

పదము.

యః । దేవః । విశ్వఽఅత్ । యమ్ । ఓంఇతి । కామమ్ । ఆహుః ।

యమ్ । దాతారమ్ । ప్రతి౾గృహ్ణన్తమ్ । ఆహుః ।
యః । ధీరః । శక్రః । పరి౾భూః । అదాభ్యః ।
తేభ్యః । అగ్ని౾భ్యః । హుతమ్ । అస్తు । ఏతత్ ॥ 4 ॥

**అనువాదం :**

ఏ అగ్ని సర్వభక్షకుడో, ఎవనిని కామఫలాత్మకుడంటారో,
ఏ అగ్నిని ఫలదాతగా, ప్రతిగ్రహీతగా చెప్తారో,
ఏ అగ్ని ధీమంతుడో, శక్తిమంతుడో,
శత్రువులను పరిభవించు వాడో,
ఎవనిని ఎవరూ హింసించలేరో,
ఆ వివిధ రూపాగ్నులకు ఈ హవిస్సు చెందుగాక! ॥ 4 ॥

**మంత్రము :**

యం త్వా హోతారం మనసాభి సంవిదు
స్త్రయోదశ భౌవనాః పఞ్చ మానవాః ।
వర్చోధసే యశసే సూనృతావతే
తేభ్యో అగ్నిభ్యో హుత మస్త్వేతత్ ॥ 5 ॥

పదము

యమ్ । త్వా । హోతారమ్ । మనసా । అభి । సమ్౾విదుః ।
త్రయః౾దశ । భౌవనాః । పఞ్చ । మానవాః ।
వర్చః౾ధసే । యశసే । సూనృతా౾వతే ।
తేభ్యః । అగ్ని౾భ్యః । హుతమ్ । అస్తు । ఏతత్ ॥ 5 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! నిన్ను దేవతలకు హోతగా భావిస్తున్నారు.
త్రయోదశ ( సంసర్ప, అహస్పత్యనామకమైన
అధికమాసంతో చేరి ) సంఖ్యగల మాసములు,
మనువు సృష్టించిన వసంతాది
*పంచ ఋతువులు, వీ రందరూ వర్చస్సు కోసమై
ప్రియ సత్యాత్మకమైన వాక్కు కోసమై
నీ విభూతి రూపాలైన అగ్నులకు
ఈ హవిస్సు నర్పిస్తున్నారు. ॥ 5 ॥

మంత్రము :

ఉక్షాన్నాయ వశాన్నాయ సోమ పృష్ఠాయ వేధసే
వైశ్వానరజ్యేష్ఠేభ్య స్తేభ్యో అగ్నిభ్యో హుత మస్త్వేతత్ ॥ 6 ॥

పదము :

ఉక్షఽఅన్నాయ । వశాఽఅన్నాయ । సోమఽపృష్ఠాయ । వేధసే ।
వైశ్వానరఽజ్యేష్ఠేభ్యః । తేభ్యః । అగ్నిఽభ్యః । హుతమ్ ।
అస్తు । ఏతత్ ॥ 6 ॥

అనువాదం .

వృషభ రూపమైన హవిస్సును భుజించు వానికి
వంధ్యా గోభక్షకుడైన వానికి,
సోమ పృష్ఠుడైన వానికి, జగ ద్విధాతకు,
వీ రందరికి పెద్ద వాడైన వైశ్వానరునకు—
ఈ అగ్ని రూపా లన్నింటికి ఈ హవిస్సు చెందుగాక ! ॥ 6 ॥

* ( హేమంత శిశిరాలు ఒకటిగా పరిగణించి )

మంత్రము :

దివం పృథివీమన్వన్తరిక్షం

యే విద్యుత మనుసంచరన్తి ।

యే దిక్ష్వన్తర్యే వాతే అన్త—

స్తేభ్యో అగ్నిభ్యో హుతమస్త్వేతత్ ॥ 7 ॥

పదము :

దివమ్ । పృథివీమ్ । అను । అన్తరిక్షమ్ ।

యే౽విద్యుతమ్ । అను౽సంచరన్తి ।

యే । దిక్షు । అన్తః । యే । వాతే । అన్తః ।

తేభ్యః । అగ్ని౽భ్యః । హుతమ్ । అస్తు । ఏతత్ ॥ 7 ॥

అనువాదం :

ద్యులోకంలో, భూలోకంలో, అంతరిక్షంలో ప్రవేశించి
ఏ అగ్నులు సంచరిస్తున్నవో,
విద్యుత్తులో ప్రవేశించి ఏ అగ్ను లున్నవో,
దిఙ్మధ్యంలో ఏ అగ్ను లున్నవో.
వాయువులో ఏ అగ్నులు సంచరిస్తున్నవో
వా రందఱకు ఈ హవిస్సు చెందుగాక ! ॥ 7 ॥

మంత్రము ,

హిరణ్యపాణిం సవితారమిన్ద్రం

బృహస్పతిం వరుణం మిత్ర మగ్నిమ్ ।

విశ్వాన్ దేవా నఙ్గిరసో హవామహ

ఇమం క్రవ్యాదం శమయ న్త్వగ్నిమ్ ॥ 8 ॥

పదము :

హిరణ్యఽపాణిమ్ । సవితారమ్ । ఇన్ద్రమ్ ।

బృహస్పతిమ్ । వరుణమ్ । మిత్రమ్ । అగ్నిమ్ ।

విశ్వాన్ । దేవాన్ । అఙ్గిరసః । హవామహే ।

ఇమమ్ । క్రవ్యఽఅదమ్ । శమయన్తు । అగ్నిమ్ ॥ 8 ॥

అనువాదం :

హిరణ్యపాణి అయిన సవితను,
ఇంద్రుని, బృహస్పతిని, వరుణుని, మిత్రుని, అగ్నిని,
విశ్వేదేవతలను, సర్వ దేవతలను, అంగిరసాది
మహర్షులను ఆహ్వానిస్తున్నాము.
వారు మాంసాహారియైన దుష్టాగ్నిని శమింప జేతురుగాక!
॥ 8 ॥

మంత్రము :

శాన్తో అగ్నిః క్రవ్యాచ్ఛాన్తః పురుషరేషణః ।

అథో యో విశ్వదావ్య1స్తం క్రవ్యాద మశీశమమ్ ॥ 9 ॥

పదము :

శాన్తః । అగ్నిః । క్రవ్యఽఅత్ । శాన్తః । పురుషఽరేషణః ।

అథో ఇతి । యః । విశ్వ౽దావ్య౽ః । తమ్ । క్రవ్య౽అదమ్ ।
అశీశమమ్ ॥ 9 ॥

అనువాదం :

ఈ క్రవ్యాదుడైన అగ్ని, సవిత్రాదులైన
దేవతల అనుగ్రహంతో సుఖకరు డగుగాక!
పురుష హింసకుడైన అగ్ని శాంతు డగుగాక!
సర్వదాహకుడైన అగ్నిని, మాంస
భక్షకుడైన అగ్నిని శాంతుని చేస్తున్నాను ॥ 9 ॥

మంత్రము .

యే పర్వతాః సోమపృష్ఠా ఆప ఉత్తానశీవరీః ।
వాతః పర్జన్య ఆదగ్నిస్తే క్రవ్యాద మశీశమన్ ॥ 10 ॥

పదము :

యే । పర్వతాః । సోమ౽పృష్ఠాః । ఆపః । ఉత్తాన౽శీవరీః ।
వాతః । పర్జన్యః । ఆత్ । అగ్నిః । తే । క్రవ్య౽అదమ్ । అశీ
శమన్ ॥ 10 ॥

అనువాదం .

సోముడు పై భాగంలో గల పర్వతాలు
వెల్లకిల పడుకొని పారే ఉదకాలు
వాత పర్జన్యులు వీరందఱూ
క్రవ్యాదుడైన అగ్నిని శాంతుని చేసినారు. ॥ 10 ॥

ఇది ఇరవై యొకటవ సూక్తం

# సూక్తం - 22

# తేజస్స్కై....

ఋషి : వసిష్ఠుడు ॥ దేవత : విశ్వేదేవులు, బృహస్పతి, వర్చస్సు ॥ ఛందస్సు : 1 విరాట్ త్రిష్టుప్ : 2,5,6 అనుష్టుప్ : 3 పఞ్చపదా పరానుష్టుప్ విరాడ తిజగతీ, 4 షట్పదాజగతీ ॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :- తేజస్కాముడు చేసే కర్మలో హస్తిదంత మణిబంధనంలో, పురోహితుడు ఏనుగును రాజునకు ప్రతి ఉదయం అప్పగించుటలో, బ్రాహ్మీమహాశాంతిలో దీనికి వినియోగం.

మంత్రము :

హస్తివర్చసం ప్రథతాం బృహద్ యశో
అదిత్యా యత్ తన్వఽః సంబభూవ ।
తత్ సర్వే సమదుర్మహ్యమేతద్
విశ్వే దేవా అదితిః సజోషాః ॥ 1 ॥

పదము :

హస్తిఽవర్చసమ్ । ప్రథతామ్ । బృహత్ । యశః ।
అదిత్యాః । యత్ । తన్వఽః । సమ్ఽబభూవ ।
తత్ । సర్వే । సమ్ । అదుః । మహ్యమ్ । ఏతత్ ।
విశ్వే । దేవాః । అదితిః । సఽజోషాః ॥ 1 ॥

**అనువాదం :**

హస్తివర్చస్సు మాలో ప్రథితమగుగాక!
అదితి శరీరం నుంచి తేజస్సు సముత్పన్నమైనది.
దానిని విశ్వేదేవతలతో సమాన ప్రీతిగల
అదితితోపాటు, అందఱూ కలిసి నాకు ప్రసాదింతురుగాక!
॥ 1 ॥

**మంత్రము:**

మిత్రశ్చ వరుణశ్చేన్ద్రో రుద్రశ్చ చేతతు ।
దేవాసో విశ్వధాయసస్తే మాఞ్జన్తు వర్చసా ॥ 2 ॥

**పదము :**

మిత్రః । చ । వరుణః । చ । ఇన్ద్రః । రుద్రః । చ । చేతతు ।
దేవాసః । విశ్వఽధాయసః । తే । మా । అఞ్జన్తు । వర్చసా ॥ 2 ॥

**అనువాదం :**

మిత్రుడు, వరుణుడు, ఇంద్రుడు,
రుద్రుడు నన్ను గుర్తింతురుగాక!
విశ్వపోషకులైన ఆ మిత్రాది దేవతలు
నన్ను వర్చస్సుతో ఆశ్లిష్టుని చేయుదురుగాక! ॥ 2 ॥

**మంత్రము :**

యేన హస్తీ వర్చసా సంబభూవ
యేన రాజా మనుష్యేష్వప్స్వ1న్తః ।

యేన దేవా దేవతామగ్ర ఆయన్

తేన మామద్య వర్చసాగ్నే వర్చస్వినం కృణు ॥ 3 ॥

పదము :

యేన । హస్తీ । వర్చసా । సమ్ఽబభూవ ।

యేన । రాజా । మనుష్యేఽషు । అప్ఽసు । అన్తః ।

యేన । దేవాః । దేవతామ్ । అగ్రే । ఆయన్ ।

తేన । మామ్ । అద్య । వర్చసా । అగ్నే । వర్చస్వినమ్ । కృణు ॥ 3 ॥

అనువాదం :

గజం ఏ వర్చస్సుతోడ సముత్పన్నమైనదో,
మనుష్యులలో ఎవడు ఏ వర్చస్సుతో
రాజు కాగలుగుతున్నాడో, ఉదక మధ్యంలో
ఏ వర్చస్సుతో రాజులు వర్చస్స్వ పొతున్నారో,
ఇంద్రాదులు సృష్ట్యాదిలో ఏ వర్చస్సుతో
దేవత్వాన్ని పొందినారో, ఆ వర్చస్సుతో ఓ అగ్ని !
ఇప్పుడు నన్ను తేజస్వినిగా చెయ్యి. ॥ 3 ॥

మంత్రము :

యత్ తే వర్చో జాతవేదో బృహద్ భవత్యాహుతేః ।

యావత్ సూర్యస్య వర్చ ఆసురస్య చ హస్తినః ।

తావ న్మే అశ్వినా వర్చ ఆ ధత్తాం పుష్కరస్రజా ॥ 4 ॥

పదము :

యత్ । తే । వర్చః । జాతఽవేదః । బృహత్ । భవతి । ఆఽహుతేః

యావత్ । సూర్యస్య । వర్చః । ఆసురస్య । చ । హస్తినః ।

తావత్ । మే । అశ్వినా । వర్చః । ఆ । ధత్తామ్ । పుష్కరఽస్రజా

॥ 4 ॥

అనువాదం :

ఓ జాతవేదా!
ఆహూతుడవైన అగ్నీ!
నీ అధిక తేజస్సు సూర్యునకు వర్చస్సునిస్తున్నది.
అసురమైన గజానికి ఏ వర్చ స్సున్నదో,
అంత వర్చస్సును నాకు పుష్పమాలలతో
అలంకృతులైన అశ్వినీ దేవతలు ప్రసాదింతురుగాక! ॥ 4 ॥

మంత్రము :

యావచ్చతస్రః ప్రదిశశ్చక్షుర్యావత్ సమశ్నుతే ।

తావత్ సమైత్విన్ద్రియం మయి తద్ధస్తి వర్చసమ్ ॥ 5 ॥

పదము :

యావత్ । చతస్రః । ప్రఽదిశః । చక్షుః । యావత్ । సమ్

ఽఅశ్నుతే ।

తావత్ । సమ్ఽఏతు । ఇన్ద్రియమ్ । మయి । తత్ । హస్తి

ఽవర్చసమ్ ॥ 5 ॥

**అనువాదం :**

నాలుగు దిక్కులు ఎంత వఱకు వ్యాపిస్తున్నవో,
చక్షు రింద్రియం యావత్పర్యంతం చూస్తున్నదో,
ఆ మహేంద్రప్రతీక నాకు లభించుగాక!
ఆ హస్తి వర్చస్సు నాకు లభించుగాక! ॥ 5 ॥

**మంత్రము :**

హస్తీ మృగాణాం సుషదా మతిష్ఠావాన్ బభూవ హి ।
తస్య భగేన వర్చసాభి షిఞ్చామి మా మహమ్ ॥ 6 ॥

**పదము :**

హస్తీ । మృగాణామ్ । సుఽసదామ్ । అతిష్ఠాఽవాన్ । బభూవ । హి ।
తస్య । భగేన । వర్చసా । అభి । సిఞ్చామి । మామ్ । అహమ్ ॥ 6 ॥

**అనువాదం :**

స్వేచ్ఛగా అరణ్యంలో సంచరించే మృగాలలో
వనగజం అత్యుత్కృష్టమైనది కదా!
అలాంటి హస్తికి చెందిన భాగ్యరూప వర్చస్సుతో
నన్ను నేను అభిషేచనం చేసుకుంటున్నాను. ॥ 6 ॥

ఇది ఇరవై రెండవ సూక్తం

## సూక్తం - 23

# వీరపుత్రప్రాప్తికై....

**ఋషి:** బ్రహ్మ ॥ **దేవత :** యోని ॥ **ఛందస్సు :** 1-4 అనుష్టుప్, 5 ఉపరిష్టాద్ భురిగ్ బృహతీ : 6 స్కంధోగ్రీవా బృహతీ ॥ **మంత్రములు :** ॥ 6 ॥

**వినియోగం :-** పుంసవన కర్మకు చెందిన వివిధ ప్రక్రియలలో దీనికి వినియోగం.

మంత్రము :

యేన వేహద్ బభూవిథ నాశయామసి తత్ త్వత్ ।

ఇదం తదన్యత్ర త్వదప దూరే ని దధ్మసి ॥ 1 ॥

పదము.

యేన । వేహత్ । బభూవిథ । నాశయామసి । తత్ । త్వత్ ।

ఇదమ్ । తత్ । అన్యత్ర । త్వత్ । అప । దూరే । ని । దధ్మసి॥1॥

**అనువాదం.**

ఓ నారీ ఏ పాపంతో నీవు వంధ్యవయ్యావో
దానిని నీ నుంచి తొలగించి వేస్తున్నాము.
అది తిరిగి నీకు అంటుకుండా
నీ నుంచి దూరంగా దానిని పారవేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము :

ఆతే యోనిం గర్భ ఏతు పుమాన్ బాణ ఇవేషుధిమ్ ।

ఆ వీరోత్ర జాయతాం పుత్రస్తే దశమాస్యః ॥ 2 ॥

పదము.

ఆ । తే । యోనిమ్ । గర్భః । ఏతు । పుమాన్ । బాణః ఽఇవ ।
ఇషుఽధిమ్ ।

ఆ । వీరః । అత్ర । జాయతామ్ । పుత్రః । తే । దశఽమాస్యః॥2॥

అనువాదం :

బాణం పొదిలో దూరినట్టు పురుష రూప
గర్భం నీ యోనిని ప్రవేశించుగాక!
నీ గర్భం పుత్రుడుగా పరిణమించి పది మాసాలలో
బలవంతుడైన వీరుడుగా జనించుగాక! ॥ 2 ॥

మంత్రము :

పుమాంసం పుత్రం జనయ తం పుమానను జాయతామ్ ।
భవాసి పుత్రాణాం మాతా జాతానాం జనయాశ్చ యాన్ ॥ 3 ॥

పదము :

పుమాంసమ్ । పుత్రమ్ । జనయ । తమ్ । పుమాన్ । అను । జాయతామ్ ।
భవాసి । పుత్రాణామ్ । మాతా । జాతానామ్ । జనయాః । చ । యాన్ ॥ 3 ॥

అనువాదం :

ఓ నారీ! నీవు మగ బిడ్డను కను.
ఆ తరువాతా పుత్రుడే కలుగుగాక!
ఇలా కలిగిన పుత్రులకు నీవు తల్లివి కమ్ము.
ఆ తరువాత కలిగిన పుత్రులకు కూడా తల్లివికా! ॥ 3 ॥

మంత్రము :

యాని భద్రాణి బీజాన్యృషభా జనయన్తి చ ।
తైస్త్వం పుత్రం విన్దస్వ సా ప్రసూర్ధేనుకా భవ ॥ 4 ॥

పదము :

యాని । భద్రాణి । బీజాని । ఋషభాః । జనయన్తి । చ ।
తైః । త్వమ్ । పుత్రమ్ । విన్దస్వ । సా । ప్రఽసూః । ధేనుకా ।
భవ ॥ 4 ॥

అనువాదం.

అమోఘ వీర్యాలైన బీజాలు గోవులలో వత్సరూపంలో
జనించినట్లుగానే నీవు పుత్రుని పొందు.
అలా ప్రసవించి ధేనువు వలెనే
పుత్రునితో పాటు వర్ధిల్లు. ॥ 4 ॥

మంత్రము :

కృణోమి తే ప్రాజాపత్యమా యోనిం గర్భ ఏతు తే ।
విన్దస్వ త్వం పుత్రం నారి యస్తుభ్యం
శమసచ్ఛము తస్మై త్వం భవ ॥ 5 ॥

పదము.

కృణోమి । తే । ప్రాజాఽపత్యమ్ । యోనిమ్ । గర్భః । ఏతు । తే
విన్దస్వ । త్వమ్ । పుత్రమ్ । నారి । యః । తుభ్యమ్ ।
శమ్ । అసత్ । శమ్ । ఉంఇతి । తస్మై । త్వమ్ । భవ ॥ 5 ॥

అనువాదం.

నీ సంతతిని ఓ నారీ!
ప్రజోత్పత్తి కరం చేస్తున్నాను.

నీ యోనిలో గర్భం చేరుగాక !
అలా నీకు పుత్రప్రాప్తి కలుగుగాక !
పుత్రుడు నీకు సుఖహేతు వవుతాడు.
నీవు కూడా వానికి సుఖహేతు వగుదువు గాక ! ॥ 5 ॥

మంత్రము :

యాసాం ద్యౌః పితా పృథివీ మాతా
సముద్రో మూలం వీరుధాం బభూవ ।
తాస్త్వా పుత్రవిద్యాయ దైవీః
ప్రావన్త్వోషధయః ॥ 6 ॥

పదము :

యాసామ్ । ద్యౌః । పితా । పృథివీ । మాతా ।
సముద్రః । మూలమ్ । వీరుధామ్ । బభూవ ।
తాః । త్వా । పుత్రఽవిద్యాయ । దైవీః ।
ప్ర । అవన్తు । ఓషధయః ॥ 6 ॥

అనువాదం .

ఓషధులకు ద్యులోకం పిత అవుతున్నాడు.
వృష్టిరూప రేతోధారణంతో పృథివి తల్లి అవుతున్నది.
సముద్రం ఆ జలరాశికి మూల మౌతున్నది.
ఆ దేవతారూపాలైన ఓషధులు
పుత్రలాభార్థమై నిన్ను రక్షింతురుగాక ! ॥ 6 ॥

ఇది ఇరవై మూడవ సూక్తం

# సూక్తం — 24

ఋషి. భృగువు॥ దేవత : వనస్పతి, ప్రజాపతి॥ ఛందస్సు : 1,3-7 అనుష్టుప్ : 2 విచృత్ పథ్యాపంక్తి ॥ మంత్రములు. ॥ 7 ॥

వినియోగం :- ధాన్య సమృద్ధికర్మలో దీనికి వినియోగం. మొదటి మంత్రానికి పితృమేధ కర్మలో వినియోగం.

మంత్రము :

పయస్వతీ రోషధయః పయస్వ న్మామకం వచః ।

అథో పయస్వతీనామా భరేహం సహస్రశః ॥ 1 ॥

పదము.

పయస్వతీః । ఓషధయః । పయస్వత్ । మామకమ్ । వచః ।

అథోఇతి । పయస్వతీనామ్ । ఆ । భరే । అహమ్ । సహస్రఽశః ॥ 1 ॥

అనువాదం :

వ్రీహి యవాదులు సారవంతము లగుగాక !
అలాగే నా వచనం సారవంత మగుగాక !
మఱి సారవంతమైన ఓషధులవల్ల వచ్చిన ధాన్యాన్ని
బహు విధాలుగా మేము సంపాదించు కొందుముగాక ! ॥1॥

మంత్రము .

వేదాహం పయస్వన్తం చకార ధాన్యఽం బహు ।

సంభృత్వా నామ యో దేవ స్తం వయం

హవామహే యోయో అయజ్వనో గృహే ॥ 2 ॥

పదము:

వేద । అహమ్ । పయస్వన్తమ్ । చకార । ధాన్యఽమ్ । బహు ।

సమ్ఽభృత్వా । నామ । యః । దేవః । తమ్ । వయమ్ ।

హవామహే । యఃఽయః । అయజ్వనః । గృహే ॥ 2 ॥

అనువాదం :

సారసంపన్న దేవుని నే నెఱుగుదును.
ఆయన ధాన్యాన్ని సమృద్ధం చేసినాడు.
సర్వసార సమాకర్షకుడైన సంభృత్వ దేవుని
స్తుతిస్తూ ఆహ్వానిస్తున్నాము.
యాగం చేయని వాని ఇంటిలోని పదార్థ
సంచయాన్ని కొనివచ్చి ఆయన మాకు ప్రసాదించుగాక !
॥ 2 ॥

మంత్రము :

ఇమా యాః పఞ్చ ప్రదిశో మానవీః పఞ్చ కృష్టయః ।

వృష్టే శాపం నదీరివేహ స్ఫాతిం సమావహాన్ ॥ 3 ॥

పదము .

ఇమాః । యాః । పఞ్చ । ప్రఽదిశః । మానవీః । పఞ్చ । కృష్టయః ।

వృష్టే । శాపమ్ । నదీఃఽఇవ । ఇహ । స్ఫాతిమ్ । సమ్ఽఆవహాన్
॥ 3 ॥

అనువాదం :

వర్షం కురియగా నదులు తమలోని ప్రాణిజాతాన్ని
వేగంగా కొని పోయినట్లు

ఈ ప్రాచ్యాది పంచ దిక్కులు,
పంచ మానవ జాతులు ఇక్కడ ఈ యజ మానుని
ధనధాన్య సమృద్ధితో నింపుదురుగాక ! ॥ 3 ॥

మంత్రము .

ఉదుత్సం శతధారం సహస్రధార మక్షితమ్ ।
ఏవాస్మాకేదం ధాన్యం౨ సహస్రధార మక్షితమ్ ॥ 4 ॥

పదము :

ఉత్ । ఉత్సమ్ । శత౨ధారమ్ । సహస్ర౨ధారమ్ । అక్షితమ్ ।
ఏవ । అస్మాక । ఇదమ్ । ధాన్య౨మ్ । సహస్ర౨ధారమ్ ।
అక్షితమ్ ॥ 4 ॥

అనువాదం :

జలో త్పత్తిస్థానం శత ధారాయుక్తమై,
సహస్రధారా యుక్తమై క్షయరహిత మైనట్టుగానే
మా ఈ ధాన్యం అపరిమిత ధారాయుక్తం,
అక్షయం అగుగాక ! ॥ 4 ॥

మంత్రము

శతహస్త సమాహర సహస్రహస్త సం కిర ।
కృతస్య కార్య౨స్య చేహ స్ఫాతిం సమావహ ॥ 5 ॥

పదము :

శత౨హస్త । సమ్౨ఆహర । సహస్ర౨హస్త । సమ్ । కిర ।
కృతస్య । కార్య౨స్య । చ । ఇహ । స్ఫాతిమ్ । సమ్౨ఆవహ ॥ 5 ॥

అనువాదం :

శతకర సంయుత దేవా!
ధనధాన్యాదులను కొని తెమ్ము.
సహస్రహస్తుడవైన ఓదేవా!
వాటిని మాపై కురిపించు.
నిష్పన్నం, నిష్పాదనీయం అయిన
ధనధాన్యాదులు సమృద్ధిగా నాకు లభిస్తున్నవి. ॥ 5 ॥

మంత్రము :

**తిస్రో మాత్రా గన్ధర్వాణాం చతస్రో గృహపత్న్యః ।**
**తాసాం యా స్ఫాతిమత్తమా తయా త్వాభి మృశామసి ॥6॥**

పదము .

**తిస్రః । మాత్రాః । గన్ధర్వాణామ్ । చతస్రః । గృహఽపత్న్యః ।**
**తాసామ్ । యా । స్ఫాతిమత్ఽతమా । తయా । త్వా । అభి ।**
**మృశామసి ॥ 6 ॥**

అనువాదం :

సమృద్ధిహేతువులైన గంధర్వ మాతృ[1]త్రయం
[2] గృహిణీ చతుష్కంతో అతిశయ సమృద్ధి
సంపన్నమైన ఓ ధాన్యమా!
నిన్ను అభిస్పృశిస్తున్నాము. ॥ 6 ॥

---

1. సమృద్ధిహేతువులైన కళలు - సాయణుడు.
2. అప్సరసలు లేదా గృహిణులు.
ఇవి రెండూ ఒక రకమైన కొలతలని కొందఱు.

మంత్రము :

ఉపోహశ్చ సమూహశ్చ క్షత్తారౌ తే ప్రజాపతే ।

తావిహా వహతాం స్ఫాతిం బహుం భూమాన మక్షితమ్ ॥ 7 ॥

పదము :

ఉప౽ఊహః । చ । సమ్౽ఊహః । చ । క్షత్తారౌ । తే । ప్రజా౽పతే।

తౌ । ఇహ । ఆ । వహతామ్ । స్ఫాతిమ్ । బహుమ్ । భూమానమ్ ।

అక్షితమ్ ॥ 7 ॥

అనువాదం :

ఉపోహ సమూహ దేవు లిద్దఱూ,
ఓ ప్రజాపతీ! నీకు సారథులు.
వారు ఇక్కడ బహుప్రకారం, క్షయరహితం
అయిన సమృద్ధిని లభింప జేయుదురుగాక ! ॥ 7 ॥

ఇది ఇరవై నాల్గవ సూక్తం

## సూక్తం - 25

# స్త్రీ వశీకరణార్థం....

ఋషి: భృగువు ; దేవత : కామేషుడు ; మిత్రావరుణులు ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥ 6 ॥
మంత్రములు :

వినియోగం :- స్త్రీ వశీకరణకాముడు చేసే వివిన్న కర్మలలో దీనికి వినియోగం.

మంత్రము :

ఉత్తుదస్త్వోత్ తుదతు మా ధృథాః శయనే స్వే

ఇషుః కామస్య యా భీమా తయా విధ్యామి త్వా హృది ॥ 1 ॥

పదము :

ఉత్ఽతుదః । త్వా । ఉత్ । తుదతు । మా । ధృథాః । శయనే । స్వే ।
ఇషుః । కామస్య । యా । భీమా । తయా । విధ్యామి । త్వా । హృది ॥ 1 ॥

అనువాదం :

ఉత్తుదనామకుడైన దేవుడు
నిన్ను కామినీ కామార్తను చేయుగాక!
*నీ శయన స్థానంపై నీవు అనురక్తవు కాకుందువు గాక!
భయం కరమైన కామబాణాన్ని
నీ హృదయంలో గ్రుచ్చుతున్నాను. ॥ 1 ॥

మంత్రము.

ఆధీపర్ణాం కామశల్యామిషుం సంకల్పకుల్మలామ్ ।
తాం సుసంనతాం కృత్వా కామో విధ్యతు త్వా హృది ॥2॥

పదము :

ఆధీఽపర్ణామ్ కామఽశల్యామ్ । ఇషుమ్ । సంకల్పఽకుల్మలామ్ ।
తామ్ । సుఽసంనతామ్ । కృత్వా । కామః । విధ్యతు । త్వా । హృది ॥ 2 ॥

* "నీవు నిద్ర పోలేకుందువుగాక!" అని భావం.

**అనువాదం :**

మనోవ్యథా పత్రాలు కలది, కామ శల్యం కలది,
సంకల్ప మనే దారుశల్య సంశ్లిష్ట మైనది,
అయిన ఈ బాణాన్ని ఎక్కుపెట్టి లాగి
నీ హృదయంలో గాడునట్లు కాముడు విడుచుగాక ॥ 2 ॥

మంత్రము .

యా ప్లీహానం శోషయతి కామస్యేషుః సుసంనతా ।
ప్రాచీనపక్షా వ్యోఽషా తయా విధ్యామి త్వా హృది ॥ 3 ॥

పదము :

యా । ప్లీహానమ్ । శోషయతి । కామస్య । ఇషుః । సుఽసంనతా ।
ప్రాచీనఽపక్షా । విఽఓషా । తయా । విధ్యామి । త్వా । హృది ॥3॥

**అనువాదం :**

కాముని సుసన్నతమై వెళ్ళే బాణం
హృదయంలో ప్రవేశించి, నీ ప్లీహాన్ని దహిస్తుంది.
ప్రాచీన పక్షయుతం సర్వ దాహకం
అయిన ఆ బాణంతో నీ హృదయాన్ని
ఓ కామినీ! భేదిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

శుచా విద్ధా వ్యోఽషయా శుష్కాస్యాభి సర్పమా ।
మృదు ర్నిమన్యుః కేవలీ ప్రియవాదిన్యనువ్రతా ॥ 4 ॥

పదము :

శుచా । విద్ధా । వి౨ఓషయా । శుష్క౨ఆస్యా । అభి । సర్ప । మా ।
మృదుః । ని౨మన్యుః । కేవలీ । ప్రియ౨వాదినీ । అను౨వ్రతా
॥ 4 ॥

అనువాదం .

విదాహయుక్తం, శోకాత్మకం అయిన
బాణంతో తాడితవై శుష్కకంఠవై నావద్దకు రమ్ము.
కోపరహితవై, మార్దవ భరితవై,
మదేక శరణవై, ప్రియ వాదినివై మదనువ్రతవు కమ్ము ॥ 4 ॥

మంత్రము :

ఆజామి త్వాజన్యా పరి మాతురథో పితుః ।
యథా మమ క్రతావసో మమ చిత్తముపాయసి ॥ 5 ॥

పదము .

ఆ । అజామి । త్వా । ఆ౨అజన్యా । పరి । మాతుః । అథో ఇతి ।
పితుః ।
యథా । మమ । క్రతౌ । అసః । మమ । చిత్తమ్ । ఉప౨ఆయసి
॥ 5 ॥

అనువాదం :

నిన్ను * సెలగోలతో ఓ కామినీ
నాకు అభిముఖంగా చేసుకుంటున్నాను.

---

* చెర్నాకోల.

తల్లి వద్దనుంచి, తండ్రి వద్ద నుంచి వచ్చి,
నా వద్ద నివసించేటట్టు, నా చిత్తాన్ని
అనుసరించేటట్టు, చేస్తున్నాను. ॥ 5 ॥

మంత్రము .

వ్య౨స్యై మిత్రావరుణౌ హృదశ్చిత్తాన్యస్యతమ్ ।
అథైనామక్రతుం కృత్వా మమైవ కృణుతం వశే ॥ 6 ॥

పదము .

వి । అస్యై । మిత్రావరుణౌ । హృదః । చిత్తాని । అస్యతమ్ ।
అథ । ఏనామ్ । అక్రతుమ్ । కృత్వా । మమ । ఏవ । కృణుతమ్।
వశే ॥ 6 ॥

ఇతి పంచమో౨నువాకః

అనువాదం :

మిత్రా వరుణులారా!
ఈమె హృదయం నుంచి విచక్షణను తొలగించండి.
ఈమెను కింకర్తవ్యతా మూఢురాలినిగా
చేసి నాకైవసం చేయండి. ॥ 6 ॥

ఇది ఇరవై ఐదవ సూక్తం.

ఇది ఐదవ అనువాకం

## అనువాకం : 6

## సూక్తం-26

# భయం నివృత్తికై

ఋషి: అథర్వుడు॥ దేవత : 1 సాగ్నులగు హేతులు : 2 సకాముడగు హవిష్యవుడు, 3 అబ్ధుక్తా వై రాజుడు : 4 సవాత ప్రవిధ్యంతాలు : 5 సౌషధికా

నిలిమ్పులు : బృహస్పతియుక్తులైన అవస్యవస్తులు: ఛందస్సు: 1 త్రిష్టుప్: 2,5,6 జగతీ : 3,4 భురిక్ త్రిష్టుప్, సర్వాః (1-6) పంచ పదావిపరీత పాదలక్షములు॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం :- తన సేనకు ఉత్సాహం కల్పించే కర్మలో, స్వస్త్యయన కర్మలో, సర్ప వృశ్చికాది భయనివృత్తికై చేసే కర్మలో, శాంతి కర్మలో దీనికి వినియోగం

మంత్రము :

యే౽స్యాం స్థ ప్రాచ్యాం దిశి హేతయో

నామ దేవా స్తేషాం వో అగ్ని రిషవః ।

తే నో మృడత తే నోధి బ్రూత

తేభ్యో వో నమ స్తేభ్యో వః స్వాహా ॥ 1 ॥

పదము :

యే । అస్యామ్ । ప్రాచ్యామ్ । దిశి । హేతయః ।

నామ । దేవాః । తేషామ్ । వః । అగ్నిః । ఇషవః ।

తే । నః । మృడత । తే । నః । అధి । బ్రూత ।

తేభ్యః । వః । నమః । తేభ్యః । వః । స్వాహా ॥ 1 ॥

అనువాదం :

ఓ గంధర్వులారా ! మీరు ఈ ప్రాగ్దిశలో
"హేతి" నామ ధారులై ఉంటారు.
పూర్వ దిగ్వాసులైన మీకు
అగ్ని తుల్యాలైన బాణాలు కలవు.

మీరు మమ్ము సుఖపెట్టండి.
మా యెడ ఓ మంచిమాట చెప్పండి.
మీకు నమస్కారం
మీ కీహవిస్సు స్వాహుతమగుగాక! ॥ 1 ॥

మంత్రము :

యేఽస్యాం స్థ దక్షిణాయాం దిశ్యఽవిష్యవో
నామ దేవాస్తేషాం వః కామ ఇషవః ।
తే నో మృడత తే నోఽధి బ్రూత
తేభ్యో వో నమస్తేభ్యో వః స్వాహా ॥ 2 ॥

పదము :

యే । అస్యామ్ । స్థ । దక్షిణాయామ్ । దిశి । అవిష్యవః ।
నామ । దేవాః । తేషామ్ । వః । కామః । ఇషవః ।
తే । నః । మృడత । తే । నః । అధి । బ్రూత ।
తేభ్యః । వః । నమః । తేభ్యః । వః । స్వాహా ॥ 2 ॥

అనువాదం :

ఓ గంధర్వులారా!
మీరు దక్షిణదిక్కులో "అవశ్య" నామంతో ఉంటారు.
మీకు విషయాభిలాషే బాణతతి.
మీరు మమ్ము సుఖపెట్టండి.
మా యెడ ఒక మంచి మాట చెప్పండి.
మీకు నమస్కారం.
మీకీ హవిస్సు స్వాహుత మగుగాక! ॥ 2 ॥

మంత్రము :

యే౽స్యాం స్థ ప్రతీచ్యాం దిశి వైరాజా
నామ దేవాస్తేషాం వ ఆప ఇషవః ।
తే నో మృడత తే నోఽధి బ్రూత
తేభ్యో వో నమస్తేభ్యో వః స్వాహా ॥ 3 ॥

పదము :

యే । అస్యామ్ । స్థ । ప్రతీచ్యామ్ । దిశి । వైరాజా ।
నామ । దేవాః । తేషామ్ । వః । ఆపః । ఇషవః ।
తే । నః । మృడత । తే । నః । అధి । బ్రూత ।
తేభ్యః । వః । నమః । తేభ్యః । వః । స్వాహా ॥ 3 ॥

అనువాదం :

మీరు పడమటు 'వైరాజ' నామంలో ఉంటారు.
మీకు వాన నీళ్ళే బాణాలు.
మీరు మమ్ము సుఖపెట్టండి.
మా యెడ ఓ మంచి మాట చెప్పండి.
మీకు నమస్కారం.
మీ కీహవిస్సు స్వాహుత మగుగాక ! ॥ 3 ॥

మంత్రము :

యే౽స్యాం స్థోదీచ్యాం దిశి ప్రవిధ్యన్తో
నామ దేవాస్తేషాం వో వాత ఇషవః ।

తే నో మృడత తే నోధి బ్రూత

తేభ్యో వో నమస్తేభ్యో వః స్వాహా ॥ 4 ॥

పదము .

యే । అస్యామ్ । స్థ । ఉదీచ్యామ్ । దిశి । ప్రఽవిధ్యన్తః ।

నామ । దేవాః । తేషామ్ । వః । వాతః । ఇషవః ।

తే । నః । మృడత । తే । నః । అధి । బ్రూత ।

తేభ్యః । వః । నమః । తేభ్యః । వః । స్వాహా ॥ 4 ॥

అనువాదం :

మీరు ఉత్తరాన "ప్రవిధ్యన్తులు"*
అను పేరుతో ఉంటారు.
మీకు వాయువే బాణ సంచయం.
మీరు మమ్ము సుఖ పెట్టండి.
మా యెడ ఓ మంచి మాట చెప్పండి.
మీకు నమస్కారం.
మీ కీ హవిస్సు స్వాహుత మగుగాక ! ॥ 4 ॥

మంత్రము :

యేఽస్యాం స్థ ధ్రువాయాం దిశి నిలిమ్పా

నామ దేవా స్తేషాం వ ఓషధీ రిషవః ।

తే నో మృడత తే నోధి బ్రూత

తేభ్యో వో నమస్తేభ్యో వః స్వాహా ॥ 5 ॥

* శత్రుహింసకులు.

పదము :

యే । అస్యామ్ । స్థ । ధ్రువాయామ్ । దిశి । నిఽలిమ్పాః ।

నామ । దేవాః । తేషామ్ । వః । ఓషధీః । ఇషవః ।

తే । నః । మృడత । తే । నః । అధి । బ్రూత ।

తేభ్యః । వః । నమః । తేభ్యః । వః । స్వాహా ॥ 5 ॥

**అనువాదం :**

భూమికి అధోదిశలో మీరు
"నిలింప" నామధారులై ఉంటారు.
మీకు ఓషధులే బాణాలు.
మీరు మమ్ము సుఖపెట్టండి.
మా యెడ ఓ మంచి మాట చెప్పండి.
మీకు నమస్కారం.
మీ కీ హవిస్సు స్వాహుత మగుగాక ! ॥ 5 ॥

మంత్రము .

యేఽస్యాం స్థోర్ధ్వాయాం దిశ్యవస్వన్తో

నామ దేవా స్తేషాం వో బృహస్పతిరిషవః ।

తే నో మృడత తే నోధి బ్రూత

తేభ్యో వో నమ స్తేభ్యో వః స్వాహా ॥ 6 ॥

పదము .

యే । అస్యామ్ । స్థ । ఊర్ధ్వాయామ్ । దిశి । అవస్వన్తః ।

నామ । దేవాః । తేషామ్ । వః । బృహస్పతిః । ఇషవః ।

తే । నః । మృడత । తే । నః । అధి । బ్రూత ।

తేభ్యః । వః । నమః । తేభ్యః । వః । స్వాహా ॥ 6 ॥

**అనువాదం :**

ఊర్ధ్వ దిశలో మీరు అవస్వన్తులు అను పేరుతో ఉంటారు.
మీకు బృహస్పతే బాణ నిచయం.
మీరు మమ్ము సుఖపెట్టండి.
మా యెడ ఓ మంచి మాట చెప్పండి.
మీకు నమస్కారం.
మీ కీ హవిస్సు స్వాహుత మగుగాక ! ॥ 6 ॥

ఇది ఇరవై ఆరవ సూక్తం

## సూక్తం - 27

**ఋషి: అథర్వుడు ॥ దేవత : 1 ప్రాచీ, అగ్ని, అసితుడు, ఆదిత్యులు ; 2 దక్షిణా ఇంద్రుడు, తిరశ్చిరాజి, పితరుడు, 3 ప్రతీచీ, వరుణుడు, పృదాకుడు, అన్నము, 4 ఉదీచీ, సోముడు, స్వజుడు, అశనిడు ; 5 ధ్రువా, విష్ణువు, కల్మాషగ్రీవుడు, వీరుధుడు ; 6 ఊర్ధ్వా, బృహస్పతి, శ్విత్రుడు, వర్షము॥ ఛందస్సు : 1, 3, 4, 6 అష్టి ; 2 త్యష్టి ; 5 భురిగష్టి ; సర్వము (1-6) పంచపదములు ॥ మంత్రములు : ॥ 6 ॥**

**వినియోగం :-** పూర్వసూక్తం వలెనే దీనికి కూడ వినియోగం

మంత్రము .

**ప్రాచీ దిగగ్ని రధిపతి రసితో రక్షితాదిత్యా ఇషవః ।**

**తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో**

నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।

యో॒౽స్మాన్ ద్వేష్టి యం వయం

ద్విష్మ స్తం వో జమ్భే దధ్మః ॥ 1 ॥

పదము .

ప్రాచీ । దిక్ । అగ్నిః । అధి౨పతిః । అసితః । రక్షితా । ఆదిత్యాః ఇషవః ।

తేభ్యః । నమః । అధిపతి౨భ్యః । నమః । రక్షితృ౨భ్యః ।

నమః । ఇషు౨భ్యః । నమః । ఏభ్యః । అస్తు ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ ।

ద్విష్మః । తమ్ । వః । జమ్భే । దధ్మః ॥ 1 ॥

అనువాదం .

ప్రాచీదిశ మమ్మనుగ్రహించుగాక !
ఆ దిశకు అధిపతి అగ్ని.
కృష్ణ వర్ణ సర్పం ఆ దిశకు రక్షకం.
ఆదిత్యులు ఆ దిక్కునకు ఆయుధాలు.
ఆ దిక్కున ఉన్న దేవతలకు నమస్కారం.
అక్కడున్న రక్షకులకు నమస్కారం.
ఆయుధాలకు నమస్కారం.
మీ కందరకూ నమస్కారం.
మేము ద్వేషించే శత్రువును, మమ్ములను ద్వేషించే
శత్రువును మీ నోటిలో వేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము

దక్షిణా దిగిన్ద్రోఽధిపతి స్తిరశ్చి-

రాజీ రక్షితా పితర ఇషవః।

తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో

నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు।

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం

ద్విష్మ స్తం వో జమ్భే దధ్మః ॥ 2 ॥

పదము.

దక్షిణా। దిక్। ఇన్ద్రః। అధిఽపతిః। తిరశ్చిఽరాజిః।

రక్షితా। పితరః। ఇషవః।

తేభ్యః। నమః। అధిపతిఽభ్యః। నమః। రక్షితృఽభ్యః।

నమః। ఇషుఽభ్యః। నమః। ఏభ్యః। అస్తు।

యః। అస్మాన్। ద్వేష్టి। యమ్। వయమ్।

ద్విష్మః। తమ్। వః। జమ్భే। దధ్మః ॥ 2 ॥

**అనువాదం:**

దక్షిణ దిశ మమ్ము అనుగ్రహించుగాక!
దక్షిణ దిశకు ఇంద్రుడు అధిపతి.
వెనుకకు చుట్టుకొని ఉన్న సర్పం రక్షకం.

పితృ దేవతలు ఆయుధాలు.
ఆ దిక్కున ఉన్న అధిదేవతలకు నమస్కారం.
అక్కడ ఉన్న రక్షకులకు నమస్కారం
ఆయుధాలకు నమస్కారం.
వీరందరకు నమస్కారం.
మేము ద్వేషించే శత్రువును, మమ్ము ద్వేషించే శత్రువును
మీ నోటిలో వేస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము.

ప్రతీచీ దిగ్ వరుణోధిపతిః
పృదాక్ రక్షితాన్న మిషవః ।
తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో
నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం
ద్విష్మ స్తం వో జమ్భే దధ్మః ॥ 3 ॥

పదము :

ప్రతీచీ । దిక్ । వరుణః । అధిఽపతిః ।
పృదాకుః । రక్షితా । అన్నమ్ । ఇషవః ।
తేభ్యః । నమః । అధిపతిఽభ్యః । నమః । రక్షితృఽభ్యః ।
నమః । ఇషుఽభ్యః । నమః । ఏభ్యః । అస్తు ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ ।

ద్విష్మః । తమ్ । వః । జమ్భే । దధ్మః ॥ 3 ॥

అనువాదం.

పడమటి దిక్కు మమ్మనుగ్రహించుగాక!
దానికి వరుణుడు అధిపతి.
'పృదాకువు' అనే సర్పం రక్షకం.
అన్నమే ఆయుధం.
ఆ దిక్కున ఉన్న అధిదేవతలకు నమస్కారం.
అక్కడ ఉన్న రక్షకులకు నమస్కారం.
ఆయుధాలకు నమస్కారం.
వీ రందరకూ నమస్కారం.
మేము ద్వేషించే శత్రువును, మమ్ము ద్వేషించే శత్రువును.
మీ నోటిలో వేస్తున్నాము. ॥ 3 ॥

మంత్రము:

ఉదీచీ దిక్ సోమోధిపతిః

స్వజో రక్షితా శనిరిషవః ।

తేభ్యో నమోధి పతిభ్యో నమో రక్షితృభ్యో

నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।

యో౾స్మాన్ ద్వేష్టి యం వయం

ద్విష్మ స్తం వో జమ్భే దధ్మః । ॥ 4 ॥

పదము :

ఉదీచీ । దిక్ । సోమః । అధి౽పతిః ।

స్వజః । రక్షితా । అశనిః । ఇషవః ।

తేభ్యః । నమః । అధిపతి౽భ్యః । నమః । రక్షితృ౽భ్యః ।

నమః । ఇషు౽భ్యః । నమః । ఏభ్యః । అస్తు ।

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ ।

ద్విష్మః । తమ్ । వః । జమ్భే । దధ్మః ॥ 4 ॥

అనువాదం :

ఉత్తర దిక్కు మమ్ము అనుగ్రహించుగాక !
దాని కధిపతి సోముడు.
స్వయం భువమైన సర్పం రక్షకం.
పిడుగు ఆయుధం.
ఆ దిక్కున ఉన్న అధిదేవతలకు నమస్కారం
అక్కడ ఉన్న రక్షకులకు నమస్కారం.
ఆయుధాలకు నమస్కారం.
వీరందఱకూ నమస్కారం.
మేము ద్వేషించే, శత్రువును మమ్ములను
ద్వేషించే శత్రును మీ నోటిలో వేస్తున్నాం. ॥ 4 ॥

మంత్రము :

ధ్రువా దిగ్ విష్ణు రధిపతిః కల్మాష—

గ్రీవో రక్షితా వీరుధ ఇషవః ।

తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో
నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు।
యో౽స్మాన్ ద్వేష్టి యం వయం
ద్విష్మ స్తం వో జమ్భే దధ్మః ॥ 5 ॥

పదము :

ధ్రువా। దిక్। విష్ణుః। అధిఽపతిః। కల్మాషఽగ్రీవః।
రక్షితా। వీరుధః। ఇషవః।
తేభ్యః। నమః। అధిపతిఽభ్యః। నమః। రక్షితృఽభ్యః।
నమః। ఇషుఽభ్యః। నమః। ఏభ్యః। అస్తు।
యః। అస్మాన్। ద్వేష్టి। యమ్। వయమ్।
ద్విష్మః। తమ్। వః। జమ్భే। దధ్మః ॥ 5 ॥

అనువాదం :

భూమి క్రింది దిక్కు మ మ్మనుగ్రహించుగాక!
దాని కధిపతి విష్ణువు.
కల్మాషగ్రీవమనే* సర్పం రక్షకం.
ఓషధులు ఆయుధాలు.
ఆ దిక్కున ఉన్న అధిదేవతలకు నమస్కారం.
అక్కడ ఉన్న రక్షకులకు నమస్కారం.

---

* మెడక్రింద నలుపున్న

ఆయుధాలకు నమస్కారం.
వీ రందరకూ నమస్కారం.
మేము ద్వేషించే శత్రువును, మమ్ము ద్వేషించే
శత్రువును మీ నోటిలో వేస్తున్నాం ॥ 5 ॥

మంత్రము

ఊర్ధ్వా దిగ్ బృహస్పతి రధిపతిః
శ్విత్రో రక్షితా వర్ష మిషవః ।
తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో
నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం
ద్విష్మస్తం వో జమ్భే దధ్మః ॥ 6 ॥

పదము.

ఊర్ధ్వా । దిక్ । బృహస్పతిః । అధిఽపతిః ।
శ్విత్రః । రక్షితా । వర్షమ్ । ఇషవః ।
తేభ్యః । నమః । అధిపతిఽభ్యః । నమః । రక్షితృఽభ్యః ।
నమః । ఇషుఽభ్యః । నమః । ఏభ్యః । అస్తు ।
యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ ।
ద్విష్మః । తమ్ । వః । జమ్భే । దధ్మః ॥ 6 ॥

**అనువాదం :**

ఊర్ధ్వ దిక్కు మ మ్మనుగ్రహించుగాక!
దాని అధిపతి బృహస్పతి.
శ్వేత సర్పం రక్షకం. వర్ష జలం ఆయుధం.
ఆ దిక్కున ఉన్న అధిదేవతలకు నమస్కారం.
అక్కడ ఉన్న రక్షకులకు నమస్కారం.
ఆయుధాలకు నమస్కారం.
వీ రందరకూ నమస్కారం.
మేము ద్వేషించే శత్రువును, మమ్ములను
ద్వేషించే శత్రువును మీ నోటిలో వేస్తున్నాం. ॥ 6 ॥

ఇది ఇరవై ఏడవ సూక్తం.

## సూక్తం - 28

# యమవంశ జనన దోషనివారణం

**ఋషి:** బ్రహ్మ॥ **దేవత :** యమిని॥ **ఛందస్సు :** 1 అతిశాక్వరీగర్భాచతుష్పదాతి జగతీ; 2,3 అనుష్టుప్; 4 యవమధ్యావిరాట్; కకుప్; 5 త్రిష్టుప్, 6 విరాడ్ గర్భా ప్రస్తారపంక్తి॥ **మంత్రములు :** ॥ 6 ॥

**వినియోగం :-** కవలలు కలిగినపుడు తద్దోష నివారణార్థం చేసే హోమంలో దీనికి వినియోగం.

**మంత్రము :**

ఏకైక యైషా సృష్ట్యా సంబభూవ యత్ర
గా అసృజన్త భూతకృతో విశ్వరూపాః ।
యత్ర విజాయతే యమిన్య పర్తుః సా
పశూన్ క్షిణాతి రిఫతీ రుశతీ ॥ 1 ॥

పదము :

ఏక౽ ఏకయా । ఏషా । సృష్ట్వా । సమ్ । బభూవ । యత్ర ।
గాః । అసృజన్త । భూత౽కృతః । విశ్వరూపాః ।
యత్ర । వి౽జాయతే । యమినీ । అప౽ఋతుః । సా ।
పశూన్ । క్షిణాతి । రిఫతీ । రుశతీ ॥ 1 ॥

అనువాదం :

ఈ అసాధారణ సృష్టి ఒక్కొక్క
వ్యక్తి జనన రూపంలో జరుగుతున్నది.
ఇందులో భూతకృతులైన ఋషులు
విశ్వరూపులైన గో మనుష్యాదులను ఇలా సృష్టించినారు.
ఈ యమళ జననం పశువులను క్షయింపజేస్తుంది.
వానిని భక్షిస్తుంది.
వానిని హింసిస్తుంది. ॥ 1 ॥

మంత్రము :

ఏషా పశూన్త్సం క్షిణాతి క్రవ్యాద్ భూత్వా వ్యద్వరీ ।
ఉతైనాం బ్రహ్మణే దద్యాత్ తథా స్యోనా శివా స్యాత్ ॥ 2 ॥

పదము :

ఏషా । పశూన్ । సమ్ । క్షిణాతి । క్రవ్య౽అత్ । భూత్వా । వి౽అద్వరీ ।
ఉత । ఏనామ్ । బ్రహ్మణే । దద్యాత్ । తథా । స్యోనా । శివా ।
స్యాత్ ॥ 2 ॥

**అనువాదం :**

రెండు దూడలను వేసిన ఈ ఆవు
ఇతర పశువులను క్షయింపజేస్తుంది,
మాంస ఖాదన శీలమై అపమార్గం త్రొక్కుతుంది.
ఈ ఆవును బ్రాహ్మణులకు దానం చేయాలి.
అప్పు డది సుఖకర మౌతుంది.
శివంకర మౌతుంది. ॥ 2 ॥

**మంత్రము :**

శివా భవ పురుషేభ్యో గోభ్యో అశ్వేభ్యః శివా ।
శివాస్మై సర్వస్మై క్షేత్రాయ శివా న ఇహైధి ॥ 3 ॥

**పదము :**

శివా । భవ । పురుషేభ్యః । గోభ్యః । అశ్వేభ్యః । శివా ।
శివా । అస్మై । సర్వస్మై । క్షేత్రాయ । శివా । నః । ఇహ । ఏధి
॥ 3 ॥

**అనువాదం :**

ఓ యమళవత్స జననీ!
మనుష్యులకు సుఖకరివి కా!
అలాగే గోవులకు, అశ్వాలకు సుఖహేతువు కా!
ఈ సర్వ *క్షేత్రానికి సుఖకరివి కా!
ఇక్కడ మాకు సర్వ విషయాల్లో సుఖప్రదవు కా! ॥ 3 ॥

---

* చేను.

మంత్రము:

ఇహ పుష్టి రిహ రస ఇహ సహస్రసాతమా భవ ।
పశూన్ యమిని పోషయ ॥ 4 ॥

పదము:

ఇహ । పుష్టిః । ఇహ । రసః । ఇహ । సహస్రఽసాతమా । భవ ।
పశూన్ । యమిని । పోషయ ॥ 4 ॥

అనువాదం:

ఈ ఇంటిలో పుష్టి కలుగుగాక!
క్షీరాజ్యాది సమృద్ధి కలుగుగాక!
ఓ యమినీ! ( యమళవత్సజననీ! )
ఇక్కడ సహస్ర ధన దాత్రివి కా!
మిగత పశువులను పోషించు. ॥ 4 ॥

మంత్రము:

యత్రా సుహార్దః సుకృతో మదన్తి
విహాయ రోగం తన్వ1ః స్వాయాః ।
తం లోకం యమిన్యభి సంబభూవ
సానో మా హింసీత్ పురుషాన్ పశూంశ్చ ॥ 5 ॥

పదము:

యత్ర । సుఽహార్దః । సుఽకృతః । మదన్తి

వి౽హాయ । రోగమ్ । తన్వ౽ః । స్వాయాః ।

తమ్ । లోకమ్ । యమినీ । అభి౽సంబభూవ ।

సా । నః । మా । హింసీత్ । పురుషాన్ । పశూన్ । చ ॥ 5 ॥

**అనువాదం :**

సహృదయులు, సుకృతులు అయిన పురుషులు
తమ శరీరాల నుంచి రోగాన్ని తొలగించుకొని
ఈ లోకంలో హర్షిస్తారు.
వారి లోకానికి యమళజనని అభిముఖ మైనది.
అది మా పురుషులను పశువులను హింసించ కుండుగాక ! ॥5॥

**మంత్రము :**

యత్రా సుహార్దాం సుకృతామగ్నిహోత్రహుతాం యత్ర లోకః ।

తం లోకం యమిన్యభి సంబభూవ

సో నో మా హింసీత్ పురుషాన్ పశూంశ్చ ॥ 6 ॥

**పదము :**

యత్ర । సు౽హార్దామ్ । సు౽కృతామ్ । అగ్నిహోత్ర౽హుతామ్ ।
యత్ర । లోకః ।

తమ్ । లోకమ్ । యమినీ । అభి౽సంబభూవ ।

సా । నః । మా । హింసీత్ । పురుషాన్ । పశూన్ । చ ॥ 6 ॥

**అనువాదం :**

సహృదయులు, సుకృతులు, అగ్నిహోత్ర
హోమాదికాలను చేసిన వారు
ఏ లోకంలో ఫలాన్ని అనుభవిస్తారో,
ఆ లోకానికి నీవు అభిముఖమైనావు.
నీవు మా పురుషులను, పశువులను హింసించవద్దు. ॥ 6 ॥

ఇది ఇరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-29

# పవయజ్ఞంలో....

ఋషి: ఉద్దాలకుడు ॥ దేవత : 1-6 శితిపాద్ అవిః; 7 కాముడు : 8 భూమి ॥ ఛందస్సు : 1-3 పథ్యాపంక్తి : 2,4-6 అనుష్టుప్, 7 షట్పదా ఉపరిష్టాద్దైవీ బృహతీ కకుమ్మతీ గర్భా విరాడ్ జగతీ; 8 ఉపరిష్టాద్ బృహతీ ॥ మంత్రములు: ॥ 8 ॥

వినియోగం :- ఓదన సవ కర్మలో, దుష్టాదుష్ట ప్రతిగ్రహంలో, తద్దోషశాంత్యర్థం చేసే కర్మలో, గ్రహయజ్ఞంలోని బుధునికై చేసే హోమాదులలో దీని వినియోగం.

మంత్రము :

యద్ రాజానో విభజన్త ఇష్టాపూర్తస్య
షోడశం యమస్యామీ సభాసదః ।
అవిస్తస్మాత్ ప్ర ముఞ్చతి
దత్తః శితిపాత్ స్వధా ॥ 1 ॥

పదము :

యత్ । రాజానః । వి౨భజన్తే । ఇష్టాపూర్తస్య ।

షోడశమ్ । యమస్య । అమీ ఇతి । సభా౨సదః ।

అవిః । తస్మాత్ । ప్ర । ముఞ్చతి ।

దత్తః । శితి౨పాత్ । స్వధా ॥ 1 ॥

అనువాదం :

దివిలో దక్షిణ దిశలోని యమ నియుక్తులైన
సభాసదులు ఇష్టా పూర్తానికి చెందిన ఉభయవిధ కర్మలలో
పొరపాటు వల్ల జరిగే పాపాన్ని
పదహారు భాగాలుగా విభజించి స్వీకరిస్తారు.
ఈ సవయజ్ఞంలో దత్తమైన పశువు (గొఱ్ఱె)
దాని నుంచి విముక్తం చేయుగాక !
శ్వేతపాదమైన ఆ యజ్ఞపశువు
ఆ సభాసదులకు ఆహార మగుగాక ! ॥ 1 ॥

మంత్రము :

సర్వాన్ కామాన్ పూరయత్యాభవన్ ప్రభవన్ భవన్ ।

ఆకూతిప్రోవిర్దత్తః శితిపాన్నోప దస్యతి ॥ 2 ॥

పదము :

సర్వాన్ । కామాన్ । పూరయతి । ఆ౨భవన్ । ప్ర౨భవన్। భవన్।

ఆకూతి౨ప్రః । అవిః । దత్తః । శితి౨పాత్ । న । ఉప । దస్యతి ॥ 2 ॥

అనువాదం

అంతటా వ్యాపించి ఫలదాన సమర్థమై
వర్ధిష్ణువైన ఈ మా యజ్ఞం సర్వాభీష్ట ప్రద మగుగాక!
మేము సమర్పించిన, శ్వేత పాదమైన గొఱ్ఱె
వృద్ధి చెందునే కాని క్షీణించదు. ॥ 2 ॥

మంత్రము:

యో దదాతి శితిపాద మవిం లోకేన సంమితమ్ ।
స నాక మభ్యారోహతి యత్ర శుల్కో
న క్రియతే అబలేన బలీయసే ॥ 3 ॥

పదము :

యః । దదాతి । శితిఽపాదమ్ । అవిమ్ । లోకేన । సమ్ఽమితమ్।
సః । నాకమ్ । అభిఽఆరోహతి । యత్ర । శుల్కః ।
న । క్రియతే । అబలేన । బలీయసే ॥ 3 ॥

అనువాదం :

ఈ శ్వేతపాదమైన గొఱ్ఱెను
లోకసమ్మతమైన దానిని ఇచ్చిన దాత స్వర్గాన్ని
అధిరోహిస్తాడు.
ఆ లోకంలో అబలుడైన పురుషుడు
బలవంతునకు శుల్కాన్ని ఇవ్వడు. ॥ 3 ॥

మంత్రము :

పఞ్చాపూపం శితిపాదమవిం లోకేన సంమితమ్ ।
ప్రదాతోప జీవతి పితౄణాం లోకేక్షితమ్ ॥ 4 ॥

పదము :

పఞ్చ౽అపూపమ్ । శితి౽పాదమ్ । అవిమ్ । లోకేన । సమ్
౽మితమ్ ।
ప్ర౽దాతా । ఉప । జీవతి । పితౄణామ్। లోకే । అక్షితమ్ ॥ 4 ॥

అనువాదం :

ఐదు అపూపములు* కల శ్వేతపాదాన్ని
లోకసంమతమైన ఈ యజ్ఞపశువును
దత్తం చేసినవాడు పితరులు నివసించే
సోమలోకంలో అక్షయఫలాన్ని అనుభవిస్తాడు. ॥ 4 ॥

మంత్రము :

పఞ్చాపూపం శితిపాద మవిం లోకేన సంమితమ్ ।
ప్రదాతోప జీవతి సూర్యామాసయోరక్షితమ్ ॥ 5 ॥

పదము :

పఞ్చ౽అపూపమ్ । శితి౽పాదమ్ । అవిమ్ । లోకేన । సమ్
౽మితమ్ ।
ప్ర౽దాతా । ఉప । జీవతి । సూర్యామాసయోః । అక్షితమ్ ॥ 5 ॥

అనువాదం :

ఐదు అపూపములు* కల శ్వేతపాదాన్ని
లోకసంమతమైన గొఱ్ఱెను దానం చేసినవాడు
సూర్యచంద్రుల లోకంలో
అక్షయమైన ఫలాన్ని అనుభవిస్తాడు. ॥ 5 ॥

---

* నాలుగు కాళ్ళలోను, నాభిలోను ఉండనవి.

మంత్రము :

ఇరేవ నోప దస్యతి సముద్ర ఇవ పయో మహత్ ।

దేవౌ సవాసినావివ శితిపాన్నోప దస్యతి ॥ 6 ॥

పదము :

ఇరా౾ఇవ । న । ఉప । దస్యతి । సముద్రః౾ఇవ । పయః ।
మహత్ ।

దేవౌ । సవాసినౌ౾ఇవ । శితి౾పాత్ । న । ఉప । దస్యతి ॥ 6 ॥

అనువాదం :

సవయజ్ఞంలో అర్పించిన తెల్లని కాళ్ళుగల గొఱ్ఱె
భూమివలె క్షీణింపనిది.
సముద్రంవలె అధికక్షీరం కలది.
సహవాసులైన అశ్వినీదేవతలవలె క్షీణింపదు. ॥ 6 ॥

మంత్రము :

క ఇదం కస్మా అదాత్ కామః కామాయాదాత్ ।

కామో దాతా కామః ప్రతిగ్రహీతా

కామః సముద్ర మా వివేశ ।

కామేన త్వా ప్రతి గృహ్ణామి కామైతత్ తే ॥ 7 ॥

పదము :

కః ఇదమ్ । కస్మై । అదాత్ । కామః । కామాయ । అదాత్ ।

కామః । దాతా । కామః । ప్రతిఽగ్రహీతా ।

కామః । సముద్రమ్ । ఆ । వివేశ ।

కామేన । త్వా । ప్రతి । గృహ్ణామి । కామ । ఏతత్ । తే ॥ 7 ॥

**అనువాదం :**

ప్రజాపతి ప్రజాపతికే దీనిని దక్షిణగా ఇచ్చినాడు.
కాముడు కామునకే ఇచ్చినాడు.
కాముడే దాత, కాముడే ప్రతిగ్రహీత.
ఆ కాముడు సముద్రంవలె అపార రూపాన్ని ధరించినాడు.
అలాంటి కామునితో నిన్ను (దక్షిణద్రవ్యాన్ని)
ప్రతిగ్రహిస్తున్నాను.
ఓ కామా! ఈ ద్రవ్యం నీకోసమే. ॥ 7 ॥

మంత్రము :

భూమిష్ట్వా ప్రతి గృహ్ణాత్వన్తరిక్ష మిదం మహత్ ।
మాహం ప్రాణేన మాత్మనా మా ప్రజయా
ప్రతిగృహ్య వి రాధిషి ॥ 8 ॥

పదము :

భూమిః । త్వా । ప్రతి । గృహ్ణాతు । అన్తరిక్షమ్ । ఇదమ్ । మహత్
మా । అహమ్ । ప్రాణేన । మా । ఆత్మనా । మా । ప్రఽజయా ।
ప్రతిఽగృహ్య । వి । రాధిషి ॥ 8 ॥

**అనువాదం :**

ఓ దక్షిణాద్రవ్యమా !
నిన్ను భూదేవత ప్రతిగ్రహించుగాక !
ఈ విశాలమైన అంతరిక్షం కూడా నిన్ను ప్రతిగ్రహించు గాక !
మేము దీనిని తీసుకొని ప్రాణాన్ని త్యజింప కుందుము గాక !
ఆత్మను, సంతానాన్ని త్యజింపకుందుము గాక ! ॥ 8 ॥

ఇది ఇరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 30

# ఐకమత్యం....

**ఋషి: అథర్వుడు ॥ దేవత : సాంమనస్యము ॥ ఛందస్సు : 1-4 అనుష్టుప్ ; 5 విరాడ్ జగతీ, 6 ప్రసారపంక్తి ; 7 త్రిష్టుప్ ॥ మంత్రములు : ॥ 7 ॥**

**వినియోగం :- సాంమనస్య (ఐకమత్య) కర్మలోను, ఉపాకర్మలో చేసే ఆజ్య హోమంలోను దీనికి వినియోగం.**

**మంత్రము :**

సహృదయం సాంమనస్య మవిద్వేషం కృణోమి వః ।
అన్యో అన్యమభి హర్యత వత్సం జాత మివాఘ్న్యా ॥ 1 ॥

**పదము :**

స౽హృదయమ్ । సామ్౽మనస్యమ్ । అవి౽ద్వేషమ్ । కృణోమి వః ।
అన్యః । అన్యమ్ । అభి । హర్యత । వత్సమ్ । జాతమ్౽ఇవ । అఘ్న్యా ॥ 1 ॥

**అనువాదం :**

( వివాద పడుతున్న జనులారా ! )
మీ కోసం విద్వేష రాహిత్యరూపమైన
సాంమనస్య కర్మను చేస్తున్నాను.
సహృదయతతో, పరస్పర ప్రేమతో,
మనుష్యు లుండునట్లు చేస్తున్నాను.
పుట్టిన తన దూడలను ఆవుల వలె
మీ రొకరి నొకరు ప్రేమించుకొనండి. ॥ 1 ॥

**మంత్రము :**

అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః ।
జాయా పత్యే మధుమతీం వాచం వదతు శాన్తివామ్ ॥ 2 ॥

**పదము :**

అను౽వ్రతః । పితుః । పుత్రః । మాత్రా । భవతు। సమ్౽మనాః।
జాయా । పత్యే । మధు౽మతీమ్ । వాచమ్ । వదతు । శాన్తి
౽వామ్ ॥ 2 ॥

**అనువాదం :**

కొడుకు తండ్రికి అనుకూలుడుగా ఉండుగాక !
తల్లి పుత్రులతో సమాన మనస్క అగుగాక !
మగనితో భార్య మధురంగా హాయిగా మాట్లాడుగాక ! ॥ 2 ॥

**మంత్రము :**

మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసార ముత స్వసా ।
సమ్యఞ్చః సవ్రతా భూత్వా వాచం వదత భద్రయా ॥ 3 ॥

పదము :

మా । భ్రాతా । భ్రాతరమ్ । ద్విక్షత్ । మా । స్వసారమ్ । ఉత ।
స్వసా ।
సమ్యఞ్చః । సఽవ్రతాః । భూత్వా । వాచమ్ । వదత । భద్రయా ॥ 3 ॥

అనువాదం :

సోదరుడు తన సోదరుని ద్వేషించ కుండుగాక !
సోదరిని సోదరి ద్వేషించ కుండుగాక !
వా రందరూ సమానగతులై సమాన కర్ములై
మంగళకరంగా సంభాషించు కొందురుగాక ! ॥ 3 ॥

మంత్రము.

యేన దేవా న వియన్తి నో చ విద్విషతే మిథః ।
తత్ కృణ్మో బ్రహ్మ వో గృహే సంజ్ఞానం పురుషేభ్యః ॥ 4 ॥

పదము :

యేన । దేవాః । న । విఽయన్తి । నోఇతి । చ । విఽద్విషతే ।
మిథః ।
తత్ । కృణ్మః । బ్రహ్మ । వః । గృహే । సమ్ఽజ్ఞానమ్ । పురు
షేభ్యః ॥ 4 ॥

అనువాదం :

ఇంద్రాదులు విమనస్కులు కానట్టు,
పరస్పరం ద్వేషించు కోనట్టు,

సమాన జ్ఞాన నిమిత్తమైన,
మంత్రాత్మకమైన ఐకమత్యాన్ని
మీ ఇంటిలో నున్న వారికి కల్పిస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

జ్యాయస్వన్తశ్చిత్తినో మా వి యౌష్ట
సంరాధయన్తః సధురా శ్చరన్తః ।
అన్యో అన్యస్మై వల్గు వదన్త ఏత
సధ్రీచీనాన్ వః సంమనస స్కృణోమి ॥ 5 ॥

పదము :

జ్యాయస్వన్తః । చిత్తినః । మా । వి । యౌష్ట ।
సమ్ऽరాధయన్తః । సऽధురాః । చరన్తః ।
అన్యః । అన్యస్మై । వల్గు । వదన్తః । ఆ । ఇత ।
సధ్రీచీనాన్ । వః । సమ్ऽమనసః । కృణోమి ॥ 5 ॥

**అనువాదం :**

అన్నదమ్ములవలె ఒకరినొకరు అనుసరిస్తూ
సమాన మనస్కులై సమాన కార్య పరులై
సమానంగా కార్య భారం వహిస్తూ సంచరించే
మీరు ఒకరినుంచి ఒకరు వేరు పడకుందురుగాక !
పరస్పరం ప్రియభాషులై వత్తురు గాక !
మిమ్ములను ఏక కార్య ప్రవృత్తులనుగా,
సమాన మనస్కులనుగా చేస్తున్నాను. ॥ 5 ॥

మంత్రము :

సమానీ ప్రపా సహ వోన్నభాగః
సమానే యోక్త్రే సహ వో యునజ్మి ।
సమ్యఞ్చోఽగ్నిం సపర్యతారా నాభి మివాభితః ॥ 6 ॥

పదము :

సమానీ । ప్రఽపా । సహ । వః । అన్నఽభాగః ।
సమానే । యోక్త్రే । సహ । వః । యునజ్మి ।
సమ్యఞ్చః । అగ్నిమ్ । సపర్యత । అరాః । నాభిమ్ఽఇవ ।
అభితః ॥ 6 ॥

అనువాదం :

మీ కందరికీ ఒకే చలివేంద్ర ఉండుగాక !
మీ రంతా ఒకే అహారాన్ని పంచుకొని తిందురుగాక !
మిమ్ముల నందరనూ ఏకైక స్నేహపాశంతో బంధిస్తున్నాను.
రథ చక్ర మధ్యం నుంచి చుట్టూ వెళ్ళే ఆకులవలె
మీ రంతా కలిసి అగ్నిని పూజించండి. ॥ 6 ॥

మంత్రము :

సధ్రీచీనాన్ వః సంమనసస్కృణో-
మ్యేకశ్నుష్టీ న్త్సంవననేన సర్వాన్ ।

దేవా ఇవామృతం రక్షమాణాః
సాయంప్రాతః సౌమనసో వో అస్తు ॥ 7 ॥

పదము :

సధ్రీచీనాన్ । వః । సమ్ఽమనసః । కృణోమి ।
ఏకఽశ్నుష్టీన్ । సమ్ఽవననేన । సర్వాన్ ।
దేవాఃఽఇవ । అమృతమ్ । రక్షమాణాః ।
సాయమ్ఽప్రాతః । సౌమనసః । వః । అస్తు ॥ 7 ॥

**అనువాదం.**

ఒకే కార్యంలో ఉద్యుక్తులనుగా
సమాన మనస్కులనుగా మిమ్ము చేస్తున్నాను.
మీకు ఒకే విధమైన ఆహారం లభించునట్టుగా చేస్తున్నాను.
ఈ సాంమనస్య కర్మతో మిమ్ముల
నందరినీ వశంచేసు కుంటున్నాను.
అమృతాన్ని ఐకమత్యంతో రక్షించుకుంటూ
ఉన్న దేవతల వలె మీరు
సౌమనస్యంతో వర్తింతురుగాక ! ॥ 7 ॥

ఇది ముప్పైయవ సూక్తం

## సూక్తం – 31

# వటువునకు ఆశీర్వాదం

**ఋషిః** బ్రహ్మ ॥ దేవతలు : మంత్రాలలో పేర్కొన్న పాపహారులగు అగ్ని మొద లగువారు ॥ ఛందస్సు : 1–౩,౯–11 అనుష్టుప్, 4 భురిగనుష్టుప్, 5 విరాట్ ప్రస్తారపంక్తి ॥ మంత్రములు : ॥ 11 ॥

వినియోగం :- ఉపనయనానంతరం, ఆయుష్కాముడైన మాణవకునికి చేసే కర్మలో, పితృమేధంలో, ఆగ్రహాయణి (మార్గశిర పూర్ణిమ) కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

వి దేవా జరసావృతన్ వి త్వ మగ్నే అరాత్యా ।
వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥1॥

పదము :

వి । దేవాః । జరసా । అవృతన్ । వి । త్వమ్ । అగ్నే । అరాత్యా ।
వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।
ఆయుషా ॥ 1 ॥

అనువాదం :

ఓ అశ్వినీ దేవతలారా !
ఈ ఉపనీతుని వృద్ధాప్యం నుంచి దూరం చేయండి.
నీవుకూడా ఓ అగ్నీ ! అమిత్రులనుంచి ఇతనిని వేరు చెయ్యి.
ఇతనిని సర్వపాపాలనుంచి విముక్తుని చేస్తున్నాను.
యక్ష్మరోగం నుంచి విముక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

వ్యా1ర్త్యా పవమానో వి శక్రః పాపకృత్యయా ।
వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥ 2 ॥

పదము :

వి । ఆర్త్యై । పవమానః । వి । శక్రః । పాపఽకృత్యయా ।

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।

ఆయుషా ॥ 2 ॥

అనువాదం :

వాయువు వీనిని రోగాది పీడల నుంచి వియుక్తుని చేయుగాక!
ఇంద్రుడు వీనిని పాపకృత్యములనుంచి వియుక్తుని చేయుగాక!
ఇతనిని నేను సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మరోగం నుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

వి గ్రామ్యాః పశవ ఆరణ్యైరాపస్తృష్ణయాసరన్ ।

వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥ 3 ॥

పదము :

వి । గ్రామ్యాః । పశవః । ఆరణ్యైః । వి । ఆపః । తృష్ణయా ।

అసరన్ ।

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।

ఆయుషా ॥ 3 ॥

అనువాదం :

గ్రామాలలోని గోమహిషాది పశువులు
అరణ్యంలోని క్రూర మృగాదుల నుంచి వేర్పడినట్లు,

నీరు దప్పినుంచి వేర్పడి నట్లు,
నేను సర్వపాపాలనుంచి ఈ బ్రహ్మచారిని వేర్పరుస్తున్నాను.
ఇతనిని నేను సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము.

వీ౩మే ద్యావాపృథివీ ఇతో వి పన్థానో దిశందిశమ్ ।
వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥ 4 ॥

పదము ;

వి । ఇమేఇతి । ద్యావాపృథివీఇతి । ఇతః । వి । పన్థానః । దిశమ్ఽదిశమ్ ।
వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ । ఆయుషా ॥ 4 ॥

అనువాదం :

ఈ ద్యావా పృథువులు వేరుపడే ఉన్నవి.
ఒక ఊరి నుంచి దిక్కు దిక్కులకూ
వెళ్ళే మార్గాలు వేరు వేరుగానే ఉంటవి.
ఆ విధంగానే సర్వ పాపాలనుంచి ఇతనిని వేరుచేస్తున్నాను.
నే నితనిని సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మరోగం నుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

త్వష్టా దుహిత్రే వహతుం యునక్తి—

తీదం విశ్వం భువనం వి యాతి ।
వ్య1హం సర్వేణ పాప్మనా
వి యక్ష్మేణ సమాయుషా ॥ 5 ॥

పదము :

త్వష్టా । దుహిత్రే । వహతుమ్ । యునక్తి ।
ఇతి । ఇదమ్ । విశ్వమ్ । భువనమ్ । వి । యాతి ।
వి । అహమ్ । సర్వేణ । పాప్మనా ।
వి । యక్ష్మేణ । సమ్ । ఆయుషా ॥ 5 ॥

తన కొమార్తె కోసమై సారెను పంపడానికి త్వష్టకు
అవకాశం కల్పించుటకై ఈ విశ్వ భువనం
పరస్పరం వేరు వేరు అవుతున్నది.
అలాగే నేను ఇతనిని పాపం నుంచి వేరు పరుస్తున్నాను.
నే నితనిని సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 5 ॥

మంత్రము :

అగ్నిః ప్రాణాన్త్సం దధాతి
చన్ద్రః ప్రాణేన సంహితః ।
వ్య1హం సర్వేణ పాప్మనా
వి యక్ష్మేణ సమాయుషా ॥ 6 ॥

పదము :

అగ్నిః । ప్రాణాన్ । సమ్ । దధాతి ।

చన్ద్రః । ప్రాణేన । సమ్ఽహితః ।

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా ।

వి । యక్ష్మేణ । సమ్ । ఆయుషా ॥ 6 ॥

అనువాదం :

చక్షురాది ఇంద్రియములను జఠరాగ్ని
స్వస్వ కార్య సమర్థాలుగా చేస్తున్నాడు.
అలాగే చంద్రుడు ప్రాణవాయువుతో
సంయుతుడై పోషిస్తున్నాడు.
నే నితనిని సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మ రోగంనుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 6 ॥

మంత్రము :

ప్రాణేన విశ్వతో వీర్యం దేవాః సూర్యం సమైరయన్ ।

వ్యహం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥7॥

పదము :

ప్రాణేన । విశ్వతఃఽవీర్యమ్ । దేవాః । సూర్యమ్ । సమ్ ।

ఐరయన్ ।

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।

ఆయుషా ॥ 7 ॥

**అనువాదం:**

లోక వీర్య భూతుడైన సూర్యుని
ప్రాణంతో దేవతలు సంయోగింప జేసినారు.
ఆయన ఇతనికి ఆయుస్సు నిచ్చునట్లు చేస్తున్నాను.
నే నితనిని సర్వపాపాల నుంచి వియుక్తుని చేస్తున్నాను
యక్ష్మరోగంనుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 7 ॥

**మంత్రము :**

**ఆయుష్మతా మాయుష్కృతాం ప్రాణేన జీవ మా మృథాః ।**
**వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥8॥**

**పదము :**

**ఆయుష్మతామ్ । ఆయుఃఽకృతామ్ । ప్రాణేన । జీవ । మా । మృథాః ।**
**వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ । ఆయుషా ॥ 8 ॥**

**అనువాదం :**

ఆయుష్మంతులకు ఆయుష్కర్తలకు చెందిన
ప్రాణంతో ఓ మాణవకుడా!
చిరకాలం నీవు జీవించు.
ప్రాణాలను వదలిపెట్టకు.
నే నితనిని సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మరోగం నుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 8 ॥

మంత్రము :

ప్రాణేన ప్రాణతాం ప్రాణేహైవ భవ మా మృథాః ।

వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥9॥

పదము :

ప్రాణేన । ప్రాణతామ్ । ప్ర । అన । ఇహ । ఏవ । భవ । మా ।
మృథాః ।

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।
ఆయుషా ॥ 9 ॥

అనువాదం :

ప్రాణంగల సర్వప్రాణులకు చెందిన
ప్రాణవాయువుతో నీవు ప్రాణం కలవాడవు కా!
ఈ లోకంలోనే ఉండు.
ప్రాణములను వదిలి పెట్టకు.
నే నితనిని సర్వపాపాలనుండి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మరోగం నుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 9 ॥

మంత్రము :

ఉదాయుషా సమాయుషోదోష ధీనాం రసేన

వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా॥10॥

పదము :

ఉత్ । ఆయుషా । సమ్ । ఆయుషా । ఉత్ । ఓషధీనామ్ । రసేన

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।

ఆయుషా ॥ 10 ॥

అనువాదం :

ఆయుస్సు వల్ల మేము
మృత్యువునుంచి బయటు పడుతున్నాము.
ఆ ఆయుస్సుతో ఈ లోకంలో ఉంటున్నాము.
వ్రీహి యవాదుల రసంతో ప్రబుద్ధుల మౌతున్నాము.
నే నితనిని సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మ రోగం నుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 10 ॥

మంత్రము :

ఆ పర్జన్యస్య వృష్ట్యో దస్థామామృతా వయమ్ ।

వ్య1హం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా ॥11॥

పదము :

ఆ । పర్జన్యస్య । వృష్ట్యా । ఉత్ । అస్థామ । అమృతాః । వయమ్।

వి । అహమ్ । సర్వేణ । పాప్మనా । వి । యక్ష్మేణ । సమ్ ।

ఆయుషా ॥ 11 ॥

ఇతి షష్ఠోఽనువాకః

**అనువాదం :**

అంతటా నున్న పర్జన్యుని వృష్టితో
మేము అమృతులమై, ఉద్బుద్ధుల మౌతున్నాము.
నే నితనిని సర్వపాపాలనుంచి వియుక్తుని చేస్తున్నాను.
యక్ష్మరోగం నుంచి వియుక్తుని చేస్తున్నాను.
ఆయుస్సుతో సంయోగింప జేస్తున్నాను. ॥ 11 ॥

ఇది ముప్పై యొకటవ సూక్తం

ఇది ఆరవ అనువాకం

ఇది మూడవ కాండ